కమ్యూనిస్టు సిద్ధాంతాల కల్పవృక్షం
సోవియట్ రష్యా జన్మదాత

# వి. ఐ. లెనిన్

— జీవితగాథ —

★

రచన: ఆంగ్లం
డేవిడ్ షబ్

★

రచన: తెలుగు
ఆ॥ వెంకటేశ్వరరావు

ప్రచురణ
విజయ పబ్లిషర్సు
మదరాసు

వెల
1
రూపాయి

# గ్రంథకర్త

డేవిడ్ షబ్ అనే అతడు దీనికి గ్రంథకర్త. అతడు రష్యాలో జన్మించి, అక్కడే చదువుకున్నాడు. నలభై సంవత్సరాలకు పైగా, రష్యా విప్లవోద్యమ నాయకులందరితోను అతనికి సన్నిహిత సంబంధం వుంది. విప్లవకారుడుగను, రష్యా చరిత్ర విద్యార్థిగను అతడు రష్యా విప్లవోద్యమంతో దగ్గర సంబంధం కలిగివుండేవాడు.

1903 సం॥లో రష్యా సోషల్ డిమోక్రటిక్ పార్టీలో షబ్ సభ్యుడుగా చేరాడు. అప్పుడు ఆపార్టీ నాయకులలో లెనిన్ ఒకడు. 1904 నుంచి 1905 వరకు అతడు పశ్చిమ యూరపు దేశాలలోని (లండన్, పారిస్· జెనీవా) రష్యా విప్లవ కేంద్రాలలో నివసిస్తూ లెనిన్ మొదలైన సోషల్ డిమోక్రటిక్ పార్టీ నాయకులను తరుచు కలుసుకున్నాడు. ప్లెఖనోవ్, ఎక్సల్రాడ్, జసువిచ్, ఖాగ్డనోవ్, లునాకార్‌స్కీ, బాంచ్ బ్రుయేవిచ్, మార్టోవ్, పొట్రెసోవ్, డాన్, మొదలైన బోల్షివిక్, మెన్షివిక్ నాయకులను అతడు కలుసుకున్నాడు.

1905 సెప్టెంబరు మాసంలో షబ్ రష్యాకువచ్చి 1905-6 లోని రష్యా విప్లవంలో పాల్గొన్నాడు. తరువాత తరువాత 1906 సం॥ ఆఖరి ప్రాంతంలో అతన్ని ఖైదుచేసి సైబీరియాకు ప్రవాసం పంపించారు. ఒక సంవత్సరం తరువాత అతడక్కడ నుంచి తప్పించుకు పారిపోయాడు.

1908 సం॥లో అతడు అమెరికాకు వచ్చాడు. అప్పటినుంచి అతడు రష్యా విప్లవనాయకులతో సన్నిహిత సంబంధం కలిగి, రష్యా వ్యవహారాలను గూర్చి విపులంగా వ్రాశాడు. లెనిన్, ట్రాట్‌స్కీ, బుఖారిన్ మొదలైన బోల్షివిక్ నాయకులతోను, కెరెన్‌స్కీ, మిలియుకోవ్, చెర్నోవ్, కాథరైన్ బ్రెష్కోవిస్కీ, (రష్యా విప్లవ పితామహి, మొదలైన లిబరల్, సోషలిస్టు నాయకులతోను అతనికి ప్రత్యేక సంబంధబాంధవ్యాలుండేవి,

స్టాలిన్ గురించి అమెరికా పత్రికలలో ప్రకటించిన వానిలో న్యూయార్కు టైమ్సు (22 మార్చి 1930)లో షబ్ చే వ్రాయబడిన వ్యాసమే మొట్టమొదట ప్రకటింపబడిన దనుకుంటాను. ఆ పత్రిక గ్రంథకర్తను గూర్చి వ్రాస్తూ "రష్యా విప్లవోద్యమంలోని ప్రధానులలో ఒకడు: రష్యా వ్యవహారాలలో అతడు లిబరల్, లేబరు, సోషలిస్టు పత్రికలకు చాలా కాలం సంపాదకుడుగా అనేక వ్యాసాలు చాలా భాషలలో వ్రాశాడు" అని వ్రాసింది.

ప్రపంచ కమ్యూనిజానికి సంస్థాపకుడైన లెనిన్ గూర్చి పూర్తిగా అర్థం చేసుకున్నట్లయితే, ప్రస్తుతంలో రష్యా తత్వంలోని రహస్యం తెలుస్తుంది. ఇటువంటి చరిత్రప్రసిద్ధుడైన లెనిన్ జీవితచరిత్రను ప్రకటించగలిగినందులకు పబ్లిషర్లు సంతోషిస్తున్నారు.

లెనిన్ తన బంధుమిత్రులతోను, శత్రువులతోను, రష్యావిప్లవోద్యమ నాయకులతోను ఎటువంటి సంబంధ బాంధవ్యాలతో ప్రవర్తించాడో తెలియచేస్తూ ఈ గ్రంథం లెనిన్ యొక్క నిజమానవత్వస్వరూపం తెలియచేస్తుంది. విప్లవానికిముందు, తరువాత కూడ లెనిన్‌కు సంబంధించిన అసలైన జీవిత రహస్యాల ఆధారంతో ఈ గ్రంథం రచింపబడింది. లెనిన్‌తోను, ఇతరనాయకులతోను గ్రంథకర్తకు గల సన్నిహిత పరిచర్యము నాధారంచేసుకుని వ్రాసిన ఈ గ్రంథంలోని యదార్థ విషయాలు ఏ ఇతరపరిశోధనలవల్ల సాధ్యపడేవికావు. లెనిన్ జీవితాంతంవరకు ఆ బాల్యంనుంచి అతడేయేపరిసర, పరిస్థితులలో పెరిగాడో మొట్ట మొదటి సారిగా ఈ గ్రంథంలో మనకు తెలియచేయబడ్డాయి.

లెనిన్ రచనలనుంచి, ఉపన్యాసాలనుంచి సరియైన ఉదాహరణలతో, ఆ కాలపు రష్యాదేశపురాజులను ప్రపంచమంతటిలోని కమ్యూనిస్టులకు మార్గదర్శకములైన సూత్రాలను, ప్రధానాంశములను తెలుసుకొనుటకు షబ్ వ్రాసిన ఈ గ్రంథం బాగా ఉపకరిస్తుంది. ఈ విధమైన గ్రంథం ఇంగ్లీషులో ప్రకటించబడుట కిదే ప్రథమం. లెనిన్‌జీవితమును, బోల్షివిజంను గూర్చిన పూర్తిచరిత్రను, ఆధారం చేసుకుని, 1825 నుంచి రష్యావిప్లవచరిత్రను, 1905,1917 విప్లవములను, ఈ రెంటిలోను లెనిన్

యొక్క పాత్రలను, తరువాత లెనిన్ నిజంగా పరిణమించిన రష్యాదేశపు విప్లవభావాలను, ఈ గ్రంథకర్త వివరించాడు. ప్రపంచచరిత్రనే మార్చి వేయగలిగిన ఆ కాలపు పరిస్థితులను, సంఘటనలను గూర్చి సాధారణ పాఠకుడు కూడా సులభంగా అర్థంచేసుకోగలుగునట్లుగా ఈ కథ రచింపబడింది.

లెనిన్‌యొక్క చర్యలు, అతనిమాటలు ఇప్పుడు ప్రపంచంలోని ఆరవ భాగమునకు మార్గదర్శకంగా ఉన్నాయి.

1947 సం. ఏప్రిల్ 9వ తేదీని జోసెఫ్‌స్టాలిన్. హెరాల్డుస్టాసన్‌తో ఇల్లా అన్నాడు. "లెనిన్‌మాకు గురువు. సోవియట్ రష్యాప్రజలమైన మేమంతా లెనిన్ శిష్యులము,"

—హగ్ గిబ్సన్

# వంశప్రభావము

వ్లాడిమర్ ఉలియనోవ్ హడలిపోతూ, వగర్చుకుంటూ పాఠశాల నుంచి ఇంటికి పరుగెత్తుకుని వచ్చాడు.

"ఏమిటది?" అని అడిగింది తల్లి.

"అలెగ్జాండరుని ఖైదుచేశారు."

మేరియా అలెగ్జాండ్రోవ్నా అక్కడున్న బేబిలును గట్టిగా పట్టుకుని "అలెగ్జాండరుని ఖైదుచేశారా? ఎందుకు?" అని ప్రశ్నించింది.

"జారు చక్రవర్తిని చంపటానికి కుట్ర పన్నినట్లు అతనిపై నేరం "మోపబడింది."

"అది నీకెల్లా తెలిసింది."

"కాష్కడమో నాకు చెప్పింది. నేను క్లాసుగదిలో నుండగా ఆమె నన్ను బైటకు రమ్మని పిలిచి, సెంట్ పీటర్సు బర్గునుంచి ఆమె తండ్రి స్నేహితుడొకడు వ్రాసిన ఉత్తరం చూపించింది."

వెంటనే బయలుదేరే రైలెక్కి రాజధానికి వెళ్ళటానికి ఆమె నిశ్చయించింది. ఆమె ఒంటరిగా ప్రయాణం చేయవలసిన అవసరం వుండదని అనుకుంది. సింబర్స్కు ప్రాంతంలో ఉలియనోవ్ వంశం చాలా గౌరవమర్యాదలు గలది. ఇల్యానికలోవిచ్ అనే ఆమె భర్త ఏడాదిక్రిందనే చనిపోయాడు. అంతవరకు అతడు ప్రముఖ ప్రభుత్వకౌన్సిలరుగా ఉన్నాడు; పెన్జా, నిజనీ నోవగ్రాండు పట్టణాలలోఅతడు లెక్కలు, సైన్సులను భోదించాడు; వ్లాడిమర్ పుట్టటానికి కొన్ని నెలలు ముందే అతడు స్కూలు ఇన్స్పెక్టరుగా నియమింపబడ్డాడు. కాని మేరియా అలెగ్జాండ్రోవ్నాకు చాలా నిరాశకలిగింది. రాజకీయ ఖైదీగా వున్నవాని తల్లితో ప్రజలెట్టి సంబంధం పెట్టుకోరు. ఆ కారణంచేత ఆమె కెవ్వరూ తోడురాలేదు. ఆమె ఒంటరిగానే ప్రయాణం చేసింది.

రాజద్రోహ నేరానికి విచారింపబడనున్న ఆమె కుమారుని గురించి ఆమె దారి పొడవునా అనేక విధాల ఆలోచించింది. చిన్నవాడైన వ్లాడి

మర్‌కు ఆదర్శప్రాయుడైన 21 సంవత్సరాల వయసుగల అలెగ్జాండర్ అనే యువకుడు ఆమె ఆరుగురు కుమారులలో పెద్దవాడు. పైకి మెత్తనివాని వలెనే ఉన్నప్పటికీ జీవితసూత్రాలలోమాత్రం అతడు చాలా పట్టుదల గలవాడని ఆమెకు తెలుసు. విప్లవసంఘంలో చేరేముందు అతడు దీర్ఘంగా ఆలోచించి నిశ్చయించాలనుకున్నాడు. అంతకు ఒక సంవత్సరం ముందే అతడు ఇల్లా చెప్పాడు:

"రోగికి మందిచ్చే మనిషి ముందుగా మందుయొక్క లక్షణాలను గ్రహించకపోవటం అతిదారుణమైనది. సాంఘిక లోపాలకు కారణం తెలుసుకోకుండా వాటిని రూపు మాపటానికి ప్రయత్నించటం యింకా ఎంత దారుణమైనదో చెప్పనలవికాదు."

ఆ సమయంలో అలెగ్జాండరుకు శారీరకశాస్త్రంలో ఎక్కువ అభిరుచి వుంది. ఆ శాస్త్రంగురించి అతడు ఒక వ్యాసం వ్రాసి బహుమతిని కూడా సంపాదించాడు. ప్రకృతిశాస్త్రంతో అన్నగారంత అభిలాష గలవాడని వ్లాడిమర్‌కు కూడ తెలీదు. ఆనాడు తన స్నేహితుల కీవిధంగా చెప్పాడు: "అలెగ్జాండరు ఎన్నటికీ విప్లవవాది కాడు. క్రిందటి వేసవి శలవులలో అతడు జీవశాస్త్ర విషయాలపై ఎక్కువ శ్రద్ధ తీసుకున్నాడు. విప్లవకారుడు ఇటువంటి శాస్త్ర విషయాలపై ఇంత కాలమును వినియోగించడు."

కొన్ని నెలలతరువాత ఈ శాస్త్రజ్ఞుడు బాంబులను తయారు చేయటం ఆరంభించాడు. విప్లవ సంఘసభ్యుడుగా అతడు సెంట్ పీటర్సుబర్గులోని ఒక విద్యార్థుల టెర్రరిస్టు సంఘానికి నాయకత్వం వహించాడు. తన బసలో రహస్యంగా జరిగిన సభలలో 1887 సం॥ మార్చి 1 తేదీని మూడవ అలెగ్జాండరుని చంపటానికి ప్లానులు తయారు చేశారు. అనాడే రెండవ అలెగ్జాండరును చంపిన ఆరవ వార్షిక దినం.

జారు మరణానంతరం వెంటనే ప్రకటించటానికై ఉలియనోవ్ ఒక నివేదికనుకూడా తయారు చేశాడు. దాని నతడీవిధంగా ప్రారంభించాడు: "రష్యా మాతృదేశపు శక్తి చచ్చిపోలేదు. ఆమె పుత్రుల హృద

తూలలో సత్యము నసించలేదు. 1887 సం॥—తేదీని జారు చక్రవర్తి మూడవ అలెగ్జాండరు చంపబడ్డాడు.''

జారు చక్రవర్తి తన వేసవికాలపు నివాసానికి వెళ్ళటానికై ఏర్పాట్లు చేస్తున్నట్లు తెలిసినందువల్ల విప్లవకారులు కొన్ని రోజులు ముందుగానే ఆవని చేశారు. విప్లవకారులు సెంట్ ఇజాక్ చర్చి ముందు కాచుకుని వున్నారు. కాని జారు రానందువల్ల వారు వారి రహస్య భూగర్భ కార్యాలయానికి వెళ్ళిపోయారు. ఫిబ్రవరి 28వ తేదీని జారు నొవెస్కీ ప్రోస్పెక్టు గుండా ప్రయాణం చేస్తాడని ఉలియనోవ్‌కి తెలిసింది. మళ్ళీ విప్లవకారులు జారుకోసమై అక్కడ కాచుకున్నారు. కాని జారు ప్రభువు బండిరాలేదు. జారును చంపటానికి కుట్రలు పన్నుతున్నారని రహస్య పోలీసుశాఖవారు తెలియచేసి జారును చలికాలపు భవనంలోనే ఉండవలసిందని సలహా యిచ్చారు.

కొన్ని గంటల తరువాత, విప్లవకారులంతా చిన్న హొటలులో కలుసుకున్నారు. వారిలో ఒకడైన ఆంద్రీమిక్కీ అనేవానిని రహస్య పోలీసులు చాలాకాలంనుంచి వెంబడిస్తున్నారు. వారతనిని వెంబడించి అతన్ని అతని సహచరులను కూడా పట్టుకున్నారు.

ఉలియనోవ్, అతని అనుచరుడు లుకషేవిచ్‌తో కలిసి రోజంతా నిరీక్షించి వారి ప్రధానకార్యస్థానానికి వెళ్ళిపోయారు. అక్కడ పోలీసులు వారికోసం సిద్ధంగావున్నారు. నేరస్థులైనా వారి పేర్లు, ఎడ్రసులు వ్రాయబడివున్న ఒక సాంకేతిక పుస్తకమును ఉలియనోవ్ దగ్గరనుంచి పోలీసులు తీసుకున్నారు. విప్లవకారులలో ఒకనిని హింసించి సాంకేతిక యొక్క మూలసూత్రమును గ్రహించిన పోలీసులు తరువాత కొద్దిరోజులలో వందలాది అనుమానితులను బంధించారు. అలెగ్జాండర్ ఉలియనోవ్‌తో కలిసి పదిహేనుమందిని ఏరి వారిపై విచారణ జరిగించారు. నేరము: జారు చక్రవర్తిని కూనీ చేయుటకై కుట్ర పన్నుట.

ఆమె కుమారుని బంధించిన ఏడు రోజులకు మేరియా అలెగ్జాండ్రోవ్నా సెంట్ పీటర్సుబర్గు పట్టణం చేరింది. కుమారుని చూమటకు

ఆమె కొన్ని వారాలు ప్రయత్నించింది. నిరాశతో ఆమె జారుచక్రవర్తికి ఒక ఉత్తరం వ్రాసింది. దానిమీదనే మూడవ అలెగ్జాండరు ప్రభువు ఈ విధంగా వ్రాశాడు.

''ఆమె విలువయైన కుమారుడు ఎటువంటి వాడో స్వయంగా చూసి తెలుసుకోటానికై, ఆమెకు తన కుమారుని చూచుటకు అనుమతినిచ్చుటయే సమంజసమని నాకు తోస్తుంది.''

అలెగ్జాండరు అతని తల్లిని కౌగలించుకున్నాడు; బోరున ఏడిచాడు; క్షమార్పణ వేడుకున్నాడు. కాని అతని ప్రధమవిద్యుక్త ధర్మం విప్లవోద్యమానికై పని చేయుటయేనని నొక్కిచెప్పాడు. అతనకి తన దేశ విమోచనకై పోరాడటంకంటె ఇతర కర్తవ్యం లేకపోయింది.

''కాని యీ విమోచనను సాధించే విధానంమాత్రం చాలా దారుణమైనది.''

''వేరొక మార్గంలేదు'' అని అలెగ్జాండరు సమాధానమిచ్చాడు.

మొదటి విచారణ రోజున ఉలియనోవ్ మాట్లాడుటకే నిరాకరించాడు. కాని అతని సహచరులనేకులు మరణశిక్ష పొందవలసివున్నదని గ్రహించి, సంపూర్ణంగా ముఖ్యభాద్యతనంతను తానే భరించటానికి నిశ్చయించుకున్నాడు.

అలెగ్జాండరు తనకు తానే న్యాయవాది. అది చాలా చిత్రమైన ప్రతివాదన. అతని సహచరులను రక్షించటానికై అలెగ్జాండరు చేయని నేరములనుకూడా తానే చేసినట్లుగా ఒప్పుకున్నాడు.

అతని చిట్టచివరి వాదనలో ఉలియనోవ్ ఈ విధంగా ఏడిచాడు: దుఃఖభాజనులైన రష్యాప్రజలకు విమోచన మార్గం చూపించటమే నా ఉద్దేశ్యం. వాక్స్వాతాంత్ర్యము లేని విధానంలో, ఆత్మశ్రేయస్సుకు, ఆత్మాభివృద్ధికిచేసే ప్రయత్నాలన్నిటినీ న్యాయశాస్త్రవిధానాలతో అణచివేస్తున్నప్పుడు మిగిలిన ఆయుధం 'భయమే.' అందుచేత అన్యాయమును

అనుభవించిన ప్రతివ్యక్తికి దౌర్జన్య విధానమే మార్గం. ప్రభుత్వ దౌర్జన్యానికి మా సమాధానం దౌర్జన్యమే ప్రజలకు రాజకీయ స్వాతంత్ర్యము నిచ్చునట్లు క్రూరప్రభుత్వమును బలవంతంగా ఒప్పించుటకు ఇది ఒక్కటే మార్గం."

తన తరపున, తన సహచరులతరపునకూడా మాట్లాడుతూ అతడిల్లా చాటించాడు: "సమిష్టిశ్రేయోకార్యాచరణలో వచ్చిన చావు కంటె గౌరవప్రదమైన చావులేదు."

అలెగ్జాండరు ఉలియనోవ్‌నకు ఉరికంబాలపై మరణశిక్ష విధించారు. ప్రభుత్వదాక్షిణ్యానికై కోరవలెనని అతనితల్లి చాలా గట్టిగా ప్రార్థించింది. అతని సహచరులు కొందరావిధంగా జారుచక్రవర్తిని ప్రార్థించారు. సిక్షలను రద్దుచేయించుకున్నారు. కాని అలెగ్జాండరు దానికి నిరాకరించాడు.

1887వ సం॥ మే 8వ తేదీని ప్రాతఃకాలమున అలెగ్జాండరు. నలుగురు సహచరులతోసహా ష్లుషిల్‌బర్గు కోటలోని ఆవరణలో ఉరి తీయబడ్డాడు.

అలెగ్జాండరు ఉరితీయబడిన వార్త ప్రకటింపబడిన ఒక సెంట్ పీటర్సుబర్గు వార్తాపత్రికను సింబర్సుక్కులోనున్న వ్లాడిమర్‌చూసి, ఆ పత్రికను నేలపై కొట్టి బోరున ఏడ్చాడు:

"వారుదీనికి తగిన ప్రతిఫలం అనుభవించునట్లు చేస్తాను. ఇది ప్రతిజ్ఞ." అన్నాడు.

"ఎవరనుభవించేలా చేస్తావు నీవు?" అని ఇరుగుపొరుగునున్న మేరియా సాలెన్కో అడిగాడు.

"అది నీకెందుకు; నాకు తెలును" అని వ్లాడిమర్ సమాధానం చెప్పాడు.

ఆ వ్లాడిమర్ ఉలియనోవే లెనిన్ అని ప్రపంచమందరికీ తెలుసు.

# విప్లవానికి వి త్తనాలు

హత్యలద్వారా స్వాతంత్ర్యం సంపాదించాలని కలలుకనిన్ని వీర మరణం పొందిన ఆదర్శవాదికి, ఇతర ఆశయసిద్ధికై మరొక మార్గాన్ని అవలంభించిన అతని సోదరుడు వ్లాడిమర్‌కుకూడా ఉత్తేజం ఒక్క చోటనుంచే వచ్చింది. వారురివురు కూడా వంశపారంపర్యమైన రష్యా విప్లవవాతావరణంలోనే పెరిగారు. దానిలోని ప్రధానాశయంలో పాలకులను గూర్చిన వ్యతిరేకపు నమ్మకాలు, నీచస్వభావము, గొప్పతనము, రాజద్రోహనేరము, ప్రేమ, అసహనము మొదలైన లక్షణాలన్నీ ఇమిడి వున్నాయి.

6023

అలెగ్జాండరు ఉరికంబంమీద మరణించినప్పుడే, అతని సోదరుని ఆశయగమ్యస్థానమును రూపొందించటానికి కావలసిన పరికరాలన్నీ తయారైపోయాయి. ఫ్రాన్సు విప్లవభావాలకు గురికాకుండా రష్యా ఆఫీసర్లు తిరిగివచ్చిన నెపోలియన్ కాలంలోనే రష్యావిప్లవోద్యమం ప్రారంభించబడింది. మొట్టమొదటగా, చాలావరకు, విప్లవోద్యమంలో ఉన్న వారంతా సైనికోద్యోగులు. జారు అలెగ్జాండరు మరణించగానే సింహాసనం గ్రాండు డ్యూక్ నికలస్‌కు దక్కకుండా చేసి, అతని సోదరుడు కాన్‌స్టంటైన్ అనే వానిని రాజ్యాంగరీత్యా రాజును చెయ్యాలనే ఉద్దేశ్యంతో డిశంబరిస్టులనబడే ఈ సైనికోద్యోగులు చేసిన ప్రయత్నమే వీరు ప్రారంభంలో చేసిన ప్రత్యక్ష కార్యక్రమం.

నికలస్ సింహాసనం ఎక్కవలసిన రోజైన 1825 సం॥ డిశంబరు 26వ తేదీని ఒక రక్షకదళంవారు నికలస్‌కు ధర్మప్రమాణం చేయటానికి నిరాకరించి, కాన్‌స్టంటైనును న్యాయసమ్మతమైన రాజుగా ప్రకటించి, రష్యాకొక రాజ్యాంగచట్టం కావాలని అధికార పూర్వకంగా కోరారు. తిరుగుబాటు నాయకులతో రాయబారాలు జరుపటానికి నికలస్ పంపిన రాయబారులు కాల్చబడ్డారు: ఈ లోగా ప్రజలంతా తిరుగుబాటుదార్లతో చేరటం ఆరంభించారు. తిరుగుబాటు ఉధృతం కాకముందే, తిరుగుబాటుదార్లపై తుపాకులు కాల్చునట్లు నికలస్ ఒక సైనిక దళానికి

ఆజ్ఞాపించాడు. ప్రాణాలు పోయినవారిని, గాయాలు పొందినవారిని వీధు లలో విడిచిపెట్టి డిశంబరిస్టులు పారిపోయారు. వారిలో అయిదుగురు నాయకులను ఉరితీశారు: ముప్పదిఒక్కమందికి బహుకాలపు కఠిన శిక్షలు విధించారు! మిగతావారిని సైబీరియాకు ప్రవాసం పంపించారు.

అనేక శతాబ్దాలుగా పశ్చిమ ఐరోపాప్రాంతమంతా రాజులకు జమీందారులకుమధ్య సంఘర్షణలతో, రాజుయొక్క సర్వాధికారమును గూర్చి కామన్సు సభ్యుల పోరాటములతోను నిండివున్న సమయంలో, రష్యాదేశంలో ప్రజలు అత్యంత దాస్యశృంఖలాలలో కట్టుబడివున్నారు.

కర్షకులలో వారిని అణచివుంచే అధికారలపై ఏహ్యభావం ఎక్కు వైంది. దీనిఫలితంగా 18వ శతాబ్దారంభంలో రష్యాఅంతా రెండు వర్గాలుగా విభజింపబడింది. జారుప్రభుత్వము, శక్తివంతమైనవారి బూర్జువా పరిపాలనా విధానము, జమీందారులు ఒక్కవర్గము; లక్ష లాదిగావున్న కర్షకులంతా ఒక వర్గము.

1830 లోని ఫ్రాన్సువిప్లవమే విప్లవభావాలకు నూతన ప్రోత్సాహ మిచ్చింది. రహస్యపు సభలను ఏర్పాటుచేసి రాజకీయ, సాంఘిక, భాషావిషయాలపై చర్చలు జరిపారు. వీటిలో ముందంజవేసినవారు ప్రభుత్వసభ్యులు, ప్రొఫెసర్లు, రచయితలు, విద్యార్థులు. వీరిలో ముఖ్య మైనవాడు అలెగ్జాండరు హెర్జెన్. బానిసత్వమును, రాజు పరిపాలనను అంతమొందించాలని హెర్జెన్, అతని మిత్రులు నిశ్చయించారు. వీరిలో కొంతమంది మధ్యతరగతివర్తకులను ఆహ్వానించారు. చాలామంది వర్తకులకు, ధనికులకు విరోధులు. రష్యా ప్రజాస్వామ్య భావాలన్నీ సోష లిజం వైపు కేంద్రీకరించాయి.

ఫొరియర్, సైంట్‌సైమన్ మొదలైన ఫ్రెంచిసోషలిస్టులను మొట్ట మొదటి తిరుగుబాటుదార్లు తమ గురువులుగా భావించారు. విద్యా వంతులైన భూస్వాములందరు జారు ప్రభువును బలపరిచారు.

1847 సం॥లో బైలిన్‌స్కీ ఇల్లా వ్రాశాడు. "(పొటేటోస్) కావా లనే కోరిక ప్రజలకుంది. కాని రాజ్యాంగానికి ఎంతమాత్రం కాదు; ఏమి చెయ్యటానికి శక్తిహీనులైన పట్టణవాసపు విద్యావంతులకే అది కావాలి."

1848 సం॥లో ఐరోపావిప్లవాలను ఈ బుద్ధిమంతులు చాలా ఆశా పూరితంగా ఆహ్వానించారు. కాని తరువాత జరిగిన అవజయంవలన ఈ మధ్యతరగతి వర్తకులకు వ్యతిరేకంగా పనిచేసింది. రష్యాలో పాట కపు జాతి లేనందువల్లను, కర్షకసంఘంవారు ప్రతికర్షకునికి భూమిని సంపాదించటంచేతను, రష్యాలో విప్లవం అసంభవమని ఒక జర్మనీ పండితుడు వ్రాశాడు. హెర్జన్ దీనికి వ్యతిరేకంగా నిర్ణయించాడు. నిశ్చ యంగా రష్యాలోని ధనికవ్యవస్థయొక్క బలహీనతవల్లను, కర్షక వర్గా లుండటంవల్లను, ఏ ఇతరచోట్లకంటె రష్యాలోనే సోషలిజమును అతి సులభంగా ప్రవేశపెట్టవచ్చు. అతడింకా ఇల్లా అన్నాడు—''పశ్చిమ భాగంలో కేవలం కొన్నివిప్లవాలవలన సాధించగలదాన్ని, రష్యాలో ఉన్న పరిస్థితులనుంచే వృదిచేయవచ్చు.''

వ్యతిరేక రాజకీయభావాలకు ఆదరణ హెచ్చినకొలదీ సెన్సారు నధికం చేయుట, బుద్ధిమంతులను శిక్షించుట ఎక్కువైనాయి. సెన్సారు ద్యోగిని తృప్తిచేయనందుకై 1852లో టర్గినెవ్‌ను ఖైదుచేశారు. ఫొరియర్ సూత్రాలనుగూర్చి రాత్రి చర్చలుజరుపుటయే ప్రధానాంశంగావున్న ఒక వాఙ్మయ సంఘమును నిషేధించి సభ్యులందరకు మరణశిక్ష విధిం చారు. వారిలో డొస్టోవిస్కీ వున్నాడు. శిక్షలను సైబీరియాలో దీర్ఘకాలపు కఠిన శిక్షగా మార్చుటకు ముందుగానే ఖైదీలకు ఉరిశిక్ష ముందుజరిపే కార్యకలాపమంతా బలవంతంగా జరిపించారు.

1855లో ఒకలవ నికలస్ చరిపోగానే వెంటనే ఏవిధమైన మార్పు లేదు. కాని క్రైమియన్ సంగ్రామంలో రష్యా అపజయం పొందినతరువాత, నిరంతరంజరిగే పోరాటఫలితంగా, బానిసత్వమును నిర్మూలించటానికై తగిన డిక్రీని తయూరు చేయటానికి రెండవ అలెగ్జాండరు ఒకసంఘమును ఏర్పాటుచేశాడు. ఈ పరిస్థితులమార్పువలన కలిగిన ప్రోత్సాహంతో పత్రికలలో ఇతర రాజకీయసమస్యలన్నింటినిగూర్చి నిర్భయంగా చర్చిం చటం ఆరంభించారు.

1861 స॥లో బానిసత్వనిర్మూలనకై జారుప్రభువు చేసిన ప్రకటనవల్ల ఉత్సాహభంగం కలిగింది. ఉచితంగాను, సర్వాధికారాలతోను

భూముల నిస్సారని ఆశించిన కర్షకులకు తణఖాఅప్పులు, పన్నులు త్వరలో తీర్చటానికి వీలులేనంత అధికంగా పెరిగిపోయాయి. కాని ఇటువంటి అనర్థకాలతో జారు తమకు స్వాతంత్ర్యంఇచ్చినట్లుగా కర్షకులు గ్రహించలేకపోయారు. భూస్వాములను నిందిస్తూ వారు దహనాలు, దొమ్మీలు ప్రారంభించారు. వీటిని అణచటానికి ప్రభుత్వం, శిక్షక దళాలను గ్రామాలకు పంపించింది.

ఈలోపుగా లిబరల్ ప్రకటనలన్నీ ఎక్కువగా విప్లవధోరణి వహించాయి. చట్టవిరుద్ధమైన కరపత్రాలు పంచిపెట్టబడ్డాయి. తన భూముల విధానంతో క్రొత్త విప్లవాన్ని ప్రభుత్వం రెచ్చగొట్టిందని ఒకకరపత్రంలో ప్రకటింపబడి "విద్యావంతులైన వర్గాలవారు" అధికారమును స్వీకరించవలెనని ఆహ్వానింపబడ్డారు. వారు దానికి నిరాకరించినట్లయితే 'పేట్రియట్లు' ప్రజలను తిరుగుబాటు చేయుటకు ప్రోత్సహించవలసిన తప్పనిసరి ఏర్పడుతుంది. రష్యాకు ప్రజాస్వామ్య పరిపాలనము నిచ్చుటకై వెంటనే రాజ్యాంగసభను ఏర్పాటు చేయవలెనని మరొకదానిలో పేర్కొనబడింది. ఇంకొక కరపత్రంలో, ప్రభుత్వం ప్రజలఅసంతృప్తికి గలకారణాలను వెంటనే తొలగించకపోతే 1863 సం॥ వేసవకాలంలో రష్యాలో పెద్ద విప్లవం చెలరేగుతుందని, ప్రకటింప బడింది.

ఆ సంవత్సరమే జరిగిన ఒకబహిరంగ ప్రకటన జరిగింది. "యువక ప్రపంచానికి" అనే వాదంలో, 1848 లో పశ్చిమయూరప్‌లో జరిగిన సోషలిజం అపజయంవలన రష్యాకు సంబంధించినంతవరకు ఏమీ జరుగలేదని నిరూపించబడింది. ఎందుచేతననగా పశ్చిమప్రాంతంలోకంటె, "రష్యాలో కర్షకసంఘాలు, 10,000 సంవత్సరాలకు సరిపడిన భూములు వున్నాయి. మేము వెనుకబడిన ప్రజలం, దానిలోనే మాకు మోక్షంవుంది. చరిత్రలో ఒక నూతనాధ్యాయం రచించటానికే మాకు విధినిర్ణయమైన దే కాని ఐరోపాపాతభావాలను అనుకరించటానికిమాత్రంకాదని మానమ్మకం."

1862 సం॥ శీతకాలంలో విప్లవమును ప్రబోధిస్తూ ప్రకటనలు జరిగాయి. ఆయుధాలు ధరించి స్వాతంత్ర్య వ్యతిరేకులను నిర్దాక్షిణ్యంగా

మారణహోమం చెయ్యాలని ఒక ప్రకటనలో వుంది. దీని రచయిత జెచ్నెవిస్కీ.

"త్వరలోనే ఆరోజు వస్తుంది; భావికాలపు పతాకము నెగురవేసి—ఎఱ్ఱపతాకము—శీతకాలపు భవనంపైకి దాడి చేయవలసిన రోజు; రాచ కుటుంబాన్నిమాత్రమే సమూలం నాశనం చేయటంతోనే మనకార్య క్రమం పూర్తి కావచ్చు; కాని చక్రవర్తిని బలపరచటానికి రాచరికపు వర్గ మంతా సిద్ధపడవచ్చు. అటువంటి సందర్భంలో మనం 'కత్తిని ప్రయోగించు' అనే నినాదము నుపయోగించి అనేరాజకీయవర్గంవారిని, వారు మనలనిప్పుడు చూస్తున్నంత కఠినంగా నాశనం చెయ్యాలి.

"........ఆరోజు వచ్చునప్పటికి మనలను బలపరచకుండావున్న వారంతా మనకు వ్యతిరేకులే అన్నసంగతి జ్ఞాపకం వుంచుకోండి. సాధ్యమైనంత తక్కువకాలంలో నూతనవిధానానికి పునాది నిర్మించు నట్లుగా, విప్లవసంఘం తన ప్రస్తుత కేంద్రసంస్థను పోషించవలెనని మాకు పూర్తి నమ్మకం కలిగింది. ఈ సంస్థ నియంతృత్వంద్వారా అధికారమును చేజిక్కించుకోవాలి. జాతీయ ప్రతినిధి సభను ఏర్పాటు చేయుటకు ప్రభుత్వం వెంటనే ఏర్పాటు చెయ్యాలి; ప్రస్తుత విధానమునకు సుముఖులైన వారెవరైనా ఇంకా జీవించివుంటే, అటువంటి వారి నెవ్వరినీ సభకు రాకూడదని వెంటనే ప్రభుత్వం ప్రకటించాలి."

దౌర్జన్యకరమైన ఇటువంటి ప్రకటనలద్వారా రాజునకు, భూస్వాములకు సంబంధబాంధవ్యములను దృఢతరం చేయగలదనీ, తద్వారా ప్రభుత్వ విధానమునింకా కఠినతరం చేయగలదనే ఉద్దేశ్యంతో ఇటువంటి దౌర్జన్యకరమైన ప్రకటనలను హెర్జ్ఞ నిరసించాడు. నిజానికి, అటువంటి కరపత్రాలమూలంగా సమూహంగా ఖైదుచేయుట, క్రొత్త రాజకీయ నిర్బంధాలు యథాప్రకారంగా బయల్దేరాయి.

చక్రవర్తి భయమును కారణంగా తీసుకుని అతని సలహాదారులు ఒకదాని తరువాత నొకప్రతికూల నిర్ణయాలపై సంతకాలు పెట్టించారు. క్రొత్తగావచ్చినవిద్యామంత్రిష్రైన్స్కీలు విద్యావిధానమంతా మార్చివేశాడు. విద్యార్థులలో గూఢచారి పద్ధతులను ప్రవేశపెట్టాడు.

మళ్ళీ విద్యార్థులే ప్రదర్శనలకు దారితీశారు. శిక్ష త్వరితంగాను, సులభపద్ధతిగాను వుంది. చాలా మందిని సైబీరియాకు ప్రవాసంగా పంపించారు.

క్రొత్త నాయకుడు కీర్తి వహించాడు—ఉదారుడు, పూర్వం ఆర్టిలరీ ఆఫీసరుగా నుండిన మైకేల్ బకునిన్ అనేవాడు. మతమును తిరస్కరించుటయే పురోభివృద్ధికి ప్రథమసోపానమని బకునిన్ భావించాడు. వంశ పారంపర్యపు ఆస్తులను అతడు రద్దుచెయ్యాలన్నాడు; వ్యవసాయ భూములను కర్షకసంఘాలకు, కర్మాగారములను కార్మికులకు అప్పగించమని అతడు ఉద్బోధించాడు. స్త్రీలకు సమానహక్కులుండాలనీ, వివాహమును, కుటుంబపద్ధతిని రద్దుచేయాలనీ, పిల్లలందరికీ ఉచిత విద్యాబోధన జరగాలనీ అతడు వాదించాడు. రాజరికమును నిర్మూలించుటే ప్రధాన విషయం. నూతనమైనది, ఉత్తమమైనది అయిన సమాజమును స్థాపించుటకు ముందు, పాత సమాజ విధానమునంతటిని నిర్మూలించాలని అతని ముఖ్యసూత్రం.

బకునిన్‌కు చాలా ముఖ్యమైన శిష్యుడు, మతగురువు కుమారుడైన సెర్గీ నెకైవ్ అనే అతడు విప్లవ పద్ధతిని అంగీకరించాడు. 1869 సం॥లో సమ్మోహపు తిరస్కార భావమును ప్రదర్శించుటకై, ఒక సంఘమును స్థాపించాడు. అతడు మాయమర్మాలకు, దౌర్జన్యానికి ఖూనీలు చేయుటకు వెనుకదీయని అనుచరులను ఆకర్షించుటకై ఏ పనులనుచేయటానికైనా వెనుకదీయలేదు.

1869 సం॥లో జరిగిన విద్యార్థుల అల్లరులలో నేరస్థుడుగా నిర్ణయింపబడిన నెచైవ్ స్విట్జర్లాండుకు పారిపోయి, అక్కడనుంచి రష్యా విద్యార్థులందరు తన ఉద్యమంలో చేరాలని ఒక విజ్ఞప్తిని ప్రకటించాడు. ఇక్కడ అతడు బకునిన్‌తో స్నేహంచేసి తన ప్రవర్తనతోను, పిచ్చి నమ్మకాలతోను అతని ఆదరం సంపాదించాడు. బకునిన్‌తో కలిసి నెచైవ్ "పీపుల్సు జస్టిస్" అనే పత్రికను ప్రకటించాడు. తద్వారా జారుచక్రవర్తి పైనే కాకుండా లిబరలు రచయితలు, పత్రికారచయితలపైన కూడా

అత్యాచారాలు జరుపవలెనని ఉబ్బోధించారు. వారి 'కాటి చిజం' (ప్రశ్నలు-సమాధానాలు)లో బకునిన్, నిచైవ్‌లు ఇల్లా వ్రాశారు:

"విప్లవకారుడు చితికిపోయిన మానవుడు. అతనికి ప్రత్యేకాభిమానాలు, వ్యాపారం, అభిప్రాయాలు, సంబంధాలు, ఆస్థి, చివరికి స్వంతపేరుకూడా, లేవు. మనసా కర్మణా, కేవలం మాటలతోనేకాక, చేతలతోకూడా అతడు సంఘంతోను, నాగరిక ప్రపంచంతోను, తెగ తెంపులు చేసుకున్నాడు. అతడు దానికి దయాదాక్షిణ్యాలు లేని శత్రువు. దానిని నిర్మూలన చేయుటయే ఏకైకకాశయంతో పనిచేస్తాడు....విప్లవమును వృద్ధిచేసేది ఏదైనా సరే అది ధర్మమే; దానికి ఆటంకంకలిగించేది ప్రతీదీ అధర్మం. నిజమైన విప్లవవాది స్వభావంలో ప్రేమకు, మృదుత్వానికి, ఆనందానికి తావులేదు."

"'ప్రపంచ విప్లవ సంఘానికి' (Revolutionary Union of the World) సంబంధించిన రష్యాశాఖకు నాయకునిగా నెచైవ్‌ను ఆమోదిస్తూ బకునిన్ ఒక ప్రకటన చేశాడు. ఈ ప్రకటనతో నెచైవ్ రష్యాకు తిరిగివచ్చి సభ్యులను చేర్పించటం ఆరంభించాడు.

ఇవనోవ్ అనే విద్యార్థి గూఢచారియని ప్రకటించి, అతనిని హత్య చెయ్యవలెనని అతడు తనకామ్రేడులను బలవంతం చేశాడు.

ఇవనోవ్ హత్యద్వారా నెచైవ్ యొక్క రహస్య ఉద్యమాన్ని కని పెట్టి, 300 మందిని ఖైదుచేయటం జరిగింది. నెచైవ్ తిరిగి స్విట్జర్లాండుకు పారిపోయి ప్రకటనలు చేస్తూండేవాడు. కాని అతని పద్ధతులవలన 'దిపొజెస్డు'లో డొస్తొవిస్కి ప్రకటించినట్లు-అక్రమంగా బకునిన్‌తో సహా అతని చర్యలు తగ్గిపోయాయి.

"నేను కలుసుకున్న వారందరిలోనికి నెచైవ్ చాలా శక్తిమంతులైన వారిలో ఒకడు" అని బకునిన్ వ్రాశాడు. "అతడు చెప్పిన 'ఆశయాని'కి పనిచేయవలసిన సమయం వస్తే, అతడు ఇతరులయందెంత కఠినుడో తనయందు కూడా అంత కఠినంగా ప్రవర్తించాడు. అతడు మూఢనమ్మకం గలవాడు. కాని చాలా అపాయకరమైనవాడు. అతనితో సంబంధం ఉన్నవారందరికీ ప్రాణాపాయం కలుగుతుంది. అతని పద్ధతు

లన్నీ చాలా అసహ్యాకరమైనవి. ఆచరణయోగ్యమైన ఒకఉద్యమాన్ని సృష్టించాలంటే. ప్రాథమిక సూత్రంగా మెకియవెల్లి తత్వాన్ని, జెస్యూట్ల దృక్పథాన్ని అనుసరించాలని అతడు నిశ్చయం చేసుకున్నాడు.

"శరీరానికి దౌర్జన్యం; ఆత్మకి అబద్ధాలు"

"ఎవరో కొంతమంది నాయకులు తప్ప మిగిలిన సభ్యులంతా ఆ నాయకులను గ్రుడ్డిగా అనుసరించాలి; ఈ సభ్యులను మోసం చేయటం దోచుకోటం, అవసరమైతే హత్యలు చేయటంకూడా వారంగీకరిస్తారు. వారు కేవలం కుట్రలకు, పాపాకి మందులాంటివారు. ఆశయశ్రేయస్సుకై, నీ కిష్టంలేకపోయినా నీమీద అతనికి సంపూర్ణాధికారంవుండాలి. మేమంతా కలిసి అతనిచర్య బయటపెట్టినప్పుడు ఇలా చెప్పటానికతడు సాహసించాడు. "ఔను, అది మా పద్ధతి. ఈపద్ధతులనంగీకంచనివారు, అనుసరింప నిరాకరించినవారంతా మా శత్రువులుగా పరిగణిస్తాం. మాతో పూర్తిగా సహకరించనివారందరినీ మోసగించటానికి, అవమానించటానికి మా హక్కువున్నదని మేం భావిస్తాం."

ఇవనోవ్ హత్యసందర్భంలో నెచైవ్‌ను స్విట్జర్లాండు ప్రభుత్వం, రష్యాప్రభుత్వానికి అప్పగించారు. అతనికి 20 సంవత్సరాలు కఠినశిక్ష విధించారు. 1883 సం॥ లో అతడు సైంట్ పీటర్, సైంట్‌పాల్ కోటలో మరణించాడు.

స్విడ్జర్‌లాండు కాలనీలో మార్గదర్శకుడు, పూర్వకాలపు ఉద్యోగి, సెంట్ పీటర్సుబర్గులోని ఆచార్యుడు అయిన పీటర్ లావ్‌రోవ్ అనే అతడు సామాన్యప్రజలలో క్రమక్రమంగా విద్యాబోధనను ఆమోదించాడు.

"రష్యా సాంఘికపునర్నిర్మాణం కేవలం ప్రజలకోసమే అయినా వారిద్వారానే అవని జరాగాలి.కాని సామాన్య జనం ఇంకా దీనికి సిద్ధంగాలేరు. కనుక మన భావాల విజయానికి కొంత ప్రయత్నము, ఉన్నవ్యవధిలో ఎంతవరకు సాధ్యమవుతుందో అర్థంచేసుకోటం అవసరం." అని లావ్‌రోవ్ వ్రాశాడు.

"సోషలిజం యొక్క నైతికాశయమును" సాధించటానికి తగిన జ్ఞానమును ప్రజలలో కలిగించటమే విద్యావంతులు చేయవలసిన పని, అని లావ్‌రోవ్ అభిప్రాయం.

బకునిన్ దృష్టిలో, రష్యా ప్రజలలో గుప్తమైవున్న కోపాగ్నిని రెచ్చ కొట్టటమే విప్లవానికి సరియైన మార్గం. బకునిన్, లావ్రోవ్ లిద్దరు కూడా 'ప్రజలదగ్గిరకు' వెళ్ళమని యువకుల నాదేశించారు."

జారు ప్రభుత్వ బందిఖానాలలో చాలాసంవత్సరాలు శిక్షలననుభ వించినపిమ్మట 1875 సం॥లో స్విట్జరులాండు వచ్చినకచేవ్ అభి ప్రాయాలుకూడా అల్లాంటివే. విప్లవభావాలుగల అల్ప సంఖ్యాకుల నియంతృత్వంలోనే కచేవ్‌కు విశ్వాసముంది. దౌర్జన్యయుతంగా అధి కారమును చేజిక్కించుకోవాలనే అతని వాదన. సాంఘిక విప్లవానంతరం కర్షక స్వర్గమునుగూర్చి కచేవ్ ఈక్రింది విధమైన అభిప్రాయం ఇచ్చాడు.

"కర్షకుడు సుఖంగా, సంతోషంగా నివసించాలి. అతని పెట్టె బంగారు నాణాలతో నిండివుంటుంది. అతనికిపశువులు, పక్షులు అమితం. అతడు కడుపుపట్టినంత తింటాడు, త్రాగుతాడు. ఇష్టమైనప్పుడే పని చేస్తాడు; ఎవ్వరూవచ్చి అతనిపై పెత్తనం చెలాయించలేరు...."

తర్వాత విప్లవం కావాలనే కోరికను, ప్రజలలో ఆశను, సోమరి తనమును ప్రోత్సహించుట ఏవిధంగాను సహాయపడదనే కారణంతో ఈ వ్యాసమును ప్రింటు చేయుటకు లావ్రోవ్ నిరాకరించాడు.

"విప్లవకారునికి ప్రజలను తిరుగుబాటు చేయునట్లు ప్రేరేపించ టానికి అధికారంవుంది. ప్రజలెల్లప్పుడు విప్లవానికి సిద్ధంగా వున్నట్లు అతడు భావించాలి. నిరంకుశ ప్రభుత్వపాలనలో అణచిపెట్టబడిన ప్రజ లందరు(ఇప్పుడున్న ప్రజలందరి పరిస్థితి అల్లాంటిదే) ఎల్లప్పుడు శక్తిగలిగి, సిద్ధంగా వుంటారు....

"నిజమైన విప్లవం ఒకేఒకవిధంగా తీసుకురావచ్చు: అధికార మును హస్తగతం చేసుకోవటంవల్లనే; మరొకవిధంగా చెప్పాలంటే— ప్రభుత్వమును కూలగొట్టి ప్రభువుల రాజ్యాంగమును విప్లవరాజ్యాంగంగా

మార్చటమే వెంటనే జరుగవలసిన ప్రధాన కర్తవ్యం. రాజ్య పాలన మనహస్తగతం చేసుకున్నంతమాత్రం చేతనే విప్లవం చేసినట్లుగా అ కోటానికి వీలులేదు. ప్రభువుల పాలన లక్షణాలన్నింటినీ నిర్మూలించి సర్వసమానత్వ సౌభ్రాతృత్వమునకు ఆటంకపరిచే సంస్థలన్నింటి రూపుమాపి, ఈ సూత్రాలన్నింటిని పెంపొందించే సంస్థలను స్థాపించగ విప్లవాత్మకప్రభుత్వం ద్వారానే విప్లవం తీసుకువచ్చినట్లవుతుంది.''

అల్పసంఖ్యాక నియంతృత్వాన్ని లావ్రోవ్ సంపూర్ణంగా నిరా కించాడు: ''గొప్ప అధికారమును పొందటంవలన ఉత్తమవ్యక్తులక అవినీతి అలవడుతుందనీ, ప్రజాక్షేమంలో మహాశక్తిమంతులే అపజయ పొందారనీ చరిత్ర తెలియచేస్తోంది. నియంతృత్వవిధానానికి, లోం పడివుండే పనిముట్లవలె ఉపయోగించే సంరక్షణసాధనలు తప్పకుండ కావాలి. వ్యతిరేకులైన శత్రువులనేకాక, తన పద్ధతులకు, పనులక వ్యతిరేకించిన వారినికూడా అణచివేయవలసినఅవసరం నియంతృత్ విధానంలో తప్పనిసరికాగలదు. నియంతృత్వస్థాపనలో ఎవ్వడ విజయం పొందినా, తనశక్తిని తనకార్యక్రమమును సాధించుకోటంలో వినియోగించుకునే కాలం కంటే అత్యధిక కాలమును తనశత్రువుల నుండి తనఅధికారమును నిలబెట్టుకోటానికే వినియోగించవలసి వుంటుంది.''

అనేక సంవత్సరాలక్రిందటనే హెర్జెన్ వ్రాసిన నమ్మకాలనే అతడు పునశ్చరణ చేశాడు. ''సంపూర్ణమైన ప్రజాస్వామ్య సమానత్వంలోఉన్న రిపబ్లికు స్వాతంత్ర్యంలో సాంఘికాభివృద్ధి సాధ్యపడుతుంది. సోషలిజానికి దారితీయని రిపబ్లికు హాస్యాస్పదమౌతుంది; దానికదే గమ్యస్థానంగా ఉన్న సందిగ్ధావస్థ కాగలదు. •రాజకీయ స్వాతంత్ర్యం అవసరంలేని సోషలిజం శీఘ్రంగా ఆటోక్రటిక్ కమ్యూనిజంలోకి మారుతుంది.''

దేశభ్రష్టులైన విప్లవకారుల ప్రభావమును అరికట్టుటకై, 1874 వ॥ జనవరినాటికి తిరిగి రావలసిందని, ఇతరదేశంలోవున్న విద్యార్థు లందరికీ ప్రభుత్వం ఒకప్రకటన చేసింది. రష్యాదేశంలోని ప్రజలకు

సోషలిజం సూత్రాలను బోధించుటకిదే మంచిఅవకాశం అనుకుని చాలామంది ప్రభుత్వాజ్ఞను పాలించారు.

1876 సం॥లో బకునిన్ ప్రభావంలో విప్లవకారులంతా "భూమి-స్వాతంత్ర్యము" అనే సంఘాన్ని స్థాపించారు. కర్షకులలో తిరుగుబాట్లను, నిరాకరణోద్యమాలను రెచ్చగొట్టి, కార్మికులచే సమ్మెలు చేయించి, క్రింది తరగతివారినుంచే సాంఘిక విప్లవమును లేవదీయుటయే వారి కార్యక్రమం. రాబోయేతిరుగుబాట్లను నడిపించుటకు "యుద్ధదళాలను" ఏర్పాటు చేశారు.

1879 లో 'భూమి-స్వాతంత్ర్యము' వర్గంలో చీలిక లేర్పడ్డాయి. అప్పుడు దౌర్జన్య కార్యక్రమాలను ఏర్పాటుచేయుటకై ఒక కార్యనిర్వాహక సంఘం ఏర్పాటయింది. జార్జిప్లాకెనోవ్ నాయకత్వంలో ఏర్పడిన ఒక ముఠావారు దౌర్జన్య విధానమును నిరాకరించారు. ఈ ముఠాకు 'బ్లాక్ రిపార్టిషన్' (Black repartition) అనే పేరువచ్చింది. మిగిలిన ముఠాకు 'పీపుల్స్‌విల్' (People's will) అనే పేరువచ్చింది,

స్వభావసిద్ధంగా కర్షకునికి సోషలిజంభావాలే వుంటాయని రెండు పక్షాలవారు నమ్మివున్నారు. పారిశ్రామిక కార్మిక వర్గంద్వారానే సోషలిజం స్థాపించవచ్చుననే మార్క్సు సిద్ధాంతానికి వ్యతిరేకంగా, రష్యాలోని కర్షకుడుకూడా అదేపాత్రను నిర్వహించగలడని వీరునమ్మివున్నారు.

కాని కొంతకాలంవరకు సోషలిజంను సాధించలేమని పీపుల్సువిల్ వర్గంవారి నమ్మకం. సంస్థానములన్నింటినీ కర్షకవర్గానికి అప్పగించుట, ప్రజాస్వాతంత్ర్యము—వారికి సత్వరాశయం. రష్యాప్రజలకు కావలసిన రాజ్యాంగవిధానమును ఏర్పాటు చేయటానికి రాజ్యాంగ సభను ఎన్నుకునేవరకు తాత్కాలికప్రభుత్వమును స్థాపించాలని ఆపార్టీ షరతు చేశారు. నిరంకుశ పరిపాలననుంచి ప్రజాస్వామ్య స్వాతంత్ర్యమును సంపాదించుటకు రాజరికసంహారమే ఏకైక మార్గమని ఈపార్టీ వారి విశ్వాసం.

1881 సం॥ మార్చి 13వ తేదీని జార్ రెండవ అలెగ్జాండరు హత్య జరిగింది.

ఈ దెబ్బతో క్రొత్తరాజైన మూడవ అలెగ్జాండరు గుండెలో బెదురు కలుగుతుందని ఆసించిన దౌర్జన్యకారుల ఆశలు పటాపంచలైనాయి. 1881 సం॥ మే 13వ తేదీని మూడవ అలెగ్జాండరు ఇలా ప్రకటించాడు. "మాయొక్క దుఃఖసమయంలో, భగవంతునిపై నమ్మకంతో, నిరంకుశత్వ నిజాయితీ, అధికారములలో నమ్మకంకలిగి, ధైర్యంతో రాజ్యాధికార మును స్వీకరించమని భగవంతుడాజ్ఞాపిస్తున్నాడు."

హత్యలో పాల్గొన్న వారిలో అయిదుగురిని ఉరితీశారు. చాలా మంది పార్టీ నాయకులకు దీర్ఘకాల శిక్షలను, సైబీరియా ప్రవాసశిక్షలను విధించారు. వేరా పిగ్నర్,—'మెడొన్నా ఆఫ్ ష్లుషెల్బర్గు-తో సహా మరి కొంతమందిని ప్రసిద్ధికెక్కిన దుర్గకూపాలలో బంధించారు. అక్కడ కొందరు మరణించారు; కొందరు పిచ్చెత్తిపోయారు.

జారు ప్రభువుపట్లను, అతని మంత్రులపట్లను దౌర్జన్యకార్యాల నంగీకరించినా, 'పీపుల్సు విల్' పార్టీ వారికి, బకునిన్, నెచైవ్, కచేవ్ లకు ఏకాభిప్రాయం లేకపోయింది.

"మాలో ఒక్కరుకూడా జాకొబిన్ కాదు. అల్ప సంఖ్యాకుల నిర్ణ యమును అధికసంఖ్యాక ప్రజలపై నిర్బంధంగా ప్రయోగించటం మా ఉద్దే శ్యంకాదు. చట్టంద్వారా విప్లవాత్మకమైన సాంఘికార్థిక రాజకీయ మార్పులుచేసే ప్రభుత్వమును మేమెన్నడు నిర్ణయించలేదు. విప్లవ కారుల పార్టీకి వ్యతిరేకమైన చర్యలనేమైనా, ప్రజాప్రతినిధులు నిర్ణ యించినట్లయితే ఈ పార్టీ ఏ సందర్భంలోను దౌర్జన్యచర్య నవ లంభించదు. కాని శాంతియుతంగానే ప్రచారంమాత్రం చేస్తుంది...." అని 1918 సం॥లో వెరాపిగ్నర్ వ్రాశాడు.

"మరణించిన వారినుంచి, జీవించివున్న వారికి" అనే శీర్షికతో 1882 సం॥లో దుర్గకూపాలలోవున్న కార్యనిర్వాహకసభ్యులు రష్యా ప్రజలకొక సందేశం పంపించారు. దానిలో వారు దౌర్జన్యమును, రక్త పాతమును నిరసించారు:

"సోదర సోదరీమణులారా! మాయొక్క మరణకూపంనుంచి మా యీ అంత్యసందేశమును పంపిస్తున్నాము. మనవిజయదినంనాడు,

మనతో జీవించివున్న శత్రువుపై దౌర్జన్య, కరకుకసాంఘుచర్యలతో మన విప్లవంయొక్క గొప్పతనాన్ని నాశనం చేయవద్దు. మాయొక్క దుర దృష్టస్థితి రష్యాస్వాతంత్ర్యమునకు మాత్రమే కాకుండా, ఇంకా ఎక్కువ మానవత్వంగల సమాజమును తయారు చేయుటకుకూడ దోహదమిచ్చు గాక! మా దేశానికి జోహార్లు! సమస్త మానవజాతికి జోహార్లు!'' అని ఆ సందేశంలో వారు వ్రాశారు.

పీపుల్సు విల్ నాయకత్వాన చిన్నాభిన్నం అయిపోయిన తరువాత కొందరు విప్లవాదులు ఇతర దేశాలకు పారిపోయారు. వారిలో జార్జిప్లెకనోవ్, పాల్ఆక్సులార్డు, వెరజానులిచ్, బ్లాక్ రిపార్టిషనుకు చెందిన లియొడియుచ్ వున్నారు. 1883 సం॥లో వారు ''కార్మికులకు మోక్షం సాధించే సంఘం'' అనే పేరుతో రష్యాలో మార్క్సు సిద్ధాంతాలను ప్రచారం చేశారు. కర్షకుల తిరుగుబాటు ద్వారాగాని, అల్పసంఖ్య విప్లవవాదులు హఠాత్తుగా దెబ్బతీయటం ద్వారాగాని, సోషలిజానికి చేరు కోటానికై రష్యా ఒకమార్గం త్రొక్కవలసి వున్నదన్న భావాన్ని త్రోసిరాజంటూ, ఈ సంఘంవారు పుస్తకాలను, కరపత్రాలను ప్రకటించారు.

విప్లవ సంఘాలన్నీకూడా క్రమబద్ధులైన వర్గహృదయంగల కార్మిక తరగతి ప్రజల ప్రోద్బలాన్ని సంపాదించినప్పుడు మాత్రమే సోషలిజానికి పోరాటంవిజయవంతం కాగలదని ఈ సంఘసభ్యుల అభిప్రాయం.

—సోషలిస్టు సంఘసంస్థావనాశయం విజయవంతం కావాలంటే రాజకీయస్వాతంత్ర్యం తప్పనిసరిగా కావాలి.

మార్క్సిస్టుల నాయకుడు ప్లెకనోవ్. అతని నాయకత్వంలో మొట్ట మొదటి సాంఘిక ప్రజాస్వామ్య సంఘాలు స్థాపింపబడ్డాయి. కాని రష్యా అంతటిలోను పీపుల్సువిల్ పార్టీని పునరుద్ధరించాలనే ఆశగల చిన్న విప్లవసంఘాలున్నాయి. అలెగ్జాండరు ఉలియనోవ్ నాయకత్వంలో ఉన్న దౌర్జన్యకారులసంఘం వీనిలో ఒకటి.

ఉలియనోవ్‌చే తయారుచేయబడిన సెంట్‌పీటర్సుబర్గు విప్లవ కారుల కార్యక్రమంలో ఈ క్రింది వివరాలున్నాయి: ''కనీస స్వాతంత్ర్యం

తేనందుచేతనే దౌర్జన్యభావం ఉదయిస్తుందనే నమ్మకంతో ఉన్నందు వలన, ప్రభుత్వం ఆకనీసపు స్వాతంత్ర్యమును ఇచ్చినట్లయితే దౌర్జన్య చర్యలన్నీ నసిస్తాయని మేము ధైర్యంగా చెప్పగలము.''

జారుచక్రవర్తి వారికి కనీసపు స్వాతంత్ర్యంకూడా ఇవ్వడనే నమ్మకం కలిగినతరువాతనే అలెగ్జాండరు ఉలియనోవ్ దౌర్జన్యచర్యల వారంభించి, తద్వారా ఉరికంబమెక్కాడు. అతని చిన్నతమ్ముడు వ్లాడిమర్ దౌర్జన్యపద్ధతుల నవలంభించలేదు. దానికి బదులు అతడు మార్క్సిజమునే అనుసరించాడు. అతడుమార్క్సుసూత్రాలను సంపూర్తిగా అనుసరించినా, అతని హృదయంలో విప్లవవర్గాల విభిన్నదృక్పథాల ప్రభావం పూర్తిగా పనిచేశాయి. అతని అన్న మరణసమయంలో మార్క్సును గూర్చి అతనికేమాత్రం తెలియకముందు-హెర్జెన్, లావ్రోవ్‌లు చేసిన మానవతత్వ ప్రబోధములను, బకనిన్, కచేవ్, నెచైవ్‌ల రాక్షస దృక్పథాల తత్వాన్ని అర్థంచేసుకున్నాడు. అలెగ్జాండరుఉలియనోవ్‌లో ఉన్నతాశయమును, ఆత్మత్యాగబుద్ధిని పెంపొందటానికి చరిత్రలో మరి ఏ ఇతర ఉద్యమాలకంటె కూడా పీపుల్సువిల్‌ద్వారా హెర్జెన్, లావ్రోవ్‌ల భావాలే ఎక్కువపనిచేశాయి. నెచైవ్‌లాంటివారిచేత ప్రబోధింపబడిన సర్వమానవసంహార సూత్రాల నింకా పరీక్షించాల్సివుంది.

అభివృద్ధి ప్రబోధకులంతా మానవుని స్వాతంత్ర్యమునే ఆకాంక్షించారు. వ్యక్తిగతంగా దౌర్జన్య పద్ధతులను వినియోగించినప్పటికీ, వారి పనులన్నింటిని నీతినియమాల పద్ధతులలోనే చేశారు. వారి నిజమైన ఆశయాలను రహస్యంచేయకుండా, ఇతరుల ప్రాణాల కపాయం కలిగించడానికి బదులు తమ ప్రాణములనే బలిదానం చేశారు.

కాని నెచైవ్ వానియనుచరులు, వారి ఆశయసాధనకై అనేకమైన రాక్షస సాధనలనే ప్రేరేపించారు. అంతులేని బలదౌర్జన్యాలతో అల్పసంఖ్యాకులనియంతృత్వ పాలనగాని, అల్లకల్లోలంగాని ఏర్పరచాలనే ఆశతో, రష్యా ప్రజలను తమ రహస్యాశయసాధనకు పరికరాలుగా ఉపయోగించారు.

ఆదిలోవున్న విప్లవసంఘాలలో రెండుదృక్పథాలవారు వుండేవారు. కాని లెనిన్ సోదరుడు ఉరితీయబడిన సమయానికి రష్యా విప్లవోద్యమంలో మానవత్వసూత్రాలకే ఎక్కువప్రాముఖ్యం వచ్చింది. 1867 సం॥ హెర్జెన్ చెప్పిన సూత్రమైన "రాజకీయ స్వాతంత్ర్యం లేని సోషలిజం అతిత్వరలో ఆటోక్రటిక్ కమ్యూనిజంలోకి దిగుతుంది" అన్నది యదార్థమని అంగీకరించారు. నెచైవ్ సూత్రాలను శాశ్వతంగా మూలకి త్రోసివేశారు. బహుశః ఒక్క, డొస్టోవిస్కీ తప్ప, అవి తిరిగి తలయెత్తి రష్యాచరిత్రలోనూ, ప్రపంచచరిత్రలోనూ ప్రధానపాత్రను నిర్వహిస్తాయని ఇంకెవ్వరూ గ్రహించలేకపోయారు.

# యౌవ్వనము

వాల్గాప్రాంతంలోని సింబర్స్కు గ్రామంలో 1870 సం॥ ఏప్రిల్ 22వ తేదీని వ్లాడిమర్ ఇలిచ్ ఉలియనోవ్ జన్మించాడు. అతని తల్లి మేరియా అలెగ్జాండ్రోవ్నా, అలెంగ్జాండర్‌బ్లాంక్ అనేవైద్యుని కుమార్తె. కజన్‌లోని కకుష్కినో గ్రామంలోస్థిరపడడానికై అతడు సెంట్‌పీటర్సుబర్గులోని అతని వైద్యశాలను విడిచిపెట్టాడు.

ఆమె 1863 సం॥ వేసవికాలంలో ఇల్యాఉలియనోవ్‌ను వివాహమాడి అతనితో పెన్జాకు వెళ్ళిపోయింది. ఇల్యా చాలా నీతి ప్రవర్తనగల బలిష్టుడు. అతని క్రింది వారందరితో అతడు కఠినంగా ఉండేవాడు. రాజకీయాలలో అతడు కన్సర్వేటివుగా వుంటూ, పూర్వాచారపారీణమైన చర్చిలో సభ్యుడుగావున్నాడు, 1866 సం॥ ప్రప్రథమంగా మేరియాకు ఆరుగురు పిల్లలలో మొదటివాడైన అలెగ్జాండరు పుట్టాడు. 1869 సం॥ సెప్టెంబరులో ఇల్యాకు రాష్ట్రపాఠశాలల ఇనస్పెక్టరు వుద్యోగం వచ్చింది. వారు సింబర్స్కులో అద్దెకుతీసుకునివున్న ఇంట్లో వ్లాడిమర్ జన్మించాడు.

వ్లాడిమర్-అందమైన కళ్లు, బరువైన శరీరం కలిగి, చిన్నతనంలో అల్లరిపిల్లవాడుగా ఉండేవాడు. అతని చెల్లెలు ఆల్గాతో కూడానే అతడు కూడా నడక నేర్చుకున్నాడు. ఆమె అతనికి ఆటలో సహాధ్యాయిని; అలెగాండరు అతనికి ఆదర్శవీరుడు.

వ్లాడిమర్ తన పాఠాలను అతిక్షుణ్ణంగా చదివేవాడు. అతడు వ్రాతలో ఎంతశ్రద్ధతీసుకునేవాడో, అతనిసోదరుడు డిమిట్రీ ఇల్లా వ్రాశాడు:

''ఒక పావుటావుకాగితంమీద అతడు ప్రధానాంశం వ్రాస్తాడు. అప్పుడతడింకొక కాగితం తీసుకుని దాన్ని సగంగా మడిచి, ఎడమప్రక్క భాగంమీద, ప్రధానాంశంబట్టి చిత్తుప్రతిని తయారుచేస్తాడు. కుడివైపున ఖాళీగా వుంటుంది. ఇక్కడ అతడు క్రొత్తవిషయాలను, వివరణలను, తప్పొప్పులు మొదలైనవి వ్రాస్తాడు.''

అతని బంధువులు స్నేహితులు చెప్పిన పూర్వస్మృతులనుబట్టి అతని బాల్యమంతా ఇంచుమించుగా అల్లరిచిల్లరిగా వుండేది.

ఉలియనోవ్‌లు ధనవంతులు కాకపోయినా, వారి జీవిత విధానమంతా చిన్నతరగతి జమీందారులవలెనే వుండేది. అతని ఉద్యోగ హెూదానుబట్టి ఇల్యానికొలోవిచ్‌ని అటువంటితరగతిలో చేర్చారు. వ్లాడిమర్ పదహారు సంవత్సరాల వయసులో వున్నప్పుడే అతనితండ్రిమరణం వారికి కలిగిన ప్రథమకష్టం. దానితరువాత ఏడాదికే అలెగ్జాండరు విషాద మరణంసంభవించింది. కాని మేరియా అలెగ్జాండ్రోవ్నా చాల ధైర్యవంతురాలు కుటుంబంలోనివారంతా ఒకరికొకరు కలిసి మెలసి వుండేవారు.

అలెగ్జాండరు మరణానికి ఒకనెలతరువాతనే సింబర్‌స్క్ కళాశాల నుంచి వ్లాదిమర్ బంగారుపతకంతో పట్టభద్రుడైనాడు. కాని అతడు ఉరితీయబడిన విప్లవవాదికి తమ్ముడైనందుచేత అతనికి కజాన్ విశ్వవిద్యాలయంలో స్థానందొరుకుతుందని తోచలేదు. కాని 1917 లో తన రాష్ట్రప్రభుత్వాన్ని కూలద్రోసిన అలెగ్జాండరు కెరెన్‌స్కీ తండ్రివల్ల అతనికి స్థానం లభించటం అతని అదృష్టం.

ఫియడోర్ కెరెన్‌స్కీ సింబర్‌స్క్ కళాశాలకు డైరక్టరుమాత్రమే కాదు; అతనిని ఉలియనోవ్‌కుటుంబానికి గార్డియన్‌గా ఇల్యానికలోవిచ్ ఒకవిల్లును వ్రాశాడు.

''స్కూలులోగాని, బైటగాని, ఉపాధ్యాయులకుగాని, స్కూలు అధికారులకుగాని అసంతృప్తికలిగించేటట్లు ఉలియనోవ్ ఏ పనిని చెయ్యలేదు.'' అని ఫియడోర్ కెరెన్‌స్కీ వ్రాశాడు.

"అతడు మానసిక, నైతిక ప్రబోధనలో పూర్తియైన శ్రద్ధ తీసుకున్నాడు. అతని సంరక్షణలో మతము, క్రమశిక్షణలను ప్రాతిపదికగా ఉండేవి. వానియొక్క ఫలితం అతని ఆదర్శప్రవర్తనలోనే గోచరించాయి." అని కూడా ఆయన వ్రాశాడు.

ఆ సమయంలో ఈ వ్రాతనుగూర్చి వ్లాడిమర్ ఏమనుకున్నాడో ఏమీ తెలియదు. కాని ఒక బోల్షివిక్‌పార్టీ ప్రశ్నావళిలోనున్న 'దేవునిలో నమ్మిక ఎప్పుడు విడిచిపెట్టా'వనే ప్రశ్నకు సమాధానంగా "పదునారవ ఏట" అని లెనిన్ వ్రాశాడు.

1887 సం॥ లో వ్లాడిమర్ కజన్‌విశ్వవిద్యాలయంలో చేరగానే విద్యార్థుల అక్రమచర్యలలో ప్రవేశించాడు. కొంచెం లిబరలు భావాలుగల ఆచార్యులను ఉద్యోగాలనుంచి బర్తరఫ్ చేశారు. రాజకీయాలలో పాల్గొన్న విద్యార్థులను ప్రవాసంపంపించారు. ఈ పద్ధతులు అప్పటి విద్యార్థి పోరాటాలను మరింత బలవత్తరం చేశాయి. 1887 సం॥ డిశంబరు 4వ తేదీని విద్యార్థులందరూ తమకోర్కెలను తెలియచేస్తూ అధికారికి ఒకకార్యక్రమం ఇచ్చారు.

మొట్టమొదటి వరుసలో చేతులు కట్టుకుని నిలచిన వ్లాడిమర్‌ను, ఆ రాత్రి మరి నలుబదిమంది విద్యార్థులతో సహా బర్తరఫ్‌చేశారు. అతని తల్లికోర్కె ననుసరించి అతడు పోలీసుపర్యవేక్షణలో కొకుష్కినోలో నివసించటానికి అంగీకరించారు. ఇక్కడ కుటుంబమంతా ఏకాంతవాసం చేశారు. కాని వ్లాడిమర్ ఏమీ ప్రత్యేకకష్టం అనుభవించలేదు. వారింట్లో కావలసినన్ని పుస్తకాలున్నాయి. వేటమొదలైన ఆటపాటలతో కాలక్షేపం చేశారు.

తరువాత మళ్లీ వ్లాడిమర్ కజన్‌లో నివసించటానికి అంగీకరించారు. కాని విశ్వవిద్యాలయంలో చేర్చుకోటానికి అధికారులంగీకరించలేదు. వారికుటుంబం రెండుఅంతస్తులు, ఒకతోటవున్న బంగళాను అద్దెకు తీసుకున్నారు. అధికంగావున్న ఒక వంటగది అతనికి చదువుకునేగది అయింది. అతని పదునెనిమిదవఏట, ఈ గదిలోనే అతడు కారల్ మార్క్సును గూర్చి చదవటం ఆరంభించాడు.

ఆతరువాత సంవత్సరమే వారి కుటుంబమంతా సమారాకు వెళ్ళి పోయారు. అతడక్కడ ఒక చిన్న మార్క్సిస్టు వర్గాన్నిస్థాపన చేశాడు. ఈలోగాఅతనిని విశ్వవిద్యాలయంలో చేర్చాలని అతనితల్లి ఎంతో ప్రయత్నం చేసింది. ఈవిషయం కజాన్స్కీలు అధికారివద్దకు వచ్చింది. అతడు వ్యతిరేకమైన రిపోర్టు వ్రాసిపంపించాడు. అప్పుడు మేరియా అలెగ్జాండ్రోవ్నా ఈ కేసును, సెంట్ పీటర్సుబర్గులోని విద్యాశాఖమంత్రివద్దకు తీసుకువెళ్ళింది. ఆమెయొక్క ప్రయత్నఫలితంగా చివరికి లెనిన్ సెంట్ పీటర్సుబర్గు విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రపట్టము పొందటానికి అధికారు లంగీకరించారు.

వేసవిలో అతడు రాజధానికి వెళ్లేముందు చాలాబాగాచదివాడు. 1891 సం॥లో అతడు న్యాయశాస్త్రంలో ఉన్నతతరగతిలో ప్యాసై న్యాయవాద వృత్తిలో ప్రవేశించాడు. కాని అతనికి చిన్ననాటినుంచీ సహచరురాలైన ఆల్గా, ఆ సమయంలోనే టైఫాయిడ్ జ్వరంవచ్చి మరణించటంవలన అతని విజయోత్సాహానికి కొంత అంతరాయం కలిగింది.

అతని తల్లికోసమే అతడు సమారాకు తిరిగివచ్చి న్యాయవాదవృత్తి ప్రారంభించాడు. నిజానికి అతడుస్థాపించిన రహస్యపు మార్క్సిస్టు సంఘమునకే ఆతడధికకాలమును వినియోగింపవలసివచ్చింది. అతనికి మొదటి అనుచరులు అతని సోదరీమణులు అన్నా, మేరియాలు, తమ్ముడైన డిమిత్రి.

డిమిత్రి, మేరియా లిద్దరు చాలావరకు మరణించిన వారిఅన్న అలెగ్జాండరువలెనే లోతైన నుదుర్లుకలిగి అందంగా వుండేవారు. దళసరియైన చిన్న ముక్కు, వెడల్పైన ఎత్తుదవడఎముకలు కలిగి, మేధాశక్తితో ప్రకాశించే కళ్లతో సామాన్యమైన ముఖంతో వుండేవాడు వ్లాడిమర్. ఇరువది ఒకటవ ఏటినుంచే అతనికి జుట్టు త్వరితంగా ఊడిపోటం ఆరంభించింది.

1892 సం॥ ప్రారంభంలో సమారా రాష్ట్రంలో కరువు వచ్చింది. తిండితిప్పలు లేక కర్షకులంతా పట్టణానికి చేరుకున్నారు. ఈ దిక్కులేని

వారందరి సహాయార్థమై ఒక పౌరుల సంఘాన్ని ఏర్పాటు చేశారు. కాని వ్లాడిమర్ తలవనితలంపుగా వేరొకమార్గం అవలంభించాడు.

"ఒక రకమైన సాంఘికవిధాన ప్రత్యక్షఫలితమే ఈ కరువు. ఆ విధానం ఉన్నంతకాలం కరువుకాటకాలు తప్పవు. వాటిని నిర్మూలించటానికి అటువంటి సాంఘికవిధానమును నిర్మూలించాలి. ఈ ఉద్దేశ్యప్రకారం ఇది తప్పనిసరి కనుక ఇది ఈనాడుపయుక్తంగానే పరిణమిస్తుంది.....

" 'సంఘం' అని అనుకునేవారికి వీరికెంత సహాయం చెయ్యాలని, వీరినెంతగా ఉద్ధరించాలనేకోర్కె వున్నదో తెలుసుకోటం సులభం. ఈకరువువల్ల దారుణమైన అల్లరులుబయల్దేరవచ్చు; బహుశః ధనికవర్గమే నాశనం కావచ్చు. అందుచేత ధనవం తులైనవారు కరువుబాధను తగ్గించటానికి ప్రయత్నించుట న్యాయం. కడుపులు కాలేవారికి అన్నము పెట్టమని చెప్పటం బుద్ధిమంతులైన వారందరూ చెప్పేదానికంటె విరుద్ధం కాదు." అని లెనిన్ నొక్కి చెప్పాడు.

లెనిన్ మొదటిసారిగా బహిరంగంగా చెప్పిన మాటలివే.

1893 సం॥లో వ్లాడిమర్ ఉలియనోవ్ సెంట్‌పీటర్సుబర్గు పట్టణానికిపోయి 'ఎల్డర్స్' అనే రహస్య సోషల్‌డిమొక్రటిక్ సంఘంలో చేరాడు. కర్షకులంతా కార్మికులు కావటానికి పట్టణాలకు వస్తున్నంతగా రష్యాదేశం పారిశ్రామికాభివృద్ధి పొందుతున్న సమయంలో అతడు చేరాడు. చిన్నచిన్న కార్మికవర్గాలలోనే, సోషల్‌డెమొక్రాట్లు తమ ప్రచారమంతా చాలా ఉన్నతస్థాయిలో జరిగించారు. దాని ఫలితంగా ఈ వర్గాలు సామాన్యజనులకు దూరంగా వుండిపోయాయి.

ప్రచారకసభలలో 'పట్టభద్రులైన' ప్రచారకులు ప్రమాదస్థితికి దూరంగానే వుండాలని ఆదేశించారు. వారు ఏ సమ్మెలలోను, లేబరు గల్లంతులలోను పాల్గొనలేదు. వెంటనే ప్రత్యేకప్రచారంనుంచి ప్రజా సామాన్య పోరాటాలకు దారితియ్యాలని లెనిన్‌సలహా నిచ్చాడు. అతని కార్యప్రణాళికను కొందరు వ్యతిరేకించారు. కాని 1895 సం॥ నాటికి అత

నితో నిలబడిన వారందరు కార్మికులలో అలజడిలేవనెత్తటానికి ప్రచారం చేస్తామని అంగీకరించారు.

ఎల్లర్లకు ఉలియనోవ్ నాయకుడయ్యాడు. సెంట్‌పీటర్సుబర్గు ఫ్యాక్టరీపనివారి నుద్దేశించిచేసిన విజ్ఞాపనకు గ్రంథకర్త అతడే.

నిరంకుశపరిపాలకులకు, మార్క్సిస్టువర్గాలవారి రచనలు మొదట అంగీకారంగానే వున్నాయి.

"ఒక చిన్న ముఠా. అధమం ఏబది సంవత్సరాలవరకు వీరివల్ల ఏప్రమాదంరాదు" అని పోలీసు డైరక్టరు జ్వోలియార్‌స్కీ అన్నాడు. విప్లవోద్యమానికి ఇంకా పీపుల్సువిల్‌వారే అధికారులైవున్నారు. జారు ప్రభువు రహస్యపోలీసులకంటె మార్క్సిస్టులే ఈ పీపుల్సువిల్‌వారి కెక్కువ వ్యతిరేకంగా పనిచెయ్యగలరని అధికారులంచనా వేశారు. అంతే కాకుండా వారిరచనలు విప్లవకారులఆరోపణలన్నీ అపాయం చేయ లేనంత అర్థ్వాన్నంగా ఉన్నాయని చెప్పటానికి వీలైనంత శాస్త్రసమ్మతంగా వున్నాయి. ఈ సమయంలో సెన్సారులచే అనుమతింపబడిన రెండుగ్రంథాలు ప్రకటింపబడ్డాయి. ఒకటి ప్లెఖనోవ్‌వ్రాసినది, ఇంకొకటి పీటర్‌స్ట్రువే వ్రాసినది.

1894 సం॥ లో క్రిస్టమస్ పండుగనాడు సెంట్ పీటర్సుబర్గు ప్రాంతంలో జరిగినసభలో ఈ గ్రంథాలనుగూర్చి ఉలియనోవ్ ఒక ఉపన్యాసం చదివాడు. ప్లెఖనోవ్ గ్రంథంగూర్చి భక్తిశ్రద్ధలతో పొగడుతూ, పురాతన మార్క్స సిద్ధాంతాలకు దూరమై వ్రాసినందుకు స్ట్రువే గ్రంథాన్ని తీవ్రంగా విమర్శించాడు. ఈ సభలోనే ప్రారంభ దశలో సోషల్‌డిమొక్రటిక్ సహచరుడు అలెగ్జాండర్ పొట్రెసోవ్ మొదటిసారిగా ఉలియనోవ్‌తో మాట్లాడాడు.

"ఉలియనోవ్ విమర్శలోని నిశితశక్తి, ఈ నాటికీ నాకు జ్ఞాపకంవుంది. అతడు మహాశక్తిని ప్రదర్శించాడని నా అభిప్రాయం. అతని ముఖం నీరసించింది; కొద్దిమాత్రపు వెంట్రుకలుతప్ప పూర్తిగా బట్టతల, చిన్న ఎఱ్ఱనిగడ్డం వుండేవి. అతని మెల్లకళ్లు, కనుబొమల

క్రిందినుంచి తీక్షణంగా చూసేవి.'' అని అనేకసంవత్సరాల తర్వాత పొట్రెసోవ్ వ్రాశాడు. ఇరువది నాలుగు సంవత్సరాల వయసులోనే అతనికి 'ముసలివాడు' అని పేరువచ్చింది.

ఎక్కువ పనివలన 1895 సం॥ ఆరంభంలో న్యూమోనియ జబ్బు తీవ్రంగా వచ్చింది. ఏప్రిల్‌నెలలో అతడు వైద్యానికై ఇతరదేశాలకు వెళ్ళాడు. రష్యా మార్క్సిజానికి ఆదిమూర్తులైన ప్లెకెనోవ్, ఏక్సిలార్డు లను, ఇతర సోషలిస్టు నాయకులను కలుసుకోటానికి ఈ అవకాశం బాగా ఉపయోగించింది. పారిస్‌లో మార్క్సుఅల్లుడైన పాల్‌లఫార్గ్యును అతడుకలుసుకున్నాడు.

1895 సం॥ ఆరంభంలో ప్లెకెనోవ్, ఉలియనోవ్‌లు జనీవావద్ద కలుసుకున్నప్పుడు, ప్లెకెనోవ్ ఉపాధ్యాయుడు, ఉలియనోవ్ అతని శిష్యుడు. ప్లెకెనోవ్ నిశితమైన మానవత్వస్వభావం కలవాడు. అతనిది వేదాంతదృక్పథం. అయినప్పటికీ అతడు వ్రాసిన వ్రాతలతోనే తృప్తి పొందక, రాజకీయనాయకత్వం వహించాడు. కాని కార్యశూరుడైనందున వానిధాటికి ఆగలేక తిరిగి రచనలను సాగించాడు.

''జారు ప్రభుత్వము, వర్తకుల క్రౌర్యాన్నుంచి నాగరికతను, దాని అభివృద్ధిని రక్షించాలనే ఉన్నతాశయంతో అతడు రాజకీయవీరుని పాత్ర వహించాడు. కాని అన్నింటికంటె ప్రధానంగా లెనిన్ రాజకీయ వీరుడు లెనిన్ జాతీయతను సంపూర్ణంగా త్రోసిరాజన్నాడు. వారి పనిలోను, పద్ధతులలోను ఆరంభంనుంచి వున్న భేదంనుంచి, క్రమంగా ఎత్తులలోను, రాజకీయాశయంలోను భేదం వచ్చింది.'' అని లునకార్స్కీ వ్రాశాడు.

సంభాషణలలోని వాఙ్మయం, కళలనుగూర్చి ప్రస్తావన వచ్చినప్పుడు ఆ యువకునిలోని భావనాశక్తి, ఉద్రేకము తక్కువగా వున్నట్లు ప్లెకెనోవ్ గ్రహించాడు. కాని ఉలియనోవ్ రాజకీయాలలో ప్రవేసించిన వెంటనే ''పూర్తిగా మారిపోయి గొప్పశక్తి సామర్థ్యములను ప్రదర్శించాడు. ప్రతివిమర్శలోను గంభీరమైన ప్రతిబింబం కనిపించింది. అతని భావాలన్నీ జీవితానుభవాలపై ఆధారపడివున్నట్లు ప్రతివానికి తెలు

స్తుంది. అతని జీవితానుభవం అంత ఎక్కువ కాకపోయినా, అతన్ని విప్లవకార్యక్రమంలో ఉత్తమునిగా చేయటానికి అది చాలు."

పార్టీకి కావలసిన నాయకుడు దొరికాడని ప్లెకెనోవ్ భావించాడు. నమ్మేలను, నిరంకుశత్వాన్ని ఎదిరించే విప్లవంగా మార్చగల శక్తిసామర్థ్యాలుగల వాడితడే. పీపుల్సువిల్‌పార్టీలో వుండిన అలెగ్జాండరు మిఖైలోవ్‌ను ఉలియనోవ్ గుర్తుకు తెస్తుండేవాడు. మిఖైనోవ్‌వలెనే ఉలియనోవ్‌కూడా నిర్మాణకార్యక్రమంలో గట్టివాడు. "ఒకే ఆశయసాధనలో నమ్మకంగల వారిద్దరుకూడా రెండు రకాలుగా మాట్లాడేవారని" పొట్రెసోవ్ భావించాడు.

ప్లెకెనోవ్ పరిచయంతో ఏక్సెలార్డును కలుసుకోటానికి ఉలియనోవ్ జనీవానుంచి జూరిచ్ వెళ్ళాడు. ఇతన్నిగూర్చి ఏక్సెలార్డుకి స్వల్పంగా తెలియటంచేత సంభాషణ ఎక్కువ మనస్ఫూర్తిగా జరుగలేదు. ఈమధ్యనే ప్రకటింపబడిన మార్క్సువ్యాసాలుగల గ్రంథాన్ని ఉలియనోవ్ అతనికిచ్చాడు.

లెనిన్ స్వంతంగా, నిశితంగావ్రాయబడిన ఒకవ్యాసంమీద అతని దృష్టిపడింది. కాని లిబరల్సుపైన గ్రంథకర్తకున్న విరోధం అతనికి చికాకు కలిగించింది. ఆ వ్యాసరచయిత పేరు కె. టులిన్" అని వుంది.

"టులిన్ ఎవరు?" అని ఏక్సెలార్డు ప్రశ్నించాడు.

"అది నా మారుపేరు"

అప్పుడు మనస్ఫూర్తియైన సంభాషణ జరిగింది.

"రష్యాకార్మికుల ప్రస్తుతాభిప్రాయాలు, సంఘంలోని ఇతర అభివృద్ధికాముకుల అభిప్రాయాలు ఒకటే అనిమా నమ్మకం. రష్యాలోని కార్మికులు, లిబరల్సుకూడ ఒకేపనిలో నిమగ్నులైవున్నారు-నిరంకుశత్వాన్ని నిర్మూలించడం" అన్నాడు ఏక్సెలార్డు.

వారిద్దరు ఒక వారంలో చాలాభాగం వాదోపవాదాలతో కాలక్షేపం చేశారు. అతనికి తృప్తి కలిగిందని చివరికి ఉలియనోవ్ ప్రకటించాడు. ఈ సంభాషణలవల్ల ప్లెకెనోవ్ వలెనే, ఏక్సెలార్డుకు కూడా సదభిప్రాయం కలిగింది. మార్క్సు సిద్ధాంతమును, కార్యరూపకమైన నిర్మాణ

శక్తిని సమన్వయం చేయగల సమర్థుడు ఇంతకు ముందెన్నడూ ఉద్యమంలో లేకపోయాడు.

"ఇప్పుడు మన కటువంటివాడున్నాడు. అతడే ఉలియనోవ్" అన్నాడు ఏక్సిలార్డు.

1895 సం॥ సెప్టెంబరులో ఉలియనోవ్ రష్యాకు తిరిగివచ్చాడు.

సెంటుపీటర్సుబర్గులో, తరువాత తనకి వ్యతిరేకయైన జూల్సు మార్టోవ్‌ను ఉలియనోవ్ కలుసుకున్నాడు. మార్టోవ్ సెంటుపీటర్సుబర్గు విశ్వవిద్యాలయంలో చదివాడు. అక్కడే అతడు విప్లవవాది, మార్క్సిస్టు అయాడు. అతడు విప్లవప్రదర్శనలలో పాల్గొన్నందుకు తరువాత అతన్ని బహిష్కరించారు. రాజధానినుంచి చాలాసంవత్సరాలు ప్రవాసంపంపబడినందువలన, విల్నాలో కార్మికోద్యమంలో ఎక్కువగా పాల్గొన్నాడు. వీరిద్దరు యువకులు రహస్యపోలీసుల కాపలాలో తరుచు గ్రంథాలయంలో కలుసుకునేవారు. "ఆ సమయంలో ఉన్నత తీవ్రభావాలు గలవాడు బోధించటానికి ముందు విజ్ఞానమును గ్రహించే పరిస్థితిలో ఉలియనోవ్ అభివృద్ధి చెందుతుండేవాడు...." అని మార్టోవ్ వ్రాశాడు.

ఆ శీతకాలంలోను తరువాత లెనిఃనను రహస్య పోలీసులు తీక్షణంగా పరీక్షించేవారు. ఏదో కష్టంరాగలదని గ్రహించి, అతడు ఖైదు చేయబడినట్లయితే, తన తల్లిని సెంట్‌పీటర్సుబర్గునకు రాకుండా చెయ్యమని లెనిఃన తన చెల్లెలు అన్నాకు తెలియచేశాడు. ఖైదువలన అలెగ్జాండరు దుఃఖస్మృతులను జ్ఞాపకం చేస్తాయి.

* * *

రహస్యంగా దాగుకోటం, వెతకటం మొదలైన పద్ధతులన్నీ చాలా మాసాలునడిచాయి.కాని రహస్యపోలీసులతన్ని గ్రుడ్డిగావెతికారు. అతడేమి చేస్తున్నాడో, లేక అతని సహచరులెవరో తెలుసుకోటం అసాధ్యమైంది. కాని కొంతకాలానికి 1895 సం॥ డిశంబరు 25 తేదీని, ఉలియనోవ్, మార్టోవ్‌లు ఖైదుచేయబడ్డారు. వారు రహస్యంగా ప్రకటించాలనుకున్న వార్తాపత్రికలను స్వాధీనం చేసుకున్నారు.

# ఖైదు - సైబీరియా

సెంటుపీటర్సుబర్గు జైలునిబంధనలు కఠినంగాలేవు. బంధువులు వారానికి రెండుసార్లుచూడటానికి వెళ్ళవచ్చు. ఒకసారి ఖైదీవున్న గదిలోను; రెండవసారి ప్రక్కనున్న సామాన్యపుగదిలోను. మొదటిసారి ఒకకావలి వాని సమక్షంలో అరగంటవరకు మాట్లాడవచ్చు; రెండవమారు ఒకగంట మాట్లాడవచ్చు. కాని ఖైదీవెనుక, వచ్చినవారివెనుక రక్షకభటులధికంగా వుంటారు. కాని అక్కడ ఏమిమాట్లాడుకోటానికి వీలులేనంత గోలగావుం టుంది. బంధువులు పుస్తకాలను, భోజనమును వారంలో చాలాసార్లు తీసుకుపోవచ్చు. చదివేపుస్తకాలను ఎక్కువకఠినగా తణిఖీచేయరు. దానివలన ఖైదీలు బైటప్రపంచ సమాచారములను తెలుసుకోవచ్చు.

ఉలియనోవ్ వద్దనిచెప్పినా కూడా అతనితల్లి మేరియా అలెగ్జాం డ్రోవ్నా అతనివద్దకు తరుచుగా వస్తుండేది నియమాలు అనుమతించి నంతవరకు ఆమె తరుచుగా పుస్తకాలకట్టలతో జైలుకు వస్తుండేది. కని పెట్టలేనంతక్లుప్తంగా వ్రాయటానికి వీలుగ చుక్కగీతల సాంకేతికవ్రాతను ఉలియనోవ్ అన్నాకు నేర్పాడు. ఈ విధానంతోను. ఇంకా ఇతరసాధనాల ద్వారానుబైటనున్న అనుచరులతో ఉలియనోవ్ తరుచుగ ఉత్తరప్రత్యుత్త రాలు జరుపుతుండేవాడు.

అతన్ని ఖైదుచేసినతరువాత ఇతరసోషల్‌డిమోక్రటిక్‌వర్గాలన్నీ "కార్మిక జనోద్ధరణలీగు" అనే సంస్థతో కలిసిపోయారు. జైలులో ఉన్నవారు అసలైన సోషల్‌డిమోక్రటిక్ నాయకులుకాదని ప్రభుత్వానికి నచ్చచెప్పటానికిది ఒక పన్నాగం. కాని అది సరిగా పనిచేయలేదు. ఒకనెలతర్వాత పొట్రెసోవ్‌తోసహా చాలామంది లీగునాయకులను ఖైదు చేశారు.కాని వారిస్థానంలో క్రొత్తవారువచ్చి విప్లవప్రచారమును సాగించారు.

జైలులోవుండగా ఉలియనోవ్ లీగుకార్యకలాపాలను నడిపిస్తూ దానికిసరియైన నాయకుడని ఆమోదింపబడ్డాడు.

35000 మంది బట్టలమిల్లు కార్మికులుచేసిన సమ్మెసందర్భంలో బలమైనప్రచారంగా ఉపయోగించిన సమ్మెలపై కరపత్రమును అతడు

1896 లో వ్రాశాడు. "రష్యాలోని పెట్టుబడిదారీ విధానాభివృద్ధి" అనే అతని ప్రథమగ్రంథరచనకుముందు, అతడు అర్ధశాస్త్రము, ధనసంబంధ మైనగ్రంథాలన్నింటినీ చదివాడు.

కొంచెం బరువుతగ్గినప్పటికి అతడు సెంట్‌పీటర్సుబర్గు జైలునుంచి, పదునాలుగు నెలలతరువాత బాగా ఆరోగ్యంగానేవచ్చాడు. అక్కడగడచిన కాలం అతనికి వృథాకాలేదు.

ఖైదునుంచి వచ్చినతరువాత మూడుసంవత్సరాలు అతన్ని సైబీరియాలోని షుషెన్‌స్కో గ్రామానికి వలసపంపించారు. అక్కడికి అతడు 1897 సం॥ మే నెలలో చేరుకున్నాడు. ప్రభుత్వంనుంచి అతనికి నెలకి ఏడురూబుల్సు నలభై కొపెక్కులు భత్యంవచ్చేది. అది అతని తిండికి, గదికి, చాకలికి సరిపోయేది.

సైబీరియాలో ఉలియనోవ్‌కి భరించలేనంత కష్టంగాలేదు. అతని జీవితం ప్రశాంతంగాను, ఆరోగ్యంగానువుంది. వేట, చేపలుపట్టుట, ఈత మొదలైనవన్నీ ఆనందకరమైన కాలక్షేపాలు;బలవంతంగా ఏకాంతవాసంలో హాయిగా చదవటానికి, వ్రాయటానికి మంచి అవకాశం. సాయంత్రం అలసిపోతే ఇరుగుపొరుగునున్న కర్షకుని సితార్ వాయించేవాడు. మొదట కొంతకాలం పత్రికలు లేకపోయినా అతడు నాగరికతనెన్నడు విడువలేదు. అక్కడ జీవితంలోని అతనితృప్తి అతని ఉత్తరాలలో ప్రతిబింబించింది.

సాధారణ భోజనం, కావలసినంతపాలు, మాంసంఉన్నాయి. ఒక గొఱ్ఱెను చంపితే వారమంతా మాంసంవుంటుంది. అయిపోగానే మళ్ళీ ఒకవారం సరుకు తయారౌతుంది.

గ్రామంలోని వారంతా అతనిపై ఆదరణచూపించారు. ఒకనాడు జవెర్టికిన్ అనే కర్షకుడు ఉలియనోవ్‌తో టీ త్రాగుతుండగా కొందరు మనుష్యులు యూనిఫారం దుస్తులతోవచ్చారనీ, వారు అసిస్టెంటు జిల్లాప్లీడరు, కెప్టెన్, పోలీసు సార్జెంటులనీ అఘట్టం వర్ణించాడు. నమస్కారం చేయకుండా, టోపీతీయకుండా ఒక పోలీసు గర్వంగావచ్చి ఉలియనోవ్ చదువుకునే గది ఏది?" అని గద్దించాడు.

ఉలియనోవ్ అక్కడున్న ఒక పుస్తకాలబల్లను చూపించాడు. వారంతట వెదకటం ఆరంభించారు.. తరువాత ప్రశ్నలు వేశారు. తరువాత కొద్దినిముషాలలో వచ్చినమనుష్యులు టోపీలను తీశేశారు; ఉలియనోవే వారికి నాయకుడైనాడు.

1898 సం॥ మేనెలలో నదేజ్దా క్రుప్స్కయా షుషెన్స్కోకి వచ్చింది. ఆమె సెంట్‌పీటర్సుబర్గులోని ఒక కార్మికపాఠశాలలో చదువుచెబుతూ ఉలియనోవ్‌ను కలుసుకుంది. వారిద్దరు స్నేహితులయ్యారు. ఉలియనోవ్ జైలులోవుండగా వారిరువురూ ఉత్తరప్రత్యుత్తరాలు వ్రాసుకున్నారు. క్రుప్స్కయాను యుఫాకువలస వంపించగా ఆమెను షుషెన్స్కోకి మార్చమని కోరింది. ''దీనికోసం ఆతనిని నా ప్రేమనాయకునిగా వర్ణించాను'' అని ఆమె వ్రాసింది.

క్రుప్స్కయా అతనికి సరియైన సహకారిణి, శక్రటరీగా ఉండతగినదని, గ్రహించి లెనిన్ ఆమెను వివాహం చేసుకున్నాడు. వారు జీవితాంతం భార్యాభర్తలుగా వున్నారు.

వారు తమ ప్రథమప్రేమ దినాలను చాలాచిత్రంగా గడిపారు. సిడ్ని, బీట్రిస్‌వెబ్‌లు వ్రాసిన ''థియరీ అండ్ ప్రాక్టిస్ అఫ్‌ట్రేడ్ యూనియనిజం'' అనే గ్రంథమును ఉదయం తర్జుమాచేయటంలో గడిపారు. ప్రతిరోజు మధ్యాహ్నం రెండుగంటలు రష్యాలో ధనికవాదాభివృద్ధి (Devolopement of Capitalism in Russia) గ్రంథాన్ని కాపీచేశారు. ఇది సెంట్‌పీటర్సుబర్గులో 1899 సం॥లో వ్లాడిమర్ ఇలిన్ అనే మారుపేరుతో ప్రకటింపబడిన తరువాత, ఉలియనోవ్ ముఖ్యమైన మార్క్సుసూత్రభాష్యకారుడనే ప్రతిష్ట రష్యా రేడికల్సులో వ్యాప్తిచెందింది.

ఆదివారం న్యాయశాస్త్ర సమాచారశాఖను నడిపాడు. దానివల్ల, ముఖ్యంగా ఒక బంగారుగనులకార్మికుడు తన యజమానిపై కేసును నెగ్గినతరువాత, అతనికి గొప్పలాయరుగా కీర్తివచ్చింది.

ప్రవాసశిక్షలనుభవించే వారందరికీ లెనిన్ఇల్లు ప్రధాన కార్యాలయంగా మారింది. ఉత్తరప్రత్యుత్తరా లధికంగా జరిగాయి. పుస్తకాలు,

వార్తాపత్రికలనేకంవచ్చేవి. సభలు నిషేధింపబడినా ఏదో వంకతో సమావేశాలు జరుగుతుండేవి.

యూరోపియన్ రష్యాదేశంనుంచి వారానికి రెండుసార్లు ఉత్తరాలు, పత్రికలు వస్తుండేవి. లెనిన్ చెల్లెలు, అన్నా, ఇతర స్నేహితులు తరుచుగ ఉత్తరాలు వ్రాస్తుండేవారు. టురుఖాన్స్కులోనున్న మార్టోవ్, ఆర్లోవ్‌లోనున్న పొట్రెసోవ్, ఇంకా ఇతర ప్రవాసశిక్షల ననుభవించేవారి వద్దనుంచి తరుచు ఉత్తరాలువస్తుండేవి. వారు రష్యా సంగతులను గూర్చి చర్చించి, ముందుముందు జరుగవలసిన కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకున్నారు.

క్రిజనోవిస్కయ వ్రాతప్రకారం "ప్రవాసిత సోషల్‌డిమొక్రట్లందరికి వ్లాడిమర్ ఇలిచ్ ప్రధాన పురుషుడయ్యాడు. అతని గంభీర చిద్విలాస జీవితం, మాకందరికీ ఉత్సాహమును, ఉత్తేజమును కలిగించాయి."

అతని ప్రభావంలో "బద్ధకము, నిరాశ, మొదలైనవిరావు. ప్రతివారు ఏదో పనిచేస్తూ, భావికార్యక్రమ పథకాలను తయారుచేస్తూ రష్యాలోని కార్మికులకుతగిన సలహానిస్తున్నారు. అందరూ ఆనందంగా. హుషారుగా సుఖంగావున్నారు." అత్యధికమైన సైబీరియా చలికూడ అతిథుల కాటంకంకాలేదు.

ఉలియనోవ్ శిక్ష ఆఖరుసంవత్సరంలో బ్రహ్మాండమైన పథకం తయారుచేశాడు. దానినే అతడు తరువాత 'ఏమిచెయ్యాలి' What is to be done, 'ఒక సహచరునికి జాబు' Letter to a Comrade' అనే గ్రంథాలలో విపులీకరించాడు. రష్యాకుబైట అధికారయుక్తమైన ఒక సోషల్‌డిమొక్రటిక్ వార్తాపత్రికను స్థాపించాలని అనుకున్నాడు. ఇతర దేశాలనుంచి రహస్యమార్గాలద్వారా, ఆపత్రిక రష్యాలోని మార్క్సిస్టు రాజకీయచర్యలను నడిపించాలి. ఈ పథకంగురించి అనేకరాత్రులు, క్రిజనోవిస్కీతోను, ఉత్తరాలద్వారా పొట్రెసోవ్, మార్టోవ్‌లతోను, సంప్రదించాడు; అతని శిక్షకాలం పూర్తికాగానే ఇతరదేశాలకు వెళ్ళడంగూర్చి కూడా ఆలోచించారు.

సైబీరియాను విడచుటకు కొన్నిమాసాలకుముందు ఉలియనోవ్‌కు పొట్రెసోవ్‌నుంచి చికాకువార్తవచ్చింది. సెంట్‌పీటర్సుబర్గులో లీగల్ మార్క్సిస్టులు నడిపేపత్రికలో పీటర్‌స్ట్రువె, ప్రొఫెసర్‌టుగన్ బరనోవిస్కీలు కొన్ని మార్క్సుసిద్ధాంతాలను సవాలుచేస్తూ వ్యాసాలు ప్రకటించారు. ఎడ్‌వర్డుబెర్న్‌స్టీన్ అనే జర్మనీప్రముఖ సోషల్‌డిమొక్రట్‌కూడా మార్క్సు సిద్ధాంతాలను కొంతసవరించాలంటూ వ్రాసిన గ్రంథంకూడా, ఉలియ నోవ్‌ను చాలా చికాకుపరిచింది. సమయానుకూలంగా ఇటువంటి వ్యతిరేక ప్రచారకులపై యుద్ధంప్రకటించాడు.

పొట్రెసోవ్, మార్టోవ్‌ల శిక్షలుకూడా పూర్తికాగానే వీరుముగ్గురు కలిసి వారిభావికార్యక్రమాలకు పథకాలను వేసుకున్నారు. అప్పటికి ఉలియనోవ్, పొట్రెసోవ్‌లు ప్స్కోవ్‌పట్టణానికివెళ్ళి, తరువాత ఐరోపాకి వెళ్లాలని నిశ్చయించారు.

వారికి ముందున్న పెద్దసమస్య నిర్వహణకార్యక్రమమే. "మనం విప్లవకార్యక్రమమును, క్రమశిక్షణను, అభివృద్ధిచేయుట, మన కుట్రల విధానాలు పరిశుద్ధముచేయుట చాలా అవసరం. ఈ పద్ధతులలో పూర్వపు రష్యావిప్లవసంఘాలకంటె మనం వెనుకబడ్డామని నిజంగా అంగీకరించాలి. వారికంటె అధికమైన పద్ధతులతో వారిని అధిగమించిపోటానికి మనం అన్నిప్రయత్నాలు చెయ్యాలి." అని ఉలియనోవ్ వ్రాశాడు.

మొట్టమొదటిసారిగా ఎన్ లెనిన్ అనేపేరుతో స్విట్జర్లాండులో ప్రకటింప బడవలసిన రష్యాసోషల్‌డిమొక్రాట్లఆశయాలు (The aims of Russian Social democrats) అనే వ్యాసరచన పూర్తిఅయేవరకు ఉలియనోవ్ శిక్షాకాలం పూర్తికాలేదు. అతడు ప్రవాసంచేసిన ప్రాంతంలోనున్న లెనా అనే నదిపేరునుబట్టి అతడు లెనిన్ అని కొనపేరు పెట్టుకున్నాడు.

1900 సం॥ మార్చిలో యూరోపియన్ రష్యాకు కష్టతరమైన, దీర్ఘమైన ప్రయాణం ఆరంభమైంది.

యుఫాలో ఆగి లెనిన్ తనభార్యను అక్కడి మిత్రుల రక్షణలో వుంచాడు. అప్పుడతడొక్కడు ప్స్కోవ్‌కి వెళ్ళాడు. అక్కడ తనని భార్య వచ్చి కలుసుకోటానికి పోలీసు అధికారిని అనుజ్ఞఅడిగితే తిరస్కరింప

బడింది. కాని మాస్కోలో అతనితల్లివద్ద ఒకవారం ఉండటానికి అను మతించారు. తరువాత సంవత్సరాంతంవరకు యుఫాలోని అతని భార్యను కలుసుకోలేకపోయాడు.

లెనిన్ లేనప్పుడు సోషల్‌డిమొక్రాట్ ఉద్యమం కొంతబలం సంపాదించింది. సెంట్‌పీటర్సుబర్గు, ఇతర పట్టణాలలో జరిగిన సమ్మెలవలన ఎకనమిస్టులు అనే ఒకవర్గం బయలుదేరింది. కార్మికులు విప్లవకార్యక్రమంలో పాల్గొటంకంటె, ఆర్థికస్థితికి పోట్లాడితే లాభంవుంటుందని వీరు ప్రబోధించారు. సోషల్ డెమొక్రట్లు, అధిక వేతనాలకు, కొద్దికాలపువనికి, మంచి సదుపాయాలకు పోరాడాలని వాదించారు. రాజకీయ నాయకత్వమే లిబరలు మేధావంతుల లక్ష్యమనీ; కార్మికులకు సొంతంగా పార్టీ అవసరం లేదనీ; నిరంకుశత్వంతోపోరాడే మధ్యతరగతివారిని బలవరచటమే తమ ప్రధానకార్యక్రమమనీ వారు గట్టిగా బోధించటంప్రారంభించారు.

1897 సం॥లో రష్యాపోలెండు, లుథేనియాలలోని జ్యూజాతి రాహస్య సోషల్‌డిమొక్రటిక్‌వర్గాలు (Secret Jewish Social democratic cells) వర్గాలు విల్నాలో ఒకరహస్య సమావేశంజరిపి జ్యూ కార్మికులందరినికలిపి సంఘమును స్థాపించారు. 'బంద్' అనే పేరు వహించిన ఈసంఘమే రష్యాలో తొలుత స్థాపింపబడిన సర్వజనసంస్థ. దీనిలోని ముఖ్యసభ్యులంతా ఫాక్టరీకార్మికులు, నిపుణులు.

రష్యాసంస్థనుంచి అరుగురు ప్రతినిధులు, బంద్‌నుంచి ముగ్గురు ప్రతినిధులతో 1898 మార్చి నెలలో మొట్టమొదటిసారిగా సోషల్‌డిమొక్రటిక్ సంఘాలన్నీకలిసి సర్వరష్యాకాంగ్రెసుసభను మిన్‌స్కుపట్టణంలోజరిపాయి. రష్యాసోషల్‌డిమొక్రటిక్ లేబరుపార్టీ జన్మించిందని ఆసభ చాటించి, ముగ్గురు సభ్యులతో కేంద్రసంఘమును ఏర్పాటుచేశారు. పార్టీ ఆశయాలతో ఒక సాధారణ నివేదికనుకూడా ప్రకటించారు. స్ట్రువేచేవ్రాయబడి కేంద్రసంఘంచేత ఎడిట్ చేయబడిన ఈ నివేదికలో పీపుల్సువిల్ యొక్క విప్లవాశయమును క్రొత్తపార్టీవారు తీసుకున్నారు.

ఈ మిన్‌స్కు కాంగ్రెసుసభ ఇదివరకు విడివిడిగా పనిచేసిన యూనిట్లను ఒకటిగా తయారుచేసి సహకారం ఏర్పరిచింది. తరువాత

ఆరునెలల్లో పార్టీ రెండవకాంగ్రెసు ఏర్పాటుచెయ్యాలని నిశ్చయించారు. కాని కొన్నివారాలతరువాత మిఁన్స్కకాంగ్రెసు నాయకులందరినీ ఖైదు చేసి, జైలులోవుంచి, తరువాత ప్రవాసం పంపించారు.

అదేసంవత్సరం, అనగా 1898 సం॥ లో ఎకానమిస్టులు 'కార్మికసమస్య' (The Workers Cause) ను స్థాపించారు. సోషల్ డిమొక్రటిక్ వర్గాలను, తమ మార్క్సిస్టుప్రచారముకంటె సమ్మెచేయుటకు హక్కు, వాక్స్వాతంత్ర్యము పత్రికా, సమావేశస్వాతంత్ర్యములకు జరిగే ప్రచారమునకే ప్రాధాన్యం ఇవ్వవలెనని కోరింది. వీరిని సైబీరియానుంచి ఎదిరించిన లెనిఁ, వీరికి వ్యతిరేకంగా నిశితప్రచారం సాగించటానికి ఏర్పాట్లు చేస్తున్నాడు.

తమ పత్రికను ఇతరదేశాలలో ప్రకటించటానికి తుది సన్నాహాలను చేయటానికై 1900 సం॥ మే నెలలో లెనిఁ, మార్టోవ్, పొట్రెసోవ్, మొదలైన మార్క్సిస్టులు రహస్యంగా సమావేశమయ్యారు. మార్క్సిస్టు పంథానుంచి వ్యతిరేకులైన ఎకనమిస్టులు వగైరాలను ఎదిరించటమే వారి ప్రధానచర్య. పత్రికపేరు ఇస్క్రా-మెరుపు-అని వుంచారు. ప్లెకెనోవ్ ప్రోత్సాహము పొందటానికై లెనిఁ, పొట్రెసోవ్‌లు ఇతరదేశానికి వెళ్ళారు.

తరువాత కొద్దికాలానికే లెనిఁ సరిహద్దునుదాటి జర్మనీ చేరాడు. స్విట్జర్లాండులో ప్లెకెనోవ్, ఎక్సెలార్డులతో సంప్రదించి, పొట్రెసోవ్‌వచ్చి అతన్ని కలుసుకున్నాడు. జర్మనీసోషల్ డిమొక్రటిక్‌పార్టీ వారు రహస్య ప్రింటింగుయంత్రాలు సప్లయిచేస్తారు. పొట్రెసోవ్, క్లారాజెట్కిఁ, ఎడాల్ఫుబాఁల సహాయం సంపాదించాడు. లీప్‌జిగ్‌లో పత్రిక నచ్చు వేయటానికి వీరు ఏర్పాట్లుచేశారు. సంపాదకవర్గం మాత్రం మ్యూనిచ్ లోనే ఉంటుంది.

జనీవాలో ఆఖరిసమావేశం జరిగింది. క్రొత్త విప్లవభావపత్రిక వెలువడుతున్నదనీ, పార్టీ శక్తులన్నింటినీ సమీకరించుటయే దాని ప్రధాన కర్తవ్యమనీ ఒక ప్రకటనచేశారు. పార్టీ సంబంధాలను నడిపించే సాధ

నాలే ఇస్క్రా పత్రికను సరఫరాచేసే ఏజంట్లుగావుంటాయి. అతి శక్తివంత మైన విప్లవసంఘాన్ని స్థిరం చేసేవరకు, సమయానుకూల వర్తనులపైనను, అనిశ్చితాభిప్రాయాలు గలవారిపైనను ఘోరయుద్ధం జరిగించాలి.

మెరుపు పెరిగి మంటగా తయారై ప్రకాశించింది.

# బోల్షివిజం పుట్టుక

ఇస్క్రాపత్రిక మొదటిసంచిక 1900 సం॥ డిశంబరు 21వ తేదీని లీప్‌జిగ్‌లో వెలువడింది. దొంగతనంగా సరఫరాచేయటానికి వీలుగా వుండునట్లు ఉల్లిపొర కాగితంమీద చిన్నచిన్న అక్షరాలతో ప్రింటుచేశారు.

సంచికలన్నింటినీ ఓడలో బెర్లిన్‌కు పంపించి, అక్కడ జర్మన్ సోషల్‌డిమొక్రటిక్ పార్టీ కేంద్రకార్యాలయంలో భూగృహాలలో నిలవ చేశారు. ఈ భూగృహంలో అతినమ్మకస్థులైన పార్టీ సభ్యులీ సంచికలను మణిచి, ప్యాకింగు పెట్టెలలో దాచిపెట్టారు. వీనిని సరిహద్దు సమీపపట్టణాలకు పంపించి, రహస్య సరఫరాలను సాగించే వృత్తిగలవారిద్వారా ఇస్క్రా ఏజంట్లకు అందచేశారు.

ఈ రహస్యమార్గాలలో పనిచేసేవారు, జర్మనీలోని రహస్యపు ఆఖ్రానా ఏజంట్లకు సహాయపడే ప్రష్యాపోలీసుల తణిఖీలో పోవాలి. తరుచుగా పెద్దపెద్ద పేపరుకట్టలను పట్టుకోటం, సరఫరాదారులను ఖైదు చేసి, సైబీరియాకు ప్రవాసం పంపటంకూడా జరుగుతుంటుంది.

పుట్టినప్పట్నుంచీ ఇస్క్రాపత్రిక విప్లవవార్తాపత్రికకంటె ఎక్కువగా వుంది. రష్యాసోషల్‌డిమొక్రటిక్ పార్టీ ఉద్యమానికది ఒక ప్రధాన కేంద్రంమయింది. ఇస్క్రా సంపాదకవర్గస్థానంనుంచి, రష్యాలోని వందలాది పార్టీస్థావరాలన్నింటికి ఆదేశాలు పోతుండేవి. ఇస్క్రాపత్రికలో ప్రకటింపబడిన పార్టీసూత్రాలే అన్నిచోట్లనున్న పార్టీసభ్యులకు పోరాటు కార్యక్రమమైంది. ఇస్క్రా తన వేదవాక్యాలను వెదజల్లి తప్పుడువార్తలను అణచివేసింది.

"బాగా బలవత్తరంగా నిర్మితమైనపార్టీ మనకుంటే, ఒకేఒక నమ్మేయే రాజకీయప్రదర్శనంగా, రాజరికంమీద రాజకీయ విజయంగానే

పరిణమించవచ్చు;ఒక్క ప్రాంతంలో ఆరంభమైన తిరుగుబాటే విజయవంతమైన విప్లవంకావచ్చు.'' అని లెనిన్ ప్రథమ ఇస్క్రాపత్రికలో వ్రాశాడు.

అటువంటి బలవత్తరంగా స్థాపించబడిన పార్టీని వృద్ధిచేయటమే లెనిన్‌యొక్క ప్రధానకర్తవ్యము. మార్టోవ్, పొట్రెసోవ్, జసులిచ్‌లను పత్రికాసంపాదకత్వం నిర్వహించునట్లుచేసి' లెనిన్ రష్యాలో ఇస్క్రా ప్రభావమును గూర్చి పరిశీలిస్తున్నాడు. అక్కడ ఎకనమిస్టులతోను, తదితరవ్యతిరేకపార్టీలతోను ఇస్క్రా జరిపే పోరాటమును, దాని అనుయాయులు రహస్యసోషల్‌డిమొక్రటిక్ కమిటీలకు, కార్మికసంస్థలకు తీసుకుపోయారు. రాజకీయాయుధంగా వ్యక్తిగతంగా జరిపే దౌర్జన్యకాండనుకూడా ఇస్క్రాపత్రిక ఖండించి ప్రచారంచేసింది. రాజకీయఖూనీలకు అలవాటుపడిన పీపుల్సువిల్ పద్ధతులకలవాటుపడినవారిని ఒప్పించటం చాలా కష్టమైన పని.

వ్యతిరేకప్రచారములన్నింటినీ ఎదుర్కొటానికై రష్యాఏజంట్లు కార్మికులలోను, విద్యార్థులలోను మహత్తరమైన ప్రచారమును, అలజడిని చేశారు. లెనిన్ ప్రచారానికి, అలజడికి తేడాను ఈ క్రిందివిధంగాచెప్పాడు:

''ప్రచారకుడు అనేకభావాలను తెలియచేస్తూండాలి. అన్నీ ఒకే విషయానికి సంబంధించినవైనా, సామాన్యునికి అవన్నీ పూర్తిగా అర్థం కావు. కాని మొత్తంమీద ఏవోకొన్నిమాత్రం ముఖ్యమైనవి అర్థంఅవుతాయి. కాని అలజడికి మొత్తం సమస్యలో ఏదో ఒకటిరెండు ముఖ్యవిషయాలను మాత్రం తీసుకుని దాని ముఖ్యసారాంశమునుమాత్రమే ప్రజాసామాన్యానికి తెలియచేస్తాడు. ఈ ఒక్కవిషయంగూర్చి జరిగిన అన్యాయమును కొండంతగాచేసి, తద్వారా ప్రజలహృదయాలలో అసంతృప్తిని, ఉద్రేకమును రెచ్చగొట్టి, దానియొక్క పూర్తివివరాలను ప్రబోధించే బాధ్యత ప్రచారకునికి విడిచిపెట్టబడుతుంది.''

ఇస్క్రాఏజంట్లు సమయందొరికినపుడల్లా, పత్రికలను, కరపత్రములను పంచిపెట్టారు. తరుచుగా సమ్మెలు చేయటంలో సోషల్‌డిమొక్రటిక్ కమిటీలే ప్రధానపాత్ర వహించాయి. 'సర్కిల్సు' అనే చిన్నచిన్న రహస్యముఠాలద్వారా రహస్యంగా విపులమైన ప్రచారం సాగించారు.

కాని క్రమబద్ధమైనవని దుస్సాధ్యమైంది. భద్రమైన ప్రదేశం దొరకటం కష్టం; ప్రచారం చాలా ప్రమాదకరమైనది. పైగా విద్యావతుంలైన ప్రచారకులుదొరకటం బహుకష్టం. అటువంటివాడు ఖైదుకి పోయినట్లయితే మళ్ళీ అతనిస్థానం ఆక్రమించగలవాడు దొరకడు. ప్రచారకముఠాల కార్యక్రమంలో ఆరులేక పది సమావేశాలనుమాత్రం జరపాలన్నప్పటికీ, ఆమాత్రంకూడా పూర్తికావటం దుర్లభమైంది. చాలా చోట్ల ఉపన్యాసంఅంటే ఇస్క్రాపత్రికను చదవటంతోనే పూర్తి అవుతోంది. ప్రతిసంచికలోను ప్రచారకునికి కావలసిన క్రొత్తవిషయాలనేకం ఉంటాయి. పత్రికవిషయాలను చాలాసార్లు చదవగా విన్నవారు, అత్యుత్సాహంతో మళ్ళీ వాటిని తమమిత్రులకు చదివివినిపించేవారు. ఆవిధంగా ఇస్క్రాపత్రికలు ఇంటింటికి, చివరికి ఏమాత్రం చదవటానికి వీలులేనంతగా జీర్ణించిపోయేటంతవరకు చేతులు మారుతుండేది.

అలజడి అనేకవిధాలుగా జరిగింది. ఒకొక్కచోట తర్ఫీదుపొందినవాడు న్యాయసమ్మతమైన వార్తాపత్రికను, కార్మికులకు చదివి దానిలోని విషయాలపై అతడు తన విమర్శలు ఎక్కించేవాడు. వినేవారిలో వారికి పనికివస్తాడనుకున్న వారిని ఏరుకునేవాడు. వారికి సమస్యలపై తాజా పుస్తకాలనిచ్చి లోబరచుకునేవాడు. అతడుత్సాహమును వెల్లడించినట్లయితే రహస్యగ్రంధాలనిచ్చేవాడు. కొంతకాలానికి అతన్ని పార్టీ సభ్యునిగా చేర్చుకునేవారు.

ఇస్క్రా కరపత్రాలను ఫాక్టరీలలోనేకాక సైన్యశిబిరాలలోను, పోస్టు ద్వారా పంచిపెట్టారు. పెద్దపెద్ద పట్టణాలలో వాటిని కట్టలుకట్టలుగా వీధులలో పడవేసేవారు. చిన్నచిన్న పట్టణాలలోను, పల్లెలలోనూ గోడల కంటించేవారు. ఫ్యాక్టరీప్రదేశాలలో విరజిమ్మేవారు.

కాని చూడసొంపైన పత్రికలయుద్ధం, మాస్కో, సెంట్‌పీటర్సుబర్గు, ఖార్కోవ్, కేవ్, ఒడెస్సా పట్టణాలలోగల ప్రదర్శనశాలలో జరిగింది. కొందరుమనుష్యులు హాలులోని పైనున్న గ్యాలరీపైకూర్చుని క్రిందనున్న వారిపై కరపత్రాలను విరజిమ్మేవారు.

ఇస్క్రారాచేసేపని విప్లవాత్మకమైన వాఙ్మయాన్ని పంచిపెట్టటం మాత్రమేకాదు. తద్వారా దానిఏజంట్లు బలవత్తరమైన విప్లవకారులుగా తయారవటానికి అవకాశం ఏర్పడింది. వీరంతా ప్రధానమైన విప్లవకారులుగా తయారవటానికి అవకాశం ఏర్పడింది. వీరంతా ప్రధానమైన విప్లవచర్యలకు ప్రాధాన్యం ఇవ్వటానికి ఈ ఏజంట్లు అవసరమని లెనిన్ కూడా వారినిగూర్చి చెప్పాడు.

*　　　*　　　*

సోషల్‌డిమొక్రట్ అయిన ఒక జర్మనీ మంగలిషాపువాడిచ్చిన చిన్నగదిలో లెనిన్‌మెయర్ అనే పేరుతో మ్యునిచ్‌లో మకాంపెట్టాడు.

అతడు విప్లవకార్యక్రమంలో మునిగిపోయినా రష్యాలోని అతని కుటుంబాన్నిమాత్రం అతడు మరచిపోలేదు. 1901 సం॥ ఫిబ్రవరి 20వ తేదీని తల్లికి ఒక ఉత్తరంవ్రాశాడు:

ప్రియమైన తల్లికి:—

ఇక్కడ కొన్నిరోజులక్రిందటనే కార్నివాల్ అయిపోయింది. ఇక్కడజరిగిన తమాషాలు చాలా ఆకర్షణీయంగావున్నాయి. వీధులలో తమాషాలు చేయటంలో ఇక్కడివారు ఘనులు....నాద్యా ప్రవాసశిక్ష త్వరలోనే ముగుస్తుంది. ఆమెకు ప్యాసుపోర్టుకొరకై త్వరలోనే వ్రాస్తాను.''

నాద్యా అనగా అతనిభార్య క్రుపస్కయా. ఆమెకు విధించిన నిర్బంధశిక్ష పూర్తికావచ్చింది. ఆమె పశ్చిమ ఐరోపాలో ప్రవేసించగానే లెనిన్‌కొరకై ఆమె పట్టణాన్నుంచి పట్టణానికి తిరగవలసివచ్చింది. రెండు రోజులవరకు ఆమెకు మోడ్రజవ్, రిట్‌మేయర్, లెనినా, ఉలియనోవా, క్రుప్సకయా,—ఏపేరుకొరకై వెదకాలో తెలియలేదు. మొదట ఆమె ప్రేగుకు వచ్చింది. లెనిన్, మోడ్రజెక్ అనే మారుపేరుతో వున్నాడనుకుని ఆపేరు కోసం వెదికింది. ముందే ఆమె టెలిగ్రాం ఇచ్చింది. కాని ఎవ్వరూ ఆమెను కలునుకోలేదు.

''నేను నిరీక్షించి, నిరీక్షించి మోడ్రజెక్ ఎడ్రసుకి బయలుదేరాను. మేము కార్మికుల కాలనీకివచ్చి ఒకపెద్ద ఇంటిముందుఆగాము. నాల్గవ

అంతస్థు కెక్కాను. ఒక అందమైన జిక్ స్త్రీ తలుపుతీసింది. హెర్ మ్యోడ్రజెక్ ఎక్కడ అనిఅడిగాను. వెంటనే ఒక కార్మికుడువచ్చి నేనే అన్నాడు. ఆశ్చర్యపోయి, కాదు నాభర్త మ్యోడ్రజెక్ అన్నాను. దానిమీద అతడు రహస్యం అంతాగ్రహించి 'ఐతేనీవు హెర్‌రిట్‌మెయర్ భార్యవు కాబోలు. అతడు మ్యూనిచ్‌లోవుంటాడు' అని అతడు చెప్పాడు'' అని క్రుపస్కాయ వ్రాసింది.

అందుచేత ఆమె మ్యూనిచ్‌కి ప్రయాణంకట్టింది. ఈసారి ఆమె ఒకకారులోవెళ్ళి రిట్‌మెయర్ ఎక్కడుంటాడో అక్కడికేవెళ్ళింది. కాని అది ఒక సారాదుకాణం. అక్కడికివెళ్ళి 'రిట్‌మెయర్‌ఎవరు' అని అడిగింది. ఆ దుకాణందారుడు 'నేనే' అన్నాడు. 'కాదునా భర్త' అని ఆమె చెప్పింది. దీనికి అంతంలేదా అని ఆశ్చర్యపడుతుండగా రిట్‌మెయర్ భార్యవచ్చింది. ఆమె హెర్‌మెయర్‌భార్య అయివుంటుంది. సైబీరియానుంచి అతడు భార్యకోసం ఎదురుచూస్తున్నాడు. నేను నిన్నతనివద్దకు తీసుకుని వెడతానురా'అని క్రుపస్కాయాను ఆమె ఒక పెద్దదొడ్డిలోనికి తీసుకుపోయింది.

అక్కడ లెనిన్ అతని చెల్లెలు అన్నా, మార్టోవులతో కూర్చుని వున్నాడు. లెనిన్ తనభార్యతో మూడు గదులుగల ఇంటివాటాలోచేరాడు. దానిలోని రెండుగదులలో ఒకకార్మికుడు, భార్య, ఆరుగురు పిల్లలతో మకాంవున్నాడు. లెనిన్ అతనిభార్యతో ఒకగదిలో కాపురం. వంటిల్లు, పడకగది, చదువుకునేగది—అన్నీ అది ఒక్కటే.

ఒకనెలతర్వాతవారు మ్యూనిచ్‌లోని స్క్వాబింగ్ ప్రాంతంలోనికి మకాం మార్చారు. కాని ఆ తరువాత వసంతకాలంలోనే వారు మళ్ళీ ప్రయాణం కావలసివచ్చింది. లీప్‌జిగ్‌లోని అచ్చుయంత్రంవిడిచి వారు మ్యూనిచ్‌కి మార్చారు. కాని అక్కడ యజమాని ఇస్క్రా ప్రింటుచేయటానికి నిరాకరించాడు. ప్లెకెనోవ్, ఎక్సెలార్డులు స్విట్జర్లాండునుంచి తమ కార్యక్రమం నడిపించాలని అనుకున్నారు. కాని అధికసంఖ్యాకులు లండన్‌కు మార్చాలని ఓటుచేశారు.

1902 సం॥ ఏప్రిల్ మాసంలో లెనిన్, క్రుపస్కాయాలు ఇంగ్లడు చేరారు. వారికి వచ్చిన ఇంగ్లీషుకి, అక్కడ వాడుకలోనున్న ఇంగ్లీషుకి

చాలా తేడావున్నట్లు వారు గ్రహించారు. లెనిన్ ఇద్దరు ఇంగ్లీషు ఉపాధ్యాయులను పెట్టుకుని ఇంగ్లీషు అభ్యాసం ప్రారంభించాడు. వారిరువురికి లెనిన్ రష్యన్‌భాష నేర్పాడు. ఈ ప్రయత్నంలో అతడు ఇంగ్లీషుభాషను బాగా అభివృద్ధిచేశాడు. బ్రిటిషుమ్యూజియంలోని లైబ్రరీ అతనికి చాలా ఉపకరించింది. కారల్‌మార్క్సుకూడా ఈ లైబ్రరీని విస్తారంగా ఉపయోగించాడు.

లండన్‌లో వున్నప్పుడే మొట్టమొదటిసారిగా లెనిన్, ట్రాట్‌స్కీని కలుసుకున్నాడు. ఈ మధ్యనే సైబీరియానుంచి తప్పించుకున్న ఉత్సాహవంతుడైన ఇస్క్రామనిషినిగూర్చి సమారానుంచి మిత్రులువ్రాశారు. అతని రచనలద్వారా అతడు 'కలము' అనే మారుపేరు పెట్టుకున్నాడు. తలుపును గట్టిగాకొట్టి ట్రాట్‌స్కీయే వారింటికివచ్చాడు. క్రుపస్కయా "ఆ శబ్దాన్నిబట్టి మనయింటికే ఎవరోవచ్చారని నాకు తెలుసు" అంటూ వెళ్ళి తలుపుతీసింది. ట్రాట్‌స్కీని తమగదిలో ప్రవేశపెట్టింది. వ్లాడిమర్ ఇలిచ్ అప్పుడే నిద్రనుంచిలేచాడు. ఇంకా మంచంమీదనేవున్నాడు.

అతన్నిగురించి ఇదివరకే విన్నదానిబట్టి, వ్లాడిమర్‌ఇలిచ్ అతన్ని బాగాపరీక్షించాడు. తరువాతనుంచి వారిరువురుకలిసి తిరుగుతూ అనేకవిషయాలను చర్చించారు. రష్యారమ్మని ట్రాట్‌స్కీకి కబురు వచ్చినప్పుడుకూడా, లెనిన్ అతనిని ఇతరదేశాలలోనేవుండి పార్టీవ్యవహారాలను బాగా అవగాహనచేసుకుంటూ ఇస్క్రాపత్రికకు సహాయం చేయమన్నాడు. సంపాదకవర్గంలోని ఇతరులతో ట్రాట్‌స్కీనిగూర్చి పోట్లాడాడు.

ప్లెఖనోవ్, ట్రాట్‌స్కీని అనుమానించాడు. అతడు లెనిన్, మార్టోవ్ పాట్రెసోవ్‌ల యువకవర్గానికి చెందినవాడని అనుకున్నాడు. ట్రాట్‌స్కీ వ్యాసాలను లెనిన్ పంపినపుడు ప్లెఖెనోవ్ ఇల్లావ్రాశాడు. "మన'కలము' గారి కలం నాకు నచ్చలేదు."

"రచనలో తీరు, అనుభవంమీదవచ్చేది. అతడు చాలా చదువుకున్నవాడు. అతడు మనకు చాలా ఉపయోగిస్తాడు." అని లెనిన్‌వ్రాశాడు. 1903 సం॥ మార్చిలో ట్రాట్‌స్కీ ట్రైనింగుకాలం పూర్తిఅయినదని నిర్ణయించి అతన్ని సంపాదకవర్గంలో చేర్చటానికి సిఫారసుచేశాడు.

కొందరు విప్లవమే వృత్తిగాగలవారిని ఇస్క్రాపత్రిక ఆదరించింది. లెనిన్ చెప్పినప్రకారం "వారిజీవితమంతటినీ విప్లవానికి పనిచేయటమే వారిధర్మం."

1902 సం॥ ఆఖరికి రష్యాలోవున్న సోషల్‌డిమొక్రాటిక్ పార్టీ కమిటీలలో చాలాభాగం ఇస్క్రా ప్రభావంలోనికి వచ్చాయి. దేశంలోని సాంఘికశక్తి త్వరితగమనంలో వృద్ధికావటంచేత ఈవిధానానికి సహాయ పడింది ప్రారంభంలోజరిగిన పారిశ్రామికసమ్మెలతరువాత విద్యార్థుల బహిష్కార ప్రదర్శనలు, వీధిలో ప్రదర్శనలు, కర్షకదొమ్మీలు జరిగాయి. 1903 సం॥లో విద్యార్థులలోను, కర్షకులలోను అల్లకల్లోలం అధికమైంది.

ఈలోపుగా లెనిన్ "ఏమిచెయ్యాలి" అనే తన గ్రంథాన్ని ప్రక టించాడు. దానిలో పార్టీపెద్దలకు, కార్మికులకు, మధ్య; విప్లవకారులకు సామాన్య జనులకుమధ్య నుండవలసిన సంబంధబాంధవ్యాలనుగూర్చి లెనిన్ ఘాటుగావ్రాశాడు. తన అనుచరులందరకు ఈగ్రంథం విప్లవమత గ్రంథమైంది. దీనిలో 'వృత్తివిప్లవకారుల' సిద్ధాంతముగురించి మొట్ట మొదటసారిగా ప్రస్ఫుటంగా చెప్పబడింది.

వారిస్వశక్తినిబట్టే కార్మికులు ట్రేడ్‌యూనియనిస్టు భావాలను పొందగలరనీ,—అనగా యజమానులతో పోట్లాటకు ఆవశ్యకతను గుర్తించ గలరనీ-కార్మికులు లాభంకొరకు ప్రభుత్వశాసనాలను వ్యతిరేకించగలరనీ ప్రతిదేశపు చరిత్రనుబట్టి మనకు తెలుస్తుంది.

గొప్పవారియొక్క, విద్యావంతులయొక్క ప్రతినిధులచే వృద్ధి చేయబడిన తాత్విక, చారిత్రక, ఆర్థికసూత్రాలనుబట్టి ఉద్భవించినదే సోషలిస్టు సిద్ధాంతం.

"ఆధునిక శాస్త్రీయసోషలిజం నిర్మాతలైన మార్క్సు, ఎంజల్సు లిద్దరూ, సాంఘిక తరహానుబట్టి మధ్యతరగతి విద్యావంతులలోని సభ్యులే. అదేవిధంగా రష్యాదేశంలో పాటకపుజనులయొక్క అవ్యక్త కష్టాలనుంచియే సోషల్‌డిమొక్రసీయొక్క సూత్రాలుద్భవించాయి. అవి, విప్లవాత్మకసోషలిస్టు విద్యావంతుల భావాలనుబట్టి స్వతస్సిద్ధంగా పుట్టి నవి. విప్లవకరసోషలిస్టు విద్యావంతులుమాత్రమే—'వృత్తివిప్లవకారులు'-

మధ్యతరగతివారి ప్రభావంనుంచి వనివారిని రక్షించి, సోషలిజంలోనికి మార్చగలరు'' అని లెనిన్ వ్రాశాడు.

ఈ సమయంలోనే అతడు పార్టీనిగూర్చి ప్రబలప్రచారంచేస్తూ, 'వృత్తి విప్లవకారులకు' కావలసిన సాధనసామగ్రిని క్రమంగా వృద్ధిచేశాడు.

ఈవిధంగా మార్క్సుసిద్ధాంతాలకు భిన్నంగా సంచరించటంచేత మెల్లగా 1903 సం॥ నాటికి పార్టీలో చీలికబయలుదేరింది. మొట్టమొదట లెనిన్‌ను కలుసుకున్నప్పుడున్నట్లుగా అతడు ఎక్కువగా పార్టీఅభిమానం చూపిస్తున్నాడని పొట్రెసోవ్, మార్టోవ్‌లుఅనుకున్నారు. కానిలెనిన్‌క్రమంగా తన అనుచరుల విప్లవతత్వానికే ఎక్కువకట్టుబడిపోయాడు. ఇస్క్రా సంపాదకకార్యాలయంలో కష్టాలెక్కువైనాయి. ఇంకా ఇతరమైన బాధలతో పాటు లెనిన్‌యొక్క వ్రాతలు ప్లెఖనోవ్‌కి నచ్చలేదు.

స్ట్రువె మార్క్సువర్గాన్నివిడిచి,లిబరలువర్గంలోచేరినప్పుడు,అతన్ని గూర్చి పార్టీవిశ్వాసపాత్రుడుకాడనీ, నమ్మకద్రోహియనీ ఇస్క్రాపత్రికలో లెనిన్‌వ్యాసంవ్రాశాడు. ఈ వ్యాసంచదివిన ప్రతిపార్టీసభ్యుడు స్ట్రువేను చంపుట తనవిధియని భావించేటంత ఘాటుగాఎందుకు వ్రాశావని లెనిన్ మిత్రుడైన టక్టరేవ్ అడిగాడు

''అతడు మరణానికైనా తగినవాడే'' అని లెనిన్ చల్లగా సమాధానం ఇచ్చాడు. అది 1903 సం॥ లోని సంగతి. టక్టరేవుగాని, సోషల్ డిమొక్రటిక్ సహచరులుగాని లెనిన్‌గురించి ఎక్కువపట్టించుకోలేదు. అతనియొక్క నిశితమైన, దూషణభాషనువారు మామూలు కవిత్వం అన్నట్లు భావించారు.

ఇస్క్రా సంపాదకులలో బలమైన బేధాభిపాయాలు 1902 సం॥ ఉద్భవించాయి. అప్పటి పార్టీకార్యక్రమం లెనిన్, మార్టోవ్, ఎక్సెలార్డు లలో ఎవ్వరికీ నచ్చలేదు.

బీదప్రజల నియంతృత్వంకోసమే పార్టీ పోరాడుతున్నదని కార్యక్రమం స్పష్టంగా చెప్పాలని, లెనిన్ పట్టుపట్టాడు.

విప్లవరంగంలో తక్కువరకపు మధ్యతరగతివారే అధికపాత్ర నిర్వహించవలసినవిధియని ప్లెఖనోవ్ సమాధానం చెప్పాడు. మార్టోవ్,

పొట్రెసోవ్‌లు పూర్తిఇష్టం లేకపోయినా లెనిన్ పక్షాన్నివున్నవారు. చాలా రాద్ధాంతసిద్ధాంతాలు జరిగినతరువాత లెనిన్, ప్లెఖనోవ్‌లమధ్య రాజీ కుదుర్చుటకువీలుగా మార్టోవ్, జసువిచ్, థియొడోర్‌డాన్‌లుకలిసి ఒక తీర్మానంచేశారు.దీనినిచివరికిఆమోదించినా లెనిన్‌కి అదితృప్తికలిగించలేదు.

దీనికితోడు ఇతర అభిప్రాయభేదాలుకూడా పెరిగాయి. దానిలో లండన్‌లోవున్న ఇస్క్రా ఆఫీసుకి, స్విట్జర్లాండులోవున్న ప్లెఖనోవ్, ఎక్సిలార్డుల కార్యాలయానికి మధ్యవైషమ్యం హెచ్చింది. చివరికి 1903 వ సం॥ ఏప్రిల్ నెలలో ఇస్క్రాను జెనీవాకు మార్చారు. అక్కడ పేచీలు వచ్చిన వ్యాసాలపై, లెనిన్, ప్లెఖనోవ్, మార్టోవ్, పొట్రెసోవ్, జెసువిచ్, ఎక్సిలార్డులు, ఆర్గురు సభ్యులుగాగల ఒకసంఘం ఇష్టప్రకారం జరగాలని నిర్ణయించారు ఇటువంటిసందర్భాలలో తరుచుగా రెండుపార్టీలుసమానంగా భాగింవబడి, లెనిన్ మార్టోవ్, పొట్రెసోవ్‌లు ఒకప్రక్క, మిగిలిన ముగ్గురు పెద్దలైనసోషల్‌డిమొక్రట్లు ఒక ప్రక్కకు చీలిపోయారు.

1903 సం॥ ఏప్రిల్ నెలలో ఇంగ్లండును విడిచిపెట్టి లెనిన్, జెనీవా శివారులోవున్న కార్మికులుండే సెచిరాన్‌జిల్లాలోని ఒకచిన్నఇంట్లో స్థిరపడ్డాడు. ఇస్క్రా ఆఫీసులోని తగాదాలిప్పుడు మరింతగా హెచ్చినాయి. లెనిన్‌ను తరుచుగా బలపరుస్తుండే పొట్రెసోవ్ "లెనిన్‌తోకలిసి పని చెయ్యటం కష్టతరం"అని రిపోర్టువ్రాశాడు. లెనిన్ ప్రపంచమునంతటినీ, "తన అనుచరులు—తనకు వ్యతిరేకులు" అని రెండుభాగాలుగా మాత్రం విభజించాడని అతడు వ్రాశాడు.

సమావేశాలలో జరుగుతున్న వాదప్రతివాదాలనుబట్టి, లెనిన్‌తో జరిగే పోరాటాలప్రతిఫలాన్ని ఇస్క్రాలోని ఇతరులు ఊహించలేక పోయారు. ఈ వివాదాలన్నీ, గృహవివాదాలవలె సమసిపోతాయిగాని, లెనిన్ తాను స్వంతంగానే నూతనపార్టీని స్థాపించటానికి దారితీస్తాయని వారూహించలేదు. ఇతర సోషల్‌డిమొక్రటిక్‌నాయకులతో ఆలోచించి, పథకం వేయబడిన ఈ నూతనపార్టీనిర్మాణమే, కమ్యూనిస్టుపార్టీ యంత్రానికి ప్రాతిపదిక. ఈ సమయంలోకూడా లెనిన్‌ఆజ్ఞను శిరసా వహించి సంచరించినవారనేకులు అతని ననుసరించేవున్నారు.

లెనిన్ ఎంత నిర్మాణదక్షుడో, అంత క్రమశిక్షణాపరుడు. "లెనిన్ పార్టీలోని క్రమశిక్షణ, మిలిటరీ క్రమశిక్షణతో పోలివుంది. అది సర్వాధికారులకు, పార్టీ నిర్మాతలకు మధ్యకలయిక. అది అల్పసంఖ్యాక విప్లవకారులసంస్థ; సమయం వచ్చినప్పుడు ఈ అల్పసంఖ్యాకులే అధికారమును హస్తగతం చేసుకోవాలి. లెనిన్ సూత్రం ప్రకారం, అధికారంకోసం జరిగే పోరాటంలో సామాన్యజనాళి అధికార విప్లవకారులకు పనిముట్లుగా ఉపయోగింపబడాలి. లెనిన్ యొక్క భావాలన్నీ ఈ 'అధికారవిప్లవకారుల' తత్వంలోనివే కనుక అవి పరాజయం పొందటం తథ్యం. 1902 సం॥లో ఇస్క్రాప్రోత్సాహంతో ఒకకమిటీని ఏర్పాటుచేసి, రష్యాలో ఒకపార్టీ మహాసభను ఏర్పాటుచేశారులెనిన్ పాల్గొన్న మొదటిసభ అదే.

1903 సం॥ వేసవి ప్రారంభంలో రష్యానుంచీ అన్నిచోట్లనుంచీ ప్రతినిధులు జనీవాలో సమావేశం అయ్యారు. మొట్టమొదటవచ్చిన వారిలో పాట్‌మాన్ అనే సెంట్‌పీటర్సుబర్గు కార్మికుడొకడు. రష్యాలోని వార్తలను తెలిసికోటానికి కుతూహలపడుతున్న రహస్యనాయకులందరినీ కలుసుకోటానికి పాట్‌మాన్‌కి అవకాశం దొరికింది.

లెనిన్‌ను తొలిసారిగా చూసినతరువాత అతన్నిగూర్చి పాట్‌మాన్ ఇల్లావ్రాశాడు: "సభలో ఏమిఆలోచించారో నాకు జ్ఞాపకంలేదు. కాని అతడు తొలిసారిగా మాట్లాడిన మాటలు వినగానే నేనతనిపక్షంలోచేరాను. అతని ఉపన్యాసం అంతక్లుప్తంగా, స్పష్టంగా, నచ్చినట్లుగావుంది. ప్లెఖెనోవ్ మాట్లాడినప్పుడు వినటానికి అతనిభాష చాలాబాగుంది. కాని లెనిన్‌లేచి మాట్లాడగనే నేను లెనిన్‌పక్షం వహించాను. ఎందుకు? అంటే నేను ఏమీ చెప్పలేను. కాని అది నాకేకాదు, ఇతర పనివారందరికీకూడా నచ్చిపోయింది."

లెనిన్ ప్లెఖనోవ్‌లమధ్య అభిప్రాయభేదాలున్నప్పటికీ ప్రారంభదశలో మొత్తంమీద ప్రతినిధులందరికీ ఏకగ్రీవ ఒప్పదంజరిగింది. దాన్నిబట్టి కాంగ్రెసుమహాసభ సౌమ్యంగా క్లుప్తంగా ముగిసిపోతుందని తోచింది. ఇటువంటి అభిప్రాయంతోనే ప్రతినిధులందరూ జెనీవాను విడిచిపెట్టి

1903 సం॥ జులై 30వ తేదీన బ్రసెల్స్‌లో జరిగే ప్రారంభోత్సవానికి వెళ్ళిపోయారు.

భద్రతా కారణాలనుబట్టి సభను ఒకచోటినుంచి మరొకచోటికి, ముఖ్యంగా బ్రసెల్సుజిల్లాలోని పనివారల ట్రేడ్‌యూనియన్ హాల్సులోనికి మార్చవలసివచ్చింది. నాలుగైదు సభలలో పార్టీ కార్యక్రమంగూర్చి తీవ్ర వాదోపవాదాలు జరిగినతరువాత, నలుగురు ప్రతినిధులకు 24 గంటలలో పట్టణంవిడిచిపోవలసిందని పోలీసులు నోటీసిచ్చారు. ప్రతినిధులందరిని పోలీసుగూఢచారులు కనిపెట్టి అనుసరిస్తున్నట్లు గ్రహించినతరువాత సభను లండనుకు మార్చవలెనని కాంగ్రెసు నిర్ణయించింది.

సభ్యులందరు వచ్చినతరువాత బ్రిటిషురాజధానీనగరంలో సమావేశం ప్రారంభమైంది. వచ్చిన 43 ప్రతినిధులలోను ముగ్గురు, నలుగురు మాత్రమే పనివాళ్లు మిగిలినవారందరూ 'అధికారవిప్లవకారులే' 51 వోట్లను కలిగిన ఈ ప్రతినిధులందరూ మూడు దృక్పథాలను కలిగివున్నారు. ఇస్క్రా—జ్యూలసోషలిస్టుబండు. (Bund) ఎకానమిస్టులు వారి విభేదాలు చాలాకట్టుదిట్టమైనవి. బండు సాధారణఫెడరేషనుకోరింది. కాని ఇస్క్రాసర్వాధికారమునకు తలవొగ్గటం ఎకానమిస్టులకు ఇష్టంలేదు.

తాను నిర్మింపబోయే కఠినపార్టీ నిర్మాణవిజయం మొదటినుంచీ తాను అనుసరించేక్రమశిక్షణపైనే ఆధారపడివుంటుందని లెనిన్ గ్రహించాడు. అందుచేత పూర్తిగా ఇస్క్రాసభ్యులతోను, ప్లెఖనోవ్ అధ్యక్షుడుగాను, తాను పావ్లోవిచ్-క్రాసికోవ్‌లు ఉపాధ్యక్షులుగాను ఉండునట్లు ఒక ప్రెసిడియమును స్థాపించటానికి తగినప్రతిపాదనను అతడు ప్రతిపాదించాడు. దీనిని మార్టోవ్ వ్యతిరేకించినా అతడు దానిని సాధించగలిగాడు. లెనిన్‌మార్టోవ్‌లయుద్ధానికి ఇదే ప్రారంభపోరాటం.

పార్టీపై ఇస్క్రా అధికారమును వ్యతిరేకించే సోషల్‌డిమొక్రటిక్ వర్గాలన్నింటిపైన 'ఇనుపహస్త' ప్రయోగానికే ఈ ప్రతిపాదనను తాను చేసినట్లు తరువాత లెనిన్ అంగీకరించాడు.

పార్టీసభ్యత్వాన్నిగూర్చి నిర్ణయించే సూత్రావళిని వ్రాయటంలో మాత్రం లెనిన్‌కంటె మార్టోవ్‌దే పైచెయ్యిఅయింది. పార్టీ కార్యక్రమాన్ని

అంగీకరించినవారినే కాకుండా, ఏఒక సంస్థలో పాల్గొన్నవారైనా సభ్యులుగా వుండవచ్చునని లెనిన్ అభిప్రాయం. కాని, పార్టీ కార్యక్రమాన్ని ఆమోదించి, ఏఒక సంస్థద్వారానైనా స్వయంగా దానితో సహకరించిన వారందరినీ సభ్యులుగా చేర్చుకోవాలని మార్టోవ్ ఉద్దేశ్యం.

చాలామందికి కేవలం ఇది మాటలలో తేడాయేనని తోచింది. కాని నిజంగా మాటలలోనున్న ఈ స్వల్పతేడాయే క్రమంగాసోషల్ డిమొక్రటిక్‌పార్టీని విచ్ఛిన్నంచేసి, బోల్షివిక్, మెన్షివిక్, పార్టీలుగా చీల్చటానికి తగినశక్తిని కలిగించింది. 1937లో అధికారనిర్వచనం ప్రకారం, ఏక రాజాధిపత్యం నిర్మూలించిన తరువాత, మధ్యతరగతి ప్రజాస్వామ్యం ద్వారానే పోరాటం సాగించటానికి తగినపార్టీని కావాలనటమే, 1903 లో మార్టోవ్, అతని అనుచరులుచేసిన దేశద్రోహకరమైన తప్పు.

దీనికి 1903 లోని మెన్షివికులు ఆగ్రహించివుండేవారు. వారు లెనిన్‌చెప్పినటువంటిసూత్రాలనే అనుసరించారు. కాని 1903 నుంచి 1917 వరకు వారుచెప్పిన దానికి చేసినదానికి సంబంధంలేకపోయింది. వారి సూత్రాలేమైనా సోషలిజం సాధనకై వారు మధ్యతరగతి ప్రజాస్వామ్యమును త్యాగంచేయటానికి అంగీకరించలేదు. మెన్షివిక్ మాటలకు, మెన్షిక్ చేతలకుగల ఈతేడాయే వారి రాజకీయ దౌర్బల్యానికి ప్రధానకారణమైంది.

పార్టీ సభ్యత్వంగురించి కాంగ్రెసులో మార్టోవ్‌కే జయంకలిగినా, మొత్తంమీద మిగిలిన అన్నింటిలోనూ లెనిన్‌దేవిజయం. దీనికి కారణం చాలావరకు ప్లెఖనోవ్.

1903 లో లెనిన్‌పక్షం వహించిన అధికసంఖ్యాకులైన సభ్యులు బోల్షివిక్కులు అని పేరుపొందారు; మార్టోవ్ పక్షంవారంతా మెన్షివిక్కులు అయ్యారు.

బలమైనపార్టీనిర్మాణవిషయంలో ప్లెఖనోవ్‌లెనిన్‌పక్షంవహించాడు. స్వతంత్రంగా వుండేపార్టీవ్యవస్థలన్నీకలిసి ఒకే ఒక పార్టీగా ఏర్పాటు కావాలని కాంగ్రెసు నిర్ణయించింది. దీనితరువాత బండ్, ఇతరవర్గాలు కొన్ని బైటకువెళ్ళిపోయాయి. తద్వారా ఇస్క్రాకు సంపూర్ణాధికారం

వచ్చింది. కాని వ్యతిరేకవర్గాలను బైటకు పంపినంతమాత్రాన లాభం కలుగలేదు. మార్టోవ్, లెనిన్‌లమధ్య పోట్లాటసాగుతూనేవుంది. ప్లెఖనోవ్ మాత్రం లెనిన్‌తరపునేవున్నాడు.

ఇస్క్రాసంపాదకీయవర్గాన్ని ముగ్గురికి-తాను, ప్లెఖనోవ్, మార్టోవ్-తగ్గించటానికి తెచ్చినప్రతిపాదనలో లెనిన్‌జయించాడు. దీనివల్ల ఎక్సెలార్డు పొట్రెసోవ్, జసులిచ్‌ల స్థానాలుపోయాయి. వీరంతామార్టోవ్‌అనుచరులు ఈ ముగ్గురు సంపాదకవర్గంలో తన దే పైచెయ్యిగా వుంటుందని లెనిన్ ధైర్యంగావున్నాడు. ప్లెఖనోవ్‌చేసిన ఉపన్యాసం అతనిధైర్యాన్ని బలవరచింది. ప్రోలిటేరియన్ నియంతృత్వంలో, సామాన్యప్రజానీకానికి ప్రత్యేకంగాగాని, పరోక్షంగాగాని హానికలిగించే సాంఘికశక్తులన్నింటినీ అణచివేయటంకూడా ఒకభాగమని, లెనిన్‌ప్రోత్సాహంతో ప్లెఖనోవ్‌వ్రాసిన కార్యక్రమముసాయిదాలో వ్రాయబడివుంది.

ప్లెఖనోవ్ తన అంత్యదశలో, లండన్‌లో తానుచేసిన ఉపన్యాసం గురించి పశ్చాత్తాపం పొందాడు. కాంగ్రెసు అయిన కొద్దివారాలతరువాత లెనిన్‌ను బలవరచటంలో ప్లెఖనోవ్ వెనుకంజవేయటం ఆరంభించాడు. అట్టి తరుణంలో మార్టోవ్ ప్లెఖనోవ్‌యొక్క ఉపన్యాసాన్ని విడమర్చిచెప్పడానికి ప్రయత్నించాడు.

"ప్లెఖనోవ్‌యొక్కమాటలు కొందరు సభ్యుల ఆగ్రహావేశాలను రేకెత్తించాయి. 'సామాన్యప్రజలువారి విజయంచాటడంకొరకు అటువంటి పద్ధతులకుపాల్పడటం అసంభవాలని ఒక్కమాట కామ్రేడ్ ప్లెఖనొవ్ చెప్పివుంటే ఆ సభ్యులుకొంత శాంతపడిఉండేవారు" అన్నాడుమార్టోవ్.

స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అణగద్రొక్కేమాటలను కాదనటం చాలా సాహసోపేతమైన కార్యం; కాని ప్లెఖనోవ్ అతనితరువాత ఆలోచనకు హేళనగా కృతజ్ఞతతెల్పాడు. తరువాత సంవత్సరాలలో అతని ఉపన్యాసానికి సరియైనప్రతిఫలం లెనినిజమే అని అతడు జ్ఞాపకంచేసినప్పుడు, ప్రజాస్వామ్యవిధానంలో ఎన్నుకున్నపార్లమెంటును విచ్ఛిన్నంచేయటం కేవలం సూత్రప్రాయంగా సాధ్యమేకాని అది సమంజసము, అవసరము

కాదని ప్లెఖనోవ్ విశదంచేయటానికి ప్రయత్నించాడు. అది ఒక కుంటి కారణం. కాంగ్రెసులో ప్లెఖనోవ్ లెనిన్‌పక్షంలోవున్నట్లు రికార్డులోస్పష్టంగా వుంది. అతని మానసికమైనమార్పు, మార్టోవ్‌పక్షం వహించటం తరువాత జరిగినది.

కాంగ్రెసుసమయంలో లెనిన్‌వాదానికి చాలాముగ్ధుడై ఎక్సెలార్డుతో ఇల్లాచెప్పాడు, "రాబస్పైరీలశక్తి అటువంటిది." ఇది చాలామంచిమాటే అని ప్లెఖనోవ్ భావం. ప్లెఖనోవ్‌కి, లెనిన్‌కి పోరాటం ధృఢతరంచేయటానికి అకిమోవ్ ప్రయత్నించినప్పుడు ప్లెఖనోవ్ ఇల్లాచెప్పాడు:

"తన సేనానాయకులందరు భార్యలకు విడాకులివ్వాలనినెపోలియన్ గట్టిగా వాంఛించాడు. ఈ విషయంలో అకిమోవ్ నెపోలియన్‌లాంటివాడు. ఎల్లాగైనా లెనిన్‌ను నేను విడిచిపెట్టాలని అతనికోరిక. కాని నేనతన్నివిడువ దలచుకోలేదు. అతడుకూడా నన్నువిడిచిపెట్టాలని అనుకోటంలేదని నా ఊహ."

కాని విడిపోటం తప్పలేదు. సమైక్యంగా సమావేశమైనకాంగ్రెసు పోట్లాటతో అంతమైంది. కాంగ్రెసు పూర్తియైన మర్నాడుదయమే, మార్టోవ్ తన అనుచరులతో పారిస్‌కి, లెనిన్ తన అనుచరులతో జనీవాకి వెళ్లారు. ఇరువర్గాలవారు మాటలు మానుకున్నారు. ఎక్సెలార్డు, పొట్రెసోవ్, జసులిచ్‌లపై అవిశ్వాసతీర్మానంచేసిన ఇస్క్రాసంపాదకవర్గంలో తాను పని చేయటానికి మార్టోవ్ నిరాకరించాడు.

తరువాత కొద్దికాలానికే జనీవాలో మరొక సభజరిగింది. దానివల్ల అభిప్రాయభేధాలు మరింతగా ఎక్కువైనాయి. లెనిన్ఇస్క్రాను స్వాధీనం చేసుకోవాలని చూస్తున్నాడని మార్టోవ్‌చెప్పినా ప్లెఖనోవ్‌మాత్రం లెనిన్ పక్షంవిడిచిపెట్టలేదు. లెనిన్‌తో పోరాటానికి జనీవాలో ట్రాట్‌స్కీమార్టోవ్‌తో కలిశాడు. పాతవాళ్లందరినిచేర్చి సంపాదకవర్గంలో మార్పులు చేయకుండా, పేచీలు రూపుమాపాలని ప్లెఖనోవ్ ప్రయత్నించాడు. కాని లెనిన్ అంగీకరించలేదు. సామరస్యం కుదర్చటానికి వేరొకమార్గం లేదని ప్లెఖనోవ్ చెప్పినప్పుడు లెనిన్ రాజీనామా ఇచ్చాడు.

''మెన్షివిక్కులతో పనిచేయటం అసంభవమని నీవు గ్రహించగల వని నా దృఢనమ్మకం. ఇస్క్రా సంపాదకత్వానికి రాజీనామానిస్తున్నాను. భావిపరిస్థితికి నీవే బాధ్యతవహించగలవు'' అని లెనిన్ చెప్పాడు.

మొత్తానికి విడాకులుతప్పలేదు. లెనిన్ తన సహచరులతోకలిసి పనిచేయకుండా రాజీనామా నివ్వటానికే చేసుకున్న నిర్ణయం అతని జీవితంలో చాలాకష్టతరమైనది. తాత్కాలికంగా, తనభావాలను ప్రచారం చేసుకోడానికి తగిన సాధనంలేకుండా తానొంటరిగానే ఉండవలసివుంటుం దని అతనికి తెలును.

లెనిన్ నిర్ణయంగూర్చి చాలా విమర్శలు చెలరేగాయి. ''ఆటో క్రట్'', ''బ్యూరోక్రట్'' అని అనేకవిధాల అతన్ని దూషించారు. ఇవన్నీ అతడు 1904 సం॥ ప్రకటించిన ''ఒక అడుగుముందుకు; రెండడుగులు వెనక్కి'' అనే కరపత్రంలో వివరించాడు.

దీనికి సమాధానంఇస్తూ, అధికారం లెనిన్ హస్తగతమైతే, అంత ర్జాతీయ ప్రజోద్యమాన్ని విప్లవవిచారణసంఘం నిందిస్తుందనీ, మార్క్స్ సిద్ధాంతాలన్నీ మంటకలిసిపోతాయనీ ట్రాట్‌స్కీ వ్రాశాడు. ప్రజానీకం మీదనే లెనిన్ నియంతృత్వం చలాయించాలన్నాడని ట్రాట్‌స్కీచెప్పాడు. క్రమంగా ఈగృహకలహం పెరిగిపెద్దదై లెనిన్ మెన్షివిక్కులమధ్య అఖాతం ఏర్పడింది.

సెచెరన్‌లోనిస్వగృహానికిచేరుకున్నతరువాత,లెనిన్ఇన్నిమాసాలుగా అధికారంకొరకు పడినశ్రమవల్ల నరములరోగానికి గురియైనాడు. వేసవి కాలానికి నరములన్నీ నిస్సత్తువైనాయి. కొంతకాలం ఈ గొడవలన్నింటినీ మరిచిపోటానికి అతన్నిదూరంగా తీసుకుపోవాలని కృపస్కయానిశ్చయిం చింది. తరువాత వారిద్దరూ స్విస్‌ప్రాంతంలో సంచరించారు. సరుకులు భుజానవేసుకుని ఊరూరా తిరిగారు. ''వ్యాపారవిషయాలు మాట్లాడ కూడదని నేనూ, వలోద్య ఒక నిర్ణయం చేసుకున్నాం. రోజు 10 గంటలు నిద్రపోతున్నాం; ఈతలాట, నడక మానను. వలోద్య పత్రికలుకూడా సరిగ్గా చదవటంలేదు.'' అని 1904 సం॥ జులై 2వ తేదీని ఆమె లెనిన్ తల్లికి ఉత్తరంలో వ్రాసింది.

మార్క్సుసూత్రాలప్రకారం ఆర్థిక, వైదాంతికరచనలు సాగించిన ఎ. ఏ బొగ్దనోవ్ సలహాలననుసరించి, మనోధైర్యము, బలము సంపాదించిన లెనిన్ జనీవాకుపోయితిరిగి స్విట్జర్లాండులోని బోల్షివిక్‌పార్టీలో చేరటానికి నిశ్చయించుకున్నాడు. బొగ్దనోవ్‌బోధనలు లెనిన్‌కి పూర్తిగా కావలసిన ప్రోత్సాహమిచ్చాయి. ఆగస్టునెలంతా వారు ప్లానులు వేయటంతో కాలక్షేపంచేశారు.

బొగ్దనోవ్ సహాయంతో యువకమార్క్సు రచయితలను కొందరను ప్రోగుచేసి, పూర్తిగా మెన్షివిక్కుల హస్తగతమైన ఇస్క్రాతో యుద్ధం చేయటానికి తగిన పత్రికను స్థాపించటానికి నిశ్చయించాడు.

జనీవాలో 22 మంది బోల్షివిక్కుసభ్యులతో ఒక సమావేశం ఏర్పాటుచేసి తన ప్లానును పూర్తిచేయించాడు. ఈ సమావేశానికి వెపెషిన్‌స్కీ, ఆల్మిన్‌స్కీ, లునాకార్‌స్కీ వోరోవిస్కీలు హాజరైనారు.

"ఈ క్రొత్తపత్రికయే రష్యాలోని కార్మికుల ఉద్యమానికి ప్రధాన పత్రికగా వుంటుంద"ని లెనిన్ ప్రకటించాడు. మొట్టమొదటి సంచిక 1904 సం॥ డిశంబరులో వెలువడింది. దానిపేరు 'వ్పేరియడ్' (Far word) తరువాత ఆపేరు 'ప్రోవిటరీ'గా మారింది. లెనిన్‌యొక్క సంపాదకాధికారంలో బొగ్దనోవ్, లునాకార్‌స్కీ, ఆల్మిన్‌స్కీ, వోరోవిస్కీలు పనిచేశారు.

'వ్పేరియడ్' పత్రికరాగానే లెనిన్‌కి నూతనోత్సాహం వచ్చింది. ఇస్క్రా సంపాదకవర్గ వాతావరణకీ, దీనికీ చాలా తేడా గోచరించింది. పోట్లాటలేకుండా సమస్తము సామరస్యంగా నడిచింది. మొదటి సంచిక రాగానే లెనిన్ కళ్లుమెరిశాయి. అతనిచుట్టూ నమ్మకస్థులైన సహచరులు చేరారు.

1904 సం॥లో జారుప్రభుత్వం జపానుతో యుద్ధానికి సిద్ధపడింది. ఈ యుద్ధంలో చాలా పరాజయాలు, దానితో విప్లవాలు చెలరేగాయి. 1905 సం॥ జనవరిలో జపానువారు పోర్టుఆర్థరును పట్టుకున్నారు.

"అపజయంపొందినది రష్యాప్రజలుకాదు; నిరంకుశరాజాధికారమే అపజయంపొందినది. జారుప్రభుత్వపతనానికి పోర్టుఆర్థరుపతనంనాంది ప్రస్తావన" అని లెనిన్ వ్రాశాడు.

తరతరాలుగా విప్లవకారులునాటిన బీజాలు మొలకలెత్తి, మొగ్గ తొడిగి ఫలించబోతున్నాయి. రష్యా విప్లవపుటంచులపైన విహరించింది. 1905 సం॥లోని గొప్పవిప్లవంనాటికి లెనిన్‌వయసు 3' సం॥రాలు. అతనికి పదిసంవత్సరాల విప్లవానుభవము, కుట్రలవిధానము, ఖైదుశిక్ష, సైబీరియాప్రవాసము రహస్యరాజకీయకలాపములు బలంగావున్నాయి. నాలుగుసంవత్సరాలు అతడు ఐరోపాదేశాలలో ఉన్నప్పటికీ అతడు ఐరోపీయుడు కాలేదు. ఆయాదేశాలభాషలు నేర్చుకున్నాడు. కాని అతనిభావాలన్నీ రష్యాదేశీయములే. అతని రాజకీయభావములు సుస్థిరముగా నాటుకొన్నాయి. మార్క్సుతత్వము ఐరోపాదేశ విద్యాభ్యాసము ఉన్నప్పటికీ అతని తత్వమంతా రష్యా విప్లవభావాలతోనూ అతని ఏకైక ఆశయంతోను కట్టుదిట్టము చేయబడిఉంది. అతని పూర్వపుసోషల్ డెమోక్రటిక్ స్నేహితులకు పూర్వపు సహచరులకు అతని పద్ధతి నియంతృత్వముగాను నిశ్చయమైనదిగాను ఉన్నప్పటికీ విప్లవవాదుల నాయకత్వముపైన అయిష్టము చూపుటచేతవారిని అతడు చాల విహ్యాభావముతో చూచెను.

వ్యక్తిగతంగాఉన్న సందేహాలను పైకి వ్యక్తంచేయుటకతడవకాశం ఇవ్వలేదు. వ్రాతలలో అతడు అంతకంత కధికంగా పురాతనపద్ధతులననుసరించాడు; అభిప్రాయబేధాలను అంగీకరించలేకపోయాడు. విప్లవసిద్ధాంతాలకు వ్యతిరేకంగా నడవవలసిన అవసరం కలిగినప్పుడు, ఈ నడతలను కేవలం యుక్తికొరకే అన్నట్లు చెప్పినప్పటికీ, ప్రత్యర్థులను మాత్రం "సమయానుకూలురు" "దేశద్రోహులు"అని నిందించాడు.

అతనివర్గంలో అతడు సహచరుల భక్తిశ్రద్ధలను, గ్రుడ్డినమ్మకమును సంపాదించాడు. అతడు స్వయంగా మితభాషి, హాస్యరసప్రియుడు అయినప్పటికీ, అతడు ప్రోత్సహించిన పొగడ్తలోని రాజకీయశక్తి అతనికి

తెలుసు. 1905 సం॥లో అతన్ని 'నాయకుడు'అని పిలవాలని అతని అనుచరులెవ్వరికీ తోచలేదు; అయినా భక్తియుక్తమైన వంశపారంపర్యమైన 'ఇలిచ్' అతని సమకాలికులకంటె అతనికి ప్రత్యేకస్థానం ఇచ్చింది.

ముందుముందు తాను నియంతనౌతానని లెనిన్ అనుకున్నాడని చెప్పటంకష్టం. అతనిచేతిలో అధికారంచిక్కేవరకు అతడు అన్నిమాటలు చెప్పలేదు. ఆతరువాత అతని అభిప్రాయాలను సుస్పష్టంగాచెప్పాడు.

"వర్గాలను పార్టీలు నడిపిస్తాయి. పార్టీలను నాయకులనబడే వ్యక్తులునడిపిస్తారు. వర్గంయొక్క కోర్కెలను ఒక్కొక్కప్పుడు నియంత తీర్చుతాడు." రష్యాసోషలిస్టు ప్రజాస్వామ్యం, వ్యక్తిపరిపాలనకు, నియంతృత్వానికి విరుద్ధంకాదు. వ్యక్తిపరిపాలనయే అవసరం; నియంత అధికారములను ఆమోదించటమే కావలసినది. సమానహక్కులు అనే మాటలన్నీ వట్టిచెత్త." అని లెనిన్ 1920 సం॥ లో చెప్పాడు.

జెనీవాసభలో లెనిన్ ఈ మాటలనువయోగించకపోయినా అతని భావాలుమాత్రంవ్యక్తమైనాయి. 1903 సం॥లో చూసినటువంటి వీధిపోరాటములనుగూర్చినవివరాలలో లెనిన్‌చూపిన ఉత్సాహానికివాలంటినోవ్ ఆశ్చర్యపడ్డాడు. వాలెంటినోవ్‌యొక్క ఆగ్రహాన్ని ఆశ్చర్యాన్నిచూసి లెనిన్ ఇల్లా చెప్పాడు:

"కేవలం పోరాటమును అలంకారికముగను, రాజకీయంగానే కాకుండా, సూక్ష్మంగా, శారీరకంగాను దాన్ని ఆచరణలో పెట్టవలసిన సమయం ఆసన్నమైనదని నీవు తెలుసుకోవాలి. విప్లవకారులు ఎఱ్ఱజెండా నెత్తి ఏకచ్ఛత్రాధిపత్యం నశించాలి" అని కేకలుపెట్టి తలోకమూలకు పారిపోయేరోజులు పోయినవి. ప్రత్యక్షంగా, ముఖాముఖీని పోరాడవలసిన సమయంవచ్చింది. ఇప్పుడు కావలసినది మన తికమక తెలివితేటల వాగ్వాదాలుకాదు; కాని సామాన్యప్రజలదెబ్బను ప్రత్యక్షశక్తితో చూపించాలి. పోరాటము ఎలాగో మనం తెలుసుకోవాలి.

"మార్క్సుమాత్రమే అసలైనసత్యం.దీన్నిఅనుసరించి మనంనిజానికి దగ్గిరగాచేరాలి. మనం మరియొకమార్గాన్ని అవలంభిస్తే అధోగతిలోను

అజ్ఞానంలోను పడిపోతాం. మార్క్సుసూత్రాల్లోని ఎంతస్వల్పభాగంవిడిచి పెట్టినా మనం ఏమీచెయ్యలేము.'' అని లెనిన్‌వ్రాశాడు.

మార్క్సుసత్యంలోను, సామాన్యప్రజలబలంలోను ఇంతనమ్మకంతో లెనిన్‌యుద్ధరంగంలో ఉరకటానికి సిద్ధమయ్యాడు.

# మొదటి విప్లవము

సోషల్‌డిమొక్రటిక్‌వర్గాలలో తుపాను చెలరేగే ఈ సమయంలో ఒక క్రొత్తపార్టీ ఉద్భవించి రష్యాప్రజలను ఆకర్షించింది. ఇదే సోషలిస్టు విప్లవపార్టీ. దీనికి నాయకులు—కాథరైన్ బ్రెష్కోవిస్క్: ఇతడు ఆరుసార్లు జైలుకువెళ్ళాడు; సైబీరియాలో 20 సంవత్సరాలు గడిపాడు; మిఖైల్‌గోట్జ్: ఇతడు గొప్పమాస్కోకోటీశ్వరుని కొడుకు; ప్రసిద్ధికెక్కిన సైబీరియా ప్రవాసి; గ్రిగరీ గెర్షూని: ఇతని టెర్రరిస్టుదళం చాలామంది వ్యతిరేక మంత్రులను, గవర్నర్లను ఖూనీచేసినది; విక్టర్‌చెర్నోవ్ మొదలైన పూర్వపుపీపుల్సువిల్ పార్టీ సభ్యులున్నారు. సోషలిస్టువిప్లవకార్యక్రమంలో టెర్రరిజమే అతిప్రాముఖ్యమైన భాగం; కాని అదేప్రధానమైనదికాదు.

సోషలిస్టువిప్లవకారులు మార్క్సుసూత్రాలను అధికంగా పాటించ లేదు. సాంఘికసమస్యల నెదుర్కోటానికి వారు ప్రథమభాగంనుంచి ఆరంభించి పైకిపోతారు. అందుచేతనేవారు ప్రజలపైన, ప్రజాసంస్థలపైనా అధికంగా ప్రాధాన్యముంచుతారు. కార్మికులకోర్కెలతో, రైతుప్రజల ఆశయాలతో, బుద్ధిమంతుల భావాలతో రాబోయేవిప్లవం జాతీయవిప్లవం కావాలి. కార్మికుడేకాదు, ప్రజాస్వామ్యసంఘంలో విద్యార్థి, ఉపాధ్యాయుడు, రైతు, విజ్ఞానవేత్త, రచయిత, అందరూ ప్రధానపాత్రలే. బుద్ధికుశలతకు అధికప్రాముఖ్యతనిచ్చి, సంపూర్ణభావస్వాతంత్ర్యానికి పోరాటం సాగించారు. భావస్వాతంత్ర్యంలేకుండా సోషలిజం సాధించటం అసంభవమైనపని. నిర్మాణము సమాజపునరుద్ధరణమే వారి ప్రధానాశయాలు. ఈ ఆశయసాధనకు రష్యాఇంకా సిద్ధంగాలేదని వారినమ్మకం. అయినప్పటికీ రష్యారైతుసాంప్రదాయానుసారంగా, భూమి ఏ ఒకవ్యక్తి సొత్తుకాదనే

వారినమ్మకం ప్రకారం విప్లవకార్యక్రమంలో వెంటనే భూమిని జాతీయం చేయవలెనని పట్టుపట్టారు.

సోషలిస్టు విప్లవవాదులప్రకారం, రైతుసంఘాలే పల్లెటూరిప్రాంతాలలో సోషలిజంవృద్ధిచేయగలవని మార్క్సువర్గం వారంగీకరించలేదు. రైతుసంఘాలు బలమైనవిప్లవశక్తులేకాని సోషలిస్టుశక్తివున్నవికాదని పురాతనపార్టీ అభిప్రాయం. పల్లెటూళ్లలోని భూమిని పంచుకునే పద్ధతులే విప్లవసంస్థలనీ, వాటిమధ్యనే వర్గపోరాటం అప్పుడే ప్రారంభమైనదనీ సోషల్‌డిమొక్రాట్ల అభిప్రాయం.

సోషలిస్టువిప్లవకారుల వ్యక్తిగత భయానకపద్ధతులనుకూడా నిరసించారు. ఈ యుక్తులు కేవలం నాయకునిచేతితోనే విమోచనరాగలదని నమ్మించి సామాన్యజనులను జోకొట్టటానికి, మధ్యతరగతులు పోరాట సాధనంగా ఉపయోగించేవని మార్క్సువర్గంవారు వీటిని నిరసించారు.

మొత్తంమీద సోషల్‌డిమొక్రటిక్ సమకాలికులు ఎక్కువరసికత్వం, నమ్మకాలు కలవారు. రాజ్యాంగసభను, ప్రజాస్వామ్యపరిపాలనలను కోరటంలో సోషలిస్టువిప్లవకారులు పూర్వపుపార్టీతో కలిసినప్పటికీ, మానవపౌరహక్కులను గుర్తించుట, ప్రజాస్వపరిపాలన, జాతిస్వాతంత్ర్యములకు ప్రాధాన్యం ఇవ్వాలని స్పష్టంచేశారు.

రష్యారాజకీయభావాలపై సోషలిస్టుసూత్రాలు సంపూర్ణహక్కును వహించలేదు. లిబరలుపార్టీకూడా రాజకీయకార్యక్రమం ప్రారంభించారు. రెండవ నికలస్‌ప్రభువు సింహాసనం ఎక్కినప్పుడు, ప్రజలమొఱ్ఱ విని వారికోర్కెలను మన్నిస్తాడనే ఆశతో, ట్వెల్‌రాష్ట్రప్రజలు అతనికి విన్నవించారు. దీనికి ప్రభువు తలతిక్కగా సమాధానం ఇచ్చాడు.

జారుప్రభువు తనసలహాదారులిచ్చే సలహాలనుమాత్రం పాటించి, వారు ప్రజలపైచేసే దురాగతాలను తెలిసికూడా లెక్కచేయలేదు. రాబోయే ప్రజాశక్తిని అతడుగుర్తించలేదు. "చక్రవర్తికి విద్యగాని, రాచకార్యానుభవంగానిలేదు." అని ఇంపీరియల్ కౌన్సిలు సభ్యుడు, సెక్రటరి ఆఫ్‌స్టేట్ అయిన ఏ. ఏ. పోలోవ్‌ట్జెవ్ అన్నాడు. రాజుమేన

మామయైన సెర్గీచెప్పినట్లే రాజువింటాడు. కాని సెర్గీ అన్నివిధాలా పనికి రాని మూర్ఖుడు.

ప్రభువు చిన్నచిన్న తగాదాలలో నిమగ్నుడైవుండగా, లిబరలు పక్షంవారు రాజకీయమార్పులకోసం వొత్తిడిచేశారు. 1903 సం॥లో ప్రొఫెసర్ పాల్‌మిలికోవ్, ప్రిన్సెస్‌పాల్, పీటర్‌డొల్గోరుకోవ్, ఇవాన్‌పెట్రుస్కెవిచ్, ఫియొడర్‌కోకోష్కిన్, ఫియడర్‌రోడిచేవ్, వ్లాడిమర్‌నబొకోవ్‌నాయకత్వంలో విమోచనసంఘం స్థాపించారు. 1905 సం॥లో ఈవిమోచనసంఘంవారు మిలికోవ్‌నాయకత్వంలో కాన్‌స్టిట్యూషనల్‌డిమొక్రటిక్ పార్టీ నిస్థాపించారు.

రష్యాసైనికుల అపజయంతోపాటు, వాన్‌ప్లెవె అనేమంత్రిని సోషలిస్టు రివల్యూషనరీపార్టీ సభ్యుడొకడు హత్యచేశాడు. వీధులలో ప్రదర్శనలు ఆరంభించారు; ప్రతిమూలనుంచి వ్యతిరేకం ఎక్కువైంది. మొట్టమొదటిసారిగా రష్యాజారుప్రభువు వెనుకంజవేసి, వాన్‌ప్లెవేస్థానంలో స్వియటోపోక్‌మర్‌స్కీ అనే లిబరలు రాజకుమారుణ్ణి నియమించాడు. సెన్సరు విధానము తగ్గించి, సంస్కరణలు చేయుటకంగీకరించారు. 1904 నవంబరు నెలలో సెంట్‌పీటర్సుబర్గులో ఒక మహాసభచేసి, పత్రికా వాక్స్వాతంత్ర్యంములను, వ్యక్తిహింసను మానాలని, అల్పసంఖ్యాకులకు సమానహక్కులను, ప్రజాప్రతినిధులసభను ఏర్పాటు చెయ్యాలనికోరారు.

ఇంతలో కార్మికులనందరను రాడికల్‌పార్టీనుంచి విముఖులను చెయ్యాలనేసంకల్పంతో, ప్రభుత్వసహాయంతో, రాజకీయపోలీసుశాఖవారు రష్యాకార్మికులయూనియను స్థాపించారు. కార్మికుల ఆర్థికహక్కులను రక్షించుట, జారుప్రభువుకు అణిగియుండుట దీనిప్రధానకార్యక్రమం. ఫాదర్‌గేపన్ అనే మతగురువు దీనికి అధిపతిగా నియమించబడ్డాడు. కాని పరిస్థితులకారణంగాపోలీసువారిఅభిప్రాయాల కతీతంగాఇదిపెరిగిపోయింది.

1905 సం॥ జనవరి 22వ తేదీ ఆదివారంనాడు, ఈయూనియను వారు జారుప్రభువుకు ఒక అర్జీ నివ్వటానికై శీతాకాలం భవనానికి ఒక ఊరేగింపు లేవదీశారు. వేలకొలది కార్మికులు, భార్యాబిడ్డలతోసహా, నినాదాలఅట్టలను ప్రదర్శిస్తూ బయలుదేరారు. వారికి జారుగాని, అతని

మంత్రులుగాని దర్శనం ఇవ్వలేదు. పైగా వారిని సైనికులు అడ్డగించి రాజభవనానికి చేరకుండా ఆపుచేశారు. సైనికులు తుపాకులనుకూడా ప్రయోగించారు. డెబ్బయిమంది మరణించారు. అసంఖ్యాకులు గాయపడ్డారు. ఈ మారణక్రియలవలన ప్రభుత్వంమీద ప్రజలకున్న నమ్మకం పూర్తిగా నసించింది. "బ్లడ్ సన్ డే" మూలంగా ప్రపంచం అంతకీ ఆగ్రహం హెచ్చింది; నిరసనసమ్మెలు ప్రవాహంలా ప్రారంభమైనాయి.

ఈమారణహెూమం జరిగిన నెలలోగానే సోషలిస్టు రివల్యూషనరీ పార్టీకి చెందిన టెర్రరిస్టుదళంవారు, మాస్కోగవర్నరు జనరలైన గ్రాండ్ డ్యూక్ సర్గీని హత్యచేశారు.

"ముందుముందు ప్రత్యక్షంగా రాబోతున్న విప్లవాన్ని గ్రహించు. మాతరంలో ఈ నిరంకుశప్రభుత్వం శాశ్వతంగా అంతరిస్తుంది." అని హంతకుడైన కాలియైవ్ జడ్జీల ముఖంమీద చెప్పాడు. 1905 సం॥ మే నెలలో మిలికోవ్ నాయకత్వంలో యూనియన్లయూనియను స్థాపించారు. తద్వారా లిబరలు, రాడికల్ పార్టీలవారందరూకలిసి ఏకోన్ముఖంగా పార్లమెంటుప్రభుత్వం, సర్వమానవులకు వోటుహక్కులను ఏర్పాటు చెయ్యాలని కోరారు

1905 సం॥ ఆగస్టు 19వ తేదీని జారుప్రభువు ఫర్మానా ప్రకటించాడు. దానిప్రకారం పాప్యులర్ ఎసంబ్లీని—ఇంపీరియల్ డ్యుమా—స్థాపించి లెజిస్లేటివ్ అధికారం లేకుండా, సలహా అధికారములుమాత్రం ఇచ్చాడు. ప్రజల కళ్లనీళ్లు తుడుచుటకుచేసిన ఈ అసంపూర్తి కార్యక్రమం ప్రజల కెంతమాత్రం తృప్తికలిగించలేదు.

సమ్మెలు, ప్రదర్శనలు, కొట్లాటలు, అన్నిచోట్లా హెచ్చిపోయాయి. సెప్టెంబరు మధ్యప్రాంతంలో మాస్కోప్రింటర్లయూనియన్వారు సమ్మెచేశారు. వారితో బేకర్లు, టెలిగ్రాఫ్, పోస్టలుపనివారు కలిశారు. ఏ సలహాలు లేకుండా సమ్మెబ్రహ్మాండంగా పెరిగిపోయింది. ఈ సమ్మెలో ప్రజలే నాయకులు సైనికులుగాకూడా పనిచేశారు.

1905 సం॥ అక్టోబరు 22వ తేదీని, రష్యాలో రక్తపాతపు విప్లవం రాబోతుందని, కౌంట్ విట్టే అనేపూర్వపుమంత్రి జారుకు జాగ్రత సూచన చేశాడు. అక్టోబరు ఆఖరుప్రాంతంలో రష్యా రైల్వేపనివారి యూనియను జనరల్ సమ్మె చేశారు. అక్టోబరు 25వ తేదీని మొత్తం సామ్రాజ్యమంతటా రైలుప్రయాణం స్తంభించింది. చివరికి సమ్మెకారణంగా ప్రభుత్వంకూడా స్తంభించింది.

అదేసమయంలో సెంట్‌పీటర్సుబర్గులోని సోవియట్ కార్మిక ప్రతినిధులతో ఒక వింతప్రభుత్వం జన్మించింది. క్రొత్తసంస్థకు ప్రతినిధుల ఎన్నికలు అక్టోబరు 26వ తేదీని ఫాక్టరీలలోనే ఆరంభమైంది. కృష్టలేవ్ నోసార్ అనే ఒక యువకలాయరు అధ్యక్షుడుగాను, ట్రాట్‌స్కీ, నికోలై అలెక్సీనవ్‌లు ఉపాధ్యక్షులుగాను ప్రధమసోవియట్‌కు ఎన్నుకోబడ్డారు.

ఈ సామాన్యప్రజాపార్లమెంటునకు కావలసిన ప్రోత్సాహం సెంట్ పీటర్సుబర్గు సోషల్ డిమొక్రటిక్‌పార్టీలోని మెన్షివిక్ వర్గంనుంచి వచ్చింది.

అక్టోబరు 26వ తేదీని మొట్టమొదటి సోవియట్‌సభ టెక్నలాజికల్ ఇన్‌స్టిట్యూట్‌లో జరిగింది. దానికి 20,000 కార్మికుల తరఫున 40 మంది ప్రతినిధుల నెన్నుకోటానికి తగిన వ్యవధిలేకపోయింది. కార్మికులందరూ సమ్మెలో చేరాలని ఈ సోవియట్ విజ్ఞప్తిచేసింది. "ఇంక కొద్దిరోజులలో రష్యాలో నిర్దేశితమైన సంఘటనలు జరుగబోతున్నాయి.దీన్నిబట్టి రష్యా లోని కార్మికుల అదృష్టం చాలాసంవత్సరాలవరకు నిర్ణయింపబడుతుంది. మన సోవియట్‌ద్వారా మనమంతాకలిసి ఈ సంఘటనల నెదుర్కొటానికి సర్వసిద్ధంగావుండాలి." అని సోవియట్ విజ్ఞాపనచేసింది.

ఈ సోవియట్ ప్రత్యక్షంగానే తన కార్యకలాపమును సాగించింది. సామాన్యప్రజల అధికారమును తెలిపే ఈ సోవియట్‌సంస్థ అమాంతంగా సర్వజనాదరణపొందకలిగింది. కృష్టలేవ్ ప్రజలప్రతినిధి పాత్రను వహిం చాడు. కాని మూడవనాడే అతని రాజకీయాధికారం ట్రాట్‌స్కీమూలంగా తబ్బిబ్బులోపడింది. అతని వాక్చాతుర్యంవల్లనే అతడుముందుకు త్రోసుకు వచ్చాడు.

సోవియటును అసలుకేంద్రసమ్మెసంఘంగా ఏర్పాటుచేసినా అది క్రమంగా రాజకీయప్రదర్శనకు పనికివస్తుందని నాయకులుగ్రహించారు. కొద్దిరోజులలోనే అది విప్లవశక్తిస్వరూపంవహించింది. 28వ తేదీని అన్నిషాపులను మూసివేయాలని సోవియట్ ఆజ్ఞాపించింది. తినుబడిసరుకుల దుకాణాలుమాత్రం ఉదయం తెరువవచ్చు. ఆరోజునే, ఫాక్టరీయజమానులకు, దుకాణయజమానులకు, వారు తమ వ్యాపారమును సాగించప్రయత్నిస్తే ప్రజలకోపాగ్నినెదుర్కోవలసివుంటుందని ఒక వార్నింగునిచ్చారు. రెండురోజులతరువాత సెంట్‌పీటర్సుబర్గులో జీవితం స్తంభించిపోయింది.

ఒక్కతుపాకిగుండుకూడా పేల్చకపోయినా ఇదేవిప్లవం అని జారు ప్రభువు సలహాదారులు గ్రహించారు. బెర్లిననుంచి కైజర్‌విల్‌హెల్మ్ తన సోదరునికి రాజ్యాంగచట్టమును ఏర్పాటుచేయమని సలహానిచ్చాడు. జారుకు రక్షణస్థానం ఇస్తాననికూడా కైజరుచెప్పాడు. ఇది రాజభవనంలో అలజడికలిగించింది. రాజ్యాంగచట్టానికి వ్యతిరేకులైనవారంతా జారు రక్షణస్థానానికి వెళ్ళటానికే సమ్మతించారు. కాని దీనివల్ల వంశం ఇంతటితో అంతరించిపోతుందని విట్టే సలహాచెప్పాడు.

ఇంకా ఆలస్యమైతే ప్రమాదకరమని నికలస్‌చక్రవర్తి పోబిడొనోస్ట్సేవ్‌ను తొలగించి విట్టేను రష్యాప్రధానమంత్రిగా నియమించుతూ అక్టోబరు 30వ తేదీని ఒక ప్రత్యేకఫర్మానా ప్రకటించాడు. దీనివల్ల వాక్స్వాతంత్ర్యము, లేబరుయూనియను ఏర్పాటుచేసే అధికారం, డ్యూమా ఎన్నికలకు ఇంకా అధికవు ఎన్నిక హక్కులు ప్రసాదింపబడ్డాయి. ఇంక డ్యూమ అధికారంలేకుండా ఏ శాసనాలు చేయబడవనికూడా నికలస్ వాగ్దానంచేశాడు. సెంట్‌పీటర్సుబర్గు గవర్నరైన ట్రెపోవ్ ఈ వార్తవిని ఇల్లాప్రకటించాడు: "ఫర్మానాప్రకటించబడినందుకు దేవునికి కృతజ్ఞత తెలుపుతున్నాను. ప్రజలేవారిప్రతినిధులను ఎన్నుకుంటారు. క్రొత్తజీవితం ఆరంభమౌతుంది."

సోవియట్ వార్తాపత్రిక ఇజ్వెస్టియాప్రకటింపబడినప్పుడు జారు ప్రభువు వాగ్దానాలనుగూర్చి ట్రాట్‌స్కీ ఇలాచెప్పాడు: "మనకు విట్టే

నిచ్చారు; కాని ట్రెపోవ్ విడువలేదు; మనకు రాజ్యాంగమిచ్చారు, కాని నిరంకుశత్వంవిడువలేదు. అంతా ఇవ్వబడింది, కాని ఏమీఇవ్వబడలేదు.''

సమ్మెను ఇంకాసాగించాలని సోవియట్ వోటుచేసింది. 31వ తేదీని బ్రహ్మాండమైన ప్రదర్శనం జరిగింది. జండాలు, విప్లవకీర్తనలు, మారుమ్రోగునట్లు ముగ్గురు సోవియట్‌సభ్యులు దీన్ని నడిపించారు. కాని సైనికులు, నావికులుమాత్రం పాల్గొనలేదు. సైన్యమంతా ఇంకా ప్రభుత్వభక్తితోనే వుంది.

నవంబరు 3వతేదీని సమ్మెవిరమించారు. కాని ఇజ్వెస్టియాలో మాటలయుద్ధం మానలేదు. ''ప్రజాస్వామ్యానికి ఏమికావాలో ఏమి అక్కర్లేదో వారికే తెలుసు. వారికి పోలీసురాక్షసుడైన ట్రెపోవ్‌గాని, లిబరలురాయబారివిట్టేగాని-తోడేలునోరుగాని, నక్కతోకగాని, అవసరంలేదు. రాజ్యాంగంముసుగులోవున్న కొరడాదెబ్బలు వారికవసరంలేదు.''

ప్రధానమంత్రి రాజకీయాలను రెండుచేతులతో నడిపించాడు. కృష్టలేవ్‌ను చూపించి, ట్రెపోవ్‌ను, ట్రెపోవ్‌నుచూపి కృష్టలేవ్‌ను భయ పెట్టాడు. ప్రభుత్వం తటపటాయిస్తున్న సమయంలో ''నిరంకుశరాజ్యపు ఆయుధాలు ఊడపీకండి; విప్లవానికి ఆయుధాలివ్వకండి'' అనే నినాదాన్ని సోవియట్ ప్రకటించింది. సెంట్‌పీటర్సుబర్గు కార్మికులకు ఎనిమిది గంటలపని, అధికవేతనాలు కావాలని సోవియట్ ప్రకటించింది. ఈ విధానంమూలంగా ధనికులు, మధ్యతరగతివారు ప్రభుత్వపక్షానికివెళ్లారు, రైతులంతా తటస్థంగా వుండిపోయారు.

నవంబరు 8వ తేదీని క్రోన్‌స్టాడ్‌కోటలో నావికులంతా పితూరీ లేవదీశారు. కాని దాన్ని త్వరలోఅణచివేసి, నాయకులనందరినీ ఉరి తీశారు. పిట్రోగ్రాడ్‌వనివారు మళ్ళీ సమ్మెప్రారంభించారు. మిలటరీ కోర్టులను, ఉరిశిక్షలను రద్దుచెయ్యాలని వారికోరిక. అదే సమయంలో సైన్యంలో అలజడి కలిగించాలని సోమియట్ తలపెట్టింది. అధికారు లనుకున్న దానికంటె సమ్మె విజయవంతంగా సాగింది. ఇదివర కెన్నడూ జారుప్రభువుమంత్రులెవ్వరూ ఉపయోగించనిభాషలో విట్టే కార్మికులకు

విజ్ఞప్తిచేశాడు: "సోదర కార్మికులారా! మీ పనులకు మీరువెళ్లండి. తిరుగుబాటు మానండి. మీ భార్యాపిల్లలనుచూసి జాలిపడండి. మీ యోగక్షేమములనాసించి, మీ పక్షం పనిచేసేవానిసలహా మీరు వినండి" అని ప్రధానమంత్రి ప్రార్థించాడు. "జారుప్రభువుమంత్రి పిట్రోగ్రాడ్ పనివారిని 'సోదరులు' అని అపురూపంగా పిలవటం, సోవియట్ సభ్యులకు ఆశ్చర్యం కలిగించింది. కార్మికప్రజలు కౌంట్‌విట్టేకు బంధువులు కారు." అని సోవియట్ కార్యాచరణసంఘం వెంటనేసమాధానంఇచ్చింది.

ఇదే సమయంలో అనగా 1905 సం॥ నవంబరునెలలో లెనిన్ రష్యాకు తిరిగివచ్చాడు. "బ్లడీసన్‌డే" (రక్తపాతపు ఆదివారం) నాటి నుంచి అతడేమి చేస్తున్నాడు?

తిరుగుబాటు తప్పదనే నమ్మకంతోనే మెన్షివికులనుంచి అధికారం లాక్కోటానికి లెనిన్ నిశ్చయించాడు. ఏప్రిల్‌నెలలో రష్యా సోషల్‌డిమొక్రటిక్ పార్టీ 3వ కాంగ్రెసు అనేపేరుతో తన అనుచరుల నందరినీ ఆహ్వానించాడు. 1905 సం॥ ఏప్రిల్ 25 నుంచి మే 10 తేదీవరకు లండన్‌లో జరిగిన ఈ కాంగ్రెసుకు లిట్వినోవ్, కామెనోవ్, రైకోవ్, క్రాసిన్, లునాకార్‌స్కీ మొదలైన బోల్షివికులు వచ్చారు.

తన కార్యక్రమాన్ని ఆమోదింపచేయటానికి లెనిన్ ఎక్కువ కష్టపడలేదు. వచ్చిన సభ్యులంతా అతన్ని తమ నాయకునిగా అంగీకరించారు. వెంటనే ఆయుధబలంతో తిరుగుబాటుచెయ్యాలని కాంగ్రెసు నిశ్చయించింది. మెన్షివికులు పూర్తిగా విసర్జించబడ్డారు. కాని 3వ కాంగ్రెసు అధికారమును ఆమోదించనందువల్ల దానికెక్కువ ఫలితం లేకపోయింది. వారికి సంబంధించినంతవరకు లండన్ కాంగ్రెసు మొట్టమొదటిదే.

1905 సం॥ వేసవికాలంలో కజన్ నుంచి ఒక యువకబోల్షివిక్ వచ్చి లెనిన్‌సలహా నడిగాడు. 'రష్యా సామాన్యసైనికులు చేయవలసిన పని ఏమిటి'?

"ఏమి చెయ్యాలి? ఒక్కటేవని—ఆయుధ విప్లవం—వెంటనే ఆయుధ విప్లవం."

ఈ సమయంలో విప్లవంవల్ల విజయం లభిస్తుందా అని బోల్షివికులు సందేహపడుతున్నారు అని కామ్రేడ్ సూచించాడు. లెనిన్ ఒక నిమిషం అలాగే నిల్చున్నాడు.

"విజయం! విజయంగూర్చి మనకెందుకు? మనం ఊహాలలో జీవించము. నా పేరుగా ఈ సంగతి మనకామ్రేడులకుచెప్పు. మనం కేవలం ఆశావాదులం. మనం తప్పకుండా జయిస్తామని ఎవ్వరూ నమ్మవద్దు. మనం ఇంకా బలహీనులమే. కాని ఇది కేవలంవిజయం కోసమేకాదు. నిరంకుశప్రభుత్వాన్నికూలద్రోసి, సామాన్యప్రజలను చైతన్యవంతులుగా చేయుటకు ఈ విప్లవంకావాలి. ప్రజలను ఆకర్షించుటయే ఇప్పుడు మనకర్తవ్యం. అదేముఖ్యవిషయం. విప్లవమేఅసలుకావలసినది. 'మనం జయించలేము' కనుక మనకు విప్లవం అవసరంలేదనేవారు పిరికిపందలు. అట్టివారితో మనకు సంబంధంలేదు."అన్నాడు లెనిన్.

'ఆయుధవిప్లవం' అనేమాటలు చెవులలో గింగురుమంటుండగా బోల్షివిక్ యువకుడువెళ్ళిపోయాడు. ఆయుధవిప్లవం, విప్లవసైన్యస్థాపన, తాత్కాలిక విప్లవప్రభుత్వం, అనేనినాదాలతో లెనిన్ బోల్షివిక్ కార్యక్రమమంతటినీ నడిపించాడు. ఆయుధాలను కొనటంలోను, రహస్యంగా రష్యాకు రప్పించటంలోను అతడు నావికులు విప్లవకారులతో సంబంధం పెట్టుకుని వారి విప్లవానుభవాలను గ్రహించాడు. "విప్లవసైన్యంకావాలి. ఎందుకంటే తద్వారా అనేకమైన గొప్పచారిత్రక సమస్యలను పరిష్కరించటానికి బలంకావాలి. ఇప్పటికాలంలో క్రమశిక్షణగల శక్తి అనగా సైన్యశక్తియే.

సెంట్‌పీటర్సుబర్గులోని సైనికసంస్థకు ఉత్తరాలద్వారా అనేక సలహాల నిచ్చాడు.

దానికి చాలా శక్తికావాలి. బాంబులనుగూర్చి మాట్లాడటాని అర్ధసంవత్సరంపట్టింది. కాని ఒక్కబాంబు తయారుకాలేదంటేఆశ్చర్యం వుంది.

యువకులవద్దకు పొండి. ప్రతిచోటా విద్యార్థులలోను, ముఖ్యం పనివారినుంచి యుద్ధదళాలను ఏర్పాటుచేయండి. వెంటనే వారికి దొరికి ఆయుధములను సేకరించి సిద్ధంగా ఉండాలి.

సోషల్ డిమొక్రటిక్ పార్టీలో ముఖమోటాలకి మాత్రం ఎవరి చేర్చుకోవద్దు. మీయొక్క సొంతప్లానులు, భావాలు మూలబెట్టి దళాలన వెంటనే తర్ఫీదుచెయ్యండి. కొంతమంది గూఢచారులను హత్య చేయుట పోలీసుస్టేషనులను తగులబెట్టుట, కొందరు బ్యాంకులనుదోచి ధన ప్రోగుచేయుట మొదలైనపనులు చెయ్యాలి. ప్రతివారు పోలీసులత పోట్లాడి, త్యాగాలను చేసినట్లయితే, అనేకరెట్లు లాభాలు పొందగలరు.

ప్రజాసామాన్యపుసమ్మె లెనిన్‌కు చాలా ఆశ్చర్యంకలిగించింది తన పత్రికలోని నినాదాలను, మూడవకాంగ్రెసులోని తీర్మానాలన మించిపోయింది. అది రష్యా నాలుగుమూలలా ప్రాకిపోడంవల్ల లెనిన్ దానినిగుర్తించి, సోవియట్ ప్రతినిధులతో కలిసిపోవలసివచ్చింది. మొట్ట మొదట ఈ క్రొత్తవిప్లవపద్ధతి జారుప్రభువునే కాకుండా, లెనిన్‌నుకూడ ఆశ్చర్యపరచింది. మెన్షివిక్కులు, సోషలిస్టువిప్లవకారులు కలిసి ఏర్పాట చేసిన సోవియటును క్రమశిక్షణలేని సంస్థగా, తనపార్టీకి విరోధిగా లెనిన్ భావించాడు.

నవంబరులో లెనిన్ రష్యాకువచ్చేసరికి విప్లవానికి సోవియట శక్తివంతమైన అండగావుంది. రష్యాలో "రెండుప్రభుత్వాలు—ప్రధాన మంత్రి విట్టేప్రభుత్వం, కృషిలేవ్ ప్రభుత్వం—వున్నాయని ఒకదాన్ని ఒకటి అణచివేయడంలో ఏది జయిస్తుందో అనేది ప్రశ్న" అని నోవోయె వ్రెమ్యా అనే పత్రికవ్రాసింది.

1905 సం॥లో సోవియటు ప్రాముఖ్యాన్నిగూర్చి ఇదికొంత అతిశ యోక్తి. కాని దానిశత్రువులు దానిశక్తిని గుర్తించారనేది స్పష్టం.

కొన్నాళ్లకి కృషిలేవ్‌ను ఖైదుచేశారు. లియాన్‌ట్రాట్‌స్కీ ఆధిపత్యంలో ముగ్గురు మూర్తులుగల ఒక కమిటీఅధికారంలోకి సోవియట్ వచ్చింది.

ఈ సమయంలో సోవియటును వ్యతిరేకించటం ప్రమాదమని గ్రహించి, సోవియట్‌ద్వారా తాత్కాలిక ప్రభుత్వాన్ని స్థాపించాలని ప్రబోధించాడు. ఆ సమయంలో 'నోవయాజిన్' అనే మొదటి బోల్షివిక్ వార్తాపత్రికను సెంట్‌పీటర్సుబర్గులో స్థాపించారు. ఇది లెనిన్‌కు అధికార సాధనంగావుంది. అయుధవిప్లవంకావాలని లెనిన్ ప్రయత్నించాడు. వార్తాపత్రికాకార్యాలయంలోను, రహస్యసమాలోచనలలోను లెనిన్ దీక్షగా పనిచేసి అయుధవిప్లవానికి కావలసిన ప్లానులను తయారుచేశాడు.

కొంతకాలం 'విలియంఫ్రే' అనేపేరుతో తనభార్యకు దూరంగా వుండటమే మంచిదని లెనిన్‌గ్రహించాడు. ఒకనాటి సాయంత్రం 'ఫ్రే' తన సహచరునితో ఒక హెూటల్లోవుండగా తనప్రక్కబల్లదగ్గిర ఒక అందమైన యువతిని చూశాడు. అది గ్రహించి అతని సహచరుడు ఆమెవద్దకుపోయి ఇల్లా అన్నాడు. "నీవు ఎవరికోసమూ వేచివుండకపోతే మా దగ్గరకివచ్చి, ఒక గొప్పవ్యక్తినిచూడరాదా. ఆ వ్యక్తి చాలాప్రసిద్ధుడు కాని వివరాలు అడుగవద్దు"

ఎలిజబెత్‌కె, అనే ఆ ధనవంతురాలు ఆ గొప్ప నూతనవ్యక్తిని కలుసుకోవాలని నిశ్చయించింది.

"నీవు బ్రిటిషువాడవా?" అని ఆమె ప్రశ్నించింది.

"పూర్తిగాకాదు" అని అతడు వికృతమందహాసంతో అన్నాడు.

వారిద్దరూ విడిపోయేముందు ఒకగంట సంతోషంగా కాలక్షేపం చేశారు. కొద్దిరోజులతరువాత ఆమె నోవయాజిన్ కార్యాలయానికివచ్చింది. మిస్టర్‌ఫ్రే అక్కడ ప్రత్యక్షమై ఆమె కాహ్వానమిచ్చాడు.

"ఎల్లావున్నావు నీవు? నిన్నుకలుసుకున్నందుకు చాలాసంతోషం. నీవు మళ్లా టార్టార్ హెూటలుకి రావటంలేదా?" ఈ ప్రశ్న ఆమె ఆహ్వానంగా అర్థంచేసుకుంది. ఆమెను లెనిన్‌కు పరిచయంచేసిన బోల్షి

విక్‌తో ఈ సంగతి చెప్పగా అతడునవ్వాడు: "నా ముఖ్యస్నేహితుడు క్రేఫే మొత్తంమీద స్త్రీలసమస్యలపై అభిమానం కలవాడు. అదంతా మొత్తం మీద సాంఘిక, రాజకీయపరంగా వుంటుంది. మనం మొదటకలును కున్ననాడు నీవిషయంలో నన్ను పూచీఇమ్మన్నాడు. ఎందుకంటే క్రొత్తపరిచయస్థులద్వారా తనరహస్యాలు బయటపడతాయేమో అని అతనిభయం. నేను నిన్నుగూర్చి చెప్పి, నీ యిల్లు రహస్యసమావేశాలకు బాగుంటుందనికూడా చెప్పాను."

మూడురోజులతర్వాత ఆముగ్గురుకలుసుకునిమళ్ళీ టార్టార్‌హొటల్లో భోజనంచేశారు. తనబసలోనే వారానికి రెండుసార్లు రహస్యాలోచనల కుపయోగించుకోటానికి ఆమె అంగీకరించింది. సమావేశంరోజున ఆమె తన నౌఖరును బయటకుపంపించి అతిథులను తానేస్వయంగా పరీక్షించి లోనికి పంపిస్తుండేది. ఆ సమయంలో ఆమెకూడా అక్కడలేకుండా బైటకు వెళ్ళిపోతుండేది. చాలారోజులు లెనిన్ ఒంటరిగానేవచ్చాడు. క్రమంగా వారిరువురిస్నేహం ఎక్కువైంది. ఆమె సంగీతంపాడి అతన్ని ఆనందపరిచేది.

విప్లవంలోని ఉధృతపరిస్థితి గడిచిపోయింది. వ్యతిరేకశక్తులు దానికి తగిన ప్రతిచర్యలను ప్రారంభించారు. విట్టేకు తెలీకుండా, జారు ప్రభువు తన నిరంకుశాధికారం నిలబెట్టుటకు, అంతరంగికమంత్రియైన దర్నోవోకు అనుజ్ఞనిచ్చాడు. దేశంలో అనేకప్రాంతాలలో శిక్షణకార్య క్రమం లేకుండా నావికులు, సైనికులు సమ్మెలుచేశారు. టెలిగ్రాఫ్సు, పోస్టల్‌పనివారి సమ్మెమూలంగా పని పూర్తిగా స్తంభించింది. పారిశ్రామికు లంతా ఈ విపరీతపరస్థితులకు తాళలేక కఠినచర్య తీసుకోవాలనీ ప్రభు త్వాన్ని కూలగొట్టాలనీ, రాజ్యాంగసభను సమావేశంచెయ్యాలనీ, సోవియట్‌ద్వారా ఒకప్రకటనచేశారు. 1905వ సం॥ డిశంబరు 16వ తేదీని సోవియట్‌కార్యాచరణ సంఘసభ్యులందరినీ ఖైదుచేశారు. వారి ప్రకటనను ప్రకటించిన పత్రికలన్నీ అణచివేయబడ్డాయి. ఈ సమయంలో బోల్షివిక్కులు దొంగతనంగా ఆయుధాలు కొని, విప్లవసైనికదళాలను తయారు చేసుకుంటున్నారు. లెనిన్ తనఆశను మాస్కోపైనే పెట్టు

క్కున్నాడు. సెంట్‌పీటర్సుబర్గులోకంటె మాస్కోలోనే విప్లవానికి ఎక్కువ అమోదం కనిపించింది.

డిశంబరు 20వ తేదీని సమ్మెను ప్రారంభించాలని నిశ్చయించారు. కాని సెంట్‌పీటర్సుబర్గు దానికంగీకరించలేదు. కాని మాస్కోలో సమ్మె అతిత్వరితంగా వృద్ధియై విప్లవంలోనికి మారింది. పార్టీయుద్ధదళాలు పోరాటాలు సాగించాయి. విప్లవకారులకు అవసరమైన సలహాలతో పోస్టర్లువేసి మాస్కోగోడలకంటించారు. సెంట్‌పీటర్సుబర్గునుంచిప్రభుత్వ సైన్యాలను గవర్నర్‌జనరల్ పంపించవేదు. విప్లవం ఒకవారం సాగిన తరువాత సెంట్‌పీటర్సుబర్గునుంచి సైన్యాలు పంపించారు. 31వ తేదీని ఆఖరి రక్షకస్థానం పడిపోయింది.

24వ తేదీనుంచి విప్లవాంతంవరకు లెనిన్ ఫిన్లాండులోవున్నాడు. విప్లవం అంతరించగానే బోల్షివిక్‌పార్టీలో లెనిన్ వ్యతిరేకులెక్కువైనారు. లెనిన్‌ను అనేకవిధాలుగా దూషించారు. కాని అతనిదృష్టిలో ఈవిప్లవం అతిముఖ్యమైనది. ఇది 1917లో జరుగబోయేదానికి నాందిప్రస్తావనగా అతడు భావించాడు. జారుప్రభువు అధికారం మళ్ళీ స్థిరపడగానే అతని మంత్రులు చేసిన వాగ్దానాలను నిర్లక్ష్యం చేశాడు. రాడికల్ పత్రికలను అణచి, సోషలిస్టు నాయకులను ఖైదుచేశారు,

నిరంకుశాధికారం మళ్ళీ స్థిరపడుతున్నప్పటికీ, విప్లవప్రభావం అంతరించని ఈ పరిస్థితులలో 'డ్యూమా'స్థితి ఏమి అనేది ముఖ్యప్రశ్న. రష్యాలో నిరంకుశ రాజ్యపాలన కొనసాగటానికి తగిన శాసనాలు చేయ టానికి డ్యూమాకు బలంవున్నదనే లిబరలు పార్టీవారు భావించారు. రాజ్యాధికారాన్ని తగ్గించే శాసనానికి నికలస్ తలవగ్గుతాడని విప్లవసోష లిస్టు పార్టీలు నమ్మలేదు. కాని డ్యూమా ఎన్నికల విధానాలతోకూడా వారు ఏకీభవించలేదు. తమ కార్యక్రమాన్ని ప్రజలకు తెలియచేయుటకై ఎన్నికలే సరియైనమార్గమని మెన్షివిక్కులు భావించారు.

కాని లెనిన్ డ్యూమాను మొత్తంగా దగాసంస్థయనీ, కనుక దాన్ని బహిష్కరించాలనీ ప్రకటించాడు. ఇతని అభిప్రాయాలనే సోషలిస్టు

పార్టీ కౌన్సిలులన్నీ ఆమోదించాయి. అనేకసభలలో ఉపన్యసిస్తూ అతడు డ్యూమాకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రచారం సాగించాడు. మాస్కో విప్లవపోరాటం అణిగిపోయిందనుకోవద్దనీ, లిబరలు పార్టీవారు జారు ప్రభువుతో చేతులు కలుపుతున్నారనీ ప్రకటించాడు.

సామ్రాజ్యచిహ్నాలను రూపుమాపటానికి, అగ్రేరియన్‌సంస్కరణలు చేయటానికి తక్కువతరగతుల విప్లవంకావాలని లెనిన్‌చెప్పాడు. ప్రజాస్వామ్యరిపబ్లికులోనే కార్మికులు వృద్ధిపొందగలరు. సామాన్యప్రజలవిప్లవం మొదట ఇంగ్లండులోను, ఫ్రాన్సులోను వస్తుంది. మార్క్సు సూత్రాల ప్రకారం ఇటువంటివిప్లవం అభివృద్ధిచెందిన దేశాలలోనే రావాలని అతని వాదం.

సోషలిస్టులు డ్యూమాను బహిష్కరించటంచేత డ్యూమాకుఎన్నికైన వారినిబట్టి కాడెట్లకు జయంలభించినట్లు తెలుస్తుంది. ఎన్నికైన వారిలో నూరుమంది రైతులుకూడా వున్నారు. ట్రుడోవిక్‌లనేపేరుతో వారొక పార్టీని స్థాపించారు. పంద్రెండుమంది స్వతంత్రులుకలిసి సోషల్‌డెమొక్రాటిక్‌వర్గం స్థాపించారు. డ్యూమాను ప్రారంభించటానికి ముందు బోల్షివికులు, మెన్షివికులు స్టాక్‌హోంలో రహస్యంగా సమావేశమైనారు. లెనిన్, లునాకార్‌స్కీతో ఇల్లా స్పష్టం చేశాడు.

"కేంద్ర సంఘంలో మనకు మెజారిటీవుంటే సంపూర్ణక్రమశిక్షణ మనం కోరాలి. మెన్షివికులు పార్టీసహకారానికి లొంగివుండాలి. వారు దీనికంగీకరించకపోతే పార్టీవిచ్ఛిన్నానికి బాధ్యత వారువహించాలి."

"కాని మనం పార్టీలోవుంటేనేం? వారికి లొంగివుండాలని వారు బలవంతంచేస్తారా?" అన్నాడు లునాకార్‌స్కీ. లెనిన్ చిరునవ్వుతో ఇలా చెప్పాడు: "సహకారంఅనే ఉరిత్రాటిని మనకంఠాలకు బిగించుకోకూడదు. ఏపరిస్థితిలోకూడా మెన్షివికులు మనకునాయకులై నడిపించకూడదు."

కేంద్రసంఘంలో మెజారిటీవస్తుందనే లెనిన్‌ఆశ నిరాశయైంది. పైకి లెనిన్ స్టాక్‌హోంనిర్ణయానికి కట్టుబడివున్నట్లున్నాడు. కాని చివరికి

లునాకార్‌స్కీతో చెప్పినట్లే చేశాడు. అతడు తన బోల్షివిక్‌స్థానాన్ని నిల బెట్టుకున్నట్టయితే, నామమాత్రపుసహకారం తనప్లానులకడ్డురాదని అతనికితెలుసు. స్టాక్‌హెూంలోవుండగా అతడు మళ్ళీ ఎలిజబెత్-కేను కలుసుకున్నాడు. ఆమె ఒక స్వీడన్ సోషల్‌డెమొక్రట్‌తో కలిసి అతన్ని అనుసరించి వెళ్ళింది. ఆమె సిటీలో ప్రవేసించగానే లెనిన్‌కి ఫోనుచేసింది. తనతో ఇతర రష్యనులుంటే తననుగుర్తించవద్దని లెనిన్ ఆమెకు తెలియ చేశాడు. అతడు ఎలిజబెత్తుఉన్న బసకివచ్చేసరికి అక్కడ ఇద్దరురష్యను లున్నారు. వారు వెళ్ళిపోయినతరువాతనే వారిరువురు మాట్లాడారు. "వారు మాసభకువచ్చిన ప్రతినిధులు, మంచివాళ్లే. కాని అడివిజాతి." అన్నాడు లెనిన్.

కాంగ్రెసుసభలమూలంగా లెనిన్‌కు సావకాశం దొరకనేలేదు. కాని ఏదోవిధంగా ఖాళీచేసుకుని లెనిన్ ఎలిజబెత్తును కలుసుకుని కొన్ని గంటలు కాలక్షేపంచేసేవాడు. కాని క్రమంగా అతనికి తీరుబడిలేక ఆమెను తరుచుగా కలుసుకోలేకపోయాడు. అందుచేత ఆమె అతనికి చెప్పకుండానే వెళ్ళిపోయింది.

తిరిగి సెంట్‌పీటర్సుబర్గు వచ్చినతరువాత లెనిన్ ఆమెకు ఉత్తరం వ్రాశాడు. కాని ఆమె దానికి బదులువ్రాయలేదు. ఆతనితో స్నేహం విడచిపెట్టాలని ఆమెనిశ్చయించింది. కాని తరువాత రెండుసంవత్సరాలకి పారిస్‌లో లెనిన్ ఉపన్యసించిన ఒకసభకు ఆమె హాజరుకాకుండా వుండలేకపోయింది. అతన్ని కలుసుకోటానికి లోనికి వెళ్ళింది. కాని అతనిచుట్టూ అనేకమంది మూగివున్నారు. ఆమెను చూడగానే అతడు "ఏమి ఇలావచ్చావు?" అని ప్రశ్నించాడు.

"నేను నీ ఉపన్యాసం వినటానికివచ్చాను. దీనికితోడు ఒక వ్యక్తి నుంచి నీకొకవార్త తీసుకువచ్చాను." అని ఆమె సమాధానం చెప్పి, అతనికి తన చిరునామాగల ఉత్తరం ఇచ్చింది. దానిప్రకారం లెనిన్ మర్నాడుదయం ఆమె వున్నచోటికివెళ్ళాడు. ఆమెతో కరచాలనం చేస్తూ ఆమెను కౌగలించుకోబోయాడు. కాని ఆమె అడ్డుపెట్టి "ఆగు, అదంతా

పూర్వకాలం''అంది. ''ఔను. నిజమే అదంతా పూర్వమే. కాని నీవు చాలా మంచిదానవు. నీవు సోషల్‌డిమొక్రట్‌వు కాకపోటం బాగాలేదు.'' అన్నాడు లెనిన్. ''నీవూ చాలామంచివాడవే కాని నీవు సోషల్‌డిమొక్రట్ మాత్రమే ;అయివుండటం బాగాలేదు.'' అని ఆమె సమాధానంచెప్పింది. లెనిన్ పకపకనవ్వాడు. ఇరువురు కొన్నిగంటలు కులాసాగా మాట్లాడుకుని, విడిపోయారు.

1906వ సం॥ మేనెల 10వ తేదీని, లెనిన్ ఇంకా స్టాక్‌హోంలోనే వుండగా, సంపూర్ణరాజకీయస్వాతంత్ర్యము, రాజకీయ ఖైదీలవిడుదల, ఉరి శిక్ష రద్దు, అల్పసంఖ్యాకవర్గాలందరికీ సమానహక్కులు, పోలెండు, ఫిన్లండులకు స్వాతంత్ర్యము, విస్తృతమైన వోటింగు పద్ధతులు, ప్రభుత్వ భూములను రైతులకివ్వాలనీ, మొదలైన కోర్కెలను డ్యూమాకోరింది. కొంతకాలం జారుప్రభువు హడలిపోయాడు. ఒక సమయంలో అతడు మిలియకోవ్‌తో రాయబారంచేసుకోవాలని అనుకున్నాడు. కాని డ్యూమాకు కార్మికులబలం ఎంతవరకువున్నదనే ' జారుఅనుమానం. ముఖ్యంగా సిటీకార్మికులు డ్యూమాను బలవరచకపోతే, జారుప్రభువు డ్యూమాకు తలవగ్గనవసరంలేదు.

ఇటువంటి క్లిష్టసమయంలో అన్నివిభేదాలనువిస్మరించి డ్యూమాను బలపరచవలెనని ప్లెకనోవ్, మెన్షివిక్కులు విజ్ఞప్తిచేశారు. కాని లెనిన్, బోల్షివిక్కులు డ్యూమాకు వ్యతిరేకులై, కాడట్లనోడించి, తిరిగి అయుధ విప్లవానికి సిద్ధంగావుండాలని ప్రజలకు ప్రబోధంచేశారు.

1917వ సం॥ విప్లవంతరువాత రికార్డులనుబట్టి బోల్షివిక్కులకు డ్యూమాతో యుద్ధంచేయుటకు సంపూర్ణసహాయం ఇవ్వవలెనని అఖ్రానా, తన ఏజంట్లకు ఆదేశించినట్లు తెలుస్తోంది. బోల్షివిక్కులు ప్రచారం చేసిన ఆయుధవిప్లవం ప్రభుత్వానికి భయంకలిగించలేదు. ప్రభుత్వం భయపడుతున్నది డ్యూమానుగురించే.

జారుఉద్దేశ్యంప్రకారం లెనిన్ ప్రచారంవిజయవంతమైంది.డ్యూమా మీద ప్రజాభిమానం పారద్రోలుటకు, 72 రోజులతరువాత మళ్లీ ఎన్నికలు

లేకుండా, డ్యూమాలేకుండారద్దుచేస్తూ ఆజ్ఞలు జారీచేయటానికి జారుకు అవకాశము లభించటానికి వీలయింది. తరువాత ఆరుమాసాలకు క్రొత్త ఎన్నికలు జరపాలని నిర్ణయించారు.

డ్యుమాసభ చర్చించినతరువాత బోల్షివికులు ఆయుధవిప్లవానికే పనిచేశారు. 1887 నుంచి విప్లవకారుడును, రెండవకాంగ్రెసు జరిగినప్పట్నుంచీ కేంద్రకమిటీసభ్యుడునైన క్రాసిన్‌కి ఉన్నతసంఘీయులతో సాన్నిహిత్యంవుంది. అతడు మాక్సిమ్‌గోర్కీకి స్నేహితుడు. తద్వారా అతనికి దేశంలో గొప్పకోటీశ్వరుడైన మోరాజోవ్‌తో స్నేహం కుదిరింది. లెనిన్‌కి ఆర్థికమంత్రిహోదాలో క్రాసిన్,మోరోజోవ్‌ను కొంతఅప్పు అడిగాడు. "నాకు సొంతఖర్చులకు సంవత్సరానికి 60,000 రుబుల్సువస్తాయి.దానిలో 3వ వంతు విద్యావేతనాలు మొదలైనవానికి ఖర్చవుతుంది. నెలకి 1000 రుబుల్సు ఇవ్వగల ననుకుంటాను'' అని ఆకోటీశ్వరుడు చెప్పాడు. 1905 సం॥ లో మోరోజోవ్ ఆత్మహత్యచేసుకున్నప్పుడు, బోల్షివిక్ పార్టీకొరకై అతడు చాలాసొమ్మును మాక్సింగోర్కీకి భార్యపేరవ్రాశాడు. తరువాత సంవత్సరం గోర్కీకి అమెరికన్ పర్యటన ఏర్పాటుచేసి క్రాసిన్ చాలాధనం సంపాదించాడు. ఇదికాకుండా బోల్షివికులచేత నడుపబడే రహస్యఆయుధనిర్మాణకర్మాగారముల నతడుపర్యవేక్షణచేశాడు. తరువాత దొంగతనంగా బాల్కన్‌రాజ్యాలనుంచి ఆయుధాలనుదిగుమతిచేయించాడు.

రెండవడ్యుమాసభ ఎన్నికలలో మెన్షివికులు ప్రత్యర్థులను ఓడించటానికి లిబరలు సభ్యులతోకలిసారు. దీనికోసమై 1907 సం॥ లో సెంట్ పీటర్సుబర్గులో ఒకసభచేశారు. లెనిన్ నాయకత్వంలో బోల్షివికులు వారిని ఎదిరించగానే మెన్షివికులు వెనక్కితగ్గారు. మిగిలినసభ్యులంతా లెనిన్ ఉపన్యాసం విన్నారు. ఎన్నికలలో సంపూర్ణస్వాతంత్ర్యం ఉండాలని నిశ్చయించారు. ఆయుధవిప్లవంచెయ్యాలనీ, కార్మికకర్షకనియంతృత్వం రావాలనీ లెనిన్ యువకులకు ప్రబోధంచేశాడు. కొంతమంది వ్లాడిమర్ వోయ్‌టిన్‌స్కీ నాయకత్వంలో వామపక్షాలనుకూడా చేర్చుకోవాలని వాదించారు. ఈ వ్యతిరేకతనుగ్రహించి లెనిన్ తనఅభిప్రాయమును మార్చు

కున్నాడు. కాని ఈవిధమైనమార్పుకు మెన్షివికులే కారణమని తన కరపత్రంలో వారిని నిందించాడు. దీనిపై పార్టీట్రిబ్యునల్ విచారించాలని మెన్షివికులు వాదించారు. విచారణలో, మెన్షివికులను అవమానించుటకే తానట్లు చేశానని చెప్పాడు.

ఈ పేచీలల్లావుండగానే ఎన్నికలలో ప్రభుత్వంఓడిపోయింది. ఇతర పార్టీల సభ్యులనేకులు ఎన్నుకోబడ్డారు సంస్కరణల నంగీకరించటమో లేక డ్యూమాను రద్దుచేయటమో జరుపవలసిన అవస్థవచ్చింది. డ్యూమాను రద్దుచేయటానికి కారణంకోసమై ప్రధాని స్టోలోపిన్ తంటాలు పడుతుండగా లెనిన్ దారిచూపించాడు. డ్యూమాప్రతినిధులంతా తమ అధికారమును ఆయుధవిప్లవానికై ఉపయోగించాలని లెనిన్ పచారం చేశాడు. వారంతా మాటలతోకాకుండా, క్రియారూపంలో ప్రజావాంఛలు తీర్చాలని ప్రజలుకోరుతున్నట్లు ప్రకటించారు. కొన్ని సంవత్సరాలతరువాత బోల్షివిక్ కార్యాలయాలలో గూఢచారులున్నట్లు తెలిసింది. డ్యూమా ప్రతినిధులు విప్లవాన్ని బలపరుస్తున్నారని చెప్పటానికి స్టోలోపిన్‌కు కారణం దొరికింది.

1907వ సం॥ ఏప్రిల్ నెలలో జరిగిన తరువాతకాంగ్రెసు సభలో లెనిన్ కేంద్రకమిటీని పూర్తిగా కైవశంచేసుకున్నాడు. ఈ సభలో బోల్షివిక్, మెన్షివిక్, జ్యూసోషలిస్టుబండు, పోలెండు, లెట్వియా, లిధోనియా, సోషల్‌డిమొక్రటిక్ పార్టీల ప్రతినిధులు హాజరైనారు. లెనిన్, ప్లెఖెనోవ్, ఫెక్సెలార్డు, మార్టోవ్, ప్రాట్రెసోవ్ మొదలైన అతిరధ, మహారధులంతా వచ్చారు. తరువాతసంవత్సరాలలో ప్రముఖపాత్రలు వహించిన నాయకులు కూడా చాలామంది హాజరైనారు.

సోషల్‌డిమొక్రటిక్ డ్యూమాసభ్యులు రష్యాకు తిరిగిరాగానే బోల్షివిక్ సైనికదళాలద్వారా, వారికొకతీర్మానం పంపించారు. ఓక్రానా ఏజంటయిన షోర్నికోవా ఈ తీర్మానం తయారుచేయటంలో ప్రముఖపాత్రవహించాడు. వీరినందరినీ పోలీసులు ఖైదుచేయకలిగివుండేవారు. కాని వీరికి డ్యూమా సభ్యులతో సంబంధంకలిగించటమే వారిఉద్దేశ్యం. ఈవిధంగా పన్నిన

వన్నాగం ప్రధానిస్టోలోపిన్‌వరకు పోయింది. సభ్యులకు చేరకముందే ఈ తీర్మానం ప్రధానికివచ్చింది. పోర్నికోవాతీర్మానమును రెండుకాపీలుతీసి ఒకటి మిలిటరీదళానికి, ఒకటి పోలీసులకు పంపించాడు.

తీర్మానం ప్రవేశపెట్టినతక్షణమే అక్కడ పోలీసులు ప్రత్యక్షమైనారు. పన్నినవన్నాగం విచ్ఛిన్నమైపోయేస్థితిలోవుంది. పోర్నికోవా నుంచివచ్చిన తీర్మానంకాపీని ఆధారంగా సభ్యులందరిపై దేశద్రోహ నేరంతో కేసులుపెట్టారు. 1907వ సం॥ జూన్ 16వ తేదీని డ్యూమాసభను రద్దుచేశారు. సభ్యులలో చాలామందిని బంధించి సైబీరియాపంపించారు.

అయినప్పటికీ ఆయుధవిప్లవం లేవనెత్తటానికి లెనిన్ చాలాప్రయత్నంచేశాడు. కర్షకులు కార్మికులతో కలుస్తారనీ, విప్లవం బ్రహ్మాండంగా సాగుతుందనీ లెనిన్ అనుకున్నాడు. దీన్నినడిపించటానికి తర్ఫీదైన విప్లవకారులజట్టులను ఏర్పాటుచేశాడు. రైతులంతాకలిసివస్తారని లెనిన్ అనుకున్నాడు. కాని వారు సహకరించలేదు.

పోర్నికోవాసంఘటనతరువాత సెంట్‌పీటర్సుబర్గులో లెనిన్‌జీవితం దుర్భరమైపోయింది. ఒకనాటిరాత్రి పోలీసులతనికొరకు వెతుకుతుండగా అతడు పారిపోయాడు. ఆ కంగారులో అతడు భార్యనుకూడా కలుసుకోలేకపోయాడు. అతడు ఆ రాత్రే ఫిన్‌లాండుకు పారిపోయాడు.

లెనిన్ ఫిన్‌లాండులోఉన్నప్పుడే అతన్ని తరువాత చాలాబాధించిన తలనొప్పి ఇవ్‌సోమియారోగాలు వచ్చాయి. ఇవి అప్పుడప్పుడు అతని జీవితాంతంవరకు బాధించాయి. ఉదయంభోజనంకాగానే అతడయిదారు గంటలు వ్రాతపని చేస్తాడు. రాత్రిళ్లు నిద్రపట్టునట్లుగా అలిసేవరకు అతడు చాలాదూరం నడిచేవాడు. రాత్రినిద్రలేక ఉదయం చాలా ఆలస్యంగాను, బద్ధకంగాను అతడు లేచేవాడు.

ఫిన్‌లాండులో జీవితం చాలాఅపాయకరం. పోలీసులతనికొరకు వెతుకుతుండటంచేత అతడు స్టాక్‌హెూముకు పారిపోయాడు. రాత్రి ఓడ ఎక్కడంలోనే పోలీసులకు పట్టుపడతాననే భయంతో అతడు చిన్నపడ

వలో రాత్రి చిన్నద్వీపంవరకుపోయి, అక్కడ ఓడ ఎక్కవలసివచ్చింది. అతడు ఇద్దరురైతులసహాయంతో మంచుగడ్డపై ప్రయాణంచేశాడు. ఆ సమయంలో అడుగునున్న మంచుగడ్డ విరిగివిడిపోడం ఆరంభించింది. అదిపూర్తిగా దూరంకాకముందే వారు రెండవప్రక్కకు చేరుకోగలిగారు. ఈ సంఘటననుగూర్చి జ్ఞాపకంచేసుకుని మంచుగడ్డ పగిలినశబ్దంవిన్న సమయంలో చనిపోతాననేభయంతో తనలో ఇలా అనుకున్నాడు:

"ఎంత నీచపు చావువచ్చింది?"

## ఆంతరంగిక విషయాలు

తన జీవితమంతటిలోను కష్టతరమైన పరిస్థితులను లెనిన్ ఇప్పుడెదుర్కొనవలసివచ్చింది. ప్రస్తుతం విప్లవమంతా చల్లారిపోయింది. ఇకముందు పరిస్థితులంత ఆశాజనకంగాలేవు. పార్టీని తనఆధీనం చేసు కోడంవలన కేంద్రకమిటీ అతనిస్వాధీనమైంది, కాని అతనిమెజారిటీ బలంమాత్రం అనుమానాస్పదంగావుంది. దీనికితోడు లండన్ కాంగ్రెసులో, పార్టీతాలూకు పోరాటపుదళాలను, యుద్ధదళాలను రద్దుచెయ్యాలనీ, ఆయుధ దోపిడీలద్వారా, పార్టీకి ధనం సేకరించేపద్ధతులను నిషేధించాలనీ తీర్మానించబడింది.

కాని వీటినన్నింటినీ రద్దుచెయ్యటం లెనిన్‌కు అంగీకారంకాదు. ఇదివరకటికంటె ఇప్పుడే అతనికధికంగా సొమ్ముకావలసివుంది. బోల్షివిక్‌పార్టీ ఉద్యమాన్ని ఉధృతంగా సాగించటానికి చాలాసాహస కార్యాలుచేయవలసివుంది. ప్లెఖనోవ్, మార్టోవ్‌లవంటి వారిచేతులలో అతడు కట్టుబడివుండటం అతనికిష్టంలేదు. ఎంతఖర్చయినా బోల్షివిక్ కేంద్రాన్ని పోషించాలి; ఏమార్గం చేతనైనా ధనం సంపాదించాలి.

1907వ సం॥ మధ్యప్రాంతంలో, ఇప్పట్లో ఆయుధవిప్లవం సాగు తుందనే ఆశ లెనిన్‌కిలేదు. అందుచేత మూడవ డ్యూమాఎన్నికలలో పాల్గొనవలసిందిగా రష్యాలోని తనఅనుచరులనతడు ప్రోత్సహించాడు. కాని తన ఆయుధదళాల చర్యలు మానలేదు. లండన్‌కాంగ్రెసు జరిగి

నప్పటినుండి 1910వ సం॥ వరకు, సెంట్ పీటర్సుబర్గులోని పార్టీకమిటీకి నెలకు వెయ్యిరుబుల్సు, మాస్కోకమిటీకి నేలకు 500 రుబుల్సు సహాయంగా బోల్షివిక్ కేంద్రం ఇచ్చింది. సంయుక్తకేంద్రసంఘానికి నెలకు నూరు రుబుల్సుకూడా ఆదాయంలేని సమయంలో ఇది జరిగింది. ఇంత అధికపుసొమ్మును లెనిన్ అనేకమార్గాలద్వారాసంపాదించాడు. మాక్సిమ్ గోర్కీ లెనిన్‌కి ధనసహాయంచేశాడు. గారిన్‌మిఖెలోవిస్కీ అనే ధనవంతుడైన ఇంజనీరు లెనిన్‌కి వేలాదిద్రవ్యంఇచ్చాడు. మోరోజోవ్ సంవత్సరానికి 12000 రుబుల్సు చొప్పున ఇచ్చినదికాక ఈపైమొత్తాలు వచ్చాయి. ఇది కాకుండా ఆయుధదళాలద్వారా చాలా మొత్తంవచ్చింది. జూన్ 26వ తేదీ ఉదయం 10-30 గంటలకు టిప్లిస్ పోస్టాఫీసులోనికి 250,000 రుబుల్సు వచ్చినట్లుచరిత్రకారులంచనావేశారు. రష్యాపత్రికలలో దీనిని 341,000 గా ప్రకటించారు. ఈ సొమ్మును ఒక కోచిబండిలోవేసి ఆయుధసిపాయిల సాలో కొంతదూరంపోయేసరికి దగ్గరనున్న ఒక ఇంటిలోనుంచి బాంబు వచ్చిపడింది. తరువాత మరికొన్ని బాంబులుపడ్డాయి. కొందరు బాటసారులు తుపాకులు పేల్చినట్లు కనిపించింది. కాని ధనంఉన్నసంచులు మాత్రం మాయమైపోయాయి.

కొన్ని నెలలతరువాత బెర్లిన్, మ్యూనిచ్, పారిస్ నగరాలలో 500 రుబుల్‌నోట్లను మార్చటంసందర్భంలో కొందరు ప్రముఖబోల్షివిక్‌పార్టీ నాయకులను బంధించారు. ఆ సమయంలోనే పారిస్‌లో మాక్సిమ్‌లిట్వినోవ్‌ను బంధించారు. కాని జర్మనీ, ఫ్రెంచిప్రభుత్వాలు నిర్బంధితులను రష్యాప్రభుత్వానికి అప్పగించటానికి నిరాకరించారు. కాకసస్ ఆయుధదళంలో కామొ, లోమిడ్జె మొదలైనవారు, లెనిన్ డిప్యూటీగాఉన్న 'కామ్రేడ్‌కోబా'—తరువాత జోసెఫ్ జగష్‌విలి అనీ, ఆ తరువాత, స్టాలిన్ అనీ పిలవబడినవాడు—నాయకత్వం వహించాడు.

సోషల్‌డిమొక్రటిక్‌పార్టీయొక్క లండన్‌కాంగ్రెసు ఈ ఆయుధదళాలను నిషేధించినప్పుడు, కాకేషియన్ దళంలోనివారిని, స్టాలిన్‌తో కూడా, పార్టీనుంచి బహిష్కరించారు. స్టాలిన్, కాకసస్ బోల్షివిక్ ప్రతి

విధులు, స్టాక్‌హెూం, లండన్‌కాంగ్రెసులకు వెళ్ళివచ్చినతరువాత లెనిన్ విప్లవంయొక్క ప్రత్యక్షమూర్తియని ప్రచారంచేసి కాకేషియనులను లెనిన్ పార్టీ వారినిగా తయారుచేశారు. లెనిన్‌మాటకు తిరుగులేకపోయింది.

టిప్లిస్‌దోపిడీతరువాత ప్రష్యాపోలీసులు, ఒక బెర్లిన్‌స్టోరులో నీటి మార్కువున్న కాగితమును—దొంగనోట్లువేయుటకు సిద్ధపరచినదాన్ని—పట్టుకున్నారు. ఆ సందర్భంలో చాలామంది బోల్షివిక్కులను ఖైదుచేశారు. తమకు తెలియచేయకుండా ఈ కాగితమును బెర్లిన్‌పంపించినందుకు జర్మనీసోషల్‌డిమొక్రాట్లకు కోపంవచ్చింది. ఈ దొంగనోట్లప్రయత్నం గూర్చి దర్యాప్తుచెయ్యాలని, చాలామంది బోల్షివిక్కులు పట్టుపట్టారు. దీనికై జార్జిచిచేలిన్ నియమించబడ్డాడు. కీలకవిషయాలన్నీ మాయం చేయబడ్డాయని లెనిన్ నిశ్చయించాడు. కాని చిచేలిన్ నీటిమార్కు పేపరును నప్లయిచేసినవర్తకునికి బోల్షివిక్‌నాయకులఫోటోలుచూపించాడు. అతడు క్రాసిన్‌ను గుర్తించి అతడే తనకు పేపరుకై ఆర్డరిచ్చాడని తెలియచేశాడు. లెనిన్ కంగారుపడ్డాడు. సెంట్రల్‌కమిటీని ఈ దర్యాప్తును విదేశబ్యూరోకు మార్చునట్లు వొత్తిడిచేశాడు. ఇక్కడ బోల్షివిక్‌మెజారిటీ బలంతో ఈ సాక్ష్యమునంతటినీ మాయంచేశాడు.

క్రాసిన్‌మరణానంతరం అతనిజ్ఞాపకార్థం ప్రకటింపబడిన గ్రంథంలో అతనిచేత తయారుచేయబడిన దోపిడీప్లానులు, కామో వాటినినడిపించిన విధానములన్నీవ్రాయబడ్డాయి. 1907 సం॥ లో క్రాసిన్‌ను ఫిన్‌లాండులో బంధించినపుడు అతన్ని ఉరితీయటానికి తగిన ఆధారంవున్నదని లెనిన్‌కు తెలుసు. కాని తరువాత అతన్ని విడిచిపెట్టారు. అతడు బెర్లిన్‌వెళ్ళి అక్కడ ఒకఎలక్ట్రిక్‌కంపెనీలోచేరి అనేకదొంగనోట్లను చెలామణిచేశాడు.

ఈ క్రాసిన్ వ్యవహారం ముగియగానే, కామ్రేడ్ విక్టర్‌గాడవతో పార్టీలో అలజడి చెలరేగింది. అతడు ఒక్రానాగూఢచారి అని అనుమానం ఉన్నప్పటికీ అతన్ని బోల్షివిక్‌కేంద్రంలో చేర్చుకున్నారు. దాన్నిగూర్చి ఏవిధమైన దర్యాప్తుజరుగలేదు. విక్టరు బాధ్యతలనుగూర్చి కొద్దిమంది బోల్షివిక్ నాయకులకుతప్ప, అంతా రహస్యంగానేవుంది. అతనిపై అనేక

ఫిర్యాదులు జరిగాయి. కాని లండన్‌కాంగ్రెసులో బోల్షివిక్కులు అతన్ని కేంద్రకమిటిసభ్యుడుగా, ముఖ్యమైన విదేశశాఖ అధిపతిగా, బోల్షివిక్ సెంటరు ఆర్థికడైరెక్టరుగా ప్రకటించారు. అతని ఆఖరిహెూదాలో అతడు గొప్పశక్తిసామర్థ్యాలు చూపించాడు.

ష్మిటో అనే మాస్కోనిర్మాత చాలాసొమ్మును సోషల్‌డిమొక్రటిక్ పార్టీకి వ్రాసిచ్చాడు. ఇది బోల్షివిక్ సెంటరుకు చెందాలని లెనిన్ పట్టు పట్టాడు. సెంట్రల్‌కమిటీమాత్రమే అసలైన పార్టీ సెంటరని వ్రాసియిచ్చిన వాడు చెప్పాడు. అందరూకలిసి ఒకసభచేశారు. దానిలో విక్టరు బోల్షివిక్ పార్టీకే సొమ్మును సంక్రమింపచెయ్యాలని చాలా ప్రయత్నించా డని దాత ఫిర్యాదుచేశాడు. ఎస్టేటు వ్యవహారం పూర్తిగా నిర్ణయంజరిగే వరకు తమఅభిప్రాయం మార్చుకుంటామని, బోల్షివిక్‌నాయకులు వాగ్దానం చేశారు. సెంట్రల్‌కమిటీసభలో ఈ విషయంచర్చించేవరకు మెన్షివిక్, బండ్‌పార్టీ సభ్యులకుతెలీదు. ఎస్టేటువ్యవహారం పూర్తిగా నిర్ణయం జరిగేవరకు దీన్నిగూర్చి ప్రస్తావించకుండా వుండకపోతే ప్రమాదకరమని బోల్షివికులు చెప్పారు. ఒక సంవత్సరంతరువాత దీనితాలూకు చాలా సొమ్మును ఇదివరకే విక్టర్ బోల్షివిక్‌సెంటరుకిచ్చాడని తెలిసింది.

1905వ సం॥లో జరిగిన బోల్షివిక్ తిరుగుబాటు సమయంలో, బోల్షివిక్‌లు ష్మిటోఫాక్టరీలోనే స్థావరంచేసుకున్నారు. అప్పుడే ఫిరంగులతో ఆభవనాన్ని నాశనంచేసి, ష్మిట్‌నుబంధించి ఖైదుచేశారు. ఒక సంవత్సరంతర్వాత జైలులో అతడే ఉరితీసుకున్నాడు. అతని మరణానికి ముందు తనఎస్టేటులోని చాలాభాగమును సోషల్‌డిమొక్రటిక్ పార్టీకి వ్రాశాడు. అతని అక్కచెల్లెళ్లు ఆసొమ్ము వారికిదక్కకుండా ఆలస్యం చేశారు. ఈ సంగతి స్విట్జర్లాండులోవున్న లెనిన్ తెలిసికొని ఆంద్రికాసిన్ అనే అతన్ని మాస్కో పంపించాడు. అతడు అక్కచెల్లెండ్రలో ఒకతైన కాథరైన్‌ను వివాహమాడి, బోల్షివికులు చంపుతామని భయపెట్టేవరకు అతడు వారికి సొమ్ముదక్కనియ్యలేదు. చివరికి వారినుంచి బోల్షివిక్ సెంటరు 100,000 రుబుల్సును వసూలుచేసింది.

తరువాత మరొక చెల్లెలువాటాను గురించి లెనిన్ విక్టర్‌ను పంపించాడు. అతడు ఆమెను పెండ్లిచేసుకున్నాడు. కాని డబ్బుమాత్రం బోల్షివిక్‌పార్టీకిరాలేదు. బొగ్డనోవ్, లునాకార్‌స్కీలు విక్టరు జారుప్రభుత్వ గూఢచారియని నిందించారు. కాని లెనిన్ అతన్నిసమర్థించాడు. తరువాత విచారణచేసి అతన్ని పార్టీసంస్థలనుంచి బహిష్కరించారు. కాని తరువాత బోల్షివిక్ విప్లవానంతరం మళ్లీ విక్టర్ లెనిన్‌తోకలిసి, గొప్ప ఉద్యోగాలుచేశాడు. ఆతడు మరణించిన తరువాత రష్యాపత్రికలలో ఆ విషయం ఏమీవ్రాయలేదు. 1907వ సం॥లో స్టానిస్లావ్‌వాల్‌స్కీ అనే ప్రముఖ బోల్షివిక్‌నాయకుడు, విక్టరును లెనిన్ సమర్థించటంగూర్చి విమర్శించగా లెనిన్ ఇల్లాఅన్నాడు;-''ఇది అతిచిన్నవిషయం. కేంద్రసంఘం బలంగావుండాలంటే దానిలో మంచిరచయితలు, సమర్థులైన నిర్మాణదక్షులు, కొందరు తెలివైన దుర్మార్గులుకూడా వుండాలి. తెలివైన దుర్మార్గునిగా నేను కామ్రేడ్ విక్టర్‌ను సిఫారసుచేశాను.'' అతనితోకలిసి పనిచేసి సోవియట్ రష్యాచరిత్రలో ప్రసిద్ధికెక్కినవారిలో చాలామందిపైన అతని కిట్టి అభిప్రాయమేవుండేది.

విక్టర్‌ను సమర్ధించటంద్వారా మధ్యతరగతులవారి నభిమానించుట, దొంగనోట్ల వ్యాపారం, కాకేషియన్ యుద్ధదళాలచర్యలు మొదలైనవన్నీ బట్టబయలైనాయి. బోల్షివిక్ సెంటరులోవున్న ప్రముఖులంతా లెనిన్‌ను తీవ్రంగా విమర్శించారు. తన పార్టీవర్గంవారి మెజారిటీ భావాలను నిర్లక్ష్యంచేయుట, పార్టీసొమ్మును, పార్టీపత్రికను అన్యాయంగా స్వాధీనం చేసుకొనుట, ఇతర స్వతంత్రాభిప్రాయాలను అణచివేయుట మొదలైన పనులకు లెనిన్‌ను మేక్సింగోర్కీ మొదలైనవారంతా నిందించారు. క్రమంగా 1908వ సం॥ నాటికి లెనిన్ పక్షంలో నిలబడ్డవారు ఇద్దరే: గ్రిగరీజినోవీవ్, లియోకామెనోవ్‌లు. వీరిద్దరినీ స్టాలిన్ 1936లో ఉరితీయించాడు.

రష్యాలోకూడా పూర్వపు అధికారవిప్లవకారులు, విద్యార్థులు మొదలైనవారికి నమ్మకం, ఉత్సాహం, తగ్గిపోయింది, స్టైలోపిన్ ప్రధానమంత్రిత్వంలో విప్లవోద్యమం అణచివేయబడింది. ఇతని కఠినపద్ధతుల

ద్వారా విప్లవకార్యకలాపమంతా అణచివేయబడింది. బుద్ధిమంతులు, కార్మికులుకూడా విప్లవవర్గాలను బహిష్కరించారు. లెనిన్ జెనీవాకు తిరిగి వచ్చి బోల్షివిక్ గ్రంథాలను, 'ప్రోలిటరీ' పత్రికను ప్రచురించటంతో కాలక్షేపంచేశాడు. కాని అతనికది తృప్తికరంగాలేదు.

ఒకనాడు జనీవా వీధిలోనడుస్తూ అతనిభార్యతో "ఇక్కడ అడుగంటిపోటానికే నేనిక్కడకు వచ్చాననుకుంటాను." అన్నాడు లెనిన్. స్విట్జర్లాండులో లెనిన్ మళ్ళీ ఎలిజబెత్‌ను కలుసుకున్నాడు. అతడు చదరంగంబల్లను తీసుకువచ్చి ఆమెకు ఆటనేర్పాడు. కాని ఆమెకు బాగా రాలేదు. ఆసమయంలో అతడు ఆమెతో ఇల్లాఅన్నాడు. "మార్క్సును అర్థంచేసుకొనుట, చదరంగం ఆడుట, రైల్వే టైముటేబులు చదువుట—ఈ మూడుపనులుచేయగలస్త్రీని ఇంకా నేను చూడలేదు."

1909వ సం॥ లెనిన్ పారిస్‌కువెళ్లాడు. అతని ఏకాకిజీవితంలోని బహుకష్టసమయం ఇక్కడేగడిచింది. సిటీబయట లెనిన్‌దంపతులు నాలుగుగదులఇల్లు అద్దెకుతీసుకున్నారు. గదులన్నీ పెద్దవిగా, వెలుతురుగావున్నాయి. ఒకటి కృప్సకయా తల్లికి, ఒకటి లెనిన్ చెల్లెలు మేరియాకు, ఒకటి లెనిన్‌దంపతులకు, నాలుగవది అతిథులకు వినియోగించారు. గ్రంథాలయం చాలాదూరంగావుండటంచేత అతడు ప్రతిదినం సైకిలుమీద చాలదూరం ప్రయాణంచేయవలసివుండేది. అక్కడగ్రంథం తీసుకోటానిక్కూడా చాలాకఠినవద్ధతులుండేవి. అందుచేత లెనిన్ దానినెప్పుడు తిట్టుకుంటూండేవాడు. 1910వ సం॥ లో లెనిన్ రూమెరీరోస్‌కు బసమార్చాడు. అక్కడ రెండు గదులుండేవి. కిటికీలలోనుంచి ఉద్యానవనం కనిపిస్తుంది. ఇక్కడ లెనిన్ కఠినపద్ధతులవలంభించాడు. అతడు ఉదయం 8 గంటలకులేచి, గ్రంథాలయానికివెళ్ళి రెండుగంటలకి వచ్చేవాడు. అప్పుడతడు ఇంటివద్దనే పనిచేసేవాడు. అతని క్షామేదులధికంగా వచ్చి బాధించకుండా క్రుప్సకయచూసేది.

లెనిన్ తనప్రత్యర్థులతో రాజీచేసికుని పనిచేయటానికి ఇష్టపడలేదు. 1910 సం॥ లో కోపెన్‌హాగన్‌లోజరిగిన అంతర్జాతీయసోషలిస్టు కాంగ్రెసులో

ఇరుపక్షాలవిరోధకారణాలు విశదంచేసినప్పుడు, లెనిన్‌పైన అందరికి కోపం హెచ్చింది. "పార్టీకి వ్యతిరేకి అతడొక్కడే. అతడు పార్టీని నాశనం చేస్తున్నాడు. అతడు మాయమైతే, ఎగిరిపోతే, చస్తే ఎంతబాగుండేది." అనుకున్నారు. సభకువచ్చినసభ్యులంతా ఒక్కమనిషివల్ల పార్టీ ఎల్లా పాడయిపోతుందని జిజనోవస్కయాసతి అడిగినప్పుడు లెనిన్ ప్రత్యర్థి ఒకడిల్లా అన్నాడు: "ఎందుకనగా ఎల్లప్పుడు, రోజుకి 24 గంటలుకూడా విప్లవంగురించే ఆలోచిస్తూ, కలలుగంటూండేమనిషి ఇంకెవ్వరూలేడు."

క్రమంగా రష్యాలో విప్లవోద్యమం తగ్గిపోతూనేవుంది. పోలీసులు గూఢచారులు మిగిలినదానిని అణచివేశారు. 1910వ సం॥లో విప్లవోద్యమం హెచ్చుతగ్గులుగావున్నప్పటికీ, 1905 సం॥ నుంచి రష్యా ఎక్కువ అభివృద్ధిపొందినదనేచెప్పవచ్చు. స్టైలోపిన్ నిర్ణయించిన సరిహద్దుల లోనే పత్రికాస్వాతంత్ర్యం వృద్ధిచెందింది; అప్పుడప్పుడు సోషలిస్టు గ్రంథాలు ప్రకటింపబడ్డాయి. సెన్సారు ఒక పేపరును నిషేధిస్తే అది మర్నాడే మరొకపేరుతో ప్రచురింపబడేది. కార్మికులు ట్రేడ్‌యూనియను లను ఏర్పాటుచేసుకోటం ఆరంభించారు. ఈ సంస్థలన్నీ రాజకీయాలకు దూరంగావున్నంతవరకు ప్రభుత్వం వాటిజోలికిపోలేదు. ట్రేడ్‌యూని యను విధానపు శక్తినిగ్రహించిన మెన్షివిక్కులు, ఆ విధానంలో ఎక్కువ పాటుపడుతుండేవారు. కాని ఈ నూతనవిధానంవల్ల సోషల్‌డిమొక్రటిక్ పార్టీకి ఎక్కువనష్టంవుందని లెనిన్‌గ్రహించాడు. కార్మికులు రహస్య సంస్థలనుంచి వెళ్ళిపోతున్నారనీ, అధికారవిప్లవకారుల అధికారమును వారంగీకరిచటంలేదనీ అతడు గ్రహించాడు. సోషల్‌డిమొక్రటిక్ పార్టీని ధ్వంసంచేయటానికే మెన్షివిక్కులు ఈ విధానం అవలంభిస్తున్నారని, లెనిన్ వారిని నిందించాడు.

ట్రేడ్‌యూనియను సంస్థలప్రాబల్యం హెచ్చుతున్నకొలదీ, లెనిన్ ముఖ్యసంస్థలను లోబరచుకోటానికీ, వాటిని పార్టీకి లోబడివుండునట్లుగా చేయటానికి ప్రచారంప్రారంభించాడు. సెంట్‌పీటర్సుబర్గులోని లోహపు పనివారిసంఘం చాలాబలమైనకార్మికసంస్థలలో ఒకటి. 1906వ సం॥లో

రోమన్‌మాలినోవిస్కీ అనేకార్మికుడు దానికి జనరల్‌శక్రటరీగా ఎన్నుకో బడ్డాడు. అతనిశక్తిసామర్థ్యాలననుసరించి కార్మికులంతా అతనిపక్షంచేరారు 1909వ సం॥ అతన్నిబంధించి సెంట్‌పీటర్సుబర్గునుంచి బహిష్కరిం చారు. అతడు మాస్కోకుపోయి అచ్చటి మెన్షివిక్ సంస్థలోచేరాడు. కాని 1910 సం॥ ఏప్రిల్‌నెలలో అతన్ని అతని అనుచరులను బంధించారు. కాని తరువాత అతన్నిమాత్రం విడిచిపెట్టారు. దీనివల్ల చాలా అనుమా నాలు బయలుదేరాయి. తరువాత కొంతకాలానికి మాలినోవిస్కీ బోల్షివిక్ పార్టీలోచేరాడు.

ఆతరువాత వెంటనే మాస్కోలోని బోల్షివిక్‌పార్టీలో కొందరిని బంధించారు. వారిలోముఖ్యులు నికోవెబుఖారిన్. అప్పుడు మాస్కోబోల్షివిక్ కమిటీలో సభ్యుడైన బుఖారిన్ మొదటినుంచీకూడా మెలినోవిస్కీని నమ్మలేదు. బుఖారిన్ ఏర్పాటుచేసిన సమావేశాలకు తప్పకుండా పోలీసులు హాజరుఅయ్యేవారు. అతని ఏర్పాట్లుగురించి మెలినోవిస్కీకి మాత్రమే తెలిసివుండేది. చివరికి బుఖారిన్‌కూడా బంధించబడినప్పుడు, తనను మాస్కో కమిటీనుంచి తొలగించాలని మెలినోవిస్కీయే ఈకుట్రలు పన్ను తున్నాడని బుఖారిన్ గ్రహించాడు. అతడు కలుసుకున్నకొందరు మెన్షి విక్‌పార్టీవారుకూడా అతన్నిగూర్చి ఆవిధంగా అనుకున్నారు. కాని వీనికి తగిన ఆధారాలుమాత్రం లేకపోయాయి. బుఖరిన్ మొదలైనవారు జైలులో నున్నందున మెలినోవిస్కీ పార్టీలో ఉన్నతస్థానం అలంకరించాడు.

విప్లవోద్యమం కొంతవరకు మందగించినప్పటికీ, లేబరుఉద్యమం వృద్ధిచెందింది. జారుప్రభుత్వం ఇంకా అధికారం వహించివున్నా, మాస్కో, సెంట్‌పీటర్సుబర్గు, ఇంకా అనేక ఇతరపట్టణాలలో లేబరుసమ్మెలు జరి గాయి. డ్యూమాలో సోషల్‌డిమొక్రట్‌సభ్యుల ప్రోత్సాహంతోనే ఇవి జరిగాయని చరిత్రకారులు వ్రాశారు. కార్మికరాజకీయార్థిక హక్కులకై పోరాటం ప్రారంభించటానికి డ్యూమాసభ్యుల ప్రోత్సాహమే కారణం.

ఏమైనా సోషల్‌డిమొక్రటిక్ పార్టీలోని వర్గపోరాటం సాగుతునే వుండి. 1910 సం॥లో సంయుక్త కేంద్రకమిటీ పారిస్‌లో సమావేశమైన

ప్పుడు, 1907 సం॥లో జరిగిన లండన్‌కాంగ్రెసు మెజారిటీనిబట్టి పార్టీ అధికారం తమదేనని బోల్షివికులు వాదించారు. కాని మెన్షివికులు మొదలైనవారు లెనిన్ అధికారమును అంగీకరించలేదు. లెనిన్, జీనోవీవ్, కామెనోవ్‌ల అధికారంలోఉన్న బోల్షివిక్‌సెంటరువద్దనున్న సొమ్మును రష్యా కార్యకలాపాలకు అధికంగా వినియోగించారు. లెనిన్ 'జ్వెజ్డా' అనే వారపత్రికను సెంట్‌పీటర్సుబర్గులో ప్రారంభించాడు. డ్యూమాలోని సోషల్‌డిమొక్రటిక్ ప్రతినిధుల సహాయంతో ఈపత్రిక ప్రథమసంచిక 1910 సం॥ ఆఖరిదశలో వెలువడింది. 1911 సం॥లో ఈపత్రిక ఆగిపోయింది. అది తరువాత మళ్ళీ ప్రారంభించినప్పుడు సంపాదకవర్గంలో ప్లెఖనోవ్‌మొదలైన బోల్షివికులు కానివారు లేరు. జ్వెజ్డాపత్రిక కేవలం లెనిన్ సొంతపత్రికగా మారింది. దానిలో రచయితలు జినోవీవ్, కామెనోవ్, క్రుప్సకయాలుమాత్రమే.

ఇప్పటికి లెనిన్‌కు 40 సంవత్సరాలు వచ్చాయి. అతని అధికార ప్రాబల్యం అప్పుడే ప్రారంభంఅయినా దానిఅభివృద్ధికి అతడు శ్రమపడిన సంవత్సరాలు చాలాస్వల్పంగా జ్ఞాపకంఉన్నాయి. అతనికి శ్రమ అధికంగా వుండేది. లెనిన్ చాలానీరసించాడు. లెనిన్ నిద్రలేకపోటం తలనొప్పి, జబ్బుతో ఎక్కువ బాధపడుతున్నా, చాలాశక్తితో పనిచేస్తూనేవుండేవాడు.

తన ఏకైకాధికారమును గుర్తించనికాంగ్రెసుమెజారిటీ సంపాదించాలనే ఆశతో తిరిగి పార్టీయంత్రాంగమును కైవశంచేసుకోటానికి 1911వ సం॥ ఆఖరుప్రాంతంలో లెనిన్ నూతనపథకాలు వేస్తున్నాడు. అతని వర్గంలోనే కొందరు బోల్షివిక్‌లు, మెన్షివిక్కులు కలసిపోవాలని వాదించి పారిస్‌లో రాయబారాలు సాగించారు. కాని లెనిన్ వీటిలో పాల్గొనలేదు. లెనిన్ తన అనుచరులను రష్యాకుపంపించి, జనరల్‌పార్టీసభలో బలం సంపాదించటానికి ఏర్పాట్లుచేశాడు.

1912 సం॥లో జనవరిమాసంలో బోల్షివిక్ సమావేశం ప్రేగ్‌లో ఏర్పాటయింది. లెనిన్ ఆవూరువెళ్ళినతరువాత ఇద్దరుబోల్షివిక్ ప్రతినిధులు ప్రేగ్‌వెడుతూ పారిస్‌వచ్చారు. వారిలో ఒకడు బ్రెణడిణస్కీ-

రష్యాలో న్యాయవిరుద్ధమైన కరపత్రాలు పంచిపెట్టడం ఇతనిపని. అతన్ని బంధించి పదిరోజులు ఖైదులోవుంచినతరువాత విడిచిపెట్టారు.

మాస్కోలో బోల్షివిక్‌గ్రంథాలు పంచిపెట్టటంలేదని క్రుప్స్కయాకు వార్తవచ్చింది. ఈవిషయం ఆమె బ్రెన్‌డిన్‌స్కీని అడిగితే అతడు వాటి నన్నింటినీ కార్మికులకు పంచిపెట్టారని చెప్పాడు. ఇంకా పరీక్షించగా అతడు అబద్ధాలుచెప్పినాడనీ, ఇతరదేశాలనుంచివచ్చిన సాహిత్యమంతా ఓఖ్రానావారికి పోతుందేవని నిర్ణయమైంది. ప్రేగ్‌సమావేశంలో వోటు చేసిన పదముగ్గురు ప్రతినిధులలోను ఇద్దరు ఓఖ్రానా ఏజంట్లని దిగ్రేట్ సోవియట్ ఎన్‌సైక్లోపీడియాలో వ్రాయబడివుంది. లెనిన్, జినోవీవ్ మొదలైనవారితో సెంట్రల్‌కమిటీని ఏర్పాటు చేశారు.

రష్యాబోల్షివిక్‌సెంటరుబ్యూరోకి ప్రధానిగా మెలినోవిస్కీని నియమించారు. అతనికిష్టులైనవారినిపార్టీసభ్యులుగాచేర్చుకునే అధికారం అతనికిచ్చారు. లెనిన్ సలహాప్రకారం, 1912 సం॥లో ప్రవాసశిక్షనుంచి పారిపోయివచ్చిన స్టాలిన్, మెలినోవిస్కీని నియమించాడు. రెండువర్గాల వారి భేదాలను ప్రేగ్‌సమావేశం ఖాయంచేసింది. అప్పట్నుంచీ బోల్షివికులపార్టీ, మెన్షివికులకు దూరంగానేవున్నారు.

స్టాలిన్, తాను ఖాళీగావున్నకొద్దికాలంలోనూ, రష్యాలోని బోల్షివిక్ స్థానాలను పునర్నిర్మించటంలో ప్రముఖపాత్రవహించాడు. ఇవనోవ్ అనే మారుపేరుతో సెంట్‌పీటర్సుబర్గు హొటల్లోవున్న స్టాలిన్, 1912 ఫిబ్రవరి 10వ తేదీని లెనిన్‌కు ఇల్లా వ్రాశాడు. "పనులన్నీ చక్కగానే జరుగుతున్నాయి అవి ఇంకా బాగాజరుగగలవని నా అభిప్రాయం. మన జనాభా యొక్క మానసికపరిస్థితి ప్రోత్సాహకరంగావుంది."

తరువాత రెండుమాసాలలోగానే ఒక రాజకీయ విషమపరిస్థితి రష్యా సామ్రాజ్యాన్ని ఉఱ్ఱూతలూగించింది. సైబీరియాలోని లెనాబంగారు గని పనివారి సమ్మెతోప్రారంభించింది. వారి నాయకులను ఖైదుచేసినట్లు తెలియగానే పనివారంతా గుమిగూడివారిని విడిచిపెట్టాలని పట్టుపట్టారు. హెచ్చరికలేంకుండానే సైనికులు తుపాకులుపేల్చారు; వందలాదిమరణిం

చారు. ఇది 1912 ఏప్రిల్ 4వ తేదీని జరిగింది. ఒకవారంతర్వాత ఈ వార్తలు ఐరోపాలోని రష్యా చేరగానే మారుమ్రోగిపోయాయి. కొద్దిరోజుల లోనే అన్నిపారిశ్రామిక కేంద్రాలలోను సమ్మెప్రారంభించారు. 215,000 మంది కార్మికులు నిరసనతోవెళ్ళిపోయారు. 1905 సం॥ తర్వాతఇదే ఇంత పెద్దఅలజడి. అతిత్వరితంగా చాలామందిని ఖైదుచేయటంజరిగింది. సెంట్ పీటర్సుబర్గులోనున్న, లెనిన్‌పత్రికా కార్యాలయంలోపనిచేస్తున్న స్టాలిన్‌ను ఖైదుచేసి తిరిగి సైబీరియాకుపంపించారు.

సెంట్‌పీటర్సుబర్గునుంచిప్రావ్దాఅనేఒకదినపత్రికను నడిపించాలని ప్రేగ్‌సమావేశంలోనిర్ణయించి దానికి మాలినోవిస్కీని నియమించారు. మెన్షివికులు తమ ట్రేడ్‌యూనియన్‌బలంతో ఈ దినపత్రికను, తమ వార పత్రికను పోషించలేనిస్థితిలోపడ్డారు. ప్రావ్దామొదటిసంచిక 1912 మే నెలలో వెలువడింది. ఈ క్రొత్తవిప్లవపద్ధతులలో పనిచేసే, ఏకైకలేబరు పత్రిక ప్రావ్దా గొప్పపలుకుబడిసంపాదించింది. కొంతకాలం సోషలిస్టు వర్గాలలో ఏవిధమైన వాదోపవాదాలులేకుండా పత్రికనడిపించింది. ప్రావ్దా పత్రికపలుకుబడి హెచ్చి, కొంతబలం చేకూర్చుకున్నతరువాతనే లెనిన్ తద్వారా తన సోషలిస్టుప్రత్యర్థులను తీక్షణంగా ఎదుర్కొన్నాడు. 1912 జులై నెలలో లెనిన్, జినోవీవ్ కామెనేవ్‌లు పారిస్‌నుంచి, క్రాకోకువెళ్ళారు. అక్కడసరిహద్దుప్రాంతంలో ఉన్నట్లయితే ప్రావ్దాపత్రికను ప్రచురిస్తూ, బోల్షివిక్‌వర్గాన్నికూడా నడిపించాలని వారి అభిప్రాయం. లెనిన్ అక్కడ ఉండటానికికావలసిన ఏర్పాట్లన్నీ ఆస్ట్రియాప్రభుత్వసహాయంతోజరిగాయి. ప్రావ్దాకు అధికారరీత్యాప్రచురణకర్త మెలినోవిస్కీ, సంపాదకుడు చెర్న మెజోవ్‌లయినా, పత్రికసంపాదకీయాలు, ప్రధాన వ్యాసాలుమాత్రంలెనిన్ స్వయంగావ్రాశాడు.

ఈ సమయంలోనే బుఖారిన్ ప్రవాసశిక్షనుంచి పారివచ్చి, రష్యా సరిహద్దుదాటి గాలిషియాలో లెనిన్‌ను కలుసుకున్నాడు. అతడు రాగానే మాలినోవిస్కీనిగురించి అతడు లెనిన్‌కు హెచ్చరికచేశాడు. కాని లెనిన్ జినోవీవ్‌లు మెలినోవిస్కీనిగురించి గట్టిగాసమర్థించారు. బుఖారిన్‌కు

నమ్మకంకలగలేదు. కాని ఈలోగారష్యాలోని బోల్షివిక్‌సంస్థకు మెలినోవిస్కీ నాయకుడయ్యాడు. నిజానికి రష్యాలో అతడు లెనిన్‌కు ప్రతినిధిగావున్నాడు. డ్యూమాసభలో అతడు బోల్షివిక్‌పార్టీనాయకుడుగా, సోషల్‌డిమొక్రటిక్ ప్రతినిధివర్గ ఉపాధ్యక్షుడుగా పాల్గొన్నాడు. జరిగినమూడు డ్యూమా సభలలోనూ సోషల్‌డిమొక్రటిక్‌వర్గంవారు ఒక్కశాఖగా ఓటుచేసి, రష్యా ప్రజలలో ఎక్కువవలుకుబడిసంపాదించారు.

1912 సం॥ లో క్రాకోలోజరిగినపార్టీ కౌన్సిల్‌సమావేశంలో,బోల్షివిక్ ప్రతినిధులంతా, వీధులలో విప్లవప్రదర్శనలు, సమ్మెలు, రహస్యపు ఫాక్టరీకమిటీలను ఏర్పాటుచేయటానికి నిశ్చయించారు. ఈ సమావేశంలో లెనిన్, కామెనేవ్, జినోవీవ్, క్రుప్స్కయా, బోల్షివిక్ డ్యూమాప్రతినిధులు, తిరిగి పారిపోయివచ్చిన స్టాలిన్ హాజరయ్యారు. తరువాత అమెరికాలో రష్యారాయబారిగావున్న ట్రాయ్‌నోవిస్కీకూడా ఒకప్రతినిధి. 1913 సం॥ ఫిబ్రవరిలో అప్పుడే కీవ్‌పట్టణానికివచ్చిన ట్రాయ్‌నోవిస్కీభార్యను ఖైదు చేశారు. ఆమెరాకసంగతి చాలా కొద్దిమందికేతెలుసు. ఆమె ఖైదుచేయ బడటానికి మెలినోవిస్కీయే చాలావరకు బాధ్యుడని బుఖారిన్, ట్రాయ్ నోవిస్కీతీక్షణంగావిచారించగా దీనికి మెలినోవిస్కీయే కారణమనితెలిసింది.

బుఖారిన్‌తో ఆలోచించినతరువాత ఇరువురు మెలినోవిస్కీని పార్టీ కోర్టులో విచారించాలని సెంట్రల్‌కమిటీకి వ్రాశారు. దీనికి సమాధానంగా లెనిన్‌వద్దనుంచి వారినిదూషిస్తూ ఒకఉత్తరంవచ్చింది. ఈ అపవాదును వ్యాపింపచేయవద్దనీ, దీన్నిగురించి ఇంకాపట్టుపడితే, వారిని పార్టీనుంచి బహిష్కరిస్తాననీ బెదిరించాడు. బుఖారిన్ అంగీకరించాడు. కాని ట్రాయ్‌నోవిస్కీ లెనిన్‌తోవిడిపోయి 1921లో బోల్షివిక్‌పార్టీలోచేరాడు. కాని మెలినోవిస్కీనిగురించి సేకరించిన క్రొత్తసాక్ష్యం పెరుగుతూనేవుంది.

స్వెర్డ్‌లోవ్‌ను ఖైదుచేసిన కొద్దిరోజులకి ప్రావ్దాపత్రికకు ధనంకోసమై ఒకవినోదం ఏర్పాటుచేశారు. ఇటువంటి వినోదకాలక్షేపాలు తరుచుగ జరుగుతునేవుండేవి. సెంట్‌పీటర్సుబర్గులో న్యాయవిరుద్ధంగావున్న స్టాలిన్, మెలినోవిస్కీలు ఈసభకు హాజరైనారు. స్టాలిన్ పారిపోవాలని

ప్రయత్నంచేస్తుండగనే పోలీసులు అతన్ని బంధించారు. వేషాలగదిలో అతన్ని దాచాలని ప్రయత్నంచేశారు. కాని పోలీసులు అతన్ని వెంబడించి, బంధించి మళ్ళీసైబీరియాకు పంపించారు. విప్లవంజరిగేవరకు అతడక్కడే వున్నాడు.

ఈఖైదులుజరిగిన తరువాత, బోల్షివిక్ ఉన్నతవర్గాలలో ఒకరహస్య ఏజంటువుండి పార్టీసభ్యులను పోలీసులకువశం చేస్తున్నట్లు వార్తలు హెచ్చిపోయాయి. కాని అతనిపేరుమాత్రం ఎవ్వరూచెప్పటంలేదు. 1913 సం॥ ఆగస్టునెలలో జకోపేన్‌గ్రామంవద్ద బోల్షవిక్‌నాయకులంతా సమావేశం అయ్యారు. లెనిన్, జినోవీవ్ మొదలైనవారంతా హాజరైనారు. దీనిలో ఐదుగురు ఓక్రోమాఏజంట్లనితెలిసింది. డ్యూమాలోని సోషల్‌డిమొక్రటిక్ ప్రతినిధులందరినీ రెండుచీలికలుగాచేసి, వేరొకబోల్షివిక్‌వర్గాన్ని స్థాపించే బాధ్యత మెలినోవిస్కీకి అప్పగించుతూ ఒకతీర్మానంచేయించాడు.

రెండువారాలతర్వాత ఆరుగురు బోల్షివిక్‌ప్రతినిధులు, ఏడుగురు మెన్షివిక్‌ప్రతినిధులకు లెనిన్ కార్యక్రమాన్ని అంగీకరించాలని ఒక బెదిరింపు వార్తపంపించారు. మెన్షివిక్‌లు నిరాకరించగానే లెనిన్‌అనుచరులు స్వంతంగానే ఒకఅధికారముతావర్గాన్ని స్థాపించి దానికి మెలినోవిస్కీని అధ్యక్షుడుగాచేశారు.

వెంటనే కీడ్జెమొదలైన మెన్షివికులకు అవమానకరంగా ప్రావ్దా ప్రచారం ప్రారంభించింది. సంపాదకీయాలన్నీ లెనిన్, జినోవీవ్‌లు మాత్రమే వ్రాశారు కాని అంతరంగికవిధానమును మాత్రం మెలినోవిస్కీయేనిర్ణయిస్తూ మెన్షివిక్‌డ్యూమా ప్రతినిధులను, ట్రేడ్‌యూనియన్ నాయకులను ఎదిరించాడు. డ్యూమాసభలలోకూడా అతడు లిబరల్, రాడికల్ వర్గాలనునిరసిస్తూ కఠినంగా ఉపన్యాసాలుసాగించాడు. చాలా వరకు పెద్దయూనియన్లలో బోల్షివికులుప్రాబల్యం సంపాదించారు. అప్పటికే మెన్షివిక్‌నాయకులనందరినీ ప్రభుత్వం ఖైదుచేయటం ఆరంభించారు. ఈచర్య అప్పటికి మామూలువిధానంగానే పరిగణింపబడింది. కాని తరువాత ఇదంతా మెలినోవిస్కీకుట్రయని తెలిసిపోయింది.

మెలినోవిస్కీయొక్క సాహసోపేతమైన ఉపన్యాసాలద్వారా అతడు కార్మికులలో పలుకుబడిసంపాదించాడు. అప్పుడప్పుడు సలహాలకై క్రాకో వెళ్ళివస్తూ ఇతడు రష్యాలో లెనిన్‌యొక్క అవతారంగా ఆరాధింపబడ్డాడు.

1914 సం॥ ఏప్రిల్‌మాసంలో జారుప్రభుత్వం డ్యుమాసభ్యుల రాజ్యాంగ నిర్లక్ష్యతనుగూర్చి విమర్శించింది. జారుప్రభువు ప్రధాన మంత్రిగానున్న కోకోవ్‌ట్సేవ్‌నుతొలగించి పురాతన అభివృద్ధినిరోధకుడైన గోర్‌మైకిన్‌ను అస్థానంలో నియమించాడు. ఇతడు డ్యుమాలో మాట్లాడి నప్పుడు వామపక్షీయులంతా అల్లరిచేసి "డ్యుమాసభ్యుల వాక్స్వా తంత్ర్యము" అని అరచారు: గోర్‌మైకిన్ ముందుకువెళ్ళలేకపోయాడు. స్పీకరుఅదుపుచేయలేక ప్రధానికిక్షమార్పణచెప్పకుని సోషల్‌డిమొక్రాట్లు, ట్రుడోవిక్‌వర్గీయులు 15 సమావేశాలవరకు హాజరుకారాదని తీర్మానం చేయించాడు. తరువాత వీరంతా 1914 మే 7వ తేదీని వచ్చినప్పుడు కెరెన్‌స్కీప్రభుత్వాన్నినిరసిస్తూ ఒకప్రకటనచేశాడు. స్పీకరు అతన్ని చాలాసార్లు అపుచేయప్రయత్నించాడు. కాని చివరికి అతనిచర్యను అక్రమమని రూలింగునిచ్చాడు. మెలినోవిస్కీకూడా అదేవిధమైన ఉపన్యాసంచేయగా, స్పీకరుసార్జెంటును పిలిచినప్పుడుగాని అతడు ఉపన్యాసం అపలేదు. వామపక్షపుసభ్యులంతా రాజీనామానివ్వాలని మెలినోవిస్కీకోరాడు. కాని ఎవ్వరూ అంగీకరించనందువల్ల అతడే స్పీకరు గదిలోనికిపోయి అతనికొక ఉత్తరంఇచ్చాడు. దానిలో "రాడ్జియాంకో! శలవు తీసుకుంటున్నాను." అని వ్రాసివుంది.

మెలినోవిస్కీ ఇంటికివెళ్ళిపోయాడు. డ్యుమాసభ ఆరంభమైనప్పుడు మెలినోవిస్కీరాజీనామాచేశాడని స్పీకరుతెలియచేశాడు. అంతా ఆశ్చర్య పడ్డారు. అలజడిబయలుదేరింది. బడైవ్ అనే ఏకైకబోల్షివిక్ సభ్యుడు ఈ సంగతి వెంటనే ప్రావ్దాఆఫీసుకుతెలియచేశాడు. అక్కడున్న సంపాదక వర్గమంతా చకితులయ్యారు.

ఈ చర్యనుగూర్చి బోల్షివిక్ ప్రతినిధివర్గాని కెంతమాత్రం తెలియ చెయ్యలేదనీ, క్రమశిక్షణకు విరుద్ధంగాచేసిన ఈ చర్యకు మెలినోవిస్కీ

బోల్షివిక్ సభ్యులకు తగినసంజాయిషీ ఇవ్వాలని చెప్పటానికి పెట్రోవిస్కీని పంపించారు. మెలినోవిస్కీ సగంసగం దుస్తులువేసుకుని, పచారు చేస్తుండగా అతడుచూశాడు.

పెట్రోవిస్కీ ఇల్లాఅన్నాడు: ''పార్టీ అనుమతిలేకుండా రాజద్రోహానికి దగ్గిరగాఉండేపనిని నీవుచేశావు. నీవు వెంటనే ప్రతినిధులకార్యాలయానికి వచ్చి సంజాయిషీచెప్పుకోవాలని నీకు చెప్పటానికై నన్ను పార్టీ వారు పంపించారు.''

''సంజాయిషీలివ్వటానికి తగినపరిస్థితిలోనేనిప్పుడులేను.'' అని మెలినోవిస్కీ మొరటుగాసమాధానంచెప్పాడు.

''పార్టీనిర్ణయానికి కట్టుబడివుండటానికి నిరాకరిస్తున్నట్లేనా దాని అర్థం?''

''నీ ఇష్టంవచ్చినట్లు అర్థంచేసుకో. నేనిప్పుడు సంజాషీ నిచ్చే స్థితిలోలేను.'' అని మెలినోవిస్కీ అరిచాడు.

ఈసమాచారం పెట్రోవిస్కీ పార్టీకి తెలియచేయగా, అతడు వెంటనే రాకపోతే చాలా కఠినచర్యతీసుకుంటారని మళ్ళీ మెలినోవిస్కీకి వార్త పంపించారు. పార్టీ విచారణకు భయపడి అతడు పిచ్చెత్తినట్లు ఇలా అరుస్తూ ఇటుఅటూ గదిలోపచార్లుచేశాడు. ''నన్నువిచారించండి. నేరాలు మోపండి. మీ కిష్టమైనదిచెయ్యండి. నేనేమీసంజాయిషీలివ్వను. వింటున్నారా? సంజాషీలులేవు.''

మెలినోవిస్కీచర్య బోల్షివిక్ పార్టీనియమాలకు విరుద్ధమేకాక, శత్రువులకు మందుగుండుసామగ్రికూడా సప్లయిచేసిందని బడైవ్ ప్రకటించాడు. బోల్షివిక్‌వర్గంలో చీలికవచ్చిందని పుకార్లుబయదేరి ఇదంతా గొప్పఅలజడికలిగించింది.

మెలినోవిస్కీని ప్రత్యక్షంగా ఎదుర్కొలేని పిరికిపందలనీ, పుకారు రాయుళ్ళనీ, ఈవిధంగా బోల్షివిక్‌పార్టీని వెన్నుపోటు పొడవటానికై యత్నిస్తున్నారనీ నిందిస్తూలెనిన్, జినోవీవ్‌లు 'ప్రావ్దా'పత్రికలోప్రకటించారు.

వీరిప్రకటనకు వ్యతిరేకంగా, సెంట్‌పీటర్సుబర్గులోనున్న మార్టోవ్, డాను అనే ప్రముఖమెన్షివిక్ పార్టీవారు ప్రకటించారు. పోలీసు ఏజంటును బయటపెట్టటం నేరం కనుక వీరిద్దరినీ ఖైదుచేశారు.

బోల్షివిక్‌పార్టీకి వ్యతిరేకపు వర్గాలవారికి లెనిన్‌పైగల అభిప్రాయాలనుగూర్చి రష్యాగ్రైంచి సోషలిస్టు, తరువాత ప్రముఖకమ్యూనిస్టు అయిన ఛార్లెస్‌రప్పాపోర్టు అనేఅతడు తెలియచేశాడు. విప్లవోద్యమంలో లెనిన్‌స్థితిని, ఇతడు జారుప్రభుత్వంలో స్టైయిలోఫిన్‌స్థితితో పోల్చాడు. 1914లో లెనిన్ నిరంకుశపరిపాలనక్రింద ఏపార్టీకూడా నిలబడలేదని ఇతడువ్రాశాడు: "లెనిన్‌విజయాలను మేము గుర్తించాము. అతడు ఇనుమువంటి మనోధైర్యముకలిగి, వర్గాలను తయారుచేయుటలో సాటిలేని ఘనుడు. అతన్ని ఎదిర్చినవారినతడు శాశ్వతంగా విరోధిగాభావిస్తాడు. సోషల్‌డిమొక్రటిక్‌పార్టీని నిలబెట్టటానికి మరణశిక్షయేశరణ్యం అంటాడతడు. ప్రత్యర్థులను సోషలిస్టువిధానాలలో ఎదిరించటంకంటె, రక్తపాతపువిధానాలనే అతడు అనుసరిస్తాడు. నేనేపార్టీకి చెందినవాణ్ణికాదు. కాని లెనిన్‌విజయం రష్యావిప్లవానికే ఉపద్రవంతెస్తుంది."

1914 సం॥ జులై 16, 17 తేదీలలో బ్రెస్సెల్సుపట్టణంలో అంతర్జాతీయ సోషలిస్టుమహాసభ జరిగింది. రష్యాలేబరు ఉద్యమంలోని సంక్షోభావమునుగూర్చిన విషయంకూడా ఎజెండామలోవుంది. సోషల్‌డిమొక్రటిక్‌పార్టీలోని చీలికలనుగూర్చి, లెనిన్‌యొక్క నిరంకుశపాత్రనుగూర్చి చాలాకాలంనుంచి అంతర్జాతీయ సోషలిస్టుబ్యూరో ఆలోచిస్తూంది. అయినా అది పార్టీకార్యకలాపంలో జోక్యంకలిగించుకోలేదు. ఏమైనా ఇంకా ఈ అక్రమాన్ని నిర్లక్ష్యంచేయటానికి వీలులేనంతగా పెరిగింది. సోషలిస్టుఇంటర్నేషనల్‌కు లొంగటం లెనిన్‌కు ఇష్టంలేదు. అతడుగాని, జినోవీవ్‌గాని, కామెనోవ్‌గాని బ్రస్సెల్సు సమావేశానికిరాలేదు. కాని వారి ప్రతినిధులు హాజరైనారు. పార్టీమొత్తానికి లెనిన్ కమిటీనే కేంద్రకమిటీగా ఆమోదించటమే పార్టీఐకమత్యానికి మార్గమని వీరు ఉపన్యాసాలుచేశారు. పార్టీలో లెనిన్‌ప్రాముఖ్యత తగ్గించకపోతే పార్టీలో ఐక్యమత్యమసంభవ

మని ప్లెఖనోవ్‌చెప్పాడు. విరోధి ఏజంట్లను బయటపెట్టకుండా లెనిన్ ఆటంకపరిచాడని అలెక్సెన్‌స్కీ నిందారోపణచేశాడు. ఇవన్నీవిని అంత ర్జాతీయబ్యూరోసభ్యులు ఆశ్చర్యపడ్డారు. ఇదంతా వియన్నాలోజరుగబోయే కాంగ్రెసుసభలో చర్చించాలని తీర్మానంచేశారు. కాని ఆసభజరుగనేలేదు.

లెనిన్‌కు పార్టీలోని పాతకాలపుపెద్దలలో పలుకుబడిలేకపోయినా, సెంట్‌పీటర్సుబర్గు, మాస్కోమొదలైన నగరాలలో కార్మికవర్గాలలో అతని పలుకుబడి చాలాహెచ్చింది. పశ్చిమ ఐరోపామార్క్సుసిద్ధాంతాలు, మెన్షివిక్ విధానాలనుగూర్చిన క్లిష్టమైన సూత్రవిషయాలకంటె, లెనిన్ చెప్పే సూక్ష్మమైననినాదములు, కార్మికులను ఎక్కువ ఆకర్షించాయి.

1914 సం॥ జూన్ నెలలో, క్రొత్తబోల్షివిక్ కాంగ్రెసు ఏర్పాటును గూర్చి చర్చించటానికి క్రాకోలోసమావేశమేర్పాటయింది. ఈ ప్రయత్నా లన్నిటికీ, యుద్ధంవలన అంతరాయం కలిగింది.

## యుద్ధము-విప్లవము

రష్యా జపానుయుద్ధం 1905 సం॥లోని వప్లవానికి సరియైన అదనుగా లెనిన్‌భావించాడు. క్రొత్తవిప్లవానికి నాందిగా మరొకయుద్ధం వస్తుందని అతడనుకున్నాడు. 1913లో మాక్సింగోర్కీకి అతడిల్లావ్రాశాడు: "పశ్చిమ ఐరోపాలో విప్లవానికి రష్యా, ఆస్ట్రియాలమధ్య యుద్ధం చాలా ఉపయుక్తంగావుంటుంది. కాని ఫ్రాంజ్‌జోసఫ్, నికలస్ మనకీఆనందము నిస్తారని నమ్మటానికివీల్లేదు."

ఒకసంవత్సరంతర్వాత వారాపనిచేశారు. రష్యాపై జర్మనీయుద్ధం ప్రకటించినవార్త తెలియగానే క్రాకోలోనున్న జినోవీవ్‌నుఅడిగిన లెనిన్ మొదటిప్రశ్న ఇది.

"రెండవ అంతర్జాతీయసంఘం ఇప్పుడేమిచేస్తుంది?"

"నీవేచూస్తావు జర్మనీలోని సోషల్‌డిమొక్రటిక్ పెద్దలు కైజరు ప్రభుత్వానికి వ్యతిరేకంగా వోటుచెయ్యలేరు. వారు బయటకుతప్పు కుంటారు." అని జీనోవీవ్ జోస్యంచెప్పాడు.

"కాదు వారంత పిరికివారుకాదు, నిస్సందేహంగా వారుయుద్ధానికి వ్యతిరేకించరు. వారి ఆత్మతృప్తికై వారు యుద్ధానికి వ్యతిరేకంగా వోటు చేస్తారు; ఈ కారణంతోనే కార్మికులు వారినెదిరిస్తారు." అన్నాడు లెనిన్.

బ్రసెల్సులో 1914 సం॥ జులైలోజరిగిన అంతర్జాతీయ సోషలిస్టు బ్యూరోసమావేశంలో రష్యా, ఆస్ట్రియాలను విరసించారు. జర్మనీపట్టణా లన్నింటిలోనూ బ్రహ్మాండమైన ప్రదర్శనలుజరిగాయి.

యుద్ధంప్రారంభంకాగానే ఆస్ట్రియాపోలీసుగూఢచారులు గాలీషియాలో వెతకటం అరంభించారు. ఆగస్టు 7వ తేదీని రాత్రి వర్షం కురు స్తుండగా లెనిన్ గనేట్‌స్కీవద్దకువెళ్లాడు. "ఇప్పడేనాయిల్లు సోదాచేశారు. స్థానికపోలీసుఅధికారి వాచ్‌మీస్టరు ఈసోదాచేశాడు. ఉదయాన్ని రైలు స్టేషనువద్ద అతన్ని కలుసుకోమనీ, అతనితో నోవిలూర్గుకు రావాలని చెప్పాడు. నీవేమంటావు? రేపువారక్కడ మనల్నిఖైదుచేస్తారా? లేక విడిచివేస్తారా?...." అని లెనిన్‌చెప్పాడు. లెనిన్ జారుప్రభుత్వానికి తిరుగులేనిశత్రువని క్రాకోపోలీసులకుతెలుసు. చాలాకాలంనుంచి అతన్ని వారు కనిపెట్టిచూస్తూ, అస్ట్రియావిషయాలలో అతనికి సంబంధంలేదని గ్రహించారు. అది క్రాకోలోని అభిప్రాయం. కాని నోవిలూర్గు కథవేరు. ఇక్కడ ఎంతపనైనా జరుగవచ్చు.

లెనిన్ క్రాకోలో ఉండటానికితగిన అనుమతిసంపాదించిన డాక్టరు మరేక్‌తో ఈవిషయం గనెట్‌స్కీచెప్పాడు. క్రాకోపోలీసు డైరెక్టరుకి లెనిన్ స్వయంగానే టెలిగ్రాంఇచ్చాడు. "స్థానికపోలీసులు నన్ను గూఢచారిగా అనుమానిస్తున్నారు. నేను గతరెండుసంవత్సరాలనుంచీ క్రాకోలో నివసిస్తు న్నాను. నన్ను అపార్థంచేసుకోకుండావుండునట్లు నోవిలూర్గులోని సరియైన అధికారులకు తంతినివ్వవలెననికోరుతున్నాను." మర్నాడు స్థానికపోలీసులకు క్రాకోకమిషనరునుంచి, లెనిన్‌ను ఖైదుచెయ్యవలసిన

కారణంలేదని టెలిగ్రాంవచ్చింది. ఈలోగా మొత్తంమీద లెనిన, జినోవీవ్లను ఖైదుచేశారు. ఆస్ట్రియాసోషల్‌డిమొక్రటిక్ నాయకుడు విక్టర్ అడ్లర్‌కు, గాలీషియా సోషల్‌డిమొక్రటిక్‌నాయకుడు ఇగ్నాట్‌డాష్టిన్‌స్కీకి గనెట్‌స్కీ టెలిగ్రాంలిచ్చాడు. ఆస్ట్రియాసోషలిస్టులు, జర్మనీలోని కామ్రేడులవలెనే, యుద్ధాన్ని సమర్థిస్తున్నారు. అడ్లర్ విదేశశాఖమంత్రి వద్దకుపోయి, మొత్తంమీద యుద్ధమునుసమర్థిస్తూ, మామూలుకంటె ప్రభుత్వంతో ఎక్కువ సన్నిహితంగావున్నారు. అడ్లరు విదేశాంగమంత్రివద్దకు లెనినగురించి కలుగచేసుకోటానికివెళ్లాడు. జారుప్రభుత్వంపై లెనినకుండే అభిప్రాయం దృష్ట్యా, అతన్ని స్వేచ్ఛగా విడిచిపెట్టటంవల్లనే ఆస్ట్రియా జర్మనీసమన్యకుపయుక్తంగావుంటుందని అతడు మంత్రికి నచ్చచెప్పాడు. అప్పుడు ఆస్ట్రియా అంతరంగికమంత్రి శాఖనుంచి ఇల్లా అర్దరువచ్చింది:-

"డాక్టరు అడ్లర్ అభిప్రాయంప్రకారం, ప్రస్తుతం ఉలియనోవ్ చాలా ఉపయోగిస్తాడు. ఉలియనోవ్‌మీద ఏమిలిటరీకోర్టుకు అధికారంవున్నదో కూడా వెంటనేతెలియచెయ్యాలని పోలీసుశాఖను కోరుతున్నాం."

1914 సం ఆగస్టు 19వ తేదీని ఖైదునుంచి విడిచిపెట్టి స్విట్జర్లాండు వెళ్లటానికి అనుజ్ఞనిచ్చారు.

లెనికు జూరిచ్, జనీవాలలో యుద్ధాన్నిగూర్చి సోషలిస్టుసభ్యులలో భేదాభిప్రాయాలు చెలరేగుతున్నాయి.మార్టినోవ్,మెన్షివిక్ నాయకుడుచాలా రోజులు ఉపన్యాసాలిచ్చాడు. తరువాత కారల్‌రడేక్, ట్రాట్‌స్కీ, లెనిన్, జినోవీవ్, మొదలైనవారుపన్యసించారు. అప్పటికింకా ట్రాట్‌స్కీలెనిన్‌కి సన్నిహితుడుకాలేదు. చాలావరకు సోషలిస్టుపార్టీలన్నీ ఏవోస్వలాభ కారణాలతోనే యుద్ధమును సమర్థిస్తున్నాయని ట్రాట్‌స్కీఅభిప్రాయం. అన్నిదేశాలధనవంతులలోను కొంతసామరస్యభావం ఉన్నప్పటికీ ప్రపంచార్థికవిధానం ఇంకాజాతీయమేగాని, అంతర్జాతీయంకాదు. ట్రాట్‌స్కీ ఉద్దేశ్యంప్రకారం, తమదేశం క్రొత్తదేశాలను, క్రొత్తమార్కెట్లను జయించినట్లయితే, తమజీవితవిధానం అభివృద్ధిపొందుతుందని కార్మికులు అభిప్రాయపడుతున్నారు. అందుచేతనే యుద్ధసమయంలో కార్మికులు వారినిదోచుకునేవారిపక్షం వహిస్తున్నారు.

లెనిన్ వచ్చినమరునాడే ఏర్పాటుచేసిన బోల్షివిక్‌సభలో, యుద్ధం గూర్చి అతడు తన అభిప్రాయంతెలియచేశాడు. ఈ తగాయిదాసామ్రాజ్య సంబంధమైనదనీ, రెండవ ఇంటర్నేషనల్‌నాయకులప్రవర్తన సామాన్య ప్రజలకు విద్రోహకరమైనదనీ, ఒకతీర్మానంచేశారు. బోల్షివిక్ డ్యూమా ప్రతినిధియైన సమోయ్‌రోవ్ దీనిని సెంట్‌పీటర్సుబర్గు కేంద్రకమిటీకి, బోల్షివిక్ డ్యూమావర్గానికి తీసుకువెళ్లునట్లు ఏర్పాటుచేశారు.

జూరిచ్‌లో జరిగిన ఒకసభలో, ట్రాట్‌స్కీ చెప్పినదంతా ధర్మ పన్నాలని తోసివేశారు. లెనిన్ కార్యక్రమం శాంతికాదు—అంతర్యుద్ధం. కందకాలలోనికివెళ్ళి, అక్కడ విప్లవవర్గాలను స్థాపించటమే సరియైన పద్ధతియని లెనిన్‌అభిప్రాయం. "మీ తుపాకులు తీసుకుని మీ ఉద్యోగుల మీదికి, ధనికులమీదికి వాటినిత్రిప్పండి" అన్నాడు లెనిన్. ముందు ధనిక వర్గాలనే కార్మికులపై తుపాకులు కాల్చునట్లుచెయ్యాలి. ఇప్పుడు ప్రపంచ వర్గాలే తుపాకులు పేల్చుతున్నారు. కనుక వారికి సరియైన సమాధానం చెప్పాలి. అతని పిడికిలిని బిగిస్తూ "పెద్దమనుష్యులారా! మీరు ముందు పేల్చారు." అని లెనిన్ తిరిగితిరిగిచెప్పాడు.

యుద్ధమును ప్లెఖనోవ్ బలపరుస్తున్నాడనేవార్త లెనిన్‌కు చాలా ఆగ్రహంకలిగించింది. అతడు ప్లెఖనోవ్‌ను ముఖాముఖీని చూడాలని ఆతృతపడ్డాడు. జర్మనీజయించినట్లయితే రష్యాలోని పరిశ్రమలునసించి, కార్మికులధోగతికి దారితీస్తుందని ప్లెఖనోవ్ అభిప్రాయం. భూఖామందు లంతా బలవంతులై జారుప్రభుత్వానికి బలముచేకూర్చి, తద్వారా రష్యా అభివృదికి ఆటంకంకలిగిస్తారు.

"మైసన్‌డుపిపిల్‌లో ప్లెఖనోవ్ ఉపన్యసిస్తాడని మాకు లాసేన్‌లో తెలిసి, వెంటనే బెర్నెలోనున్న లెనిన్‌కు తెలియచేశాం. అతడు వాయు వేగంతోవచ్చిచేరాడు.హాలంతా క్రిక్కిరిసిపోయింది. ప్లెఖనోవ్,లెనిన్‌ను చూసి 'బోనులోపడినట్లుగాతోస్తోంది' అన్నాడని బుఖారిన్‌చెప్పాడు. కూట రాజ్యాలసోషలిస్టుల దేశభక్తిని కొనియాడుతూ ప్లెఖనోవ్ బ్రహ్మాండంగా ఉపన్యసించాడు. అతడు జర్మనీసోషల్‌డిమొక్రట్లను విమర్శించినప్పుడు

అందరితోపాటు లెనిన్‌కూడా సంతోషించాడు. కాని జర్మనీసైన్యాలకు వ్యతిరేకంగాఉన్న ఫ్రాన్సు, బెల్జియం, ఇగ్లండుదేశాలలోని సోషలిస్టులు ఆయాదేశాలను ప్రోత్సహించాలని వాదించినప్పుడు లెనిన్‌కి కోపంవచ్చింది ప్లెఖనోవ్ ఉపన్యాసం పూర్తికాగానే లెనిన్ వేదికవద్దకుపోయాడు. నిప్పులు గ్రక్కేకళ్ళతో అతడు తనప్రత్యర్థులనుగూర్చి నిశితంగా మాట్లాడాడు. "ఇప్పుడుద్భవించినయుద్ధం ప్రమాదవశంగావచ్చినదికాదు. ఇదిస్పష్టంగా ధనికవర్గప్రోద్బలంతో ప్రారంభమైంది. స్టట్‌గార్డు, కోపెన్‌హాగన్, బాస్లేలో జరిగినకాంగ్రెసులలో యుద్ధమునుగూర్చి సోషలిస్టులవిధానమునిర్ణయింప బడింది. ఈయుద్ధం కార్మికులు, రాజులమధ్యపోరాటం క్రిందమారాలి." ఇలిచ్ పదినిముషాలుమాట్లాడాడు. దానికి ప్లెఖనోవ్ సమాధానంఇచ్చాడు. అతడు జయించినట్లు అంతా అనుకున్నారు." అని క్లుప్స్కయావ్రాసింది.

కారల్‌రడెక్ అనే అతడు స్విట్జర్లాండులో ప్రముఖుడైన ఇంటర్నే షనలిస్టు. జూరిచ్‌లో,ఇంపీరియలిజంనుగురించి అతడుచదివినఉపన్యాసం ఆకర్షణీయమైనది. రష్యాజర్మనీ సోషల్‌డిమొక్రాటయిన పర్వస్‌నుగూర్చి రడెక్ చెప్పవలసినది చాలావుంది. ధనం దుర్వినియోగం చేయటంవల్ల అతన్ని జర్మనీసోషల్‌డిమొక్రటిక్‌పార్టీవారు బహిష్కరించారు. పర్వస్ చాలాబుద్ధిమంతుడు. కాని దేనిలోనూ చాలాకాలం నిలకడగావుండలేడు. కాకేషియారంగంలో రష్యాకెదురుగా టర్కీసైన్యాలతోకలిసి యుద్ధంచేయ టానికి జార్జియాఖైదీలను రిక్రూటుచెయ్యాలని టర్కీ, జర్మనీలు ప్రయ త్నిస్తున్నాయి. పారిపోయిన జార్జియావారు చాలామందివున్న బల్గేరియాలో దానికి సంబంధించిన సంస్థఒకటివుంది. కాన్‌స్టాంటినోపిల్‌లో యుద్ధానికి ముందు చాలాకాలంనివసించిన పర్వసే ఈ పథకాన్ని తయారుచేసినవాడు.

ఇప్పుడు పర్వస్ జర్మనీదేశాభిమాని; జర్మనీ సైనికకంట్రాక్టరు కూడా. యుద్ధసమయంలో అతడు చాలాధనం గడించాడు. అతన్నిగూర్చి పనిచేసినవారిలో గనెట్‌స్కీ ఒకడు. రడెక్‌కు వీరిద్దరి ఆర్థికవ్యాపార విష యాలలో సంబంధంలేదు. వీరిసంబంధబాంధవ్యాలు లెనిన్‌యొక్క తరు వాత చర్యలలో ప్రముఖపాత్రను వహించాయి.

రష్యాకార్మికులు రష్యాఅపజయమునే ఆశించారని, డ్యూమాసభలో బోల్షివిక్ ప్రతినిధులు ప్రకటించునట్లు చెయ్యాలని లెనిన్ కామెనేవ్‌కు వార్తపంపించాడు. ఈ ప్రకటనకు కామెనేవ్ తగిన ఏర్పాట్లుచేశాడు. ఈ ఏర్పాట్లు జరిగేసభను పోలీసులు చుట్టుముట్టి అక్కడున్నవారందరినీ బంధించారు. డ్యూమాప్రతినిధులతోసహా అందరినీ రాజద్రోహులుగా నిర్ణయించి సైబీరియాకుపంపించారు.

రష్యాఅపజయంవల్ల విప్లవం త్వరగా రాగలదని నమ్మిన లెనిన్ అనుచరులంతా అతని నభిమానించారు. మెన్షివిక్కులు రెండు భాగాలుగా చీలిపోయారు. రష్యామెజారిటీకి నాయకులైన పాత్రెసోవ్, స్విట్జర్లాండు నాయకుడైన ప్లెఖనోవ్‌లు యుద్ధాన్నే బలపరిచారు. మైనారిటీ నాయకులైన మార్టోవ్, ఆక్సెలార్డులు ఇంటర్నేషనలిస్టులను బలపరిచి, జర్మనీ, ఇటలీ, ఫ్రాన్సుదేశాల వామపక్షీయుల వైఖరిననుసరించారు. సోషలిస్టు విప్లవ వర్గాలు అదేపద్ధతులలో చీలిపోయాయి. విక్టర్‌చెర్నోవ్‌నాయకత్వంలో నున్నవర్గం ఇంటర్నేషనలిస్టులను, నికొలై ఆక్సెంటీవ్‌నాయకత్వంలోని వర్గం మిత్రరాజ్యకూటాన్ని బలపరిచాయి.

చాలాకష్టంమీదట లెనిన్, సెంట్‌పీటర్సుబర్గులోని బోల్షివిక్‌సెంట్రల్ కమిటీబ్యూరోద్వారా, సైబీరియాలోని స్టాలిన్, స్వెర్డ్లోవ్ మొదలైనవారితో ఉత్తరప్రత్యుత్తరాలుచేశాడు. యుద్ధమునుగూర్చి అతని రిసెర్చిఫలితాలను కూడా వారికితెలియచేశాడు. ఇతరదేశాలలోనున్న బోల్షివిక్‌వర్గాలకు తన విధానపు రిపోర్టునుపంపించాడు. సభలో తదనుగుణ్యంగా తీర్మానం చేయించారు. అవకాశవాదులందరికీ ఈ క్రింది అల్టిమేటం ఇవ్వాలని లెనిన్ నిర్ణయించాడు. "యుద్ధమునుగూర్చి సెంట్రల్‌కమిటీ విజ్ఞప్తిఇదిగో మీస్వభాషలోప్రకటించటానికి మీకిష్టమేనా? కాదా? అయితేనమస్కారం ....మనం విడిపోదాం."

యుద్ధంమూలకంగా రష్యాలోని వ్యవసాయ, పారిశ్రామిక, రహదారుల లోపాలన్నీ బయటపడి, బలహీనంగావున్న దేశఆర్థికవిధానమంతా దెబ్బతింటోంది. అప్పటికే అధికపన్నులభారంతోవున్న దేశానికియుద్ధం

చాలాభరింవరానిదైపోయింది. ప్రభుత్వం ఇతరదేశాలనుండి అప్పులు చేసింది. ఈ అప్పులభారం అధికమైపోయింది. 18 మిలియనులప్రజలను యుద్ధానికిసిద్ధంచేశారు. యుద్ధరంగాలలోనున్న కార్మికులను పారిశ్రామికులు వెనుకకుపిలువవలసిన గత్యంతరంవచ్చింది. తెలివైనకార్మికులు కరువైనారు. క్రొత్తవారిని పల్లెటూళ్ళనుంచి పిలిపించారు. రష్యాపారిశ్రామిక రంగంలో తగినంతయంత్రాలులేవు. ఇతరదేశాలనుంచి యంత్రాలు రావటం లేదు. ముడిపదార్థాలదిగుమతి, బొగ్గుఉత్పత్తికూడా తగ్గిపోయాయి.

మొదట్లో కొన్ని జయాలుకలిగినా తరువాత రష్యా సేనలకు ఘోరాపజయాలుకలిగాయి. యుద్ధకార్యక్రమలోపాలవలన, దేశంలోని క్లిష్ట పరిస్థితులవలన, జారుప్రభువైన నికలస్‌బాధ్యత అత్యధికమైపోయింది. యుద్ధప్రారంభదశలో రష్యాదేశమంతా సమైక్యంగావున్నదని ప్రకటించటానికి డ్యూమాసభ ఏర్పాటుచేశారు. దేశరక్షణకై పోరాడేవారిని బలపరచాలనీ, అన్నివర్గాలవారు ప్రకటించారు. కాని నికలస్‌ప్రభువు లిబరలు వారిబలంమీద ఆధారపడకుండా, అతనిజర్మనీస్నేహితుడు, రాస్పుటిన్‌లపై ఆధారపడ్డాడు. రెండవనికలస్‌తో పోల్చిచూస్తే అతనిభార్య అలెగ్జాండ్రా మహారాణికే ఎక్కువశక్తి, తెలివిఉన్నట్లుతోచింది.

మహారాణివద్ద రస్పుటిన్‌కిగల పలుకుబడికికారణం అతని మంత్రశక్తియేకాక, అతనికున్నాయనుకుంటున్న దివ్యదృష్టిశక్తులుకూడా కారణమే. అలెగ్జాండ్రాకును దేవునికి ఇతడు మధ్యవర్తిగావున్నాడు. రాజు దగ్గరకూడా ఇతనికి ఉద్యోగంవుంది. అతనికేమీవనిలేదు. కాని రాజకీయోద్యోగులను నియమించునప్పుడితన్ని సలహాచేస్తారు. అటువంటి సమయాల్లో అతడు రాజుకనుమానంలేకుండా, బాగా డబ్బుకుంజుకునేవాడు. రస్పుటిన్ జర్మనీగూఢచారిఅనే వదంతి నిర్ధారణకాలేదు. ఇతడు, రాణితో కలిసి రాజ్యాధికారానికి, డ్యూమాకు, వ్యతిరేకంగా కుట్రచేసేవాడు.

గాలిషియారంగంలో పెద్దపరాజయాల కారణంవలన 1915 సం॥ జూన్ 19వ తేదీని జారు డ్యూమాసభను ఏర్పాటుచేశాడు. కాని పెట్టెం

ఖరు 3వ తేదీని దానిని తిరిగి వాయిదావేశారు. రస్పుటిన్‌ను కోర్టునుంచి తొలగించాలని వాదిస్తున్న డ్యూమాసభ్యులకీవిధానం నచ్చలేదు. 1915 సం॥లో ఏర్పాటైన ప్రోగ్రసివ్‌పార్టీ అని పిలువబడేది మధ్యతరగతివారికి, రాజ్యాధికారులకు, కోర్టుఉద్యోగులకు మధ్యసామరస్యం ఏర్పాటుచేయ టానికి ప్రయత్నించింది. దీనికి ప్రోత్సాహం జారుమంత్రులే చేశారని మిలియుకోవ్ అంగీకరించాడు. డ్యూమాలోని వర్గాలన్నీ ఒక సువిశాలమైన రాజకీయ, సాంఘికకార్యక్రమం తయారుచేశారు. కాని ప్రధానాధికారం ఇంకా జారుచేతిలోనేవుంటుంది. ఈకార్యక్రమమంతా ఉన్నతాశయాల జాబితాగానేవుంది గాని ఒక్కవిషయంకూడా కార్యరూపం దాల్చలేదు.

1915 సం॥ వేసవికాలంలో లెనిన్ ఇల్లాగ్రాశాడు:

కార్మికుల విమోచనకై తగులబెట్టవలసినదింకా ప్రపంచంలోవుంది. కోపము, నిస్పృహ సామాన్యజనంలోవుంటే, విప్లవవాతావరణం నిలచి వుంటే, క్రొత్తగా సంస్థలను ఏర్పాటుచేసి, మరణము, నిర్మూలనము అనే ఆయుధాలను మీప్రభుత్వంపై ప్రయోగించండి. నిశ్చయంగా చెప్పటానికిది సులభంకాదు. అనేక ప్రారంభకష్టాలను ఎదుర్కోవాలి. ఎన్నోత్యాగాలు చెయ్యాలి. ఇదంతా నేర్చుకోవలసిన క్రొత్తవిధానం. తప్పులు, అపజయాలు లేకుండా నేర్చుకోటంజరగదు. ఎన్నికలలో పాల్గొనవలసిన ఈ విధానము కోటనుపట్టుకోటానికి సైన్యవిన్యాసాలుచేస్తూ కందకాలలో ఉండటానికి సమానమైనది.

1915 సం॥ సెప్టెంబరు 5వ తేదీని యుద్ధవ్యతిరేకులైన ఐరోపా సోషలిస్టువర్గాలన్నీ స్విట్జర్లాండులో సభచేశాయి. దీనికిముందు బెర్నులో లెనిన్ క్రొత్తఇంటర్‌నేషనల్ ఏర్పాటుచేసి, యుద్ధంచేసే దేశాలసైనికులు కార్మికులు ఆయుధవిసర్జనచేసి యుద్ధవ్యతిరేకంగా సమ్మెలుచెయ్యాలని విజ్ఞప్తిచేశాడు.

1915 సం॥ ఇటలీయుద్ధంలో ప్రవేసించినప్పుడు అంతర్జాతీయ యుద్ధవ్యతిరేక ప్రచారానికి ఇటలీసోషలిస్టుసభ్యులే మార్గదర్శకులయ్యారు.

ఇంటర్నేషనలిస్టులతో రాజీబేరాలకు ఈ పార్టీవారు ఏంజలికాబాలబనాఫ్, మోర్గారీలను ఎన్నుకువంపించారు.

లెనిన్ సూచనలను వ్యతిరేకంగా తీసుకున్నారు. సైనికులకు, కార్మికులకు ఇచ్చిన విజ్ఞాపన వ్యర్థంకాగలదని కొందరునాయకులన్నారు. ఈ విజ్ఞాపనపై సంతకాలుపెట్టిన వారందరికీ, స్వదేశానికిచేరగానే మరణ శిక్షలు విధిస్తారు; కాని లెనిన్ మధ్యవర్తిదేశమైన స్విట్జర్లాండులో సుఖం గానేవుంటాడు, అని కొందరన్నారు. ఎనిమిదిగంటలు వాదోపవాదాలు జరిగినతరువాత ఏవిధ్యవసానంలేకుండా సభ విచ్ఛిన్నమైపోయింది.

స్విట్జర్లాండు జర్నలిస్టు, సోషలిస్టునాయకుడునైన రాబర్టుగ్రిమ్ అనే అతడు, యుద్ధవ్యతిరేకవర్గాలందరిమధ్య శాశ్వతసంబంధం ఏర్పాటు చేయటానికి ప్రయత్నంచేశాడు. ఇటలీసోషలిస్టుపార్టీవారు వర్గపోరాటమును, యుద్ధవ్యతిరేకతను అంగీకరించినవారందరికి ఆహ్వానాలు పంపించారు. మొత్తంమీద అనేకదేశాలనుంచి, అనేక వర్గాలనాయకులు మొత్తం 35 మంది ప్రతినిధులు సభకువచ్చారు. అధికసంఖ్యాకుల ప్రకటనలో యుద్ధమునకు వ్యతిరేకంగాను, సోషలిజం విజయానికీ పోరాటంసాగించాలన్నారు. కాని ఇంకా స్పష్టంగా, ప్రత్యక్షప్రజాయుద్ధము, నూతన రివల్యూషనరీ ఇంటర్నేషనలును సంస్థాపించాలనే తీర్మానం చెయ్యాలని బోల్షివికులు పట్టుపట్టారు. ఫ్రెంచి, జర్మనీదేశాలప్రతినిధులు లెనిన్ విజ్ఞాపనకు వ్యతిరేకులుకావటంవల్ల సభవిచ్ఛినంకావలసిన పరిస్థితి వచ్చింది. ఈ సమయంలో రకోవిస్కీ ముందుకువచ్చి ఇరుపక్షాలవారికి రాజీసూచనచేశాడు. దీనిపై కమిటీలోజరిగిన వోటింగులో లెనిన్ వ్యతిరేకంగా వోటుచేశాడు. ఈసభఫలితంగా జిమ్మర్వాల్డు యూనియను అనే యుద్ధవ్యతిరేక సోషలిస్టులవర్గం ఒకటి ఉద్భవించి, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్థాపించబడేవరకు పనిచేసింది.

ఇటువంటి మహోన్నతవిషయాలపై వాదప్రతివాదనలు జరిగే సమయంలోనే, లెనిన్ తనకు, తిండికికావలసిన డబ్బుకోసం చాలా ఇబ్బందిపడ్డాడు. ఒకనెలతరువాత లెనిన్ తన 'సోషియల్‌డిమొక్రాట్'లో

ఇల్లా వ్రాశాడు:- "రష్యాలో తరువాతి విప్లవానంతరం సాంఘికవిధాన మంతా, [కార్మికకర్షకవిప్లవ ప్రజాస్వామ్యనియంతృత్వం కాగలదు. రాజును, భూస్వాములను పడగొట్టకుండా విప్లవం విజయవంతంకాదు. కర్షకులు, కార్మికులను బలపర్చకపోతే వారినిపడగొట్టడం అసాధ్యం. రష్యాలో సామాన్యజనులలక్ష్యం ఐరోపాసోషలిస్టువిప్లవాన్ని రేకెత్తించుటకై మధ్యతరగతుల ప్రజాస్వామ్య విప్లవాన్ని అణచివెయ్యటమే."

1916 జనవరిలో లెనిన్ భార్యాసమేతంగా బెర్నునుంచి జూరిచ్‌కి వెళ్ళాడు. జూరిచ్‌లో రాడికల్‌వర్గీయులబలం సంపాదించటానికి లెనిన్ చేసిన ప్రయత్నం విజయంపొందలేదు. లెనిన్‌బసకు దగ్గరగావున్న జిమ్ ఆడ్లర్ కేఫ్‌లో ఒకసభచేశారు. దీనికికొందరు రష్యా, పోలెండుబోల్షివికులు, కొందరు స్విట్జర్లాండు సోషలిస్టులు, మరికొందరు జర్మనీ, ఇటలీయువకులు వచ్చారు. యుద్ధము, ఐరోపా సోషలిస్టునాయకులనుగూర్చి లెనిన్ వివరించగానే, అతనికి ప్రోత్సాహంకలగలేదు. లెనిన్ వ్యర్థప్రయత్నం చేస్తున్నాడని ఒక స్విట్జర్లాండు రాడికలుసభ్యుడన్నాడు. దానినందరూ అంగీకరించారు. తరువాత అనేకసమావేశాలుజరిగాయి. కాని తగినంత ప్రోత్సాహకరంగాలేకపోయింది. "మేము కొన్నితమాషాకథలను చెప్పకుని ఇళ్ళకుపోయాం" అని క్రుప్సకయాచెప్పింది. 1916 సం॥లో జూరిచ్‌లో లెనిన్ గడిపినంత ఏకాంతవాసం మరెన్నడూగడపలేదు.

* * *

యుద్ధం పూర్తిఎప్పుడవుతుందో తెలీకుండా సాగుతూనేవున్న కారణంచేత, జిమ్మర్వాల్డు ఇంటర్నేషనల్ సోషలిస్టుకమిటీ ఒకసమావేశం ఏర్పాటుచేసింది. కీన్‌థాల్‌పట్టణంలో 1916 సం॥ ఏప్రిల్ 24 తేదీని జరిగిన ఈసభకు 43 ప్రతినిధులువచ్చారు. ఈసభలో లెనిన్ నాయకత్వం జయించింది. రెండవ ఇంటర్నేషనల్ సోషలిస్టుబ్యూరోను మందలిస్తూ తీర్మానంచేయగలిగారు. ఇది పూర్తిగా బోల్షివిక్‌విజయం కాకపోయినా, తనయెత్తు నెగ్గిందనే లెనిన్ సంతోషించాడు. లెనిన్ తన అనుచరులను కూడా కొందరిని, వారియుద్ధవిషయపు భావాలను విమర్శించాడు.

సామాన్యజనులు ఆయుధధారణకు సిద్ధపడరాదనిచెప్పినవారిని లెనిన్ నిశితంగాదూషించాడు. "మనవినాదం ఈవిధంగా ఉండాలి. గొప్పతరగతి వ్యాపారులను జయించి, నిరాయుధులనుచేసి, అణచుటకై సామాన్యజనులు ఆయుధములు ధరించాలి." అనిన్ చెప్పాడు. రాజకీయ కార్యకలాపం సాగలేదనేకోపంతో లెనిన్ వ్రాతలో మునిగిపోయాడు. 1916 సం॥ అంతంలో, ప్రతిరోజూ రోజంతా గ్రంథాలయంలోనే వుండి "ఇంపీరియలిజం కాపిటలిజానికి ఉన్నతస్థితి." (Imperialism, the highest Stage of Capitalism) అనే గ్రంథంవ్రాశాడు.

ప్రపంచార్థికవ్యవస్థలో ధనికసర్వాధిపత్యములను క్రొత్తపాత్రలను గూర్చి లెనిన్ ప్రత్యేకంగావ్రాశాడు. ధనికరాజ్యాలు, క్రొత్తక్రొత్త వ్యాపార స్థలాలను సంపాదించటానికే పోటీపడి ప్రయత్నించి చివరికి యుద్ధాలతో పోటీలను విరమిస్తాయనేసూత్రం తెలియచేశాడు. కాని అతడింకాముందుకు వెళ్ళాడు. ప్రతిచోటా సోషలిజం స్థాపించబడేవరకు ఆయుధవిసర్జన ప్రబోధం మోసమైనది. లెనిన్ అభిప్రాయంప్రకారం సోషలిజం విప్లవం ద్వారానే సిద్ధిస్తుంది. ఆయుధాలులేకుండా విప్లవం అసంభవం. సోషలిజం విజయంసాధించేముందు, గొప్పతరగతివ్యాపారులకు, సామాన్యప్రజలకు యుద్ధంజరిగితీరాలి. తుపాకులేవిప్లవంనిర్ణయిస్తాయి. విప్లవకారులచేతిలోని తుపాకులే సామాన్యజనులవిజయానికి దారిచూపిస్తాయి.

1916 సం॥ మేరియా అలెగ్జాండ్రోవనా మరణంవల్ల లెనిన్‌స్థితి అంధకారమయంగా మారింది. 1910లో లెనిన్‌తల్లిని కలునుకున్నతరువాత మళ్ళీఆమెనతడుచూడలేదు. అతడు సభికులముందునిలబడి ఉపన్యసించుట ఆమె అప్పుడే మొదటిసారిగాచూసింది. మేరియా అలెగ్జాండ్రోవనా మరణం లెనిన్‌కి అధికంగా బాధకలిగించింది.

రష్యాలోని కార్యకలాపంనుంచి దూరమైనాడు; ప్రారంభంలో వున్న అనుచరులనేకులతన్నివిడిచిపెట్టారు; సాధారణజీవితఖర్చులకే చాలినంత ధనంలేకపోయింది; ఇతరదేశీయసోషలిస్టులను కూడగట్టుకునే

ప్రయత్నం విఫలమైపోయింది; ఈవిధంగా 1916 సం॥ చివరిభాగంలో లెనిన్ అధమస్థితిలోపడిపోయాడు. అతని ఉన్మాదిగాభావించారు.



లెనిన్ జనీవాలో జరిగిన ఒక రాజకీయసభనుంచి తిరిగివచ్చిన తరువాత, రష్యాలోని తన అనుచరులవద్దనుంచి వార్తలేరావటంలేదని ఫిర్యాదుచేశాడు. అతని అనుచరుడైన ఫిలియా, రష్యాలోనున్న 50, లేక 60 మంది బోల్షివిక్ సభ్యులను సమావేశపరచి, పార్టీతరఫున యుద్ధ వ్యతిరేకవిజ్ఞాపనప్రకటించాలని నిశ్చయించాడు. దానికి లెనిన్‌సమాధానం ఇది:— "50, లేక 60 మంది ఎందుకు? అది చాలా ఎక్కువ. 4 లేక 5 మందిచాలు. కాకసస్‌నుంచి ఒకడు, సైబీరియానుంచి ఒకడు, లేక ఇద్దరు, యూరల్సునుంచి ఒకడు, మాస్కోనుంచి ఒకడు, పిట్రోగ్రాడ్ నుంచి ఒకడు. ఈ నలుగురైదుగురుమంది, వివిధప్రాంతాలకార్మికుల ప్రతినిధులుగా సభలో సమావేశమై యుద్ధవ్యతిరేకంగా గట్టిగాపనిచేసి నట్లయితే, రష్యాలో విప్లవోద్యమానికి నూతనచైతన్యంకలిగి మహత్తరమైన చరిత్రాత్మిక కార్యసాధనచేయగలదు. పార్టీసమావేశం అనేపేరుతో వచ్చిన ఈ నలుగురైదుగురు సభ్యులనుబట్టి వేలాదిప్రజల విప్లవ వాంఛలును ప్రజ్వరిల్లి, ప్రకాశిస్తాయి." ఫిలియా లెనిన్ వ్రాతలకు చాలా ఆశ్చర్యపోయాడు.



కాని 1916 సం॥ పూర్తిఅయేసరికి ఈ నలుగురైదుగురుకూడా సమకూరలేదు. వారెక్కడవుంటారు? కాకసస్‌నుంచి బోల్షివిక్ ఎక్కడ? అతడు ఇతరద్యుమానసభ్యులతోకలిసి సైబీరియాలో ప్రవాసశిక్ష ననుభవిస్తున్నాడు. విప్లవసమయంలో, ఐరోపారష్యాలో లెనిన్ అనుచరులు కొద్దిమందివున్నారు. లెనిన్ డబ్బుఇబ్బందిపడుతున్నాడనితెలిసి, అతని స్నేహితుడు సోలోమన్, పిట్రోగ్రాడ్‌పార్టీసభ్యులనుంచి చందాలు ప్రోగు చేశాడు. మంచి ఇంజనీరుపదవిలోనున్న క్రాసిన్‌ను అతడు చందాఅడిగితే ప్రదిమవిరిచాడు.

"జార్జి! నీవు నీకాలమును వృథాచేస్తున్నావు. నాకు తెలిసినంతగా ఇలిచ్‌నిగూర్చి నీకు తెలీదు. అతని ఖర్మ ఆతడనుభవించనీ. మనం

భోజనానికిపోదాం.'' అన్నాడు. వారిద్దరూ భోజనంచేస్తుండగా సోలోమన్ మళ్ళీచందావిషయంతెచ్చాడు. ''సరే. నీకోసం నేను చేస్తాను'' అంటూ క్రాసిన్ రెండు ఐదురుబులునోట్లుతీసిఇచ్చాడు. కోపంతో ఆపదిరూబుల్సును సోలోమన్ విసిరికొట్టి. ''నీచందాలేకుండా మేం బ్రతకగలం'' అన్నాడు.

''అదిచాలాబాగుంది. కాని ఆగ్రహించకు. లెనిన్‌సహాయానికి అర్హుడుకాదు. అతడు నాశనంచేసేవాడు. అతనిబుఱ్ఱలోనుంచి ఎప్పుడెటువంటి నాశనవిధానంవస్తుందో నీకుతెలీదు.'' అంటూ క్రాసిన్ పదిరుబుల్సును జేబులోవేసుకున్నాడు. అవిధంగా ఆరోజుల్లో లెనిన్‌ను అనుమానించినది క్రాసిన్ ఒక్కడేకాదు. పారిస్‌లోని కొన్నిపత్రికలుకూడా అతన్నిగూర్చి అనుమానాస్పదంగా వ్రాశాయి.

1917 సం॥ జనవరి 22వ తేదీని జూరిచ్‌లోని యువకులసభలో లెనిన్ ఇల్లా ఉపన్యసించాడు:—

''ఐరోపాలో ప్రస్తుతంఉన్న శ్మశానవాతావరణంలో మనం మోసపోకూడదు. ఐరోపాలో విప్లవంరేగుతోంది. యుద్ధమూలకంగాను, జీవనపు ఖర్చులధికంగా పెరుగుటవల్లను, ప్రతిచోటా విప్లవవాతావరణం వ్యాపించింది. రాజులు, భూస్వాములు, వారిప్రభుత్వాలు, అందరూ గ్రుడ్డిగా అడవిలో ప్రవర్తిస్తున్నారు. కాని బ్రహ్మాండమైన విప్లవాలతోగాని వీరు బయటపడలేరు. శ్మశానవాతావరణం సమసిపోవచ్చింది.''

స్విట్జర్లాండులో ప్రవాసిగావున్న లెనిన్‌ను పిట్రోగ్రాడ్ కాంతిలోనికి తీసుకువచ్చేమార్పులు రష్యాలో జరుగుతున్నాయి. కష్టపరిస్థితులన్నీ సమసిపోతున్నాయి. 1917 సం॥ జనవరివరకు, రష్యాలో అధికార విప్లవకారులకుతప్ప లెనిన్‌గురించి ఎవ్వరికీ బాగాతెలీదు. పశ్చిమఐరోపాలోని సోషలిస్టులకతడింకా మోటలుకుట్రదారుడే; ఎన్నోభావాలను, కొద్దిమంది అనుచరులనుకలిగిన రష్యనుజాతివాడు. మూడుమాసాలతరువాత జారుప్రభువుకు ప్రియమైన నాట్యకత్తెభవనంలోనుంచి, జాకోబిన్సు తరువాత ప్రపంచంలో కనివిని ఎరుగని మహావిప్లవానికి నాయకత్వం వహించి, తనశక్తిని దశదిశలా మారుమ్రోగింపచేశాడు.

# స్వాతంత్ర్యం మూర్తీభవించినదేశం

ప్రతిరష్యన్‌నగరంలోను, పట్టణంలోనుకూడా ఆహారపదార్థాల అంగడులముందు జనం పెద్దపెద్ద "క్యూ"లలో బారులుతీరి నిలబడడం ప్రారంభించారు. చాలానగరాలలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికర్మాగారాలు, మంచినీటిని సరఫరాచేసేకుళాయిల చెరువులు పనిచేయడంమానేశాయి.

మాస్కో రాజకీయ రహస్యపోలీసుశాఖ అధిపతి 1916 అక్టోబర్‌లో పోలీసుశాఖకు సలహానిస్తూ ఇలావ్రాశాడు: "ప్రజలుపడుతూన్న ఇబ్బందులకు, ఇడుములకు అంతులేదు. అత్యధికసంఖ్యాకులు తినడానికి తిండిలేక ఆకటిబాధతో అలమటిస్తున్నారు. ఆహారంకొరత ఏర్పడినప్పుడు ఈవిధంగా 'క్యూ'లను ఏర్పడనివ్వడంవల్ల విప్లవసభలవల్ల, లక్షలాది విప్లవకరపత్రాలను పంచిపెట్టడంవల్ల కలిగేటంతటిహాని, అనర్థం కలగక మానవు. ప్రజలలో ఇప్పుడు ఏర్పడివున్నంతటి అసంతృప్తి, ఆగ్రహావేశాలు ఇంతకుముందెన్నడూ ఎవరూ చూసివుండరవి నేను ఘంటాపథంగా చెప్పగలను. 1905వ సంవత్సరంలో ఏర్పడిన పరిస్థితులతో పోలిస్తే ఇప్పటిపరిస్థితేప్రభుత్వానికి ఎక్కువ అనర్థాన్నితెచ్చి పెట్టేదిగావున్నదని చెప్పకతప్పదు."

1917 జనవరిలో పోలీసుశాఖ ఇలా రిపోర్టుచేసింది; "ప్రజలు ఆహారంకోసం ఇంతవరకు అల్లరులు, కల్లోలాలు జరపనంతమాత్రంచేత వారికముందు జరపబోరని భావించరాదు. ప్రజలఆగ్రహావేశం క్రమంగా హద్దుమీరిపోతున్నది. "మాకు భోజనమైనాపెట్టండి, యుద్ధమైనా నిలిపి వెయ్యండి" అంటూ ఆందోళనచేస్తున్నవారిసంఖ్య నానాటికి పెరిగి పోతున్నది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రచారంచేసేవారికి ఇది మిక్కిలి అనుకూలమైన వాతావరణమని వేరేచెప్పనక్కరలేదు. యుద్ధం ఫలితం వ్యతిరేకమైనా వారికి ఇంతకంటెపోయేదేమీలేదు. కనుక, కల్లోలాలు ఎప్పుడు, ఎలాగ ప్రజ్వరిల్లుతాయో చెప్పడం కష్టం. కాగా, అత్యంత ప్రమాదభరితమైనపరిణామాలకు దారితీయగలపరిస్థితి ఏర్పడివున్నదనడం మాత్రం స్పష్టం. ఏక్షణంలో ఏమిముంచుకువస్తుందో ఎవరూచెప్పలేరు."

కాని, ప్రభుత్వం ఈ హెచ్చరికలను పెడచెవిని పెట్టింది.

కార్మికులను యుద్ధంలోనికిపంపడం, ఎక్కడెక్కడవున్నగుర్రాలను స్వాధీనంచేసుకోవడం యథాప్రకారం కొనసాగుతూనేవున్నది. తత్ఫలితంగా పొలాలలో పనిచేసేవారు యుద్ధానికిపోతూవుంటే పంటలువండించేవారు లేకపోయారు. పంటభూములు పాడుపడిపోయి ఆహారధాన్యాలకు విపరీతమైన కొరతఏర్పడింది. ఈవిధంగా 1917 జనవరినాటికి పెట్రోగ్రాడ్‌లో వస్తువులధరలు ఆరురెట్లు పెరిగిపోయాయి. "ఇవాళ రొట్టెలేదు; ఎప్పుడు వస్తుందోతెలియదు" అని లిఖించబడినబోర్డులు దాదాపు ప్రతిదుకాణం వద్దకనబడసాగాయి. మాస్కోనగరం విద్యుచ్ఛక్తివాడకాన్ని విధిలేకనగానికి సగం తగ్గించుకోవలసివచ్చింది.

అయినా యుద్ధం ముగియడంతోనే తమకు తిరిగి భూములు యిస్తారనే ఆశాలేశం రైతులను ఇంకా విడిచిపెట్టలేదు. కాని, యుద్ధం ఇంకా కొనసాగుతూ క్రొత్తక్రొత్తతరగతులసైనికులు సమీకరించబడుతున్న కొద్దీ ఈ ఆశాలేశం సయితం అడుగంటజొచ్చింది. తమకు కడుపునిండా తిండిపెట్టడంలేదనీ, తుపాకులులేకుండా యుద్ధంచెయ్యవలసివస్తున్నదనీ సైనికులు తమ యిండ్లకువ్రాస్తున్నారు. యుద్ధంలో హతక్షతగాత్రులసంఖ్య పెరిగిపోయినకొద్దీ దెబ్బతిని వికలాంగులైపోయిన సైనికులతో గ్రామాలు నిండసాగాయి. రెండవతరగతి రిజర్వుసైనికులుగా సమీకరించబడిన గ్రామీణరైతుజనంకూడా రణరంగానికి పిలువబడ్డారు.

రాస్‌పుటిన్ బలదర్పాలనుగురించిన వదంతులు గ్రామాలకు వ్యాపించాయి. గ్రామాలనుంచి రణరంగానికి రణరంగంనుంచి గ్రామాలకు వదంతులు, వార్తలు ప్రవహించాయి. గ్రామాలలోవున్న రైతులలోను, యుద్ధభూమిలోవున్న రైతులలోనుకూడా ఆవేశంక్రమంగాహెచ్చిపోయింది. వారిఅసంతృప్తి మరింతస్పష్టమైన రూపాలను ధరించింది.

ఇక పోలీసుశాఖ ఈ క్రిందివిధంగా రిపోర్టుచేయకతప్పిందికాదు. "సైన్యంలో తిరుగుబాటుతత్వం పెచ్చుపెరిగివున్నది. దానిలో పెద్దపెట్టున తిరుగుబాటును ప్రేరేపించడానికి సిద్ధంగావున్నవారు కొంతమందివున్నారు. తక్కినవారు తిరుగుబాటు జరిపినవారిని శిక్షించేచర్యలలో పాల్గొనడానికి

నిరాకరించవచ్చు. ఈ తిరుగుబాటు ప్రేరేపకులు కట్టుదిట్టంగా కట్టుబాటు చేసుకొనడంలో కృతకృత్యులైతే, సమర్ధతో విప్లవవ్యతిరేకశక్తిగా పోరాడి ప్రభుత్వాన్ని రక్షించడానికి చాలినన్ని దళాలు సైన్యంలోమిగలబోవనడంలో అత్యుక్తివుండబోదు.''

అగ్నిపర్వతం ఇక బ్రద్ధలుకావడానికి సిద్ధంగావున్నది. ప్రభుత్వం శిథిలమైపోతున్నది. రోమనోవ్‌పరిపాలనలోని ఈ కట్టకడపటిసంవత్సరంలో ప్రభుత్వాధిపత్యంవహించిన మంత్రివర్గంవున్నంతటి దీనావస్థలో మున్నే మంత్రివర్గం వుండివుండలేదు. మంత్రులలో కొంచెం యించుమించుగా సమర్థుడనిచెప్పదగినవాడు దేశీయవ్యవహారాలశాఖామంత్రి ప్రొటోపోపోవ్ ఒక్కడేవున్నాడు. అతడు సయితం తన జాతకచక్రాన్ని ఒకసారి పరిశీలించుకొని మరీ డ్యూమా (శాసనసభను) సమావేశపరచడానికి తేదీని నిర్ణయించాడు.

తక్కినమంత్రులు అవకాశవాదులు; అవినీతిపరులు; అవినీతిలంచగొండితనాలను కప్పిపుచ్చడానికి ఉన్నతపదవులలో నిల్పబడిన వయసుమళ్ళిన వ్యక్తులు. స్ట్యూమర్‌భోగలాలసుడు, కాంతాలోలుడు—రస్పుటిన్ చెప్పినట్టు 'ముక్కుకు త్రాడుపోసిలాగడానికి తగినవాడు.' రస్పుటిన్‌ద్వారా అధికారంలోనికివచ్చిన ఖ్వోస్టోవ్ ప్రభుత్వపుసొమ్మును హరించడానికి అలవాటుపడినవాడు. ఇక షెగ్లోవ్‌ను గోముఖవ్యాఘ్రమని రస్పుటినేవర్ణించాడు. ఇక కుర్లోవ్ జారత్వప్రియుడు; అవినీతిపరుడు. డొబ్రోవ్‌ల్‌స్కీ సివమెత్తించుకొని పితృదేవతల్తో సంప్రతించి ప్రభుత్వ నిర్ణయాలను చేసేవాడు.

రాణిసయితం ఈ మంత్రులను ''అవివేకు''లనీ, ''బుద్ధిహీను''లని అనేది. రాజరికపు కడపటిమాసంలో రష్యానువాస్తవానికి రాణియే పరిపాలించింది.

డ్యూమాపిలిస్తే మూలవున్న ముసలమ్మకూడా పలకనంతటి అసమర్థసంస్థగా తయారైంది. 1916వ సంవత్సరాంతంనాటికి అభ్యుదయాన్ని కోరే రాజకీయపక్షాలు అధికారాన్ని కైవశంచేసుకోడానికి పట్టుదలతో

ప్రయత్నించవలసివచ్చింది. రష్యా ఆర్థికవ్యవస్థను, సైన్యాన్ని శిథిలకై పోకుండా రక్షించడానికి క్రొత్తనాయకత్వం, క్రొత్తఅధిపత్యం అవసర మైనాయి. డ్యూమా మాజీఅధ్యక్షుడు అలెగ్జాండర్ గుచ్‌కోవ్ ఆకస్మికసైనిక విప్లవంజరగాలని సూచించాడు. మరొకరు రాణిని ఒక యుద్ధనౌకకు ఆహ్వానించి అక్కడనుంచి ఆమెను బ్రిటన్‌కు తీసుకుపోవాలని ప్రతి పాదించారు. చక్రవర్తిపరివారాన్ని పట్టుకొని నిర్బంధంలోవుంచి, నికోలస్ చేత రాజ్యపరిత్యాగంచేయించి, చక్రవర్తిసోదరుడు గ్రాండ్‌డ్యూక్‌మైఖైవ్ రీజెంటుగా చక్రవర్తికుమారుడు అలెక్సిస్‌కు పట్టంగట్టి, ప్రభుత్వసభ్యులగు అరస్టుచేయాలని గుచ్‌కోవ్, జనరల్‌క్రిమోవ్ తీర్మానించారు.

1915వ సంవత్సరం నవంబర్ 7వ తేదీని గ్రాండ్‌డ్యూక్ నికోలై తన సోదరుని కుమారుడైన చక్రవర్తితో మనసువిప్పిమాట్లాడి "సింహా సనం కూకటివేళ్లతోకూలడానికి సిద్ధంగావున్న"దని గట్టిగాహెచ్చరించాడు.

"ఆయేడే డిసెంబర్ 30వ తేదీని చక్రవర్తి ఆస్థానసభ్యులు రస్పుటిన్‌ను చంపివేయడంద్వారా రాజవంశాన్ని రక్షించడానికి ప్రయ త్నించారు. అయితే, పరిస్థితి సృతిమించిపోయినపిమ్మట రస్పుటిన్ హత్యజరిగింది.

డ్యూమాలో అన్నిపక్షాలవారుకూడా అది సంపూర్ణమైన అధికారాన్ని స్వీకరించాలని ఆందోళన ప్రారంభించారు. డ్యూమా ప్రభుత్వాధికారాన్ని స్వీకరించాలని కోరుతున్నవారికి దానిఅధ్యక్షుడు రాడ్జియాంకో "ప్రజలను జారుకు వ్యతిరేకంగా రెచ్చగొట్టడానికి నాకు సామర్థ్యంలేదు, యిష్టమూ లే"దని సమాధానంచెప్పాడు.

1917 జనవరిలో జనరల్‌క్రిమోవ్ యుద్ధరంగంలో క్లిష్టపరిస్థితిని వివరించి, రాజప్రాసాదంలో విప్లవంజరిగేమాటవుంటే సైన్యం డ్యూమాను బలపరచగలదని ప్రకటించాడు.

అయితే, డ్యూమా చర్యతీసుకోడానికి సిద్ధంగాలేదు. వివిధవర్గాలు విభిన్నాభిప్రాయాలను వెలిబుచ్చుతూవచ్చాయి.

"జనరల్ క్రిమోవ్ చెప్పినది సమంజసంగావున్నది. ఆకస్మిక సైనికవిప్లవం జరగడం అత్యంతవసరం. అయితే, ఆ విప్లవాన్ని లేవదీయ డానికి ఎవరుసాహసించగలరు?" అన్నాడు డ్యూమాసభ్యుడు షింగరేవ్.

"రష్యాకుసర్వనాశనంతెచ్చి పెడుతున్న జార్‌నుదయతలచజాలం" అన్నాడు మరొకప్రతినిధి షిర్లోవ్‌స్కీ ఆగ్రహావేశంతో.

ఈ అభిప్రాయంతో డ్యూమాసభ్యులు చాలామంది ఏకీభవించారు. "జార్, రష్యాలలో ఎవరిని వరిస్తావంటే నాకు రష్యాకావాలంటాను" అన్న నైరుతిరంగసేనాని జనరల్ బ్రూసిలోవ్ పలుకులను వీరందరు సమర్థించారు.

"విప్లవంవస్తుందనే మీరు భావిస్తున్నారా?" అని 1917 ఫిబ్రవరి మూడవతేదీని గ్రాండ్‌డ్యూక్ మైఖైల్ రాడ్జియాంకోను సూటిగాప్రశ్నించాడు. రాణీనిరాజకీయాలలో కలుగజేసుకోకుండాచేసి ప్రజలకు విశ్వాసంవుండగల మంత్రివర్గాన్ని నియమిస్తే ఇప్పటికైనా రష్యాను రక్షించడం సాధ్యమేనని రాడ్జియాంకో సమాధానం చెప్పాడు. రాణీ అధికారంలోవుంటే విప్లవం అనివార్యమేకాగలదని ఆయన హెచ్చరించాడు కూడా.

గ్రాండ్‌డ్యూక్ ఒప్పుకున్నాడు. "బ్రిటిష్‌రాయిబారిసర్‌జార్జిబుఖానన్ ఈ విషయాన్నే నా సోదరుడికి తెలియజేశాడు. చక్రవర్తిని ఎంతటికీడును తెచ్చిపెడుతోందో మా కుటుంబంవారు గ్రహించకపోలేదు. ఆమెకు, నా సోదరునికి చుట్టూవున్నవారందరు రాజద్రోహులే...అయితే, ఏంచేస్తాం?" అన్నాడు ఆయన.

"వాస్తవపరిస్థితిని జార్‌కు వివరించి చెప్పండి. ప్రజలు ఆమెను రష్యాశ్రేయస్సుకు వ్యతిరేకంగా పనిచేస్తున్న రాక్షసిగా పరిగణిస్తున్నారని ఆయనకు చెప్పండి" అని సూచించాడు రాడ్జియాంకో.

ప్రయత్నిస్తానని గ్రాండ్‌డ్యూక్ వాగ్దానంచేశాడు.

రెండువారాల అనంతరం ఫిబ్రవరి 15వ తేదీని "మహాప్రభూ! రాణీని రాజకీయాలజోలికి రాకుండాచేయడానికి తమరేదైనా మార్గాన్ని ఆలోచించాలి" అని రాడ్జియాంకో జార్‌ను హెచ్చరించాడు.

బాధ్యతతో పనిచేసే ప్రధానమంత్రిని నియమించవలసిందిగా అయన నికోలస్‌కు వినతిచేశాడు. "రష్యాకుహానికలిగించి శత్రువుకు లాభదాయకంగావుండే చర్యలే అన్నీ తీసుకోబడుతున్నవనే అభిప్రాయం వ్యాపిస్తున్నది. మీ పరివారంలో నిష్కపటి, విశ్వాసపాత్రుడు అయిన వాడు ఒక్కడుకూడాలేడు. దొడ్డవారందరు వెడలగొట్టబడ్డారు, లేదా వెళ్ళిపోయారు" అని స్పష్టంచేశాడు.

"ఊరికే మాటలుఅని ప్రయోజనంలేదు. వాస్తవంగా జరిగిన వేమైనావుంటేచెప్పు. నువ్వు చెప్పేదానికి అవంతకూడా ఆధారంలే"దని బదులుచెప్పాడు నికోలస్.

1917 ఫిబ్రవరి 27వ తేదీని డ్యూమా సమావేశపరచబడింది. సమావేశం ప్రారంభంకాగానే ఉపన్యసిస్తూ కెరెన్‌స్కీ ఇలాప్రకటించాడు. "తప్పుఅంతా మంత్రులదే అనేవారు ప్రజలలోవున్నారు. మంత్రులు కేవలం నామమాత్రులనీ, వారు కదలిపోయే నీడలవంటివారనీ ఇప్పుడు దేశం గ్రహించింది. వారిని ఇక్కడకు ఎవరుపంపుతున్నారో దేశానికి స్పష్టమైపోయింది. మహావిపత్తురాకుండా నివారించాలంటే జార్‌నే, మార్గాంతరంలేకపోతే బలవంతంగానైనా, పదభ్రష్టునిగాచేయాలి."

రాణీ కెరెన్‌స్కీ ఉపన్యాసాన్ని పత్రికలలో చదివినప్పుడు అతనిని రాజద్రోహనేరానికి ఉరితీయాలని పట్టుపట్టింది.

పెట్రోగ్రాడ్‌లో జరిగిన వామపక్షాల రహస్యసమావేశంలో డ్యూమాకు బాధ్యతవహించే మంత్రివర్గం నెలకొల్పబడాలనే మితవాదులసూచనను తనవర్గంబలపరచజాలదని బోల్షివిక్‌ప్రతినిధి ష్లియాప్‌నికొవ్ ప్రకటించాడు నిరసనప్రదర్శనాన్ని బోల్షివిక్‌లు వ్యతిరేకించబోరనీ, వారు వేరే నినాదాలతో తమ ప్రచారాన్ని కొనసాగించగలరనీ అతడు తెలియచేశాడు.

ఫిబ్రవరి 27వ తేదీని జరిగిన నిరసనప్రదర్శనంలో అనేకమంది సైనికోద్యోగులు విద్యార్థులతోకలిసి ఉత్సాహంతో పాల్గొన్నారు. సైనికులకు ప్రజలకు మధ్యవుండే 'గోడ' పునాదులతో కదిలిపడిపోవటం ప్రారంభించింది.

వారంరోజులుగా డ్యూమాసమావేశం జరుగుతున్నది. బాధ్యతగల మంత్రివర్గస్థాపనను జార్ప్రకటించబోతున్నట్టు రాడ్జియాంకొవిన్నాడు. ప్రధానిగోవిట్సిన్, తక్కిన మంత్రివర్గసభ్యులు కబురంపించబడ్డారు. మరునాడు డ్యూమాసమావేశానికి స్వయంగా హాజరుకాగలనని నికోలస్ వాగ్దానంచేశాడు.

గోవిట్సిన్ సంతోషం ఆట్టేసేపువుండలేదు: అనాడు సాయంకాలమే తాను రాజధానికి బయలుదేరి వెడుతున్నానని చక్రవర్తి అతనికి తెలియ చేశాడు.

"అయితే, మహాప్రభూ! బాధ్యతగల మంత్రివర్గంమాట ఏమిటి? తాము రేపు డ్యూమా హాజరుకావడానికి ఏర్పాటుచేసుకున్నారే." అన్నాడు గోలిట్సిన్.

"....నా మనస్సు మార్చుకున్నా"నని చక్రవర్తి బదులుచెప్పాడు.

నికోలస్ ఈవిధంగా నిలకడలేకుండా తన నిర్ణయాలను చలచిత్తంతో మార్చుకుంటూ వ్యవహరిస్తూవుండగా ఆకస్మికంగా అమితవేగంగా సంఘటనలు జరిగిపోజొచ్చాయి. మార్చి 8వ తేదీని పెట్రోగ్రాడ్‌లో కార్మికులు సమ్మెచేస్తున్నారని, ప్రజలు పట్టపగ్గాలులేకుండా అల్లరులుజరుపుతున్నారని తెల్పుతూ పెట్రోగ్రాడ్ నగరరక్షణసేన కమాండర్ జనరల్ ఖబలోవ్ జార్‌కు ఒక టెలిగ్రాంపంపించాడు.

"అల్లరులను తక్షణం అణచివెయ్యి" అంటూ జార్‌దానికి సమాధానంగా ఉత్తరువుచేశాడు. అంతట అల్లరులలో పాల్గొంటున్నవారిని మూకవుమ్మడిగా తుపాకులతోకాల్చి చంపివేయవలసిందిగా ఖబలేవ్ తన సైనికులను అజ్ఞాపించారు.

చక్రవర్తిని మహోపద్రవసూచకంగా ప్రారంభమైన ఈ కల్లోలాలను అలసభావంతో ఏవోచిన్నచిన్న అల్లరులుగా పరిగణించింది. మార్చి మార్చి 9వ తేదీని అమె తన భర్తకు ఇలావ్రాసింది.

''నగరంలో సమ్మెదారులు, అల్లరిమూకలు మునుపటికంటె ఎక్కువగా అధికారాన్ని ప్రదర్శిస్తున్నారు. ఈఅల్లరులను బొద్దువూడని కుర్రవాళ్లు జరుపుతున్నారు. బాలురు బాలికలు తమకు అన్నంలేదని అరుస్తూ వీధులవెంట పరుగులుపెడుతున్నారు; ఏదో కొంతసంచలనం కలిగించడంకోసం వారు ఈపనిని చేస్తున్నారు. చలి ఇంకాకొంచెం ఎక్కువగా వుండివుంటే వీళ్లందరు బహుశా ఇండ్లలో తలుపులుమూసుకుని కూర్చుని వుండేవారే. డ్యూమాలో సభ్యులు చిత్తంవచ్చినట్టు ప్రసంగాలు చేస్తూ ప్రజలను రెచ్చగొట్టకుండావుంటే ఈఅల్లరులు అవే అణగిపోతాయి. ఈ సభ్యులుచేసిన వాటిలో మిక్కిలి అనర్థదాయకంగా కనిపించిన ఉపన్యాసాలు పత్రికలలో ప్రచురించబడడంలేదు. కాని, రాజవంశానికి వ్యతిరేకంగా ఉపన్యసించేవారు వెంటనే కఠినంగా శిక్షించబడాలని నా అభిప్రాయం.''

మార్చి 18వ తేదీని తనభర్తకువ్రాసిన లేఖలో ఈఅల్లరులన్నింటికి కారకులు సోమరిపోతులని తెల్పుతూ ఆమె ఇంకా యిలా పేర్కొన్నది.

''సోమరిపోతులు, మంచి దుస్తులను వేసుకున్నవారు, యుద్ధంలో దెబ్బతినసైనికులు, హైస్కూలు బాలికలు మొదలైనవారు ఈఅల్లరులను జరుపుతున్నారు. వీరే ఇతరులను ప్రేరేపిస్తున్నారుకూడా. అసలుసంగతి సందర్భాలేమిటో కనుక్కోడానికి విల్లీవద్దకువచ్చి 'ఉదయంపూట మీరు వీధులలో కనబడితే మిమ్మల్ని తుపాకులతోకాల్చి చంపుతా'మని తమకు తెల్పినట్టువారు ఆమెకు తెలియజేశారు. నీతిమాలినవారు. బండ్లనుత్రోలే వారు, మోటారుడ్రైవర్లు ఇప్పుడు సమ్మెచేస్తున్నారు. అయితే, ఇప్పుడు వారందరు మిమ్మల్ని ఆరాధిస్తున్నందున పరిస్థితి 1905 నాటికంటె పూర్తిగా భిన్నంగావున్నదనీ, వారు భోజనంకావాలని మాత్రమే ఆందోళన చేస్తున్నారనీ అందరు అంటున్నారు.''

ఇంకరేపు బాహాటంగా విప్లవం ప్రారంభమౌతుందనగా రాణి ఇలా వ్రాసింధి.''....పరిస్థితి అంతా చక్కబడగలదనే భావిస్తున్నాను. అతని సమాధివద్ద సూర్యుడు తేజోవంతంగా ప్రకాశిస్తున్నాడు; నా మనస్సు

ప్రశాంతంగావున్నది. అతడు మనలను కాపాడడానికి మరణించాడు.''
''అతడు'' అంటే రస్పుటిన్.

పరిస్థితినిగురించి ఏమీ ఆందోళనపడనవసరంలేదంటూ, చీమ కుట్టినట్టయినాలేకుండా రాణి ఈవిధంగా ఉత్తరాలు వ్రాస్తూవుండగా, మార్చి 11వ తేదీని రాడ్జియాంకోచక్రవర్తికి ఇలా ఒక టెలిగ్రాంపంపాడు:

''పరిస్థితి తీవ్రరూపంధరించింది. రాజధానిలో అరాజకం తాండవిస్తున్నది. ప్రభుత్వంస్తంభించింది; బస్సులుమున్నగురవాణాసర్వీసులు నిలిచిపోయాయి. నగరానికి ఆహారం, కట్టెలు, బొగ్గులు వగైరాసరఫరా పూర్తిగా కుంటుపడింది. అసంతృప్తి ప్రబలిపోయింది....సైనికులు ఒకరిపై ఒకరు తుపాకులు కాల్చుకుంటున్నారు. ప్రజావిశ్వాసాన్ని చూరగొన్న ప్రముఖుణ్ణి ఎవరివైనా ఆహ్వానించి నూతనమంత్రివర్గాన్ని నెలకొల్ప జేయడం అత్యంతఅవసరం. ఆలస్యం ఎంతమాత్రంతగదు. తటపటాయిస్తే ముప్పుతప్పదు.''

మరునాడు ఆయన ఇలా మరొక టెలిగ్రామిచ్చాడు:

''పరిస్థితి విషమిస్తున్నది. తక్షణం తగు చర్యలు తీసుకోబడాలి. దేశంగతి, రాజవంశంగతి తేలిపోగల తుదిఘడియలు వచ్చాయి.''

''డ్యూమాను రద్దుచెయ్యి'' అంటూ జార్‌వద్దనుంచి ఆయనకు సమాధానంవచ్చింది.

రాడ్జియాంకో వేరొక టెలిగ్రాంలో ఇలా విన్నవించాడు:

''మహాప్రభువుల ఆజ్ఞప్రకారం ఇంపీరియల్ డ్యూమా సమావేశాలు ఏప్రిల్‌వరకు వాయిదావేయబడ్డాయి. శాంతిభద్రతల రక్షణకుగల తుది సాధనం తొలగించబడింది. కల్లోలాలను నిలపగలశక్తి ప్రభుత్వానికిలేదు. నగరరక్షణసేనలను నమ్మడానికి వీలులేదు. రిజర్వుపటాలాలు తిరుగుబాటు జరుపుతున్నవి. వాటి అధికారులు కాల్చివేయబడుతున్నారు. పటాలాలు దేశీయశాఖాకార్యాలయంపై, ఇంపీరియల్ డ్యూమాపైకి దండెత్తివస్తున్నవి. అంతర్యుద్ధం ప్రారంభమై నాలుగు మూలలకు వ్యాపిస్తున్నది. నూతన

ప్రభుత్వస్థాపనకు వెంటనే ఉత్తరువుచేయండి. ఇటీవల మీరుచేసిన ఉత్తరువులను రద్దుచేసి శాసనసభలను తిరిగిసమావేశపరచవలసిందిగా ఆజ్ఞాపించండి.... ఈ ఆందోళన సైన్యానికికూడా చేరిననాడు జర్మనీకి విజయంసిద్ధించడం, రాజవంశంతోపాటు రష్యా సర్వనాశనంపొందడం తథ్యం. రష్యాశ్రేయోభివృద్ధిదృష్ట్యా నా విన్నపాన్ని ఆలించి పాలించవలసిందిగా తమరిని అభ్యర్థిస్తున్నాను. మీ భవితవ్యాన్ని, రష్యాభవితవ్యాన్ని నిర్ణయించగల ఘడియలువచ్చాయి. రేపు అంటే తరుణం మించిపోవచ్చు."

ఇంతలో, జనరల్ ఖబలోవ్ పెట్రోగ్రాడ్‌లో సైనికులు తిరుగుబాటు జరిపారనితెల్పి, ఆతిరుగుబాటును అణచివేయడానికి క్రొత్తసైనికదళాలను పంపవలసిందిగాకోరుతూ జార్‌కు ఒక టెలిగ్రాంపంపించాడు.

అయితే, నికోలస్‌మాత్రం తనభార్యసలహానే అనుసరించసాగాడు. డ్యూమాను రద్దుచేయడంద్వారా ఆయన తనకు, విప్లవానికిమధ్యగల తుదిప్రాకారాన్ని కూలద్రోసుకున్నాడు.

అందరి ఆమోదంతోను, జార్‌పంపిన రద్దుఉత్తరువుదృష్ట్యా తీసుకోవలసినచర్యను గురించి నిర్ణయించుకోడానికి మార్చి 12వ తేదీని డ్యూమా ప్రతినిధుల అనధికారసమావేశం ఏర్పాటుచేయబడింది.

ప్రతినిధులు డ్యూమాకువచ్చి శరవేగంతో జరిగిపోతున్న సంఘటన లనుగురించి నివేదించారు. కార్మికులు ఎన్నికను జరుపుకుంటున్నారు. ఒక సేన-వోలికన్‌స్కీ రెజిమెంటు-తిరుగుబాటు జరిపింది. దానిలోని సైనికులు తమ కమాండర్‌ను చంపివేశారు. కొసాక్స్‌ప్రజలతో చేతులు కలుపుతున్నారు. నెవ్‌స్కీపై అవరోధాలువేయబడ్డాయి. మంత్రులగతి ఏమైందో ఎవరికీతెలియదు. దాదాపు 30 000 మంది సైనికులు, కార్మికులు, విద్యార్థులు, స్త్రీలుకలిసి డ్యూమాపైకి దండయాత్రగావస్తున్నారు.

తరువాత, డ్యూమా అధ్యక్షుని కార్యాలయంలో సకలపక్షాలనాయకుల సమావేశం జరిగింది. రాడ్జియాంకో అధ్యక్షతవహించాడు. రద్దుకావల

సిందిగా జార్ ఉత్తరువుచేసినపిమ్మట డ్యూమా ఇంకా సమావేశం జరిపిం దంటే విప్లవాన్ని ప్రకటించినట్టవుతుంది. రాడ్జియాంకో, ఇంకా సభ్యులలో చాలామందికూడా అట్టిచర్యను తీసుకోడానికి సాహసించలేకపోయారు. తక్షణం అనధికారరీత్యా సమావేశమై రాజాజ్ఞను శిరసావహించడానికి సంబంధించిన తీర్మానాన్ని ఆమోదించడానికి వారు నిర్ణయించుకున్నారు. అన్నిపక్షాల ప్రతినిధులుకూడా ఉద్రేకపూరితంగా ఉపన్యాసాలుచేశారు. డ్యూమా రద్దుకావడానికి నిరాకరించి అది తాత్కాలికప్రభుత్వంగాను, రాజ్యాంగనిర్ణయపరిషత్తుగాను ప్రకటించుకోవాలని ఒకరు సూచించారు. తాను నికోలస్‌పక్షాన్ని అవలంబిస్తున్నదో, ప్రజలపక్షాన్ని అవలంబిస్తున్నదో డ్యూమా స్పష్టంగా ప్రకటించాలని మరొకరుకోరారు. ఇంతలో ద్వారంవద్ద పెద్దఅలజడి బయలుదేరింది. పెద్దపెద్ద కేకలువినబడ్డాయి. ఒక సైనికో ద్యోగి పరుగెత్తుకుంటూ హాలులోనికిప్రవేశించాడు.

"డ్యూమా ప్రతినిధులారా! నన్నురక్షించండి, రక్షించండి!" అంటూ అతడు కేకవేశాడు. "నేను మీరక్షణసైనికదళం-డ్యూమా రక్షకదళం నాయకుడను. ఎవరో తెలియని కొంతమందిసైనికులు బలవంతంగాలోపల ప్రవేశించారు. వారు నన్ను చంపివేయడానికి ప్రయత్నించారు. నేను అతికష్టంమీద తప్పించుకొని ఇలాపారిపోయివచ్చాను. నన్ను రక్షిం చండి" అని అతడు మొరపెట్టుకున్నాడు.

అంతట, కెరెన్‌స్కీలేచి ఇలాఅన్నాడు: "ఇప్పుడు జరిగినదాన్నిబట్టి చూడగా మనమింక జాగుచేయకూడదని స్పష్టమౌతున్నది....నేనిప్పుడు సేనలను చూసిరావడానికి వెడుతున్నాను. సైనికులకు నేను ఏమిచెప్పాలో ముందు తెలుసుకోవాలి. డ్యూమా తమపక్షానవున్నదనీ, అదే యావత్తు బాధ్యతను వహించగలదనీ, అదే ఈమహోద్యమానికి నాయకత్వం వహించగలదనీ నేను వారికి చెప్పవచ్చునా?"

డ్యూమాపైకిదండెత్తివస్తున్న ముప్పైవేలమంది కార్మికులు,సైనికులు, స్త్రీలు, విద్యార్థులు టారైడ్‌రాజప్రాసాదం వద్దకుచేరారు. కెరెన్‌స్కీవారిలో మొదటిగుంపులోనిసైనికులను ఉద్దేశించి ప్రశంసిస్తూ వారిని "తొలివిప్లవ

అగ్రగామిదళం'' అని వారిని సంబోధించాడు. ప్రజలు డ్యూమాభవనాలను ఆక్రమించుకొనడంతోనే డ్యూమా, విప్లవం మహాసంరంభంతో ఏకమైపోయాయి.

ఆనాడే-మార్చి 12వ తేదీనే-పెట్రోగ్రాడ్‌లోని ఫ్యాక్టరీల కార్మికులు 1905 నాటి పెట్రోగ్రాడ్ సోవియెట్ నమూనాపై కార్మికప్రతినిధుల సోవియెట్‌ను ఏర్పరచుకొని, దానికి అధ్యక్షుడుగా ఛీడ్జేను, ఉపాధ్యక్షుడుగా కెరెన్‌స్కీని ఎన్నుకున్నారు.

తిరుగుబాటు జరుపుతూన్న రెజిమెంటుల సైనికులు, కార్మికులు ముందు రాజకీయఖైదీలను విడుదలచేసి, తరవాత రాజభవనంపైకి దండెత్తారు. అక్కడ అప్పుడే పెట్రోగ్రాడ్‌లోని విప్లవనాయకప్రముఖులందరు సమావేశమైవున్నారు. రెండుగంటలయేసరికి ట్రేడ్‌యూనియన్ల నాయకులలోను, సహకారోద్యమనాయకులలోని వామపక్షప్రతినిధులతో కలిసి యుద్ధపరిశ్రమసంఘంతాలూకు కార్మికవర్గనాయకులు కార్మిక ప్రతినిధుల సోవియెట్‌కు ఒక తాత్కాలిక కార్యవర్గాన్ని ఏర్పాటుచేశారు. ఈ కార్యవర్గంలో డ్యూమాలోని సోషలిస్టు ప్రతినిధులు ఛీడ్జే, స్కొబెలేవ్, మరి అయిదుగురుప్రముఖులు సభ్యులుగా నియమించబడ్డారు

ఈ కార్యవర్గం వెంటనే చర్యతీసుకొన్నది. నాటిసాయంకాలం ఏడుగంటలు కాకమునుపే వందలాదిప్రతినిధులురావడం ప్రారంభించారు. హాలుకు వెలుపల ఒక పెద్దబల్లచుట్టూ కొందరు కూర్చుని సమావేశానికి వచ్చిన ప్రతినిధుల పేర్లను నమోదుచేస్తున్నారు.

అధ్యక్షుని బల్లవద్ద 1905 నాటి సోవియట్‌కు నాయకత్వం వహించిన ఖ్రుషలేవ్, సోకోలోవ్ తాత్కాలికకార్యవర్గ సభ్యులరాకకై ఎదురు చూస్తూ కూర్చున్నారు. సోకోలోవ్‌రాత్రి తొమ్మిదిగంటలకు సమావేశాన్ని ప్రారంభించి ప్రెసిడియంను ఎన్నుకోవాలనికోరాడు. సమావేశం ప్రారంభమయేసరికి అక్కడ రెండువందలయాభైమంది ప్రతినిధులువున్నారు. కాని, తాము ఈ సంఘానికి చెందినవారమనీ, ఆ సంఘానికి చెందిన

వారమనీ చెప్పకుంటూ ఇంకా ప్రతినిధులు గుంపులుగుంపులుగా వస్తూనే వున్నారు.

ప్రతినిధులు ఆహారపరిస్థితినిగురించి, క్రమంగా పెరిగిపోతున్న అరాజకపరిస్థితిని అదుపులోపెట్టడానికి తీసుకోవలసిన చర్యలనుగురించి, జారిజంకు వ్యతిరేకంగా పోరాటానికిచేయవలసిన సన్నాహాలను గురించి చర్చించారు. తరువాత వారు ఛ్ఖీడ్జెఅధ్యక్షుడుగా, కెరెన్‌స్కీ, స్కోబెలేవ్‌లు ఉపాధ్యక్షులుగా, గ్వోజ్‌డియోవ్, సాకోలోవ్, గ్రిన్‌విచ్, పాంకోవ్‌లు కార్యదర్శులుగా ఒక శాశ్వతమైన ప్రెసిడియంను ఎన్నుకున్నారు.

ఒకసైనికులజట్టు తాముకూడా ప్రసంగించగోరుతున్నామనితెల్పగా, ఆకోరికను అందరు సముత్సాహంతో మన్నించారు. ఆ సైనికులు తమ సేనలలోజరుగుతూన్న సంఘటనలను గురించి నివేదించారు. రామనోవ్ పరిపాలనకు స్వస్తికినాందికాగలవారి ప్రసంగాలను సభవారు అమిత శ్రద్ధాసక్తులతో ఆలకించారు.

"మేము వోలిన్‌స్కీ రెజిమెంటుసైనికులం....మేము పాల్లోవిస్కీ రెజిమెంటుకు చెందినవారం .... మేము లిటోవిస్కీరెజిమెంటునుంచి వచ్చాము....మాది ఫిన్‌లిండ్‌స్కీ రిజెమెంటు....మేము గ్రెనేడియర్స్ పటాలంనుంచి వస్తున్నాము" అంటూ ఆసైనికులు ఆహారానికై జరిగిన కల్లోలాలను విప్లవంగామార్చిన సేనలపేర్లను చెబుతూవుంటే సభలోనివారు దిక్కులు పిక్కటిల్లేటట్టు హర్షధ్వానాలు చేశారు.

"మేము సమావేశాలు జరిపాము....మాసైనికాధికారులు పారిపోయి దాగున్నారు. కార్మికప్రతినిధుల సోవియెట్‌లో ప్రజలకు వ్యతిరేకంగా రాణీకొలువులో పనిచేయడం మాకు యిష్టంలేదని ప్రకటించవలసిందిగా మా సేనలు మాకు అధికారమిచ్చిపంపాయి..ప్రజోద్యమాన్ని సమైక్యతతో బలపరచడానికి మేము మా సోదరులైన కార్మికులతో చేతులు కలువుతున్నాము....ఈ మహోద్యమంకోసం మా ప్రాణాలను అర్పించడానికి మేము సిద్ధంగావున్నాము... విప్లవం చిరస్థాయిగా వర్ధిల్లుగాక!" అంటూ ఆ సైనికులు ప్రసంగాలుచేశారు.

విప్లవసైన్యాన్ని, కార్మికులనుకలిపి ఐకేసంస్థగా సమైక్యంచేయడానికి ఒక్క నిముషములో ప్రతినిధులు నిర్ణయించారు. ఈసారి ఆసభ కార్మిక, సైనికప్రతినిధుల సోవియట్‌గా రూపొందింది.

సోవియెట్ పరిస్థితినిగురించి చర్చిస్తూవుండగా యువకుడైన ఒక సైనికుడు తన రైఫిల్‌ను చేతులతో పైకెత్తి త్రిప్పుకుంటూ లోపలికి పరుగెత్తుకొనివచ్చి, "సోదరులారా, కామ్రేడ్‌లారా, సెమియొనోవిస్కీ గార్డ్స్ సైన్యానికిచెందిన సైనికులందరితరపున మీకు స్నేహపూర్వకమైన అభినందనాలను గొనివస్తున్నాను. మాలో ప్రతి ఒక్కరంకూడా ప్రజలతో చేతులుకలిపి కృషిచేయడానికి కృతనిశ్చయులమైనాము" అని కేకవేసి ప్రకటించాడు.

మరొకసారి సభవారిలో ఆనందోత్సాహాలు హద్దులేకుండా వెల్లివిరిసి పోయాయి. ఈ సెమియొనోవిస్కీ గార్డ్స్ 1905 లో మాస్కోలో జరిగిన తిరుగుబాటును అణచివేశారనేసంగతి ప్రేక్షకులందరికి బాగాతెలుసు.. ఒక్కొక్కసైన్యమే తన ప్రతినిధులను హుటాహుటిని ఈ మహాసభకు ఉరికిస్తున్నకొద్దీ జార్‌చక్రవర్తి సైన్యాలపైగల ఆధిపత్యం, అధికారం పూర్తిగా శిథిలమైపోయిందనీ, ఆయన ఇక విప్లవాన్ని సేనలసహాయంతో నిలువరించజాలడనీ విప్లవపూరితమైన పెట్రోగ్రాడ్‌కు మరింతగా తెటతెల్లమౌతూవచ్చింది.

అంతట, శాంతిభద్రతలకు భంగంకలిగించకుండా ప్రశాంతంగా వుండవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తిచేస్తూ సోవియెట్ ఒక ప్రకటనచేసింది.. ఒకరాజ్యాంగపరిషత్తును ఎన్నుకోవలసిందిగా ప్రజలను ఆహ్వానిస్తూ ఈ ప్రకటన ముగించబడింది.

మరునాడు . పెట్రోగ్రాడ్‌సోవియెట్ తరపున వెలువరించబడిన "ఇజ్వెస్తియా" పత్రిక మొట్టమొదటి సంచికలో ఇది ప్రచురించబడింది.

వివిధరాజకీయపక్షాలవైఖరి ప్రతినిధులకు చక్కగా తెలీకపోయి నందుననేమి, ఆ పక్షాలేదానిని స్పష్టంగాప్రకటించనందుననేమి తరవాత

శాశ్వతమైన కార్యవర్గానికి జరిగినఎన్నికలు చాలావరకు పార్టీలతోనిమిత్తం లేకుండా జరుపబడ్డాయి.

మొదటికొద్దివారాలలోను, విప్లవంలో మునుముందుకీలకపాత్రలను నిర్వహించిన నాయకులలో ఒక్కరుకూడా కార్యవర్గంలో సభ్యులుగాలేరు. వారిలో కొందరు ప్రవాసంలోను, మరికొందరు విదేశాలలోను వుండి పోయారు.

మొదటిరోజులలో సోవియెట్‌విప్లవాన్ని వ్యాపింపజేసి, విప్లవం సాధించినవిజయాలను సుసంఘటితంగా చేసుకోవడమే తనకు కర్తవ్యంగా పెట్టుకొన్నది. సోవియెట్ సంప్రదాయసిద్ధమైన పార్లమెంటరీ సంస్థకాదు. నిర్దిష్టమైన నిబంధనావళి ఏమీలేకుండానే అది పనిచేస్తూవచ్చింది. దాని సభ్యులసంఖ్య త్వరలోనే 2,000 గా తేలింది; మార్చి నెల 15వ తేదీ ప్రాంతానికి ఈ సంఖ్య దాని ప్రతినిధులసంఖ్య 3,000 కు పెరిగింది.

జార్‌ను చూసివచ్చేనిమిత్తం ఒక రైల్వేట్రెయిన్‌ను ఏర్పాటుచేసుకోడానికి తనకు అనుమతినివ్వవలసిందిగా రాడ్జియాంకో సోవియెట్‌కు విజ్ఞాపన చేశాడు. ఈ సోవియెట్టే జనరల్‌సమ్మెను నిలిపివేయించింది; ఫ్యాక్టరీతిరిగి యథాప్రకారం పనిచేసేటట్టుచేసింది; నగరాల వీధులలో తిరిగి బస్సులు మున్నగు సర్వీసులు ఎప్పటివలెనడిచేటట్టు చేసింది.

డ్యూమాలో పరిస్థితి ఇంకా గందరగోళంగానేవున్నది. తరవాత ఏమి జరుగుతుందో ఎవరికీ తెలియదు. కెరెన్‌స్కీ, ఛ్ఖీడ్జె సాహసోపేతమైన చర్య తీసుకున్నారు: వారు వీధులలోకివెళ్ళి తిరుగుబాటులో చేరవలసిందిగా సైనికులకు సరాసరి స్వయంగా విజ్ఞప్తిచేశారు. సైనికులు వారి విజ్ఞప్తిని హృదయపూర్వకంగా మన్నించి తిరుగుబాటులో ఇంకాఎక్కువసంఖ్యలలో చేరడం ప్రారంభించారు.

పెట్రోగ్రాడ్‌సోవియెట్ తమకిచ్చిన అధికారాన్ని పురస్కరించుకొని కెరెన్‌స్కీ, ఛ్ఖీడ్జె ప్రభుత్వాధికారాన్ని కైవశంచేసుకొనే నిమిత్తం ఒక తాత్కాలికసంఘాన్ని ఎన్నుకొనేటట్టు డ్యూమాసభ్యులలో అత్యధికసంఖ్యాకులను ప్రోత్సహించగలిగారు. వారిద్దరుకూడా ఆసంఘంలో సభ్యులైనారు.

జార్‌పరిపాలనకు స్వస్తిచెప్పడాన్ని పూర్తిచేయవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తిచేస్తున్న ''ఇజ్వెస్తియా'' పత్రిక తొలిసంచిక నగరప్రాకారాలనిండా అతికించబడింది.

అంతట, జార్‌మంత్రివర్గం పదవినుంచి తప్పుకోడానికి తన సంసిద్ధతను ప్రకటించింది. బాధ్యతగల మంత్రివర్గాన్ని నెలకొల్పాలని రాజా తుదిక్షణపు విజ్ఞాపనను చేయవలసిందిగా గ్రాండ్‌డ్యూక్‌మైఖైల్ యుద్ధతంత్ర కార్యాలయాధ్యక్షుడు •జనరల్ అలెగ్జియేవ్‌కు అమితఆందోళనతో టెలిఫోన్‌చేశాడు. అలాంటిపని తానేమీ చేయబోవడంలేదని జార్ సమాధానమిచ్చాడు.

మొఘిలేవ్ సమీపంలోని సైనికప్రధానకార్యాలయంవద్ద తనసొంత రైలుబండిలో మకాంవున్న నికోలస్‌దేశంలో ఏమిజరిగిపోతున్నదీతెలుసుకోలేకపోయాడు. ఆయన అతికఠినంగా వ్యవహరిద్దామనుకున్నాడు. తిరుగుబాటును అణచివేయడానికి ఒక డిక్టేటరును నియమిస్తే సరిపోతుందనుకున్నాడు. జనరల్ ఇవానోవ్‌ను నియమించడానికి నిర్ణయించుకున్నాడు. మార్చి 13వ తేది రాత్రి రాజభక్తిపరులుగా భావించబడుతున్న సైనికులతోకూడిన ఒకపటాలాన్ని వెంటబెట్టుకుని జనరల్‌ఇవానోవ్ రాజధానికి బయలుదేరాడు. తన ట్రెయిన్‌ను పెట్రోగ్రాడ్ సమీపంలో ట్సార్స్కోయేసెలోకు తిరిగిపట్టించవలసిందిగా నికోలస్‌ఉత్తరువు చేశాడు. రాత్రి రెండుగంటలకు చక్రవర్తి ట్రెయిన్ మలయవిషేరాస్టేషన్‌లో ఆగేసరికి ప్లాట్‌ఫారంమీద ఆందోళనపడుతున్న జనులగుంపువేచివున్నది. ''తమ ట్రెయిన్‌ను తిన్నగా పెట్రోగ్రాడ్‌కు పట్టించవలసిందిగా మాకు ఉత్తరువులు వచ్చాయి. అక్కడ ఒక తాత్కాలిక ప్రభుత్వమిప్పుడు అధికారంలో వున్న''దని వారనాయకులు చక్రవర్తికి తెలియజేశారు.

వెంటనే చక్రవర్తి ట్రెయిన్‌వెనుకకుతిరిగి పిస్కోవ్‌కు బయలుదేరింది. అక్కడ జనరల్‌రూజ్‌స్కీ ప్రధానకార్యాలయంవున్నది. జనరల్‌రూజ్‌స్కీ బహుశా తనకు సహాయపడవచ్చునని చక్రవర్తి ఆశించాడు.

ఇవనోవ్ తిరుగుబాటును అణచివేయగలడనే ఆశ చక్రవర్తికింకా పోలేదు.

ఈలోగా రాణి, ట్సార్‌స్కోయే సెలోకువెళ్ళింది. ఆమె తనభర్తకు ఇలావ్రాసింది: ''పరిస్థితిఅంతా అధ్వాన్నంగావుంది. మిమ్మల్ని ఎక్కడ కలుసుకోగలనో తెలియడంలేదు. కాని, పరిస్థితులన్నీ అవే చక్కబడగల వని నేను పూర్తిగా నమ్ముతున్నాను. ఈనావిశ్వాసం అచంచలమైనట్టిది. మీరు ఎక్కడవున్నారో సరిగా తెలియనందున ప్రధానకార్యాలయంద్వారా మీ సమాచారం తెలుసుకోడానికి ప్రయత్నించాను. మిమ్మల్ని ఎక్కడ, ఎందుకు ఆపుచేశారో తనకుతెలియనట్టు రాడ్జియాంకో నటించాడు. రాజ్యాంగంమీదో, అటువంటి అసహ్యకరమైన మరేదైనా పత్రంమీదో మీచేత సంతకంపెట్టించేదాకా మీరు నన్ను కలుసుకోకుండా చెయ్యడానికి వీళ్లు ప్రయత్నిస్తున్నారనడం స్పష్టమే. బోనులోపట్టుబడిన ఎలుకవలె, సైన్యంసహాయంలేకపోతే మీరు ఏమిచేయగలరు? చక్రవర్తిని నిర్బంధంలో వుంచడంకంటె నీచత్వం, దారుణం వేరేమివుంటుంది? ఇంతటి ఘోరాన్ని చరిత్రలో ఎన్నడూ కనివినియెరుగం పిస్కోవ్‌లోను, ఇతరచోట్లకూడా మీరు బయటికివచ్చి సైనికులకు దర్శనమివ్వడంద్వారా వారిని బహుశా కూడగట్టుకోవచ్చుననుకుంటాను. మీరు ఒకవేళ కొన్ని వాగ్దానాలను చేయ వలసివచ్చినప్పటికీ, అవి బలవంతంగా ఒత్తిడిచేసి తీసుకొనబడినవైనందున వాటిని మీరు పాలించితీరాలనే కించపెట్టుకోనవసరంలేదు.''

తాత్కాలిక డ్యూమాసంఘం ఆదేశాలకు తలవంచవలసిందిగా రూజ్‌స్కీ చక్రవర్తికిసలహాయిచ్చాడు. ఒకగంటకుపైగాతీవ్రంగా వాదించిన పిమ్మట రాడ్జియాంకో నాయకత్వంక్రింద బాధ్యతగల మంత్రివర్గాన్ని నెల కొల్పడానికి జార్ సమ్మతించాడు. రూజ్‌స్కీ తరువాతతిరిగివచ్చి జనరల్ ఇవానోవ్ జారీచేసిన ఉత్తరువులనురద్దుచేయవలసిందిగా చక్రవర్తినికోరాడు. నికోలస్ దాస్తోహమన్నాడు.

మార్చి 14వ తేదీ తెల్లవారుజామున మూడుగంటలకు జార్ ఈ కోరికలను అంగీకరించాడు. ఈ విషయాన్ని రూజ్‌స్కీ వెంటనే రాడ్జి

యాంకోకు తెలియపరచాడు. కాని, జార్ ఉత్తరువులు అందగానే వాటిని చూసి రాడ్జియాంకో ఆగ్రహావేశపరవశుడైపోయాడు. ఈ చర్యను తీసుకో వలసిందిగా ఆయన కొన్నివారాల క్రిందటే జార్‌కు సిఫారసు చేశాడుగా? అప్పుడు ఈ చర్యనుతీసుకోవడం సాధ్యమైవుండేదికూడా. కాని, ఇప్పుడో? జార్ రాజ్యపరిత్యాగం చెయ్యాలని ప్రజలు గట్టిగా కోరుతున్నారు.

ఆనాడుదయం పదిగంటల పదిహేను నిమిషాలకు రూజ్‌స్కీ మళ్లీ జార్‌ట్రెయిన్‌లో ప్రత్యక్షమైనాడు. తాను రాడ్జియాంకోతో జరిపిన సంభాషణల పాఠాన్ని రూజ్‌స్కీ నికోలస్ ముందుపెట్టాడు. దానిని చదివి వినిపించ వలసిందిగాచక్రవర్తిరూజ్‌స్కీనికోరాడు. అంతట, ఆయన తనఆసనంనుంచి లేచి నెమ్మదిగా కిటికీవద్దకు నడిచివెళ్ళాడు. ఒక్కనిమిషం అంతా నిశ్శబ్దంగావున్నది. కడకు, నికోలస్‌కుతిరిగి ఆత్మసంయమనం లభించింది. ఆయన కంఠస్వరం ఎట్టి ఒడుదుడుకులేకుండా గంభీరంగావున్నదికాని, మాటలుమాత్రం దాదాపు ఒకదానికొకటి సంబంధంలేకుండా వచ్చాయి. "రష్యామేలుకోసం నేను తప్పుకోవడం అవసరమైతే, అందుకు నేను సంసిద్ధంగావున్నాను. అయితే, ప్రజలు అపోహపడతారేమోనని భయ పడుతున్నాను....ఎందుకు, నేను యుద్ధరంగంనుంచి వైదొలగిపోయానని కొస్సాక్‌లు నాపైనిందారోపణచేస్తారు..నేను కష్టాలు అనుభవించడానికే పుట్టాను. రష్యాకు నేను కష్టాలు తెచ్చిపెడుతున్నాను....అయితే, నేను పట్టాభిషేకంనాడు స్వీకరించిన ప్రమాణానికి భంగంకలిగిస్తే రాజభక్తులు నన్ను ఎన్నటికీ క్షమించబోరు...."

ఈ సమయంలో యుద్ధతంత్రకార్యాలయాధ్యక్షుడు జనరల్ అలెగ్జీ మేవ్ దగ్గరనుంచి ఒక టెలిగ్రాంవచ్చింది. గ్రాండ్‌డ్యూక్ మైఖైల్‌రిజెంటుగా జార్ తన కుమారునికి పట్టంకట్టి తాను రాజ్యపరిత్యాగం చేస్తేనేయుద్ధానికి కొనసాగించడం సాధ్యంకాగలదని దానిలో ఆయన పేర్కొన్నాడు. ఒక్కొక్క క్షణం గడచినకొద్దీ విప్లవకారులకోరికలు ఎక్కువైపోతూవుంటాయి.

రూజ్‌స్కీ చక్రవర్తికి అలెగ్జీమేవ్‌పంపిన టెలిగ్రాంను చదివి వినిపించాడు.

''దీనిపై నీ అభిప్రాయంఏమిటి, నికోలై వ్లాడిమిరోవిచ్?'' అని జార్ ప్రశ్నించాడు.

''ఇది చాలా ముఖ్యమైనవిషయం. దీనినిగురించి శ్రద్ధగా ఆలోచించడానికి మరికొంత వ్యవధినివ్వవలసిందిగా ఏలినవారినికోరుతున్నాను. తక్కిన యుద్ధరంగాలలో మనసైన్యాలకు నాయకత్వంవహిస్తున్న సేనానులు ఏమంటారో ముందువినాలి'' అన్నాడు జనరల్ వ్లాడిమర్‌విచ్.

మధ్యాహ్నం రెండుగంటలకు రూజ్‌స్కీతిరిగి చక్రవర్తి వద్దకు వచ్చాడు. ఈసారి ఆయనవెంట మరి యిద్దరుసేనానులుకూడా వున్నారు.

రూజ్‌స్కీ చక్రవర్తికి తాజావార్తలను నివేదించాడు: జార్ సొంత అంగరక్షకదళం తిరుగుబాటుజరిపి ప్రజోద్యమంలో పాల్గొనడానికి డ్యూమాకు బయలుదేరి వెళ్ళిపోయింది. రాణి రాడ్జియాంకోతో సంప్రతించాలని కోరుతున్నది: గ్రాండ్‌డ్యూక్ సిరిల్‌వ్లాడిమిరోవిచ్ ఒకసేనపై ఆధిపత్యాన్నిస్వీకరించి డ్యూమాపట్ల భక్తివిశ్వాసాలుకలిగి సేవిస్తానని బాస చేశాడు; మాస్కోజిల్లా మిలిటరీగవర్నరు తాత్కాలిక డ్యూమాసంఘం అధికారాన్ని ఆమోదించి, శిరసావహించాడు; జార్‌మంత్రులందరు అరెస్టు చేయబడ్డారు.

రెండున్నర గంటలకు వివిధ యుద్ధరంగాలలోని సేనానుల సమాధానాలను పొందుపరుస్తూ అలెగ్జియేవ్‌పంపిన టెలిగ్రాంఅందింది. ఈ సేనానులందరుకూడా చక్రవర్తి రాజ్యపరిత్యాగం చేయడమే తమ అభిమతమని వెల్లడించారు.

ఒక్కక్షణం ఎవరూ మాట్లాడలేదు. ''నేనొక నిర్ణయానికివచ్చాను'' అన్నాడు రాజు; ''రాజ్యపరిత్యాగంచేస్తున్నాను'' అని ప్రకటించాడు. ఆయన మౌనంగా దైవప్రార్థనచేశాడు. సేనాపతులుకూడా అలాగే ప్రార్థన చేశారు.

పిమ్మట, టెలిగ్రాఫ్‌ఫారాలమీద రాజు రెండుసందేశాలనువ్రాశాడు. రాడ్జియాంకోకొరకు ఉద్దేశించిన టెలిగ్రాంలో ఇలాపేర్కొన్నాడు: ''మాతృ

దేశమైన రష్యాశ్రేయోభివృద్ధికోసం, విమోచనంకోసం ఎంతటిత్యాగాన్ని చేయడానికైనాసరే నేను వెనుదీయను. అందుచేత నాసోదరుడుమైఖైల్ అలెగ్జాండ్రోవిచ్ రీజెంటుగా నాకుమారినికి సింహాసనం అప్పగిస్తూ రాజ్య పరిత్యాగంచేయడానికి నేను సంసిద్ధంగావున్నాను. అయితే, నా కుమారుడు యుక్తవయస్సు వచ్చేవరకు నాతోనేవుండాలి.''

జనరల్ అలెగ్జీమేవ్‌కు పంపదలచిన రెండవ టెలిగ్రాంలో ఇలా ప్రకటించాడు. ''ప్రియతమమైన మన: రష్యాకు సౌఖ్యసౌభాగ్యాలను సంతరించేనిమిత్తం నాకుమారునికి సింహాసనం అప్పగిస్తూ రాజ్యపరిత్యాగం చేయడానికి నేను సంసిద్ధంగావున్నాను. అతనిని భక్తివిశ్వాసాలతో త్రికరణశుద్ధిగాసేవించవలసిందిగా సమస్తప్రజానీకానికి విజ్ఞప్తిచేస్తున్నాను."

1917, మార్చి 15వ తేదీఉదయం అయిదుగంటలకు జార్‌చేత సంతకంపెట్టించడానికి రాజ్యపరిత్యాగపత్రాన్ని తీసుకుని డ్యూమాప్రతినిధులుగుచ్‌కోవ్,షూల్జిన్‌లుపెట్రోగ్రాడ్‌నుంచి పిస్కోవ్‌కు బయలుదేరారు.

షూల్జిన్ తరవాత ఇలావ్రాశాడు:

''రాత్రిపదిగంటలకు మేము పిస్కోవ్‌చేరాము. ట్రెయిన్‌దిగి ప్లాట్‌ఫారమ్‌మీదికి వెళ్లాము....ఒకవ్యక్తి మావద్దకువచ్చి రాజు మాకోసం నిరీక్షిస్తున్నాడని తెలియజేశాడు. అతనివెంట మేము రైలుపట్టాలనుదాటి రాజువున్న పెట్టెదగ్గరకు వెళ్లాము. కొద్దినిమిషాలలోనే ఆయన మాకు దర్శనమిచ్చాడు. మేము వినమ్రతతో తలవంచి నిలబడ్డాము. ఆయన మాతో సుహృద్భావపూర్వకంగా కరచాలనంచేసి రెండు ఆసనాలను చూపి 'కూర్చోండి' అన్నాడు. గుచ్‌కోవ్ మాట్లాడడం ప్రారంభించాడు. ఆయన చాలా ఉద్రేకంగావున్నాడు....రాజధానిలో ఏమిజరుగుతున్నదీ వివరించాడు .. పెట్రోగ్రాడ్‌లో పరిస్థితులను వున్నవివున్నట్లు వర్ణించి చెప్పాడు. రాజు ప్రశాంతంగా కూర్చునివిన్నాడు.

గుచ్‌కోవ్ మాట్లాడడం పూర్తికాగానే చక్రవర్తి శాంతగంభీరస్వరంతో ఇలా అన్నాడు: 'సింహాసనాన్ని పరిత్యజించడానికి నేను నిశ్చయించు

కున్నాను. మధ్యాహ్నం మూడుగంటలవరకుకూడా నా కుమారుడు అలెగ్జివ్‌కు సింహాసనంఅప్పగించి రాజ్యపరిత్యాగంచేయాలని అనుకున్నాను. కాని అప్పుడు నా మనస్సును మార్చుకొని నా సోదరుడు మైఖైల్‌కు సింహాసనాన్ని అప్పగించి రాజ్యాన్ని పరిత్యజించడానికి నిర్ణయించుకున్నాను....''

''ఇలా జరుగుతుందని మేము అనుకోలేదు. గుచ్‌కోవ్ కొన్ని అభ్యంతరాలను తెల్పినమీదట ఆయనతో ఒక పావుగంటసేపు నేను సంప్రతించాలని సూచించాననుకుంటాను. కాని, ఆ సంప్రతింపులు జరగనేలేదు. చక్రవర్తి చెప్పినదానికి మేము అంగీకరించాము. అంతకు మించి మేము చేయగలిగిన దేమున్నది?....

''అంతట, చక్రవర్తిలేచాడు. మేమందరంకూడా లేచినిలబడ్డాము. గుచ్‌కోవ్ తనవద్దవున్న రాజ్యపరిత్యాగపత్రం మతలబుసుతీసి చక్రవర్తికి అందించాడు. ఆయన దానిని తీసుకొని లోపలికివెళ్ళాడు. కొంచెంసేపు అయినతరవాత ఆయన రాజ్యపరిత్యాగప్రకటనపాఠంతోకూడిన పత్రాన్ని తీసుకువచ్చి గుచ్‌కోవ్‌కు యిచ్చాడు.

''అప్పటికి రాత్రి ఇరవైనిమిషాలుతక్కువగా పంద్రెండుగంటలైంది. చక్రవర్తి మాతో కరచాలనంచేసి మాకు సెలవిచ్చాడు. అప్పుడు ఆయన వైఖరి మేము అక్కడకు వెళ్ళినప్పటికంటెకూడా ఎక్కువ సుహృద్భావ పూర్వకంగా వున్నదనేచెప్పాలి....మేము రైలుపెట్టెవద్దకు తిరిగివచ్చాము.. ఉదయానికి పెట్రోగ్రాడ్ చేరుకున్నాము.''

ఈలోగా, పెట్రోగ్రాడ్‌లో డ్యూమాసంఘం, సోవియెట్‌కార్యవర్గం కలిసి క్రొత్తతాత్కాలికప్రభుత్వానికి సభ్యులను నియమించాయి. ఆ మంత్రివర్గంలో అఖిలరష్యన్ జెంస్ట్వోల, మునిసిపాలిటీలయూనియన్ అధ్యక్షుడు ప్రిన్స్‌జార్జిల్వోవ్‌ప్రధానిగాను, కేడెట్‌పార్టీనాయకుడు, ప్రొఫెసర్‌పాల్ మిలియూకోవ్‌మంత్రిగాను, అలెగ్జాండర్‌కెరెన్‌స్కీ న్యాయశాఖామంత్రిగాను నియమించబడ్డారు.

నికోలస్‌చక్రవర్తి రాజ్యపరిత్యాగపత్రం అంతామించిపోయిన పిమ్మటవచ్చింది: కార్మిక, సైనికప్రతినిధుల సోవియెట్ అసలు రాజ వంశమే ఇక అధికారంలోవుండరాదని నిర్ణయించి, దానిని గుర్తించడానికి నిరాకరించింది.

మార్చి 16వ తేదీ ఉదయం ఆరుగంటలకు కెరెన్‌స్కీ గ్రాండ్ డ్యూక్‌కు టెలిఫోన్‌చేసి, రాడ్జియాంకోనాయకత్వంక్రింద డ్యూమాసంఘ సభ్యులు ఆయనతో మాట్లాడగోరుతున్నారని తెలియజేశాడు. ఒక్క మిలియూకోవ్‌తప్ప ఆ సంఘంలోని తక్కిన సభ్యులందరూకూడా సింహా సనం తనకువలదని ప్రకటించవలసిందిగా గ్రాండ్‌డ్యూక్‌కు నచ్చచెప్ప డానికి నిర్ణయించుకున్నారు.

ఈ మెజారిటీ అభిప్రాయాన్ని రాడ్జియాంకో గ్రాండ్‌డ్యూక్‌కు తెలియ పరచాడు. శాంతిభద్రతలను స్థాపించాలంటే రష్యన్‌ప్రజలు బాగా అలవాటుపడిన అధికారయుక్తమైన చిహ్నం ఒకటివుండడం అవసరమనీ, పరిపాలకుడుగావుండే రాజే ఆ చిహ్నమనీ మిలియుకోవ్ వాదించాడు.

కొన్నిగంటలసేపు చర్చజరిగినపిమ్మట, సింహాసనానికీ తనకుగల హక్కును వదలుకోడానికి గ్రాండ్‌డ్యూక్ నిర్ణయించుకున్నాడు.

ఈలోగా, అలెగ్జాండ్రా 1905 నాటిచరిత్ర పునశ్చరణకాగలదని ఇంకా ఆశపడుతూనేవున్నది. ఆ సంవత్సరం నికోలస్ ప్రజలకు ఒక రాజ్యాంగాన్ని, పౌర స్వాతంత్ర్యాలను ముందు మంజూరుచేసి, తరువాత తన వాగ్దానాన్ని ఉపసంహరించుకొని విప్లవాన్ని అణచివేశాడు.

మార్చి 16వ తేదీని ఆమె ఇలావ్రాసింది.

''ఓ నా వీరశిఖామణీ! మీచర్యను నేను బాగా అర్థంచేసుకున్నాను. పట్టాభిషేకసమయంలో మీరు చేసిన ప్రమాణానికి విరుద్ధంగావుండే ఏ పత్రంపైనకూడా సంతకంచేయజాలరని నాకుతెలుసు. మాట్లాడనవసరం లేకుండానే మనం ఒకరినొకరం పూర్తిగా అర్థంచేసుకోగలం. మీ రాజ్య పరిపాలన కడువైభవోపేతంగా పరిఢవిల్లేటట్టు మీ ప్రజలే, సైన్యమే

మిమ్మల్ని తిరిగి సింహాసనాన్ని అధిష్ఠింపజేయగలరనే పరిపూర్ణవిశ్వాసం నాకుకలదు. ఆ శుభదృశ్యాన్ని మేము కన్నులవిందుగా చూస్తాము. మీ తనయునికోసం, దేశంకోసం మీరు సామ్రాజ్యాన్ని వరిరక్షించారు; మీకు ఆ దేవదేవుడే ఈ భూలోకంలో మీ దేశంలో పట్టాభిషేకంచేయగలడు.''

ఇప్పుడు రష్యాలో పెట్రోగ్రాడ్ కార్మిక, సైనికప్రతినిధుల సోవియెట్ అమితప్రాముఖ్యంగల సంస్థగా రూపొందింది. డ్యూమాతాత్కాలిక సంఘం, సోవియెట్ కార్యవర్గంకలిసి రూపొందించిన ఎనిమిదిప్రాథమికమైన సిఫారసులను శిరసావహించి పాలిస్తానని ప్రమాణంచేసినమీదట తాత్కాలికప్రభుత్వం అధికారాన్ని ఈ సోవియెట్ గుర్తించింది. ఆ ఎనిమిది సిఫారసులు ఇవి: అందరు రాజకీయఖైదీలను, దేశబహిష్కృతులను వెంటనే పూర్తిగా విడుదలచేయడం; ప్రజలకు వాక్సభాప్రచురణస్వాతంత్రాలను, సమ్మెజరిపేస్వాతంత్ర్యాన్ని ప్రసాదించడం; మతవర్గవిచక్షణను నిర్బంధాలను పూర్తిగా రద్దుచేయడం; రష్యాకు వుండవలసిన ప్రభుత్వ స్వరూపాన్ని నిర్ణయించి ఒక రాజ్యాంగవిధానాన్ని ఆమోదించే నిమిత్తం అందరకు వోటింగు హక్కువుండేపద్ధతిని రహస్యపు బ్యాలెట్ విధానం ద్వారా ఒక రాజ్యాంగనిర్ణయపరిషత్తును ఎన్నుకొనజేయడం; పోలీసుశాఖ స్థానేస్థానికఅధికారుల ఆజ్ఞకు బద్ధమైవుండేజాతీయసైన్యాన్ని నెలకొల్పడం మునిసిపాలిటీలకుఉద్యోగులను ప్రజాస్వామికపద్ధతిపై ఎన్నుకొనజేయడం; విప్లవంలో పాల్గొన్నసైనికదళాలను పూర్తిగా ఆయుదసమన్వితంగావించి పెట్రోగ్రాడ్ లో నిల్పడం; తమవిధులను నిర్వర్తించేటప్పుడు సైనికక్రమశిక్షణకు భంగంలేని పద్ధతిని సైనికులకు పౌరస్వాతంత్ర్యాలను విస్తరింపజేయడం.

ఈసమయంలో ప్రజల అశేషఆదరాభిమానాలను చూరగొని కెరెన్‌స్కీ వీరునివలె ఆరాధించబడుతున్నాడు. మొట్టమొదటి విప్లవ ప్రభుత్వంలోనున్న సోషలిస్టు ఆయనఒక్కడే అయినప్పటికీ, ఆయన కార్మిక, సైనికప్రతినిధుల సోవియెట్ కుకూడా ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. రాజకీయనేరాల విచారణలలో ముద్దాయిలతరపున కడుసమర్థంగా వాదించే

న్యాయవాదిగా ఆయన సుప్రసిద్ధిపొందినట్టివాడు. లెనా బంగారుగనులలో మూకవుమ్మడిగా జరిగిన సమ్మెదార్ల హత్యాకాండనుగురించి దరియాప్తు చేసి అసమానప్రతిభను ప్రదర్శించడంతో ఆయనకీర్తి మరింతగా దశదిశలకు వ్యాపించింది. ఆయన కార్మికశ్రేయోభిలాషిగా డ్యూమాలో ప్రవేశించి క్రమంగా దానిలోని మితవాదసోషలిస్టు వర్గానికి నాయకుడైనాడు.

మొట్టమొదటి తాత్కాలికప్రభుత్వం చాలావరకు 'బూర్జ్వా' తత్వం గలదే అయినప్పటికీ, మెన్షెవిక్‌లు, సోషలిస్టు విప్లవవాదులు అత్యధిక సంఖ్యాకులుగాగల సోవియెట్ ఆదేశాలను అది ఔదలదాల్చవలసి వచ్చింది. ఈ సభ్యులలో దాదాపు అందరుకూడా తాత్కాలిక ప్రభుత్వాన్ని భూస్వాముల హయాంగా పరిగణించారు. సంఘంలో పెద్దఎత్తున సంస్కరణలను, రాజకీయస్వాతంత్ర్యాన్ని సంతరించగలవధంలో విప్లవాన్ని నడిపించడానికి సోవియెట్ కృతనిశ్చయమైవున్నది. తన సంతకం కూడా వుంటేతప్ప తమ అధికారులఆజ్ఞలను శిరసావహించవలదని తెల్పుతూ పెట్రోగ్రాడ్ సోవియెట్ 1917 మార్చి 15వ తేదీని సైనికులకు ఉత్తరువులు జారీచేసింది. ప్రతిసైనికదళంకూడా స్థానికంగా సోవియెట్‌లను ఏర్పాటుచేసుకోవాలనికూడా ఈ వుత్తరువులలో పేర్కొనబడింది. ఈ ఉత్తరువులతో సైన్యంలో క్రమశిక్షణ నశించింది.

కెరెన్‌స్కీ ఆదిలో డ్యూమాలోని మితవాదులకు, సోవియెట్‌లోని అతివాదులకుమధ్య సమైక్యసమన్వయాలను సాధించేసేతువుగా పని చేశాడు. ఆయన దేశమందంతటా పర్యటించి ప్రజలను ఉద్బోధించి నూతనప్రభుత్వానికి వారి అండదండలను సమకూర్చడంలో ప్రముఖ పాత్రను నిర్వహించాడు.

ఒడెస్సాలో ఒకసారి సైనికదళాలసమావేశంలో ప్రసంగిస్తూ ఆయన ఇలా అన్నాడు: "మొత్తం దేశాన్నంతను ఉర్రూతలూగిస్తున్న సమధికానందోత్సాహాలను నేను కళ్ళారా చూస్తున్నాను. బానిసలను స్వతంత్రులుగా మార్చివేసే రష్యన్‌విప్లవంవంటి మహాద్భుతాలు శతాబ్దానికి ఒక్కసారిమాత్రమే సంభవిస్తాయి. మనం చాలాకష్టాలను అనుభవించాము.

ఇప్పుడు రష్యన్‌ప్రజలందరి హృదయాలలో ఒకేఒక భావం స్పందిస్తున్నది. మొత్తం ప్రపంచానికే శాంతినిసాధించడానికి కొనసాగుతున్న మహోద్యమాన్ని జయప్రదంగావించడానికి మనం యావచ్ఛక్తినీ వినియోగించి పాల్గొందాము. సకలదేశాలు సౌఖ్యస్వాతంత్ర్యాలతో విలసిల్లాలనేవాదంలో మనకు పరిపూర్ణమైన విశ్వాసంకలదు.''

లిబరల్‌పక్షానికి చెందిన మితవాది ప్రొఫెసర్ యూజీన్ ట్రూబెట్‌స్కాయ్ ఇలా వ్రాశాడు:

''ఈవిప్లవం నిరుపమానమైనది. ఇదివరలో బూర్జ్వావిప్లవాలు, కార్మికవిప్లవాలు జరిగాయిగాని, ప్రస్తుతరష్యన్ విప్లవంవంటి వికరమైన జాతీయవిప్లవంమాత్రం ఎన్నడూ జరిగివుండలేదని నిస్సందేహంగా చెప్పవచ్చు. ప్రతిఒక్క వ్యక్తిచేసినకృషి ఈవిప్లవంలో కార్మికులు, సైనికులు, బూర్జ్వావర్గంవారు, కడకు ప్రభువులు—ఒకరననేల దేశంలోని సమస్తవర్గాలప్రజలు పాల్గొన్నారు.''

ఈ తత్వమే మార్చివిప్లవాన్ని అమితచైతన్యవంతంగాచేసింది. ఇదే 1917, ఏప్రిల్ 20వ తేదీనాటి ''ప్రావ్దా'' పత్రికలో లెనిన్ పేర్కొన్నట్టు రష్యాను ఒక్కపూటలో ''మొత్తం ప్రపంచంలోని కంతటికి స్వాతంత్ర్యం మూర్తీభవించిన దేశంగా''గా మార్చివేసింది.

## పెట్రోగ్రాడ్‌కు లెనిన్ మార్గం

రష్యాలో విప్లవంప్రారంభమైనట్టువచ్చినవార్త లెనిన్‌కు ఆశ్చర్యం కలిగించింది; ఇంత తొందరగా విప్లవంవస్తుందని ఆయన అనుకోలేదు. 1917 మార్చిలో బోల్షివిక్ నాయకులలో అత్యధికసంఖ్యాకులు విదేశాలలోనో, సైబీరియాలోనో ప్రవాసంలోవున్నారు. జినోవియేవ్, సెమాష్కో, ల్యూనాచర్‌స్కీ, లిట్వినాఫ్, చిచెరిన్, గానెట్‌స్కీ, రాడెక్, రియాజనోవ్ మదాం కొల్లాంటై, లెనిన్ అనేకసంవత్సరాలుగా విదేశాలలో-కొందరు స్విట్జర్లెండ్‌లోను, మరికొందరు లండన్, పారిస్‌నగరాలలోను-వుంటున్నారు బుఖారిన్ ట్రాట్‌స్కీతోకలిసి ఒకప్రవాసపత్రికకు సంయుక్తసంపాదకుడుగా

న్యూయార్క్‌లోవున్నాడు. స్టాలిన్, కామనేవ్, స్వెర్డ్లాఫ్‌లు సైబీరియాలో వున్నారు.

ప్రాతకాప్రమేడ్ బ్రాన్‌స్కీ లెనిన్‌గదిలోకి పరుగెత్తుకొనివచ్చి పెట్రో గ్రాడ్‌నుంచి వచ్చిన అత్యద్భుతవార్తను తెల్పగా, దానిని జూరిక్ వార్తా పత్రికలు ధ్రువపరిచేవరకు లెనిన్ నమ్మలేకపోయాడు. ఆ క్షణంనుంచి కూడా ఆయన తనయావచ్ఛక్తిని 'సాధ్యమైనంత శీఘ్రంగా పెట్రోగ్రాడ్‌ను చేరడమనే లక్ష్యంపై లగ్నంచేశాడు. ఒక్కగంటసేపునుకూడా ఇక వృధా చేయడానికి వీలులేదు. చెదురుమదురుగా, అసమగ్రంగా వస్తున్నవార్త లన్నింటిని ఆయన క్రోడీకరించి, పరస్పరం సమన్వయపరచి విప్లవశక్తుల నూతనవంథాను ఆయన అప్పుడే దర్శించడం ప్రారంభించాడు. తన పార్టీలోను, తనపార్టీ ఇతరులతోను మునుముందు జరుపవలసిన పోరాటాలను ఆయన స్థూలంగా ఊహించగలిగాడు. కాగా, రష్యాలోని తనబోల్షివిక్ సహచరులు సముచితమైనమార్గాన్ని అనుసరించి ముందుకు పోగలరనే నమ్మకం ఆయనకు లేనేలేదు. 1917వ సంవత్సరపు వసంత కాలంలో యూరప్, అమెరికాలలోను, పంటమొగమెరుగని సైబీరియా ఊసరక్షేత్రాలలోను ,ఏషియాటిక్ రష్యాలలోను, గలసమస్తప్రాంతాల నుంచి బయలుదేరే రోడ్డులన్నీకూడా రాజధానివైపే సాగసాగాయి. స్వదేశానికి తిరిగివస్తున్న దేశబహిషకృతులలో స్త్రీలు, పురుషులు, విప్లవవాదులలో పెద్దలు, మితవాదులు, సోషలిస్టులు, రైతులు,విద్యార్థులు బుద్ధిజీవులు,జారిస్టుచెరసాలలలో సైబీరియాలోని నిర్బంధకార్మికశిబిరాలలో ఏళ్ళతరబడి మ్రగ్గినవారు, 1905 సంవత్సరంనాటి తిరుగుబాటు ప్రవాహంలో విధివశానపడిపోయిన విద్యార్థులు, కార్మికులు సమస్తవర్గాల వారు వున్నారు.

తాత్కాలికప్రభుత్వం అన్నితరగతుల ఖైదీలవిడుదలను ఉత్తరువు చేసినందున అన్నిరోడ్డులు పెట్రోగ్రాడ్‌కే దారితీశాయి. రష్యాలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు గట్లుతెంపుకొని ప్రవహించిన ఘడియలవి. శీతకాలపు తుదిమంచుతెరలు విడిపోతున్న పెట్రోగ్రాడ్‌నగరం విమోచనపొందిన రష్యన్‌ప్రజల ఆనందోత్సవాలతో కోలాహలంగావుంది.

బోల్షివిక్‌ప్రముఖులలో స్టాలిన్, కామనేవ్, మురనోవ్, స్వెర్డ్లోఫ్ ప్రభృతులు పెట్రోగ్రాడ్‌కు అందరికంటె ముందుగాచేరారు. మార్చి నెలా ఖరునాటికి వీరు సైబీరియానుంచి పెట్రోగ్రాడ్‌కు వచ్చారు. రాజధానిలో కానవస్తున్నరాజకీయపరివర్తనాన్ని ఉత్సాహోద్రేకాలనుచూసి వీరిహృదయాలుకూడా ఆనందోత్సాహాలతో ముప్పిరిగొన్నాయి. కాని, జార్‌పతనానికి వెనువెంటనేతిరిగి ప్రచురణప్రారంభించిన బోల్షివిక్‌పార్టీపత్రిక "ప్రావ్దా" కార్యాలయంలో వీరికి ఇందుకు భిన్నమైనవైఖరిద్యోతకమైంది. "ప్రావ్దా" పత్రిక తాత్కాలిక సంపాదకులైన మోలటాఫ్, ష్లియాప్నికోవ్‌లు తాత్కాలిక ప్రభుత్వాన్ని విమర్శిస్తున్నారు.

త్వరలోనే తాత్కాలికసంపాదకవర్గం తొలగించబడి దానిస్థానే స్టాలిన్, కామనేవ్, మూరనోవ్‌లు సంపాదకులుగా నియమితులైనారు. వీరి ఆధ్వర్యంక్రిందవచ్చిన తొలి "ప్రావ్దా" సంచిక మార్చి 28వ తేదీని వెలువరించబడింది. ఈ క్రొత్తవీరత్రయం సంపాదకత్వంక్రింద "ప్రావ్దా" ప్రభుత్వంపట్ల, తక్కిన సోషలిస్టుపార్టీలపట్ల సమాధానపూర్వకవైఖరిని ప్రదర్శించనారంభించింది. లెనిన్, ట్రాట్‌స్కీలు ఒకరికి తెలియకుండా ఒకరు తాత్కాలికప్రభుత్వంపై కత్తికట్టవలసిందిగా కార్మికులను ఆహ్వానిస్తూ, యుద్ధాన్ని నిలిపివేయడానికి వెంటనే చర్యతీసుకోబడాలనికోరుతూ వుండగా, స్టాలిన్ అతిజాగ్రత్తతోకూడినవైఖరిని అనుసరించాడు.

మార్చి 27వ తేదీని మొత్తం ప్రపంచప్రజానీకాన్ని ఉద్దేశించి పెట్రోగ్రాడ్ సోవియెట్ ఒక ప్రణాళికను ఏకగ్రీవంగా ఆమోదించింది. దానిలో మార్చివిప్లవం సామ్రాజ్యకాంక్షగల జర్మనీఓటమి ప్రాతిపదికగా ప్రజాస్వామికయుక్తమైన శాంతిసాధనకు ఒకచర్యగా వర్ణించబడింది. ఇది లెనిన్ అభిప్రాయానికి దూరంగావున్నది. ఆయన ప్రస్తుతయుద్ధం పోటీపడుతున్న రెండుపాపిష్ఠిశక్తులమధ్య జరుగుతున్న సామ్రాజ్యసంఘర్షణ తప్ప వేరేమీకాదని వ్యాఖ్యానించాడు.

పెట్రోగ్రాడ్ సోవియెట్ ప్రణాళికనుగురించి స్టాలిన్ మార్చి 28వ తేదీ "ప్రావ్దా" సంచికలో ఇలావ్రాశాడు:

"'యుద్ధం నశించుగాక!' అనే నినాదం ఎంతమాత్రం ఆచరణ యోగ్యమైనట్టిదికాదు. జర్మనీసైన్యం కైజర్ ఉత్తరువులను శిరసావహిస్తున్నంతకాలం రష్యన్ సైనికులు తమస్థానంలో స్థిరంగానిలిచి తుపాకి గుండుకు తుపాకిగుండుతో, శతఘ్నికి శతఘ్నితో సమాధానం చెపుతూ వుండవలసిందే....ఎడతెగకుండా పెద్దపెట్టున జరుగుతున్న ఈహత్యాకాండకు స్వస్తిచెప్పకతీరని పరిస్థితిని తమప్రభుత్వాలకు కల్పించవలసిందిగా ప్రపంచప్రజానీకానికి విజ్ఞప్తిచేస్తూ నిన్నకార్మిక, సైనికప్రతినిధుల సోవియెట్ ఆమోదించిన ప్రణాళికను హర్షించకుండా వుండజాలము.... యుద్ధంలో పాల్గొంటున్న దేశాలన్నింటిచేత శాంతిసాధనకై వెంటనే రాయబారాలను ప్రారంభింపజేయడానికి ప్రయత్నించేటట్టు తాత్కాలిక ప్రభుత్వంపై ఒత్తిడిని తీసుకురావాలన్నదే మా నినాదం....అంతవరకు ప్రతివ్యక్తికూడా తాను పోరాడుతున్న స్థానాన్ని విడిచిపెట్టరాదు!''

క్రొత్త "ప్రావ్దా'' బోల్షివిక్‌పార్టీ వారికి భయభ్రాంతులుకలిగిస్తున్నదని ష్లియాప్నికోల్ అన్నాడు. "హేతువాదానికి కట్టుబడేమితవాదబోల్షివిక్‌లు తమ పార్టీలోని అతివాదులను ఓడించారనేవార్త టారైడ్ రాజభవనంలో మారుమ్రోగింది. సోవియెట్‌కార్యవర్గంలో బోల్షివిక్‌లను చూడగానే తక్కిన వారు విషపునవ్వులు నవ్వేవారు.

అనేక బోల్షివిక్ కార్యాలయాలలో కార్మికులు సమావేశాలుజరిపి స్టాలిన్, కామెనేవ్, మురనోవ్‌లు పార్టీనించి బహిష్కరించబడాలనికోరారు. మరునాడు మార్చి 29వ తేదీని పెట్రోగ్రాడ్ బోల్షివిక్‌సమావేశంలో ప్రసంగిస్తూ స్టాలిన్ ఇలా పేర్కొన్నాడు:

"తాత్కాలికప్రభుత్వం తటపటాయిస్తూ తప్పటడుగులువేస్తూ తనకు యిష్టంలేకపోయినప్పటికీ, విప్లవప్రజానీకం ఇంతవరకు సాధించిన విజయాలను పటిష్ఠతరంగా చేయడానికి కృతనిశ్చయమైవున్నది. ఇట్టిపరిస్థితి కొంత మంచిని చెడ్డనుకూడా తెచ్చిపెడుతుంది. సంఘటనలు మరింత శీఘ్రగతిని జరిగేటట్టుచేసి, మన పార్టీ నుంచి ఎలాగా వైదొలగవలసిన బూర్జ్వాశక్తులను ఇప్పుడే తొలగించడానికి ప్రయత్నించడం మంచిదికాదు.

విప్లవాన్ని వటిష్ఠతరంగా చేస్తున్నవరకు మనం తాత్కాలికప్రభుత్వాన్ని బలపరచాలి. అది విప్లవనిరోధకంగా వ్యవహరించినంతవరకు దానిని మనం బలవరచరాదు.''

మార్చి 20వ తేదీని, ఇంకా అప్పటికి జూరిచ్‌లోనేవున్న లెనిన్ 'దూరసీమలనుంచి లేఖలు' అనేశీర్షికతో తొలిలేఖను ప్రచురించాడు. ఈలేఖ ఏప్రిల్ 3వ తేదీని 'ప్రావ్దా'లో ప్రచురించబడింది. దీనితో స్టాలిన్, కామెనేవ్‌లు అనుసరిస్తున్న సమాధానపూర్వకవైఖరిని పూర్తిగా విడనాడ బడినట్టు తేటతెల్లమైపోయింది.

రష్యన్ రాజవంశం అంత సులభంగా కూలద్రోయబడడం ఆంగ్లో-ఫ్రెంచి ఇంపీరియలిస్టుల కుట్రవల్లనే సాధ్యమైందని లెనిన్ పేర్కొన్నాడు. కాన్‌స్టాంటినోపుల్‌ను గుచ్‌కోవ్‌కు, సిరియాను ఫ్రాన్సుకు, మెసాపొటేమి యాను బ్రిటిష్‌కేపిటలిస్టులకు కట్టబెట్టించే నిమిత్తం మరిన్ని లక్షలమంది రష్యన్‌లను బలిపెట్టి ఈఇంపీరియలిస్టు యుద్ధాన్ని మరింతభయంకరంగా, పట్టుదలతో కొనసాగింపచేయడానికి మిలియుకోవ్-గుచ్‌కోవ్ బృందానికి అధి కారాన్ని హస్తగతంచేసుకొనేటట్టు ఈ కుట్రదారులు మద్దత్తునిస్తున్నారని ఆయన వివరించాడు.

మార్చి 24వ తేదీని లెనిన్ ''దూరసీమనుంచి'' మరొక లేఖను వ్రాస్తూ ఈ గుచ్‌కోవ్‌లతోను, మిలియుకోవ్‌లతోను, భూస్వాములతోను, కేపిటలిస్టులతోను పోరాడడానికి 7,50,000 సైన్యాన్ని సమీకరించవల సిందిగా కార్మికవర్గానికి విజ్ఞప్తిచేశాడు. మిత్రరాజ్యాలతో రష్యాచేసుకున్న సంధులను రద్దుచేయాలనీ, రహస్యంగాజరిగిన ఒడంబడికలన్నింటిని ప్రచురించాలనీ; వలసదేశాలన్నింటికి విమోచనం కల్పించడం, తమ ప్రభుత్వాలను కూలద్రోసి కార్మికప్రతినిధులసంఘాలకు సమస్తాధికారాలను అప్పగించవలసిందిగా సకలదేశాలకార్మికులకు విజ్ఞప్తిచేయడం మున్నగు అంశాలతో కూడిన క్రొత్తశాంతిషరతులనుప్రకటించాలనీ లెనిన్ ఈలేఖలో ఉద్బోధించాడు.

లెనిన్ ఈ లేఖలను తటస్థదేశరాజధాని అయిన స్టాక్‌హోంలోవున్న గానెట్‌స్కీకి పంపగా, ఆయన వాటిని పెట్రోగ్రాడ్‌లోవున్న లెనిన్ సోదరి మేరియాకు పంపించేవాడు.

లెనిన్ ఇంకా జూరిక్‌లోనేవున్నాడు. కొన్ని ప్రతిబంధకాలు ఆయన రష్యాకుతిరిగిరావడంలో జాగుజరగడానికి కారణమైనాయి. తనకు బద్ధవైరి అయిన లెనిన్ స్వదేశానికి తిరిగిరావడానికి తాత్కాలికప్రభుత్వం ఎట్టి అభ్యంతరం తెల్పలేదుగాని, బ్రిటన్, ఫ్రాన్సులుమాత్రం ఆయనకు వీసాలను మంజూరుచేసి ప్రయాణపు సౌకర్యాలను కలిగించడానికి యిష్టపడడంలేదు.

అయితే,లెనిన్ స్విట్జర్‌లెండ్‌లో ఆట్టేకాలంవుండిపోలేదు. తాత్కాలిక ప్రభుత్వాన్ని కూలద్రోసి జర్మనీతో శాంతిసంధిచేసుకొనే నిమిత్తం లెనిన్ రష్యాకు తిరిగిరావడానికి తోడ్పడడానికి మిత్రరాజ్యాలైతే నిరాకరించాయే గాని, బెర్లిన్ ఆయనకు సహాయపడతానన్నది.

అన్నిటికంటె విడ్డూరమేమంటే, జర్మన్ యుద్ధఖైదీలతో మార్పిడి క్రింద రష్యన్ విప్లవకారులు జర్మనీగుండా స్వదేశానికి తిరిగిరావాలని ఆదిలో మార్టోవ్ ప్రతిపాదించాడు.

ఈవిధంగా రష్యన్ విప్లవకారులతో జర్మన్‌యుద్ధ ఖైదీలమార్పిడికి మార్టోవ్ ప్రతిపాదించినపిమ్మట ఈవిషయంలో తాను తోడ్పతానని స్విస్ సోషల్‌డెమొక్రాట్ రాబర్ట్‌గ్రిమ్‌తానై ముందుకువచ్చి వాగ్దానంచేశాడు. కాని, సోవియెట్ కార్యవర్గం ఆమోదంలేకుండా చర్యతీసుకోటానికి మెన్షివిక్‌లు నిరాకరించడంతో గ్రిమ్‌పేరు తరువాత వినబడలేదు. తాను, తన సహచరులు జర్మనీగుండా రష్యాకు తిరిగివెళ్ళడానికి నిర్నిబంధంగా అంగీకరిస్తున్నామని లెనిన్ గ్రిమ్‌కు తెలియజేసి, తమప్రయాణానికి వెంటనే ఏర్పాటులు చేయించవలసిందిగా ఆయననుకోరాడు.

ఈసమయంలో పెట్రోగ్రాడ్ సోవియెట్ సమ్మతిలేకుండా రష్యాకు తిరిగి వెళ్ళడానికి పదిమందిమాత్రమే సుముఖతను ప్రకటించారు.

ఈషరతుపై సంప్రతింపులు జరపడానికి గ్రిమ్‌నిరాకరించడంతో మరొక అంతర్జాతీయసోషలిస్టు ఫ్రిట్జ్‌ప్లాటెన్ ఈపనికి పూనుకున్నాడు.

ప్లాటెన్ స్విట్జర్లెండులోని జర్మన్‌రాయబారితో స్పష్టమైన ఒడంబడికను చేసుకున్నాడనీ, దానిలో ఈక్రింది ప్రధానాంశాలుకలవనీ బోల్షివిక్ అధికార ప్రకటనలో పేర్కొనబడింది. ఆ అంశాలు ఇవి: 1. స్విట్జర్లెండ్‌లో ప్రవాసంలోవున్న రష్యన్‌లందరుకూడా-యుద్ధంపట్ల వారివైఖరి ఎట్టిదైనప్పటికీ రష్యాకు తిరిగి వెళ్లవలసిందే; 2. తాను ప్రయాణంచేసే ట్రెయిన్‌పై ఏదేశానికీ ఆధిపత్యంవుండరాదు; 3. దానిలో ప్రయాణంచేసినవారందరు రష్యాకు వెళ్ళడంతోనే, రష్యాకు తమ రెంతమందితిరిగివెళ్లారోఅంతమంది రష్యాలో నిర్బంధంలోవున్న ఆస్ట్రో—జర్మన్‌ఖైదీలమార్పిడికై అందోళన చెయ్యాలి.

ఇవి అధికారపూర్వకమైన ఈ ఒడంబడిక పాఠంలో పేర్కొనబడిన అంశాలు. అయితే, తూర్పురంగంలోని జర్మన్ యుద్ధతంత్ర కార్యాలయాధ్యక్షుడు జనరల్‌హాఫ్‌మన్ జర్మనులఉద్దేశాన్ని స్పష్టంగావివరించాడు.

"స్విట్జర్లెండ్‌లో ప్రవాసంలోవుండి రష్యన్ విప్లవవాదులతో సంబంధంకలిగి జర్మనీలోవుంటున్న ఆ వ్యక్తి" ఎవరు? లెనిన్‌ను, సోషలిస్టు అతివాదులను రష్యాలో ప్రవేశపెట్టి అక్కడ వారిద్వారా కొంత సత్ప్రయోజనాన్ని సాధించవచ్చునని పార్వస్ అనేవ్యక్తి సూచించాడు. పార్వస్‌సూచనను కౌంట్‌బాన్ మాల్ట్‌జాన్, అప్పుడు జర్మనీసైనిక ప్రచార శాఖకు అధిపతిగావున్న ఎర్జ్‌బర్గర్ బలపరిచారు. ఈసూచనను కార్యరూపంలోపెట్టడంవల్ల కలగగలలాభాన్నిగురించివారు ఛాన్సలర్‌బెథ్‌మన్-హాల్‌వెగ్‌కు నచ్చచెప్పారు. అప్పుడు పార్వస్‌చేసిన అద్భుతమైనసూచనను అమలులో పెట్టవలసిందిగా ఛాన్సలర్ యుద్ధతంత్రకార్యాలయాన్ని ఆదేశించాడు.

పార్వస్ విల్‌హెల్మ్‌స్ట్రాస్‌ద్వారా ఈ ఏర్పాటులను పూర్తిచేస్తున్న సమయంలో, తరువాత జర్మనీకమ్యూనిస్టుపార్టీగా రూపొందిన స్పార్టసిస్ట్ యూనియన్‌కు చెందిన యుద్ధవ్యతిరేకిఅయిన జర్మన్‌సోషలిస్టు పాల్‌లెవీ బెర్న్, జూరిక్‌లమధ్య సంప్రతింపులను కొనసాగిస్తున్నాడు. జూరిక్‌లో లెనిన్, రాడెక్‌లతో సంప్రతించినమీదట, ఈ విషయాన్నిగురించి స్విట్జ

ర్లెండ్‌లోని జర్మనీరాయబారితో చర్చించవలసిందిగా లెవీ ''ఫ్రాంక్‌ఫర్టర్ జీటుంగ్'' పత్రికకు బెర్నీలోగలవిలేఖరికి విజ్ఞప్తిచేశాడు. బెర్లిన్‌తోచర్చించి సమాధానం చెపుతానని జర్మన్ రాయబారి వాగ్దానంచేశాడు.

ఆ మరునాటి సాయంకాలం జర్మనీరాయబారి టెలిఫోన్‌లో లెవీని పిలిచి ''నేను లెనిన్‌తో మాట్లాడాలంటే ఆయన ఎక్కడదొరుకుతాడు? ఆయనను రష్యాకు పంపించడానికి సంబంధించి ఏ క్షణంలోనైనా నాకు బెర్లిన్‌నుంచి ఉత్తరువులురావచ్చునని ఎదురుచూస్తున్నా''నని అన్నాడు.

ఆయన కంఠస్వరాన్నిబట్టి లెనిన్ రష్యాప్రయాణానికి బెర్లిన్ అమిత ప్రాముఖ్యమిస్తున్నదని లెవీకి అర్థమైంది. జర్మనీరాయబారి సందేశాన్ని లెవీ లెనిన్‌కు తెల్పడంతోనే లెనిన్ హడావుడిగా కాగితం కలంతీసుకుని తాను జర్మనీగుండా ప్రయాణంచేయడానికి అంగీకరించడానికి షరతులను వ్రాశాడు. వాటిని లెవీద్వారా జర్మన్‌రాయబారికి అందజేశాడు. ఆ షరతు లన్నింటిని బెర్లిన్ ఆమోదించింది. దానితో పెట్రోగ్రాడ్‌కు మార్గం నిష్కంటకమైంది.

పెట్రోగ్రాడ్ సోవియెట్ ఆమోదానికై వేచివుండకుండానే జర్మనీ గుండా ప్రయాణంచేయడానికి లెనిన్ సమ్మతించాడనేవార్త పైకిపొక్కడం తోనే తత్ఫలితంగా స్విట్జర్లెండ్,ఫ్రాన్సులలోని సోషలిస్టులలో పెద్దసంచలనం బయలుదేరింది. అక్కడప్రవాసంలోవున్న రష్యన్‌ల సభలలో లెనిన్, ఆయన అనుచరులు తీవ్రంగా నిరసించబడ్డారు.

మరి రెండురోజుల అనంతరం లెనిన్‌ను, ఆయన సహచరులను సాగనంపడానికి రష్యన్‌ప్రవాసులు, స్విస్, ఇటాలియన్ కార్మికులు రైల్వే స్టేషన్‌లో అధికంగా గుమికూడారు. లెనిన్ వెంట జినోవియేవ్, రాడెక్, క్రప్‌స్కయా, కార్పిన్‌స్కీ మరికొందరు బోల్షివిక్‌లువున్నారు. అయితే రష్యాకు తిరిగి వెడుతున్నజట్టులో దాదాపు ఇరవైమంది బోల్షివిక్‌లుకాని వారుకూడావున్నారు. జర్మన్‌ల అధ్వర్యంక్రింద తాను రష్యాకుతిరిగి వెడు తున్నందున ఏర్పడగల అపోహలను తొలగించడానికి ఈనాన్-బోల్షివిక్‌లు కూడా తనతోకలిసి ప్రయాణంచెయ్యాలని లెనిన్ పట్టుపట్టాడు. లెనిన్‌ను

బలపరచేవారు ప్లాట్‌ఫారంమీద వేచివున్న ఆయనట్రెయిన్‌చుట్టూ విప్లవపతాకాలతో గుంపులుగుంపులుగాచేరి ''ఇంటర్నేషనేల్'' గీతాన్ని గానంచేశారు. మరొకవైపున ఆయన శత్రువులైన జర్మన్‌వ్యతిరేకులైన సోషలిస్టులు గుమిగూడి ''గూఢచారులు! వారు ఎంతకులాసాగావున్నారో చూడండి—కైజర్‌ఖర్చుతో యింటికివెడుతున్నారు!'' అంటూకేకలువేశారు.

లెనిన్ తాను ప్రయాణంచేసేపెట్టె కిటికీవద్ద తనగడ్డాన్ని తలుపు అంచుకుఆనించి చిరునవ్వునవ్వుతూ, తలవూపుతూ నిలబడ్డాడు.

ఏప్రిల్ 13వ తేదీని గానెట్‌స్కీకి లెనిన్‌వద్దనుంచి ఈక్రింది టెలిగ్రాంవచ్చింది:'' నేటి సాయంకాలం ఆరుగంటలకు ట్రెల్లెబోర్గ్‌లో వున్నాను.''

మాల్మోవద్ద గానెట్‌స్కీ లెనిన్‌ను కలుసుకున్నాడు. వారు ఉభయులు ఒకరినొకరు ఆలింగనంచేసుకున్నప్పుడు గానెట్‌స్కీ కళ్లలో నీళ్లు తిరిగాయి. కొద్దిగంటలతరువాత వారు స్టాక్‌హోంకువెళ్ళే ఒక ప్రత్యేకమైన పెట్టెలో కూర్చున్నారు. ఆపెట్టెలో క్రప్‌స్కాయా, జినోవియేవ్‌లుకూడా వున్నారు. ట్రెయిన్‌ప్రయాణం చేస్తూవుండగా రాత్రి చాలాప్రొద్దుపోయే వరకు వారు మాట్లాడుకుంటూనేవున్నారు. పెట్రోగ్రాడ్‌నుంచి వచ్చిన తాజావార్తలనుతెల్పమని లెనిన్ గానెట్‌స్కీని పదేపదే కోరుతూనేవున్నాడు.

పార్వస్ లెనిన్‌ను కలుసుకోలేదు. కాని, శాంతిసంధికై రాయబారాలను వెంటనే ప్రారంభింపజేయడం అతిముఖ్యమని తెల్పుతున్న ఒక సందేశాన్ని ఆయనకు అందజేయించాడు. విప్లవఆందోళనను జరపడమేగాని రాజనీతి ప్రదర్శనం తనపనికాదని లెనిన్ సమాధానంపంపాడు.

1917, ఏప్రిల్ 16వ తేదీని తెల్లవారేసరికి పెట్రోగ్రాడ్‌లోని ఫిన్లెండ్ స్టేషన్‌లో ఇసుకవేస్తేరాలకుండా జనం గుంపులుగుంపులుగా చేరివున్నారు. కార్మికులు, సైనికులు, నౌకాదళసభ్యులు, వివిధ విప్లవసంస్థల ప్రతినిధులు ఎర్రజెండాలతోవచ్చి లెనిన్ ఆగమనంకోసం సమధికోత్సాహంతో వేచివున్నారు. ఎట్టకేలకు దిక్కులు మారుమ్రోగేలాగ మొదటిగంటవినబడింది.

ఆ వెనువెంటనే కొంచెందూరంలో దేదీప్యమానంగా వెలుగొందుతున్న పెట్టెలతో ట్రెయిన్ కనిపించింది.

అందరికంటె మునుముందు లెనిన్ బండిదిగాడు. కొందరు కార్మికులు త్రోసుకుని ముందుకువెళ్ళి ఆయనను తమభుజాలపై ఎక్కించుకుని ఫిన్లెండ్ స్టేషన్‌లోని "ప్రజలగది" (ఇంతవరకు జార్ గది)లోకి తీసుకువెళ్ళిదింపారు. అన్నివైపులనుంచి ఆయనను చూడాలనే కుతూహలంతో, విమోచనంపొందిన రాజధానికి తిరిగివచ్చిన విప్లవనాయకులను అభినందిస్తూ మిన్నుముట్టేలాగ జయజయధ్వానాలుచేస్తూ, జనం ముందుకు త్రోసుకువచ్చారు.

లెనిన్ తొందరగా అగది మధ్యభాగంలోకి నడిచివెళ్ళి, పెట్రోగ్రాడ్ సోవియెట్ అధ్యక్షుడు ఛ్హీడ్జీఎదుట ఆగాడు.

ఛ్హీడ్జీ ఆయనకు స్వాగతంచెవుతూ ఇలా అన్నాడు: "కామ్రేడ్ లెనిన్! రష్యాకు తిరిగివచ్చిన మీకు పెట్రోగ్రాడ్ సోవియెట్‌తరపున, విప్లవం తరఫున మేము స్వాగతమిస్తున్నాము .... అయితే, దేశంలోను, విదేశాలనుంచికూడా జరగగల సకలవిధములైన దాడులనుంచి మన విప్లవాన్ని రక్షించుకోవడమే మన విప్లవప్రజాస్వామ్యానికి ప్రథమకర్తవ్యమని మేము విశ్వసిస్తున్నాము....ఈలక్ష్యసిద్ధికై కొనసాగే కృషిలో మీరు మాతో చేరగలరని ఆసిస్తున్నాము."

ఛ్హీడ్జీ చెవుతున్నమాటలతో తనకెంతమాత్రం సంబంధంలేనట్టు లెనిన్ జవాబుచెప్పకుండా అక్కడేనిలబడ్డాడు. ఆయన కన్నులుగదిలో అమూలనుంచి ఈమూలకు ఒకసారి కలయజూచాయి; జనం గుంపులను పర్యవేక్షించాయి. కడకు ఆయన ఛ్హీడ్జీని, సోవియెట్‌కార్యవర్గ సభ్యులను విడిచిపెట్టి ఆజనాన్ని ఉద్దేశించి ఇలా ఉపన్యసించాడు:

"ప్రియమైనకామ్రేడ్‌లారా, నావికులారా, కార్మికులారా! విజయాన్ని చూరగొన్న రష్యన్‌విప్లవం తరఫున, అంతర్జాతీయ కార్మికసైన్యానికి అగ్రగామిదళంగా మీకు మహదానందంతో శుభాభినందనాలను తెల్పు

తున్నాను.... మన కామ్రేడ్ కార్ల్ లీచ్‌నెక్ట్ (జర్మన్ స్పార్టసిస్ట్‌నాయకుడు) పిలుపువినబడగానే ప్రజలు తమను దోచుకుంటున్న కేపిటలిస్టులపై తమ ఆయుధాలను ప్రయోగించేతరుణం అనతికాలంలోనే రాగలదు....మీరు సాధించిన రష్యన్‌విప్లవంతో ఒక నూతనశకం ప్రారంభమైంది. ప్రపంచ వ్యాప్తమైన సోషలిస్టువిప్లవం చిరకాలం వర్ధిల్లుగాక!''

అనంతరం, ఫిన్లెండ్‌స్టేషన్‌నుంచి లెనిన్‌ను క్షెసిన్‌స్కయా ప్రాసాదంలోవున్న బోల్షివిక్ ప్రధానకార్యాలయానికి తీసుకువెళ్ళారు.

ప్రాసాదం వెలుపల సైనికులు, నావికులు గుంపులుగుంపులుగా వేచివున్నారు. ఆ రాజభవనం రెండవఅంతస్థుముందున్నడాబాపైకివచ్చి ప్రసంగిస్తూ లెనిన్ సర్వత్రాగల కష్టజీవులతోకూడిన సామాన్యప్రజానీకం జరపగల అంతర్జాతీయవిప్లవానికి ఈ రష్యన్‌విప్లవంతో నాందివాంచకం చదవబడిందని ఉద్ఘాటించాడు.

తరువాత, లెనిన్ బోల్షివిక్ పార్టీనాయకులు సమావేశమైవున్న హాలులోనికి వెళ్లాడు. ఏవగింపుతోకూడిన చిరునవ్వుతో వారిప్రసంగాలన్నీ విన్నాడు. పిమ్మట, ఆయనలేచి, తాను స్విట్జర్లెండ్‌లోవుండగా ప్రభుత్వాన్ని తాత్కాలికంగా బలపరిచినందుకు వారిని తీవ్రంగా విమర్శించాడు.

''తాత్కాలికప్రభుత్వాన్ని బలపరచకూడదు''-ఇవేఇంచుమించుగా ఆయన తొలిపలుకులు. స్టాలిన్, కామనేవ్‌లు అనుసరిస్తున్నవిధానాన్ని పూర్తిగా ఖండిస్తూ ఆయన తిరుగులేని ధోరణిలో నిర్మొహమాటంగా మాట్లాడడంచూసి ఆయన సహచరులే నివ్వెరపోయారు.

తన అనుయాయులను అంతనిశితంగా విమర్శించినపిమ్మట లెనిన్ సోవియెట్‌లోని నాన్-బోల్షివిక్ మెజారిటీని తాను ఎంతమాత్రం బలపరచ బోనని స్పష్టంగా ప్రకటించాడు. నాన్-బోల్షివిక్ సభ్యులందరు శత్రుశిబిరానికి చెందినవారని ఆయన ఉద్ఘాటించాడు.

''కార్మికవిప్లవాన్ని సంరక్షించేది జిమ్మర్‌వాల్డ్ వామపక్షంఒక్కటే:'' అని లెనిన్ గొంతెత్తిచాటాడు. తక్కినవారందరుకూడా పైకితియ్యనిమాటలు

చెపుతూ సోషలిస్టు ఉద్యమాన్ని, కార్మికవర్గాలను గోతిలోకి దింపేప్రాత అవకాశవాదులుమాత్రమే''నని ఆయన వక్కాణించాడు.

తాను నిర్దాక్షిణ్యంగాచేసిన నిశితవిమర్శాఘాతంనుంచి బోల్షివిక్ అధిష్ఠానవర్గం ఇంకా తెప్పిరిలకుండానే లెనిన్ తనకార్యక్రమంలోని ప్రధానాంశాలను పునరుద్ఘాటించాడు. ఆయన నీళ్లునమలలేదు. సమావేశానికి అధ్యక్షతవహించిన కామనేవ్ లెనిన్ ఉపన్యాసంపట్ల తక్కిన బోల్షివిక్ సభ్యుల అభిప్రాయాన్ని ఇలా క్రోడీకరించి చెప్పాడు.

''లెనిన్ అభిప్రాయంతో మనం ఏకీభవించవచ్చు, ఏకీభవించకపోవచ్చు. ఆయావరిస్థితులపట్ల ఆయన అనుసరిస్తున్న వైఖరిని మనం ఆమోదించకపోవచ్చు. కాని, ఏమైనా మనపార్టీ అభిమానగౌరవ విశ్వాసాలను చూరగొన్న నాయకుడు లెనిన్‌రూపంలో రష్యాకు తిరిగివచ్చాడు. ఆయనతోపాటే మనం సోషలిజం లక్ష్యంవైపు పురోగమిస్తాము.''

లెనిన్ మునుముందుగావెళ్లి టారైడ్ రాజభవనాన్నికాక తనతల్లి సమాధిని సందర్శించివచ్చాడు. క్షెసిన్‌స్కీ రాజభవనంలో దిగగానేఆయన టెలిఫోన్‌చేసి ఒకకారును తెప్పించుకొని తనతల్లి సమాధివున్న శ్మశానవాటికకు బయలుదేరివెళ్ళాడు.

లెనిన్ ఏపరిస్థితులలో రష్యాకు తిరిగివచ్చాడో క్రమంగా అందరికి తెలియడంతో పెట్రోగ్రాడ్‌లోని సైనికులలోను, నావికులలోను, విద్యార్థులలోను, కార్మికులలోను చాలామంది ఆయనను కంటగించుకోవడం మొదలుపెట్టారు. ఏప్రిల్ 17వ తేదీని, జర్మనులసహాయాన్ని ఆమోదించినందుకు లెనిన్‌ను ఖండిస్తూ రెండవబాల్టిక్ నౌకాదళానికిచెందిన సభ్యులు సభజరిపి తీర్మానంచేశారు. వోలిన్‌స్కీ సేనవున్న బారకీసులలోని సైనికులు సమావేశమై లెనిన్‌ను అరెస్టుచేయడం విషయమైచర్చించారు. ఇంకా అనేకచోట్ల సైనికులు సమావేశాలుజరిపి, లెనిన్ ఇంపీరియల్ జర్మనీగుండా ప్రయాణంచేసి రావడానికిగలకారణాలను పరిస్థితులను గురించి దరియాప్తు జరిపించవలసిందిగా తాత్కాలికప్రభుత్వాన్నికోరుతూ తీర్మానాలుచేశారు.

జిమ్నేసియం (వ్యాయామకళాశాల) విద్యార్థులు కెరెన్‌స్కీ రాజ ప్రాసాదానికి వెలుపలచేరి లెనిన్‌కు వ్యతిరేకంగా ప్రదర్శనజరిపారు. యుద్ధంలో క్షతగాత్రులైనసైనికుల, నావికుల ప్రతినిధివర్గం ఒకటి "లెనిన్ బృందం జర్మనీకి తిరిగిపొండి!" అని లిఖించబడిన అట్టలను పట్టుకొని ఊరేగింపు జరిపింది.

లెనిన్ వచ్చేసరికి రష్యాపరిస్థితి సుస్థిరంగావున్నదని అనుకోడానికి ఎంతమాత్రం వీలులేదు. రాజరికం పతనంకావడంతో రష్యామానసికంగా దెబ్బతిన్నది. మొత్తం జనాభాయావత్తుకూడా, కెరెన్‌స్కీ చెప్పినట్లు, ఒక్కసారిగా నిరవధికమైన స్వేచ్ఛాప్రవాహపు సుడిగుండాలలో పడి పోయింది. మానవసమాజానికి అత్యవసరమైన అత్యంతప్రాథమికమైన కట్టుబాటులనుకూడా లేకుండా స్వేచ్ఛకట్టలు త్రెంపుకుని ప్రవహిం చింది. కాగా, మూడేళ్లుగా యుద్ధభారాన్ని వహిస్తున్నప్రజలు విసుగు చెందిపోయి, డస్సిపోయివున్నారు. దీనిఫలితంగా వారిలో కర్తవ్యనిష్ఠ, కార్యసాధనదీక్ష నశించాయి: ఫ్యాక్టరీలలో కార్మికులు పనిచేయడం మాని వేశారు. ప్రజలలో విధేయత, ఆజ్ఞాపాలనశక్తి నశించాయి. అధికారులు ఆదేశాలనివ్వలేనిస్థితికివచ్చారు. ఫ్యాక్టరీలలో కార్మికులు తాము అస హ్యించుకునే డైరెక్టర్లపైన, ఇంజనీర్లపైన అత్యాచారాలుజరపడం ప్రారం భించారు. అనేకప్రాంతాలలో రైతులు ప్రభుత్వచర్యకోసం వేచివుండ కుండానే భూములను ఆక్రమించివేసుకున్నారు. యుద్ధరంగంలో సైనికులు చెప్పకుండా సైన్యాన్నివిడిచి పారిపోవడానికి ఇక లెక్కలేదు. సైనికులు ఉదయంనుంచి రాత్రివరకు నిర్విరామంగా సమావేశాలుజరిపారు. సైనికో ద్యోగులపట్ల అనుమానాలు ప్రబలిపోయాయి. మార్చి 13వ తేదీని క్రాన్‌ స్టాట్‌లో నౌకాదళసభ్యులు బాల్టిక్ నౌకాదళం కమాండర్‌ను, ఇంకా అనేక మంది నౌకాదళోద్యోగులను చంపివేశారు. తక్కిన ఉద్యోగులను అరెస్టు చేసి చిత్రహింసచేశారు. ఇక, నగరాలలో స్థానిక ప్రభుత్వయంత్రాంగం స్తంభించడంతో హత్యాకాండలు, దోపిడులు, ఇతర అరాజకచర్యలు చెలరేగాయి. దేశంపూర్తిగా అరాజకంపాలైపోకుండా నివారించడానికి

నూతన ప్రభుత్వాధికారులు బ్రహ్మాండమైన భగీరథప్రయత్నం చేయవలసి వచ్చింది.

లెనిన్ పెట్రోగ్రాడ్‌కు తిరిగివచ్చిన మరునాటి ఉదయం అన్ని రాజకీయపక్షాలనుకలిపి ఒకేఒకపార్టీగారూపొందించడానికిగల అవకాశాలను గురించి తుదిసారి చర్చించడానికి టారైడ్‌రాజభవనంలో సోషల్‌డిమొక్రాటిక్ సమావేశం జరపబడింది. ఈ సమావేశంలో లెనిన్ చేసిన మహోపన్యాసంలో తన వైఖరికింక తిరుగులేదని, దానిని తాను అణుమాత్రంకూడా మార్చుకొనబోవడంలేదని స్పష్టంగా ప్రకటించాడు. తాను తన బోల్షివిక్ కామ్రేడ్‌లకు స్పష్టంచేసినవిధానాన్ని అనుసరించడానికే కృతనిశ్చయంతోవున్నానని పునరుద్ఘాటించాడు. దీనితో రాజకీయపక్షాలను సమైక్యంగావించవచ్చుననే ఆశ పూర్తిగా అంతరించింది.

లెనిన్ తన ఉపన్యాసాన్నిపూర్తిచేయగానే బోల్షివిక్ కేంద్రసంఘం మాజీసభ్యుడు జోసప్‌గోల్డెన్‌బర్గు ప్రసంగించాడు. అప్పుడే ప్రవాసంనుంచి తిరిగివచ్చిన గోల్డెన్‌బర్గ్‌కు లెనిన్ గురించి చక్కగా తెలుసును. ఆయన లెనిన్‌తోకలిసి పనిచేసి ఆయన ఆదరగౌరవాలను చూరగొన్నట్టివాడు.

లెనిన్ పునరాగమనంపట్ల, సోవియెట్‌లో ఆయనచేసిన తొలి ప్రసంగంపట్ల ప్రదర్శించబడిన ఈప్రాతికూల్యంచూసినపిమ్మట తాత్కాలిక ప్రభుత్వసభ్యులలో 'ఇకమనకేం' అనే ధీమా, అలసభావం ఏర్పడ్డాయి. లెనిన్ జర్మనీసహాయంతో రష్యాకు దిగుమతిచేయబడ్డాడనే విషయమే బోల్షివిక్ ప్రచారం ప్రాబల్యాన్ని నశింపచేయగలదని వారుభావించారు. ఏప్రిల్ 17వ తేదీని స్కోబెలేవ్ లెనిన్‌కు పూర్వంవున్నపలుకుబడి ఇప్పుడు లేదనీ, జాతీయోద్యమం ఆయనను లెక్కలోనికి తీసుకొనబోదని మంత్రివర్గానికి నచ్చజెప్పాడు.

లెనిన్ ప్రాభవప్రభావాలను తాత్కాలిక ప్రభుత్వం సరిగా అర్థం చేసుకొనలేక వాటిని తక్కువచేసి భ్రమలోపడిందనడానికి పెట్రోగ్రాడ్‌లోని ఫ్రెంచిరాయబారి మారిస్‌పాలియొలోగ్ 1917 ఏప్రిల్ 18వ తేదీని తన దినచర్యలో వ్రాసుకున్న ఈక్రిందివాక్యాలే తార్కాణం. ఆయన ఇలా

వ్రాసుకున్నాడు: ''లెనిన్ నిన్న సోవియెట్ సమావేశంలో పూర్తిగా విఫలుడైనాడని విదేశాంగమంత్రి మిలియకోవ్ నేటి ఉదయం నాతో అన్నాడు. తక్కిన నాయకులందరిపట్ల ధిక్కారవైఖరితో ఆయన అసంగతంగా వెంటనే శాంతిసంధిజరగాలనే తన సిద్ధాంతాన్ని సమర్థించుకోడానికి అతివ్యాప్తిగా మాట్లాడినందున ప్రేక్షకులు అసహ్యించుకొని కేకలువేస్తూ అల్లరి చేయడంతో ఆయన ఉపన్యాసం కట్టిపెట్టి వేదికనుంచి దిగి వెళ్ళిపోక తప్పిందికాదనీ, ఈ పరాభవాఘాతంనుంచి లెనిన్ ఇక ఎన్నటికీ తెప్పరిల్లజాలడనీ కూడా మిలియకోవ్ నాతో అన్నాడు. అలాగ జరుగుతుందనే ఆశిద్దామని నేను అన్నాను. కాని, ఇట్టి ఆశాభావంతోవున్నందుకు మిలియకోవ్‌కు మరొకసారి ప్రాయశ్చిత్తం జరగకమానదని నా అభిప్రాయం.''

మార్చి విప్లవానికి లెనిన్ ముప్పుతెచ్చిపెట్టేవాడుకాడనే బహుజనాభిప్రాయంతో సుతరామూ ఏకీభవించనివ్యక్తి ఒక్క అలెగ్జాండర్ కెరెన్‌స్కీ మాత్రమే. సోవియెట్ కేంద్రకార్యనిర్వాహకవర్గంలోని సోషలిస్టు విప్లవ సభ్యుడు వ్లాడిమర్‌జెంజినోవ్ పేర్కొన్నాడు. ''ఇతడు విప్లవాన్ని నాశనం చేస్తా''డని లెనిన్‌వచ్చిన కొద్దిరోజుల అనంతరం కెరెన్‌స్కీ తనతోఅన్నట్టు ఆయన తెలియజేశాడు.

టారైడ్ రాజభవనంలో తీవ్రవాదప్రతివాదాలతో సమావేశంజరిగిన కొద్దిరోజులకు లెనిన్, ఒకప్పుడు తనను పూర్తిగా బలపరచికూడా ప్రస్తుతం సందిగ్ధవైఖరిని ప్రదర్శిస్తున్న తన ప్రాతబోల్షివిక్ సహచరులతో ఒక సమావేశం జరిపాడు.

మరిరెండురోజుల అనంతరం ''ప్రావ్దా'' ప్రసిద్ధమైన లెనిన్ ఏప్రిల్ సిద్ధాంతాలను ప్రకటించింది. వివిధదళాలమధ్య కొనసాగుతున్నయుద్ధానికి స్వస్తిచెప్పేనిమిత్తం సాధనంగా అంతర్యుద్ధానికి పూనుకోవలసిందిగా తన కార్యక్రమాన్ని వివరిస్తూ లెనిన్ ఉద్బోధించాడు.

''మనం యుద్ధానికి స్వస్తిచెప్పడం ఎల్లాగ?'' అని ప్రశ్నవేసుకొని లెనిన్ తానే దానికి ఈ క్రిందివిధంగా సమాధానంచెప్పాడు.''

"గత యాభైసంవత్సరాలుగా ప్రపంచంలో ధనము, తత్సంబంధమైన, శాఖోపశాఖల అభివృద్ధినుంచే యుద్ధంబయలుదేరింది. యుద్ధంలో గల రాజ్యాధికారస్వభావమును విస్మరించలేము. ధనికశక్తిని నాశనం చెయ్యకుండా, బలప్రయోగంలేకుండా, ప్రజాస్వామ్యపద్ధతులలో శాంతి నెలకొల్పడం అసంభవం. ఈ మార్గం ఛేదించడంద్వారానే కార్మికకర్షకులు ఒకవర్గంగా పురోభివృద్ధిచెందగలరు.

శాశ్వతంగా యుద్ధమును అంతరింపచెయ్యాలంటే ప్రజాసామాన్యం అధికారమును హస్తగతం చేసుకోడం చాలాఅవసరం. రష్యాలో, ధనిక విధానంపై యుద్ధంచేయగల ఆయుధం కార్మికుల, సైనికుల డిప్యూటీల సోవియట్లరూపంలో ప్రత్యక్షమైవుంది.

రాజ్యాధికారపుయుద్ధాన్ని, ప్రజాయుద్ధంగా మార్చే ఆ విధానానికి 1917 సం॥ మార్చిలో జరిగిన విప్లవం ప్రారంభం. యుద్ధమును ఆపు చేయుటకై ఈ విప్లవం ప్రధమప్రయత్నం. దీనిని శాశ్వతంగా ఆపుటకు అధికారమును సామాన్యప్రజల చేతిలోనికిరావాలి. ప్రపంచంలోని ధనిక వాదుల మార్గాలను ఛేదించటానికిది ప్రారంభదశ. ఈ మార్గంద్వారానే సామాన్యప్రజలమానవజాతిని విముక్తినొందించి, యుద్ధమునుంచిరక్షించి, శాశ్వతశాంతిని చేకూర్చగలదు."

మార్చివిప్లవంవరకు అతడు సమర్థించినపార్లమెంటరీ ప్రజాస్వామ్యమునకు బదులు అతడిప్పడు సోవియటును సమర్థించాడు. పాతక్రొత్తల తేడాను స్పష్టంచేయుటానికై అతడు సోషల్‌డిమొక్రటిక్‌పార్టీకి బదులు కమ్యూనిస్టుపార్టీకే ప్రాధాన్యం ఇచ్చాడు. "మనకు కావలసినది ప్రపంచమును పునఃసృష్టిచేయడమే. అనేక వేలాదిజనమును, లక్షలాది డాలర్ల ధనమును పాడుచేసిన రాజ్యాధికారపు యుద్ధమును మాన్పించాలి. ప్రజాసామాన్యవిప్లవంలేకుండా డిమొక్రటిక్ శాంతిలో ఇది సాధ్యపడదు. ఇది మానవజాతికే అత్యుత్తమమైనది."

ఒకపురాతన బోల్షివిక్‌మాటలలో, లెనిఞయొక్క సిద్ధాంతం బాంబు పగిలినట్లుగావుంది. అది ప్రకటించబడిన కొద్దిరోజులకు 'ప్రావ్దా'లో ఇల్లా

ప్రాశారు:- "లెనిన్ విధానం ప్రకారం, ధనికవర్గాలవిప్లవం అంతరించినట్లు అది వెంటనే సోషలిస్టు విప్లవంగా మారినట్లుగా భావించబడినట్లు మాకు తోస్తోంది క నుక దానిని అంగీకరించుటకు వీలులేదు."

లెనిన్ విధానానికి, అతని ఆప్తులే కొందరు వ్యతిరేకభావం ప్రకటించారు. వారి సందేహనివృత్తిచేస్తూ లెనిన్ అనేకవ్యాసాలలో, కరపత్రాలలో ప్రకటనలుచేశాడు. క్రమంగా బోల్షివిక్‌పార్టీలో చాలామంది అతని అభిప్రాయంతో ఏకీభవించారు.

లెనిన్ ప్రాథమిక కష్టాలతోపాటు మాలినోవిస్కీ విషయం మళ్ళీ తలయెత్తింది. అనేకమైన దృష్టాంతాలను, జరిగిన సంగతులనుబట్టి, మాలినోవిస్కీ, ఓక్రానా ఏజంటని లెనిన్ అంగీకరించాడు.

అతనిపై-చిన్నవి, పెద్దవి తుపానులెన్ని చెలరేగినా 1917 సం॥లో మే నుంచి 12వ తేదీవరకుజరిగిన అఖిలరష్యా బోల్షివిక్‌పార్టీసమావేశంలో లెనిన్ అధికారమే ప్రాముఖ్యంవహించింది. ప్రధానతీర్మానములన్నీ అతని ఏప్రిల్ సిద్ధాంతము ననుసరించేజరిగాయి.

పార్టీలోని ప్రధానవిషయాలన్నింటిపైనా లెనిన్‌పక్షమే జయించినా, కొందరు బోల్షివిక్ నాయకులు అతనికి వ్యతిరేకంగానేవున్నారు. వీరందరి వ్యతిరేకాభిప్రాయాలను లెక్కచేయకుండా, తాత్కాలికప్రభుత్వం 'ధనికులు భూస్వాములప్రభుత్వం' అనీ, మెన్షివికులతో కలియకూడదనీ, సమావేశం నిర్ణయించింది. ఈ సమావేశంతరువాత పార్టీనుంచి కొందరు రాజీనామా లిచ్చారు. లెనిన్ పాత అనుచరుడైన వ్లాడిమర్‌వోయ్‌టిన్‌స్కీకూడా రాజీనామానిచ్చాడు. కామెనేవ్, లెనిన్ వ్యతిరేకుడైనా, రాజీనామానివ్వలేదు.

"సర్వాధికారము, సోవియట్లకే" అనే లెనిన్ నినాదంలోని అంతరార్థం సైనికులకర్థంకాలేదు. ప్రజాదృష్టిలో కార్మికులు, కర్షకులు సైనికులు ఎన్నుకున్న సోవియట్ల డిమొక్రటిక్ విప్లవభావాలను సూచించాయి. లెనిన్‌కుమాత్రం ఈ నినాదం, అసలు విషయాన్ని దాచటానికి మంచి మూతగా ఉపయోగించింది—బోల్షివిక్‌పార్టీనియంతృత్వము. లెనిన్ తన

ప్రధానాశయమును సామాన్యజనులకేకాక, తన ఉద్యోగులకుకూడా తెలీకుండా దాచివుంచాడు.

ఈ సమావేశంతరువాత బోల్షివికులు తమ ప్రచారమును అభివృద్ధి చేశారు. మే నెలాఖరుకి పిట్రోగ్రాడ్‌సోవియట్‌లోని కార్మికులు, పిట్రోగ్రాడ్ సైన్యాలలోని సైనికులు లెనిన్ పక్షం వహించారు.

విదేశవ్యవహారాలమంత్రియైన మిలియుకోవ్‌చేసిన ఒక తప్పిదమే లెనిన్ ఆశయానికి సహాయంచేసింది. మే 1వ తేదీని, మిత్రరాజ్యాలతో కలిసి జర్మనీ పూర్తిగా అపజయంపాందేవరకూ యుద్ధంచేస్తాము అనే ఒక పత్రమును పంపించునట్లు సోవియట్ రాజకీయ ప్రతినిధులను మిలియుకోవ్ ఆదేశించాడు. ఈ పత్రమునకు వెంటనే వ్యతిరేకపు తుపాను బయలుదేరింది. మిలియుకోవ్‌రాజీనామానివ్వాలంటూ ప్రదర్శనలుచేశారు.

దేశంలో నాలుగు మూలలా ప్రబలుతున్న ప్రాంతీయసోవియట్ల వద్దకు చేరవలెనని ప్రజలకు సోవియట్ ఆదేశం ఇచ్చింది. సోవియట్ శాంతి విధానమును ఆమోదించిన అన్నివర్గాలను, అన్నిపార్టీలను ఒక సమావేశంచెయ్యాలని అంతర్జాతీయ సోషలిస్టు సమావేశమును ఏర్పాటు చేయుటకై సోవియట్ కార్యనిర్వాహకవరం ప్రతినిధివర్గమును పంపటానికి నిర్ణయమైంది.

కాని మిలియుకోవ్ ప్రకటించిన రష్యన్ యుద్ధలక్ష్యాలనుబట్టి పిట్రోగ్రాడ్‌లో ద్వంద్వప్రభుత్వంజరుగుతున్నట్లు స్పష్టపడింది. దీనివల్ల యుద్ధరంగంలోనూ, దేశంలోనూకూడా అవినీతి హెచ్చింది. తాత్కాలిక ప్రభుత్వం సోవియట్‌ప్రతినిధులుకలిసి మిశ్రమప్రభుత్వమును ఏర్పాటు చేయడం అత్యవసరమైంది. మే 12వ తేదీని గుచ్‌కోవ్, యుద్ధమంత్రి పదవికి రాజీనామానిచ్చాడు: ఆరురోజులతరువాత మిలియుకోవ్ తాత్కాలిక ప్రభుత్వాన్ని విడిచిపెట్టాడు. అప్పుడు ప్రధానమంత్రి లవోవ్ (Lvov) సోవియట్ నాయకులను మంత్రివర్గంలోనికి ఆహ్వానించాడు.

మే 17వ తేదీని మిశ్రమమంత్రివర్గం ఏర్పాటయింది. దీనివల్ల రష్యాకు అధికమైన ప్రాతినిధ్యపరిపాలన ఏర్పడింది. క్రొత్తప్రభుత్వం ధనిక

వ్యతిరేకశక్తిని ప్రతిబింబించింది. కాని అధికారయుక్తంగా పరిపాలించే శక్తి దానికి లేకపోయింది. విప్లవముఖద్వారాలు పూర్తిగా తెరిచేవున్నాయి. ప్రభుత్వం వాగ్దానంచేసిన శాంతిపద్ధతులు, పెట్రోగ్రాడ్‌లోనున్న 15,000 మంది సైనికులకు నచ్చలేదు. ఈ సైన్యాలను యుద్ధరంగానికి పంపుతామంటేనే తిరుగుబాటుకు దారితీసేలాగవుంది.

లెనిన్ యొక్క యుద్ధనినాదాలలో, ప్రజలకు ధనికవర్గంమీదవుండే అయిష్టతయే ప్రతిధ్వనించినట్లు భావించారు. 1917 సం॥ జూన్ 16వ తేదీని జరిగిన అఖిలరష్యా సోవియట్లకాంగ్రెసులో లెనిన్, కెరెన్‌స్కీల వాగ్వాదములలో రెండు రకాలభావాలను వ్యక్తంచేసినట్లు మరెక్కడా జరుగలేదు. ఈ కాంగ్రెసులోనే, హెర్జెన్, లావ్‌రోవ్, బుఖానిన్‌ల రోజుల తరువాత, రష్యావిప్లవసోషలిజంలో అనుశ్రుతంగావస్తున్న ఆత్మనాశనకరమైన ద్వంద్వవిధానం గోచరించింది. ఈ సమావేశంలో లెనిన్ జూన్ 17వ తేదీని ఉపన్యసించాడు. 1792 సం॥ లో జరిగిన ఫ్రెంచివిప్లవ సమావేశానికి, సోవియట్ ప్రస్తుతకాలపు నమూనాయేననిచెప్పి, వెంటనే తాత్కాలికప్రభుత్వంనుంచి అధికారమును సోవియట్ హస్తగతంచేసుకోవాలన్నాడు. లెనిన్‌చెప్పిన విధానమును అనుసరించినట్లయితే, ఇప్పుడే సంపాదించిన అధికారములన్నీ మంటకలుస్తాయని సభికులను హెచ్చరిస్తూ కెరెన్‌స్కీసమాధానంఇచ్చాడు. కాని సభలోని సైనికులు, నావికులు లెనిన్‌మాటలకే హర్షధ్వానాలుచేశారు. తరువాత కొద్దిరోజులకే బోల్షివికులు వారనుకున్నంతపనీచేశారు.

మర్నాడు మధ్యాహ్నానికి ఏర్పాటుచేయబడిన ప్రదర్శన కొన్నిరోజులవరకు సాగునట్లు రహస్యఏర్పాట్లుచేశారనీ, దానిలో సైనికదళాలు, మరతుపాకులదళాలు పాల్గొంటున్నాయనీ, ప్రదర్శనను విరమించకపోతే పెట్రోగ్రాడ్ వీధులలో, యుద్ధం తప్పదనీ, జూన్ 22వ తేదీ ఉదయం, చ్ఖీడ్జె (Chkheidzee) అనే అతడు సోవియట్‌కాంగ్రెసులోప్రకటించాడు. సోవియట్‌నాయకులు లేకుండా ఏ నిర్ణయంచేయకూడదని క్రైలెన్కో (Krylanko) సమాధానంచెప్పాడు. కాని వెంటనే డెలిగేట్లను ఫాక్టరీలకు

సైనికశిబిరాలకుపంపి ప్రదర్శనలను మాన్పించాలనేతీర్మానానికి సోవియట్ వోటుచేసింది.

జూన్ 23వ తేదీని ఉదయం 8 గంటలకు సోవియట్ కాంగ్రెసు సమావేశంలో బోల్షివిక్ కేంద్రసంఘం ప్రదర్శనలను నిలుపు చేయుటకే నిర్ణయించినట్లు తెలిసింది. ప్రాఫ్దాపత్రిక మొదటిపేజీలో అ కమైన తెల్లని ఖాళీలు ప్రకటించారు. ప్రదర్శనచేయమని, బోల్షివికు లు చేసిన ప్రకటనను, ఆఖరిసమయంలో ఆపుచేసినట్లు స్పష్టమైంది.

ఉదయపు సమావేశానికి ట్రాట్‌స్కీవచ్చాడు; కొందరు డెలిగేట్లు ఒత్తిడిచేసినా అతని పరిస్థితినిగూర్చి అతడు ఏమీచెప్పలేదు. జూన్ 26వ తేదీని ప్రాఫ్దాలో ఇల్లాప్రకటించారు. "ప్రదర్శనలనుగూర్చి ట్సెరెటెల్లీ (Tseretellie) చేసినప్రకటన శుద్ధఅబద్ధం. కాని అసలు విషయం విచారించగా, ప్రదర్శనతో తాత్కాలికప్రభుత్వకార్యాలయమైనమేరియన్‌స్కీ భవనం (Mariensky) పైకిపోవుకుట పథకంవేసినట్లు తెలిసింది; కొందరు మంత్రులభవనాలను పట్టుకోవాలి; కొందరు ప్రజలను రెచ్చగొట్టటానికి నిర్ణయించారు. సరియైన తరుణంలో తాత్కాలిక ప్రభుత్వ సభ్యులను ఖైదుచేస్తారు. బోల్షివిక్‌పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ పేరుతో వ్యవహరిస్తూ. అప్పుడు తానే రష్యాప్రభుత్వంగా ప్రకటిస్తుంది.

చీదేసిన ఈ బోల్షివిక్‌కుట్రవివరాలు చాలా ఆలస్యంగా తెలిశాయి. 1917 సం॥ జూన్‌లో వారు కోపగించిన అమాయకులవలె నటించారు. మెన్షివికులకు, సోషలిస్టురివల్యూషనరీలకు తాత్కాలికంగా సోవియట్‌లో పైచెయ్యి నివ్వడమే ఈ జూన్ సంఘటనఫలితం. అప్పటికి లెనిన్‌పరువుపోయింది; అతని పార్టీ కుంటిసాకులతో పరాజయంపొందవలసివచ్చింది. పైగా సోషలిస్టులు. వారిపూర్వసహచరులపై తగినచర్య తీసుకోటానికి సిద్ధంగాలేరు. ఇది చాలాముఖ్యమైనపాఠం.

తరువాతిచర్యకు తన శక్తియుక్తులను సమీకరించుకోటానికి ముందుగా లెనిన్, పెట్రోగ్రాడ్‌విడిచి అతనిపూర్వపు స్నేహితునియింటిలో విశ్రాంతితీసుకున్నాడు. ఆఖరి మూడునెలలూ అతన్ని పూర్తిగా నీరస

పరిచాయి. ప్రశాంతమైన ఆ పల్లెటూరులో లెనిన్ ఒక దుప్పటీపరుచుకుని నీడలోపడుక్కోడం, నిద్రపోడం, విశ్రాంతితీసుకోడంతో క్రమంగా అతడు ఆరోగ్యం సంపాదించాడు.

కాని జూలై 17వ తేదీని, ఉదయం ఆరుగంటలకు పార్టీ సహచరుడైన సేవ్‌లీవ్‌వచ్చాడు.

''ఏమిజరిగింది?''

''పెట్రోగ్రాడ్‌లో తిరుగుబాటుజరిగింది.''

గుంపులు, గుంపులుగా ప్రదర్శనదారులు, డ్యూమాపైకి టారైడ్ రాజభవనంమీదికీ, దాడిచేశారు; వీధులలో తుపాకుల కాల్పులు వినిపించాయి. ప్రభుత్వం సైన్యాలను సమీకరిస్తున్నట్లు, ఏ నిమిషమైనా యుద్ధంజరుగవచ్చుననీ వదంతి చెలరేగింది, అని సెవ్‌లీవ్‌చెప్పాడు.

చాలాకష్టంమీద లెనిన్ నిద్రలేచాడు.

ఆ వార్తవినగానే ''నేనువెళ్లాలి'' అన్నాడు లెనిన్.

బహుశః అతనికి నిర్ణీతమైనసమయం ఆసన్నమైనట్లుంది.

## జులై తిరుగుబాటు

జులై తిరుగుబాటుకు కొన్నివారాల ముందుగానే, బోల్షివిక్‌పార్టీ సభ్యులు, సైనిక, నావికస్థావరాలలోను, రైతులలోను, ప్రబలమైనప్రచారం ప్రారంభించారు. సైనికులు జర్మనీసైనికులతో సహకరించాలనీ, రైతులు భూములను, రాజ్యాంగసభ నిర్ణయానికి లెక్కచెయ్యకుండా ఆక్రమించుకోవాలనీ, ఉద్బోధించారు. యుద్ధరంగంలోనున్న సైనికులను, తుపాకులనువిడిచి, స్వగృహాలకుపోవలెనని బోల్షివిక్‌సైనిక పత్రికలు ప్రకటించాయి యుద్ధమంత్రియైన కెరెన్‌స్కీ, యుద్ధరంగంలోని సైనికులందరను, సాహసోపేతంగా యుద్ధం చెయ్యవలెనని ప్రోత్సహించాడు. దీనిని సోవియట్ల కేంద్రకార్యవర్గం బలపరిచింది. 1917 సం॥ జులై 1వ తేదీని జనరల్ బ్రుసిలోవ్, గాలిషియన్ రంగంలో దాడిజరిపాడు. కొంతకాలం రష్యనులు విజయం సంపాదించారు. కాని తరువాత, పరాజయం

పొందారు. జులై 19వ తేదీన జర్మనులు పెద్దమొత్తంగా ప్రతిదాడిచేశారు; కాని శత్రువులు మనస్ఫూర్తిగా ఎదిరించలేదని గ్రహించారు.

జులై 15వ తేదీ రాత్రి, బోల్షివిక్‌పార్టీ కేంద్రకార్యవర్గం హఠాహత్తుగా సమావేశమైనారు. పరిస్థితులు జూన్ 23వ తేదీ నాటివలెనే ఉన్నాయి. తిరుగుబాటు జరుగుతూనేవున్నది. కాని దానిని పూర్తిగా బోల్షివిక్‌పార్టీ బలపరచడమా, లేక మళ్ళీ సోవియట్‌కు లొంగిపోవడమా అనేది ప్రశ్న. తిరుగుబాటుకు పూర్తినాయకత్వం తీసుకోడంగురించి సెంట్రల్‌కమిటీ రాత్రంతాచర్చించింది, సాయంత్రం అనుకూలంగా నిర్ణయంచేసి, దానిని ప్రావ్దాపత్రికలో ప్రకటించారు. కాని తాత్కాలిక ప్రభుత్వం చాలా గట్టి చర్యలు తీసుకుంటున్నట్లు వార్తలు వచ్చినందువల్ల, బోల్షివిక్ నాయకులు తగ్గిపోయారు.

ప్రావ్దాపత్రికలో ప్రకటనకు కంపోజ్‌చేసి సిద్ధంగావున్న పై విషయాన్ని ప్రకటించకుండా అవుచేశారు. ఆ తరువాత రోజున ప్రావ్దాలో తిరిగి పెద్దఖాళీస్థలం ప్రత్యక్షమైంది.

సెంట్రల్‌కమిటీవారు వెనుకతగ్గుటకు నిశ్చయించినా సైన్య సమీకరణకుముందుగా ఇచ్చిన ఆజ్ఞలను రద్దుచేయలేదు. ఆయుధ నావికులువచ్చి పెట్రోగ్రాడ్‌లోదిగి పటాలాలుగా బోల్షివిక్‌పార్టీ ముఖ్య కార్యస్థానమునకు చేరుకున్నారు. క్రోన్‌స్టాట్ నావికులందరూ క్షెసిన్‌స్కీ రాజభవనముదగ్గిరకు చేరేసమయానికి లెనిన్ అక్కడకువచ్చాడు. వారికి ఒక ఉపన్యాసం ఇచ్చాడు. సైనికులను ముందుకువెళ్లమనిగాని, వెనక్కి పొమ్మనిగాని అతడుచెప్పలేదు. తాత్కాలికప్రభుత్వాన్ని దుమ్మెత్తిపోశాడు. విప్లవమును సమర్థించమనీ, బోల్షివిక్‌పార్టీపై భక్తికలిగివుండమనీ అతడు సైనికులకు ప్రబోధించాడు.

తరువాత లెనిన్‌కోరికపై లునాకార్‌స్కీ ఉపన్యసించి, సైనికులకు నాయకత్వంవహించి టార్రైడ్ రాజభవనానికి నడిపించుకునిపోయాడు. 20,000 మంది నావికులకు సాయుధపాణులైన కార్మికులు కలిశారు.

బోల్షివిక్‌పార్టీ కేంద్రకమిటీ అంగీకరించలేకపోయినా, విప్లవానికి బలం చేకూరింది.

క్రోన్‌స్టాట్‌నావికులు సాయంత్రం 5 గంటలకు టారైడ్‌రాజభవనం చేరారు. తాత్కాలికప్రభుత్వమంత్రులను చూడాలని వారు పట్టుపట్టారు. సోషలిస్టు రివల్యూషనరీ నాయకుడైన విక్టర్‌చెర్నోవ్(Victor Chernov) ముందుగా బైటకువచ్చాడు. అతన్నిచూడగానే ప్రజలు కేకలువేశారు.

"అతన్ని వెతకండి! అతనిదగ్గిర ఆయుధాలున్నాయేమోచూడండి!"

"అల్లాగైతే, నేను చెప్పవలసినదేమీలేదు." అని అతడు లోపలికి వెళ్లబోయాడు. అప్పుడు ప్రజలు కేకలు మానినతరువాత చెర్నోవ్ చిన్న ఉపన్యాసం ఇచ్చాడు. అతడు ఉపన్యాసం పూర్తిచేయగానే కొందరు నావికులు అతన్నిపట్టుకుని ఒక కారులో ఎక్కించి ఖైదుచేశారు. దీనితో అలజడి మరింతగా ఎక్కువైపోయింది. కొందరు కార్మికులు భవనంలో ప్రవేసించి సోవియట్ నాయకులకు వార్నింగుగా "కామ్రేడ్‌చెర్నోవ్‌ను ప్రజలు ఖైదుచేశారు. అతనిని ముక్కలుముక్కలుగా చేస్తారు. అతన్ని రక్షించండి." అని చెప్పారు.

అధ్యక్షుని సలహాతో ట్రాట్‌స్కీ బైటకువచ్చి ప్రజలకువన్యసించ టానికి ప్రయత్నించాడు. కాని ప్రజలలో అల్లకల్లోలం తగ్గలేదు. కాని అతడు అలజడిలోనే ఇల్లా ఉపన్యసించాడు:

"కార్మికులకు, ధనికులప్రభుత్వం అక్కర్లేదని, సోవియట్‌సభకు తెలియచెయ్యటానికై మీరక్కడికివచ్చారు. మీ దౌర్జన్యంతో, కొందరు వ్యక్తులను బంధించి మీ ఆశయాన్ని మీరెందుకు పాడుచేసుకుంటారు? వారు మీశక్తికి అర్హులుకారు. మీలోప్రతివారూ విప్లవానికై, మీశిరములనే త్యాగంచెయ్యటానికి సిద్ధంగాఉన్నారు. నాకదితెలుసు. సోదరా! నాతో సహకరించు!" అతనిమాటలకు నావికులు కొంత శాంతించి చెర్నోవ్‌ను విడిచిపెట్టారు. ట్రాట్‌స్కీతో చేతులుకలిపి అతడు టారైడ్ భవనంలోనికి వెళ్ళిపోయాడు.

సోవియట్లముఖ్యకేంద్రంవద్ద రస్కోల్‌నికోవ్ (Raskolnikov) రెడ్‌నావికులనాయకుడుగా నిలబడ్డాడు. తరువాత ఏమిచెయ్యాలో అతనికి తెలియలేదు. సమయానుకూలంగా చేయవలెనని అతనికి సెంట్రల్ కమిటీ ఆజ్ఞనిచ్చింది. సోవియట్ కార్యనిర్వాహకవర్గాన్ని ఖైదుచేయటానికింకా అతని కధికారంవుంది. కాని ఈ ట్రాట్‌స్కీ-చెర్నోవ్ సంఘటన అతన్ని కలవరపెట్టింది. ఏమీచెయ్యకపోవడంకూడా అపాయకరమే. ఉద్రేకంలో నున్న నావికులు అతనిపైనే తిరుగబడవచ్చు.

కొంతసేపు ఏమీతోచక వేచివున్నతరువాత, నావికులు వారంతట వారే వెళ్ళిపోయారు. అప్పుడు బోల్షివిక్‌పార్టీ పక్షమైన 176వ రిజర్వు దళంవచ్చింది. కాని వారికి సలహాలివ్వటానికి అక్కడ బోల్షివిక్‌నాయకు లెవ్వరూలేరు. అప్పటికే సాయంత్రం 7 గంటలైంది. ఆవిధంగా మొదట వచ్చిన రెండు బోల్షివిక్‌తిరుగుబాటు కెరటాలు సాగిపోయాయి.

అటుతరువాత కొంతసేపటికి మూడవకెరటం బయలుదేరివచ్చింది. ఈసారివచ్చినవారు పుటిలోవ్ ఫాక్టరీపనివారు. వారు తిన్నగా టారైడ్ భవనానికి చేరుకున్నారు. ట్సెరిటెల్లీ (Tseretelli)ని చూడాలని వారు చాలా అలజడిచేశారు. ఒక కార్మికుడు ఆయుధపాణియై ఎత్తయిన ప్రదేశంలో నిలబడి కేకలుపెట్టాడు. సోవియట్ అధ్యక్షతవహించిన చ్ఖీడ్జె (Chkheidze) అతనికేకలు శాంతంగావిని, పిట్రోగ్రాడ్ కార్మికులను గూర్చి సోవియట్ తయారుచేసిన విన్నపం కాగితమును అతని కందించాడు. అతడది చదివిన తరువాత అందరూ ఎవరింటికివారు వెళ్ళిపోయారు.

అంతటితో జులైతిరుగుబాటు అయిపోయింది. బోల్షివిక్ నాయకత్వ లోపంవలన, నావిక, కార్మిక, సైనికదళాలలో తగిన సామరస్యం లేనందువల్ల ఈ తిరుగుబాటు విఫలమైంది. కాని అటుతరువాత కొన్నినెలలకు, బోల్షివిక్‌పార్టీకి అంతకుముందులేని బలం చేకూరింది.

జులై 19వ తేదీని, జినోవీవ్, కామెనోవ్, లునాకార్‌స్కీ, రస్కోల్నికోవ్ మదాంకొల్లోన్టైలను ఖైదుచేయమని తాత్కాలికప్రభుత్వం ఆజ్ఞా

పించింది. జర్మనీ ప్రభుత్వధనసహాయంతో, సాయుధ తిరుగుబాటును ప్రేరేపించినట్లు వారిపై నేరారోపణచేశారు. బోల్షివిక్ ముఖ్యస్థానమును ప్రభుత్వదళాలు ఆక్రమించాయి.

"ఇప్పుడు వారు మనలను తుపాకితో కాల్చుతారు" అని లెనిన్ ట్రాట్‌స్కీతో చెప్పాడు.

"ఉదృష్టవశాత్తూ, మన శత్రువులకు ఒకపద్ధతిగాని, అతగుండె ధైర్యంగానిలేవు" అని ట్రాట్‌స్కీ చెప్పాడు.

జులై 21వ తేదీ నిల్వావోల్ రాజకుమారుడు ప్రధానివదవికి రాజీనామానివ్వడం, కెరెన్‌స్కీ అస్థానానికి రావడంజరిగింది.

తాత్కాలికప్రభుత్వం ఖైదుచేయమని అజ్ఞనిచ్చినప్పుడు లెనిన్, జినోవీవ్‌లు ఒక బోల్షివిక్‌సభ్యుని ఇంట్లోదాక్కున్నారు....తరువాత లెనిన్ పారిపోయాడు. ఆ సాయంత్రం సైనికులు లెనిన్ గృహమును సోదాచేసి, చిందరవందరచేసి, అతనిసోదరి అన్నా, ఆమె భర్తను, కృప్సకయాను ఖైదుచేశారు. కాని మరునాడేవారిని విడిచిపెట్టారు.

లెనిన్, జినోవీవ్‌లు, పెట్రోగ్రాడ్ ప్రాంతంలోని ఒక కుగ్రామంలో, ఒక బోల్షివిక్ సభ్యుని ఇంట్లో తల దాచుకున్నారు. వారు పారిపోయిన రెండురోజులతరువాత క్రోన్‌స్టాట్‌పత్రికలో వారిచేవ్రాయబడిన ఉత్తరం ప్రకటించబడింది.

లెనిన్ పారిపోయినతరువాత తాత్కాలికంగా బోల్షివిక్‌లు రంగంలో నుంచి తప్పుకున్నారు. వారికి వ్యతిరేకంగా చాలాదుమారం చెలరేగి, అక్కడున్న బోల్షివిక్ నాయకులు బైటకురావటానికే భయపడ్డారు. ఖైదు చేయబడిన స్టెక్లోవ్, జులై 23వ తేదీని "బోల్షివికులకు నాకు ఏమీ సంబంధంలేదు" అని ప్రకటించాడు.

ఆ రోజునే పాట్‌మాన్ అనే అతడు, బోల్షివిక్ కేంద్రకమిటీ సభ్యులను కలుసుకున్నాడు. లెనిన్ జినోవీవ్‌లను జాగ్రత్తగావుండేస్థలానికి

పంపే ఏర్పాట్లుచెయ్యమని వారతనికి సలహానిచ్చారు. చివరికి వారిని కార్మికులవేషంతో ఫిన్లాండు సరిహద్దుదాటించటానికి నిశ్చయించారు. వారికి తగిన కాగితాలు సులభంగా సంపాదించారు. లెనిన్ మీసాలను, గడ్డాన్ని గొరిగించి, విగ్గుధరించాడు. జినోవీవ్ గడ్డంపెంచి, క్రాపును తగ్గించాడు. ఆవిధంగా తీయించుకున్న ఫోటోలను, దొంగపత్రాలకు అతికించారు.

లెనిన్ ఫిన్లాండుకు ప్రయాణం చేయటానికీ, జినోవీవ్, ఒక ఫిన్లాండు కార్మికునింట్లో ఉండటానికీ నిశ్చయించారు.

ఫిన్లాండు డయట్ సభ్యుని సహాయంతో, లెనిన్ హెల్సింకీ అనే పోలీసు కమిషనరు ఇంట్లో ఉండటానికి పాట్మాన్ ఏర్పాట్లుచేశాడు. ఇంతకంటె భద్రమైన స్థలం వారికి దొరకలేదు.

## పరిస్థితి మారింది.

తిరుగుబాటు విఫలంకాగానే, జులై మధ్యభాగంనుంచి, సెప్టెంబరు వరకు, బోల్షివిక్‌పార్టీ బలం క్రమక్రమంగా తగ్గిపోయింది.

జులై 30వ తేదీని కెరెన్‌స్కీ, బోరిస్‌సావిన్‌కోవ్‌ను యుద్ధమంత్రిగాను, కోర్నిలోవ్‌ను ప్రధానసైన్యాధికారిగానూ నియమించాడు. అస్థిర పరిస్థితులలోనున్న శక్తులను సమీకరించగల సమర్థుడైనవానిని సైన్యాధికారిగా నియమించమని, జులై 19వ తేదీని కార్యనిర్వాహకసంఘం కెరెన్‌స్కీకి తంతిపంపించింది. ఆమరునాడే కోర్నిలోవ్‌కు ఆస్థానం లభించింది. మరియొక వారంలో కోర్నిలోవ్ రష్యాసైన్యాలన్నింటికీ సర్వసేనాధిపతిగా నియమించబడ్డాడు.

కెరెన్‌స్కీ, కోర్నిలోవ్‌లిద్దరికి ఒకరిపైఒకరికి నమ్మకం లేకపోయినా సైన్యవిషయాలలోమాత్రం ఇద్దరికీ ఏకాభిప్రాయం కుదిరింది. మాస్కో, పెట్రోగ్రాడ్‌ల సమీపానికి మూడవగుఱ్ఱపుదళాన్నీ, ఫిన్లాండు ప్రాంతానికి మరొక కొసాక్‌దళాన్ని పంపమని జులై 19వ తేదీని నికోర్నిలోవ్ ఆజ్ఞాపిం

చాడు. రెండువారాలతరువాత దీనిఉద్దేశ్యం ఏమిటోజనరల్ లుకోమ్‌స్కీకి క్రిందివిధంగా తెలియచేశాడు.

''జర్మనీ మద్దత్తుదార్లను, గూఢచారులను, లెనిన్‌తోసహా ఉరితీయ వలసిన సమయంవచ్చింది; కార్మికుల సోవియట్లను, సైనికుల డిప్యూటీలను,మళ్ళీ ఎన్నడూకలునుకోకుండా చిన్నాభిన్నంచెయ్యాలి.పిట్రోగ్రాడ్‌లో బోల్షివిక్‌లు అలజడిచేస్తే వారికి తగినబుద్ధి నేర్పడానికై ముఖ్యంగా గుఱ్ఱపు దళాన్ని, ఆగస్టు నెలాఖరుకి పిట్రోగ్రాడ్ చేరునట్లుపంపుతున్నాను. దీని కంతకీ నాయకత్వం వహించటానికి జనరల్ క్రిమోవ్‌ను నియమిస్తున్నాను. అవసరమైతే ప్రతీ సోవియట్ సభ్యునీ ఉరితీయుటకు అతడు వెనుదీయడని నాకు నమ్మకం కలిగింది.''

ఆగస్టు 28వ తేదీని కెరెన్‌స్కీ ఏర్పాటుచేసిన అఖిలరష్యా రాజ్య మహాసభమాస్కోలోజరిగింది. అన్నిపార్టీలవారు, సైన్యదళాలప్రతినిధులతో కూడా మొత్తం 2400, మంది ప్రతినిధులు హాజరైనారు.

మహాసభ ప్రారంభమైన రోజునే స్థానికబోల్షివిక్‌సంస్థ వ్యతిరేక సూచకంగా సమ్మెజరిపింది. సమ్మెపూర్తిగా విజయవంతంకాకపోయినా, మహాసభలో ప్రజలందరకూ పూర్తినమ్మకంలేదనేవిషయం స్పష్టపడింది.

కెరెన్‌స్కీ, తన ఉపన్యాసంలో ప్రభుత్వమును కూలద్రోయటానికి శత్రువులు చేసేప్రయత్నాలన్నింటినీ సర్వవిధాలా అణచివేస్తామని హెచ్చరించాడు. తరువాత కోర్నిలోవ్ ఉపన్యసించాడు. ఎన్ని ఉపన్యాసాలు చేసినా, మొత్తంమీద ఆ మహాసభలో జరిగిన ఫలితం శూన్యం.

సెప్టెంబరు 3వ తేదీని జర్మనీవారు రీగాను పట్టుకుని ముఖ్యపట్టణం మీదకు వస్తున్నారు. వెంటనే పెట్రోగ్రాడ్ సైనికస్థావరంమీద తనకు ప్రత్యక్షాధికారం కావాలని కోర్నిలోవ్ అడిగాడు. సైనికభాగాలు కోర్నిలోవ్ అధికారక్రిందవున్నప్పటికీ పట్టణంమాత్రం తాత్కాలికప్రభుత్వాధికారంలో వుండాలని కెరెన్‌స్కీ పట్టుపట్టాడు.

సెప్టెంబరు 7వ తేదీని మంత్రివర్గం రాజీనామానివ్వాలనీ, సివిల్, మిలిటరీ అధికారములను ముఖ్యసైన్యాధిపతికి స్వాధీనంచెయ్యాలనీ

కోర్నిలోవ్ కోరాడు. 9వ తేదీని కెరెన్‌స్కీ, కోర్నిలోవ్‌ను బర్తరఫ్‌చేసి, పెట్రోగ్రాడ్‌వెళ్ళాలని ఆజ్ఞాపించాడు. కాని కోర్నిలోవ్ తన గుఱ్ఱపుదళాలను పెట్రోగ్రాడ్‌పైకేనడిపించాడు. ఇది అధికారంకొరకు చేసిన గొప్పసాహసం. కాని దానిని ఒకరాత్రిలోనే అణిచివేశారు. ఏమీ యుద్ధంజరుగకుండానే, కోర్నిలోవ్ దళాలు పెట్రోగ్రాడ్‌చేరకుండానే చెల్లాచెదరైపోయాయి.

సెప్టెంబరు 12వ తేదీని కెరెన్‌స్కీ సర్వసైన్యాధ్యక్షుడైనాడు. కోర్నిలోవ్‌ను ఖైదుచేశారు. సెప్టెంబరు 14వ తేదీని రష్యాను రిపబ్లికుగా ప్రకటించారు. కోర్నిలోవ్ సంఘటనద్వారా కెరెన్‌స్కీకి సైన్యాధికారానికి మధ్యసంబంధంపోయింది. అటుతరువాత కెరెన్‌స్కీ పెట్రోగ్రాడ్‌సోవియట్ దయకు పాత్రుడుకావలసివచ్చింది. అతనికి నమ్మకమైన సైన్యాలు లేక పోయాయి. ఈనూతన పరిస్థితులలో జూలైలో ఖైదుచేయబడిన బోల్షివిక్ నాయకులను విడుదలచేశారు. కార్మిక, కర్షక, సైనికవర్గాలలో బోల్షివికుల పలుకుబడి హెచ్చసాగింది.

సెప్టెంబరు 12వ తేదీని పార్టీ సెంట్రల్‌కమిటీకి ఫిన్లాండునుంచి లెనిన్ ఇలా వ్రాశాడు; "జరిగిన సంఘటనలలో కోర్నిలోవ్ తిరుగుబాటు హఠాత్తుగా జరిగినసంఘటన. కెరెన్‌స్కీపై మన పోరాటవిధానమును మార్పుచెయ్యాలి. అతనిపై విరోధమును కొంచెమైనాతగ్గించకుండా, అతనికి వ్యతిరేకంగా ఇదివరలో చెప్పినమాటలకు వెనుదియ్యకుండా, కెరెన్‌స్కీని పదభ్రష్టుని చెయ్యాలనే సంకల్పాన్ని విడిచిపెట్టకుండా మనం ఇల్లా చెప్పాలి. మనం ప్రస్తుతపరిస్థితులనుబట్టి సంచరించాలి. కెరెన్‌స్కీని ఇప్పుడే పడగొట్టకూడదు; అతనితో పోరాటానికి మరొకమార్గం అవలంబించాలి; కోర్నిలోవ్‌కు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలకు కెరెన్‌స్కీయొక్క లోపాలను, పొరబాటును తెలియచెయ్యాలి; ఇదివరకుకూడా ఇదిచేశాం. కాని ఇప్పుడు అదేప్రధాన కార్యక్రమం. అదే మార్పు."

కోర్నిలోవ్ తిరుగుబాటు కారణంగా అనేకపట్టణాలలో ఉద్యోగులపై అఘాయిత్యాలు జరిగాయి. సోవియట్ల సెంట్రల్‌కార్యసంఘంలోని సైనికవర్గం ఇటువంటి సంఘటనలనుగూర్చి ప్రకటించింది.

నవంబరుకు ముందుగానే పెట్రోగ్రాడ్ కార్మికులభావాలు నిశ్చితమై పోయాయి. అవి పూర్తిగా బోల్షివిక్‌పార్టీని బలపరిచేభావాలే. రాజ్యాంగ సభకు ఎన్నికలు జరుగటానికి వున్నవ్యవధిలో—నవంబరు 25 ఎన్నికల తేదీ—అసెంబ్లీసభ జరిగేవరకు ఒక ప్రాథమికపార్లమెంటును ఏర్పాటు చెయ్యాలని తాత్కాలిక ప్రభుత్వం నిశ్చయించింది. సోవియటులోని శక్తులను, ఇతరశక్తులను సమీకరించటానికై ఇది కెరెన్‌స్కీ చేసిన ఆఖరి ప్రయత్నం. తనపార్టీకూడా ఈ ప్రయత్నంలో పాల్గొంటున్నట్లు తెలియగానే లెనిన్ కోపంతో సెంట్రల్‌కమిటీకి ఫిన్‌లాండునుంచి ఒక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరం చాలాఘాటైనమాటలతో నిండివుంది. "పెద్దశిక్షలతో మమ్మలను భయపెట్టాడు. మేమంతా ఆశ్చర్యపడ్డాం. తరువాత కొంత ఆలోచించి ఒక నిర్ణయానికివచ్చాం. మాపార్టీచరిత్రలో, సెంట్రల్‌కమిటీ ఏకగ్రీవంగా లెనిన్ ఉత్తరమును తగులబెట్టాలని నిశ్చయించడం ఇదే ప్రథమం. ఈ సంఘటనకు అప్పుడు ప్రచారం ఇవ్వలేదు." అని బుఖారిన్ అన్నాడు.

కాని అధికారమును చేజిక్కించుకోటానికి లెనిన్ ప్రయత్నం చేస్తూనేవున్నాడు. మాస్కో, పెట్రోగ్రాడ్‌లోవున్న నాయకులకు అతడు వ్రాసిన రెండుత్తరాలలో అతని రాజకీయపుటెత్తును తెలియచేశాడు:-

"రెండు ముఖ్యపట్టణాలలోని కార్మిక, సైనికడిప్యూటీలలో మెజారిటీని సంపాదించితే బోల్షివికులు ప్రభుత్వాధికారం చేజిక్కించుకోగలరు; చేజిక్కించుకోవాలి.

ఇప్పుడు బోల్షివికులు అధికారంవహించాలి? ఎందుకనగా పెట్రోగ్రాడ్ లొంగిపోయినట్లయితే మనకవకాశం తగ్గిపోతుంది కనుక.

కెరెన్‌స్కీచేతులలో సైన్యం ఉన్నంతవరకు పెట్రోగ్రాడ్ పతనాన్ని ఆపడం మనశక్యంకాదు. రాజ్యాంగసభ ఏర్పడేవరకూకూడా మనం వేచివుండకూడదు; బోల్షివికులకు నామకఃమెజారిటి లభించేవరకూ ఊరుకోటంకూడా మంచిదికాదు. దానికోసం ఏవిప్లవమూ ఆగదు. డిమొక్రటిక్ సభయొక్క తడబాటులు పెట్రోగ్రాడ్ మాస్కోకార్మికుల ఓపికను పోగొట్ట గలదు. ఇప్పుడు మనం అధికారం చేబట్టకపోతే చరిత్ర మనలను

క్షమించదు. బ్రిటిషు, జర్మనీలమధ్య జరుగబోయే ప్రత్యేకశాంతి జరుగుతున్న ఈ అంతర్జాతీయపరిస్థితులు మనకు అనుకూలమైనవి. ఇప్పుడు మనం దేశాలకు శాంతినిసూచించినట్లయితే మనంతప్పకుండాజయిస్తాము.

మాస్కోలోనూ, పెట్రోగ్రాడ్‌లోనూ వెంటనే అధికారం చేపట్టాలి. మనసైన్యాలను అన్నిముఖ్యస్థలాలవద్దనూ ఏర్పరిచి, ప్రభుత్వాధికారులను ప్రభుత్వాన్ని బంధించాలి. టెలిఫోను, టెలిగ్రాపు కేంద్రాలను స్వాధీనం చేసుకుని అన్నిఫ్యాక్టరీలతో, సైన్యాలతో, యుద్ధస్థలాలతో సంబంధం కలిగివుండాలి.''

అక్టోబరు 3వ తేదీని ప్రాథమిక పార్లమెంటును ఏర్పరుచుటకు తాత్కాలిక ప్రభుత్వానికి మహాసభ అధికారంఇచ్చింది. అక్టోబరు 8వ తేదీని కెరెన్‌స్కీ ప్రధానిగా, సోషలిస్టు, లిబరల్ పార్టీ ప్రతినిధులతో ప్రభుత్వం పునఃస్థాపితమైంది. హెల్సింకిలోవున్న బోల్షివిక్‌పక్షపు ఒత్తిడి వార్తలు తెలియగానే లెనిన్, పెట్రోగ్రాడ్‌కు ప్రయాణమయ్యాడు. కాని బోల్షివిక్ సెంట్రల్‌కమిటీ అతనిప్రయాణం వాయిదావెయ్యాలనిచెప్పింది. కాని లెనిన్ వెంటనేబయలుదేరి పెట్రోగ్రాడ్‌చేరాలనే సంకల్పంతో వైబోర్గ్‌చేరాడు. షాట్‌మాన్ అతన్ని ఫిన్లాండు రచయితయైన లటక్ ఇంటివద్దచూచి, అతనిక్షేమంగురించే సెంట్రల్‌కమిటీఅలాప్రవర్తించిందని చెప్పాడు. అయితే దాన్ని ఖాయపర్చమని లెనిన్ పట్టుపట్టాడు. షాట్‌మాన్ అవిధంగా ఒకకాగితంమీద వ్రాసియిచ్చాడు. దానిని మడిచి లెనిన్ జేబులో పెట్టుకుని, ఇటునటుపచారుచేస్తూ ''అంతటితో ఊరుకోను'' అంటూ కోపంగా అనుకున్నాడు.

అతడు కొంతశాంతించినతరువాత తనప్లానులన్నింటినీ ఆధారాలతో షాట్‌మాన్‌కు బోధించి ఇప్పుడే మనం అధికారం చేజిక్కించుకోవాలి అని వాదించాడు. అధికారం చలాయించగల శక్తిమంతులు మనకులేరని షాట్‌మాన్ వాదించాడు. దానికి లెనిన్ ''ఏ కార్మికుడైనా మంత్రిత్వం నిర్వహించడం కొద్దిరోజులలో నేర్చుకోగలడు. ప్రత్యేకశక్తి సామర్థ్యాలు అవసరంలేదు. సాంకేతికశాఖలను ఇప్పుడున్నవారిచేతనే మనం బలవంతంగా పనిచేయించవచ్చు''నని చెప్పాడు.

ప్రభుత్వం మన చేతులోనున్నదనే నమ్మకం కలిగేటట్లుగా మనం కొన్ని డిక్రీలను చేయగలగాలి. అప్పుడు వారు ప్రభుత్వాన్ని సమర్థిస్తారు. మొట్టమొదట, లెనిన్ ఉద్దేశ్యంప్రకారం, యుద్ధమును సమాప్తిచెయ్యాలి: తద్వారా యుద్ధరంగంలోని సైనికులబలం సంపాదించగలము. జారు, ఇతర ధనికవర్గాలు, చర్చిలయొక్క భూములను రైతులకు పంచిపెట్టాలి. ఫాక్టరీలు మొదలైనవాటిని ధనికులవద్దనుంచిలాగి కార్మికుల కొప్పగించాలి. అప్పుడింకా బోల్షివికులనెవరు ఎదిరిస్తారు?

కోర్నిలోవ్ సంఘటనకు పూర్వాపరాల పరిస్థితులను చర్చిస్తూ, అయుధవిప్లవప్రయత్నాలకిదే సరియైన సమయమని సెప్టెంబరు అఖరున లెనిన్ సెంట్రల్‌కమిటీకి ఒక ఉత్తరంవ్రాశాడు. ఈమారువిప్లవం విఫలం కాదని అతడు వాదించాడు. అఖిలరష్యాసోవియట్ల కాంగ్రెసువరకూ వేచివుండక, వెంటనే కెరెన్‌స్కీని ఓడించి, తరువాతనే కాంగ్రెసును ఏర్పాటుచెయ్యాలని లెనిన్ సలహానిచ్చాడు.

అక్టోబరు 20వ తేదీని ప్రాథమికపార్లమెంటు ప్రారంభమైంది. లెనిన్ బలవంతంచేత బోల్షివిక్‌సెంట్రల్ ఒక బహిష్కారతీర్మానమును చేసి పంపించారు. ట్రాట్‌స్కీ దాన్నిచదివి బోల్షివిక్‌ల అభ్యంతరాన్ని తెలియచేశాడు.

హెల్సింగఫోర్స్‌లోని సైనిక, నావిక కార్మికులస్థానిక సంఘాధ్యక్షుడైన స్మిల్గా (Smilga)అనే అతన్ని ఫిన్లాండులోని సైనిక, నౌకాదళాలను సమీకరించటానికి లెనిన్ నియమించాడు. అతడు చేయవలసిన కార్యక్రమాన్ని లెనిన్ విపులంగా అతనికి బోధించాడు.

తాత్కాలిక ప్రభుత్వంనుంచి అధికారం వెంటనే పెట్రోగ్రాడ్ సోవియట్‌కు ఒప్పగించాలని ఇప్పుడే అలజడిచెయ్యాలని లెనిన్ సలహానిచ్చాడు.

"నాఅభిప్రాయంలో ప్రజల మనస్సుల సరిగా తయారుచేయుటకు వెంటనే ఈనినాదం ప్రచారంచెయ్యాలి. అధికారం వెంటనే పెట్రోగ్రాడ్

సోవియటుకు ఒప్పగించాలి, అది సోవియట్లకాంగ్రెసుకు అందచేయబడు తుంది. ఇంకా మూడువారాలు యుద్ధంతో ఎందుకు బాధపడాలి?

తనయొక్క ఆత్మరక్షణకు లెనిన్, స్మిల్గాకు ఇలా ఆజ్ఞాపించాడు: "స్థానికకమిటీ అధ్యక్షునిసంతకంతో సీలుచేయబడిన ఐడెంటిఫికేషన్‌కార్డు నాకుపంపించు. స్థానికకమిటీ అధ్యక్షుడు, ఈకార్యమేదుకు హామీఇస్తాడనీ, అన్ని సోవియట్లు, సైన్యప్రతినిధులు అందరూ అతనిలో పూర్తివిశ్వాసం ఉంచవచ్చుననీ, దానిలోవ్రాయించు.ఏదైనా అవసరమైతే-పేచీగాని, కలుసుగోడంగాని-సంభవిస్తే ఇది నాకుకావాలి...."

అటుతరువాత కొద్దికాలానికి షాట్‌మాన్ వైబోర్గులోవున్న లెనిన్ దగ్గరకువెడుతూ, స్టేషనులో రాఖియాను కలుసుకున్నాడు. వైబోర్గ్‌కు వెళ్ళవలసిన అవసరంలేదని రాఖియాచెప్పాడు. లెనిన్ పెట్రోగ్రాడ్‌కు తిరిగివచ్చాడు.

## లెనిన్ అధికారం చేపట్టాడు

లెనిన్ పెట్రోగ్రాడ్‌లో ప్రవేశించగానే ఆయుధవిప్లవానికి తగిన ఏర్పాట్లుచేయడం ఆరభించాడు. 1917 సం॥ అక్టోబరు 23వ తేదీని జరిగిన బోల్షివిక్ సెంట్రల్‌కమిటీసభలో—జినోవీవ్, కామెనేవ్, స్టాలిన్, ట్రాట్‌స్కీ, స్వెర్డ్‌లోవ్, యురిట్‌స్కీ, జెర్జిన్‌స్కీ, కోలోన్‌టై, బుబ్‌నోవ్, సొకోల్నికోవ్,లో మోవ్‌లు హాజరైనారు—బోల్షివిక్ తిరుగుబాటును రాజ్యాంగ సభవరకు ఆపుచెయ్యకూడదని లెనిన్‌పట్టుపట్టాడు.

"మనం వెంటనేప్రారంభించటానికి అంతర్జాతీయపరిస్థితి తగినట్లున్నాయి. ప్రజలు అలక్ష్యంగావుండటానికి కారణం, వారు మాటలతోను తీర్మానాలతోనూ అలసిపోయివుండటమే. ఇప్పుడుమనదే మెజారిటీ.మనకు తప్పకుండా వ్యతిరేకంగావుండే రాజ్యాంగసభవరకు ఆలసించడం చాలా తెలివితక్కువ. అది మనకు కష్టాలెక్కువచేస్తుంది." అన్నాడు లెనిన్. దీన్నిగూర్చి పెద్దచర్యజరిగింది. చివరికి లెనిన్ జయించాడు.

తొందరగా అక్కడున్న ఒక పిల్లలపుస్తకంలోని గ్రాఫ్‌కాగితం చింపి, పెన్సిలుతో "ఆయుధవిప్లవానికి తయారుకావాలని పార్టీ ఆదేశిస్తున్నది." అని ట్రాట్‌స్కీ తన డైరీలో వ్రాసుకున్నాడు. అధికారతీర్మానం వోటుకు పెట్టగా అనుకూలంగా 10 వ్యతిరేకంగా 2 వోట్లువచ్చాయి.

కొన్నాళ్లతరువాత ఇంకా ఆలస్యంవల్ల ఇంకా నష్టంకలుగుతుందని లెనిన్ మళ్ళీ హెచ్చరించాడు.

"వ్యవసాయికమైన అక్రమాలు అధికమౌతున్నాయి. ప్రభుత్వం రైతులపై అతిదౌర్జన్యవిధానాలువయోగిస్తూన్నారు. సైన్యంలో మన ఆశయానికి అభిమానం హెచ్చుతోంది. మాస్కోలోని సైన్యంలో 100 కి 99 మంది మన పక్షంలోవున్నారు. ముఖ్యంగా నావికులను పేల్చిన తరువాత జర్మనీలోవిప్లవం ఇదివరకే ప్రారంభమైనట్లు నిశ్చయమైంది. మాస్కోసోవియటు ఎన్నికలలో బోల్షివికులకు 100కి 47 వోట్లువచ్చాయి. సోషలిస్టురివల్యూషరరీలతోకలిపి దేశంలో మనకేమెజారిటీలభిస్తుంది.

"ఈ పరిస్థితులలో ఆలసించడం చాలాఅక్రమమైనవని. సోవియట్ల కాంగ్రెసువరకూ వేచివుండటానికి బోల్షివికులకు అధికారంలేదు. వారు వెంటనే అధికారం చేపట్టాలి. ఆవిధంగా వారు ప్రపంచవిప్లవాన్ని అరి కట్టగలుగుతున్నారు. లేకపోతే అన్ని దేశాల రాజులు మనకు వ్యతిరేకంగా మైత్రిఒడంబడిక చేసుకుంటారు...."

ఈలోగా కార్మికులను, సైనికులను కెరెన్‌స్కీ వ్యతిరేకంగా రెచ్చ గొడుతున్నాడు. ఈసందర్భంలో "కెరెన్‌స్కీప్రభుత్వం పడిపోగానే భూమి నంతటినీ ప్రజలకుపంచుతాము; ప్రజాస్వామ్యహక్కులను, సంస్థలను పునరుద్ధరించి, ఇంకెవ్వరు పడగొట్టలేనిప్రభుత్వమును నెలకొల్పుతాము" అని లెనిన్ పదేపదేవాగ్దానాలు చేశాడు.

కొందరుసభ్యులు ఇదమిద్ధంగా నిర్ణయించలేకపోయారు. కాని మెజారిటీమాత్రం వెంటనే కార్యరంగంలోనికి దిగాలని నిశ్చయించారు. ట్రాట్‌స్కీ ప్రోద్బలంతో పెట్రోగ్రాడ్‌లో మిలిటరీరివల్యూషనరీ కమిటీ

స్థాపించబడింది. సెంట్రల్ కమిటీకూడా అన్ని ఏర్పాట్లుచేయడానికై ఒక పొలిటికల్ బీరోను స్థాపించారు. కాని మిలిటరీ రివల్యూషనరీ కమిటీయే ప్రధానపాత్ర వహించింది. సైన్యాధికారమంతా స్వాధీనంచేసుకోడానికై పెట్రోగ్రాడ్‌లోనూ, చుట్టుప్రక్కలనుఉన్న సైనికదళాలలో ఒక్కొక్క కమిసార్‌ను ఏర్పాటుచేశారు.

నవంబరు 6వ తేదీని సెంట్రల్ కమిటీకి లెనిన్ ఒక ఉత్తరంవ్రాశాడు:

''ఈవిషయాన్ని ఏ షరతులులేకుండా ఈ సాయంత్రమే, లేక ఈరాత్రే నిర్ణయించాలి. జయంతథ్యమైన ఈరోజున అశ్రద్ధచేస్తే చరిత్ర క్షమించదు. నిజానికి రేపు అంతా అపజయమేఅవుతుంది. మనం ఈవేళఅధికారం చేజిక్కించుకుంటే అది సోవియట్లకు వ్యతిరేకంగా కాదు; అది వారితరఫునేజరుగుతుంది. అధికారం పట్టుకోడం అనగా కేవలం తిరుగుబాటే. దానియొక్క రాజకీయాశయం తరువాత స్పష్టంగా తెలుస్తుంది. ఇటువంటివిషయాలను కేవలం వోట్లతోకాకుండా దౌర్జన్యంతో నైనా నిర్ణయించటానికి ప్రజలకు అధికారంవుంది. ప్రమాదకరపరిస్థితులలో, ఎంత ముఖ్యప్రతినిధులకైనా, ఆదేశాలనివ్వటానికి ప్రజలకుహక్కు వుంది; అది వారిధర్మం.''

ఈ సవాలునుబట్టి తాత్కాలికప్రభుత్వవశంలో చాలాకొద్ది సైన్యాలే వున్నట్లు తెలిసింది. దానిమీద వెంటనే కార్యక్రమం ప్రారంభించటానికి మిలిటరీరివల్యూషనరీ కమిటీనిర్ణయించింది. 'వింటర్‌పాలెస్'ను ఆక్రమించుకుని ప్రభుత్వాధికారులను ఖైదుచేయటానికి ఒక ప్లాను తయారు చేశారు. ప్రభుత్వంలొంగకపోతే నౌకాదళాల బలప్రయోగంతో దానిని స్వాధీనంచేసుకోటానికి నిశ్చయమైంది.

కార్యక్రమ నిర్వహణాధికారం ఆంటొనోవ్, చుడ్నోవిస్కీ, పోడ్వోయిస్కీల చేతులలోపెట్టారు. నవంబరు 7వ తేదీని కోటను ఎదుర్కోవాలి. ఎదుర్కొనేముందు 'వెంటనేలొంగిపోవాలి' అని ఒక అల్టిమేటుంపంపాలనీ 20 నిమిషాలలో లొంగకపోతే బలప్రయోగం చెయ్యాలనీ నిర్ణయించబడింది.

నవంబరు 6వ తేదీ ఉదయం, ఈ తిరుగుబాటునకు లెనిన్ ముఖ్యకారకుడనిచెప్పడానికి తనకు బలమైన ఆధారాలున్నవని కెరెన్‌స్కీ ప్రకటించాడు. దాన్ని అణచివేయుటకు ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది. సైన్యాలను పంపటానికి ప్రభుత్వం సంకోచించదు. కాని అన్ని పార్టీలసహకారం, ప్రజలసహాయం విజయానికి చాలాఅవసరం, అని చెప్పి కెరెన్‌స్కీ పూర్వపుపార్లమెంటు సహకారమును కోరాడు.

పూర్వపుపార్లమెంటులో, తాత్కాలిక ప్రభుత్వానికి బలమైన మెజారిటీలేదు. దానిలో ముఖ్యమైనవాడు థియొడోర్‌డాన్ అనే లెప్టుమెన్షివికుపార్టీవాడు. అతడు బోల్షివికులను విమర్శిస్తూ ఒకతీర్మానం ప్రవేశపెట్టాడు. కాని వెంటనే భూములను రైతులకు స్వాధీనంచెయ్యాలనీ, రాజ్యాంగసభను వెంటనే ఏర్పాటుచెయ్యాలనీ వాదించాడు. బోల్షివికులు జరుపుతున్న విప్లవంవల్ల చాలాఅనర్థం జరుగుతుందనీ, కాని విప్లవ ప్రజాస్వామ్యం వారిపై బలప్రయోగంచెయ్యగలదనీ, అల్లాచేస్తే విజయమంతా, బోల్షివికులను, తాత్కాలిక ప్రభుత్వమును, మొత్తంప్రజాస్వామ్యమునేతుడిచివేసే వేరొకశక్తిహస్తగతం అవుతుందనీ డాన్ చెప్పాడు. ఇప్పటి విప్లవానికి బాధ్యులు బోల్షివికులు, తాత్కాలికప్రభుత్వాలపై పెడుతూ, దీనిని అరికట్టేబాధ్యత ప్రజారక్షకకమిటీకి ఒప్పగించాలని అతని తీర్మానంలో వాదించాడు.

ఈతీర్మానం అంగీకరింపబడగానే డాన్ తాత్కాలికప్రభుత్వసభకు పోయి, తన తీర్మానంలోని ముఖ్యాంశములను కరపత్రాలలో ప్రకటించి, ప్రజలలో వెంటనే ప్రచారంచెయ్యాలని పట్టుపట్టాడు.. ఈతీర్మానం ప్రజాభిప్రాయంలో చీలికల నేర్పరచటానికి ఉపయోగిస్తుందనికూడా అతడు కెరెన్‌స్కీకి తెలియచేశాడు, "ఇప్పుడు కావలసినది పని; కాని మాటలుకాదు" అన్నాడు కెరెన్‌స్కీ.

ఈలోగా, బోల్షివికులు, తమపైమోపబడిన అభాండాలన్నీ కెరెన్‌స్కీ సృష్టించినవని ప్రకటించారు. కెరెన్‌స్కీ, డాన్‌తో మాట్లాడుతున్న సమయంలోనే, కొసాక్‌దళాల ప్రతినిధులువచ్చారు. ఇది ఇదివరకు జులైలో

వలె తమశక్తిని వృధాచెయ్యకుండావుంటే బోల్షివికులతో తాము యుద్ధం చేస్తామని వారు కెరెన్‌స్కీతోచెప్పారు. ఇక్కడ ఈవిధంగా వారుమాట్లాడు తున్నసమయంలో కొసాక్‌దళాల కౌన్సిలుసభచేసి, ఈ పోట్లాటలో తాము కలుగచేసుకోకూడదని తీర్మానించారు.

"వ్లాడిమర్‌ఇలిచ్ గదిలోపచారుచేస్తున్నాడు. వెంటనే అతడు, 'ఇప్పుడు స్మోల్నీఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళాలి' అన్నాడు. అతనికి జరుగబోయే అపాయములను సూచిస్తూ, అతన్నివెళ్లవద్దని వారించాను. నా మాటలను లెక్కచేయకుండా "మనం స్మోల్నీకి వెడుతున్నాం అన్నాడు లెనిన్"అని కృపియా తెలియచేశాడు.

లెనిన్ దుస్తులు మార్చుకుని వారు స్మోల్నీకిచేరుకున్నారు. వెంటనే ట్రాట్‌స్కీ, స్టాలిన్‌లను రమ్మని లెనిన్ కబురుచేశాడు. వారు రాగానే ఆ నలుగురు పెద్దమనుష్యులు ఒకప్రత్యేకగదిలోనికివెళ్ళి మంతనాలుచేశారు. మిలిటరీ రివల్యూషనరీకమిటీకి, పిట్రోగ్రాడ్ మిలిటరీజిల్లాఉద్యోగులకు రాయబారాలు సాగుతున్నాయని పత్రికలు ప్రచురించాయి. "రాజీకి నీవు అంగీకరించావా?" అని లెనిన్, ట్రాట్‌స్కీని తీక్షణంగా అడిగాడు. తాను ప్రత్యేకంగా ఈవార్తలను పత్రికలకిచ్చాననీ, తిరుగుబాటుకుముందు ఇదిఒక తాత్కాలికవుటెత్తుమాత్రమేననీ ట్రాట్‌స్కీచెప్పాడు.

"అది చాలాబాగుంది....ఛా....లా బాగుంది" అన్నాడు లెనిన్ గదిలోపచార్లుచేస్తూ.

తిరుగుబాటు అతిచురుకుగా జరిగింది. రెడ్‌గార్డులు, సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసును, పోస్టాఫీసు, ఇతర ముఖ్యప్రభుత్వభవనాలను ఆక్రమించుకున్నారు.ఆయుధపాణులైనబోల్షివికులు, వింటరుపాలెస్‌ను,మిలిటరీ డిస్ట్రిక్టుకేంద్రాన్ని గట్టిగాముట్టడించారు. ఉపముఖ్యమంత్రి కోనోవలోవ్‌తో కలిసి కెరెన్‌స్కీ ముఖ్యకేంద్రానికిబయల్దేరాడు. యుద్ధరంగంనుంచివస్తున్న సైన్యాలనుస్వయంగాకలుసుకుని మాట్లాడాలనికెరెన్‌స్కీ, బోల్షివిక్‌బలాలను చీల్చుకునిపోటానికి నిశ్చయించాడు. అతడుఒకకారులోబయలుదేరివెళ్లాడు.

కావలివారు, ప్రజలుఅతన్ని గుర్తుపట్టారు కానికారు గచినా(Gatchina)కు వెళ్ళిపోయింది.

అఖిల రష్యాకార్మిక, సైనికడిప్యూటీలసభ ఆనాడు సాయంత్రం జరుగబోతోంది. ఆసభలో అధికారం కైవశమైనదని చెప్పటానికి, బోల్షి వికులు అధికారవశీకరణకు అవస్థపడుతున్నారు. రాత్రి పడినప్పటికి వింటర్‌పాలెస్‌ఇంకా వశంకాలేదు. ఈసమయంలోనే పెట్రోగ్రాడ్ కౌన్సిలులో ఒకవింతసభజరుగుతోంది. వింటర్‌పాలెస్‌ముందు యుద్ధం జరుగు తున్నట్లు వారికితెలిసింది. అందులో ఒకసభ్యుడులేచి "మనంకూడా పోయి, రష్యాఎన్నుకున్న ప్రతినిధులతోపాటు మరణించుదాం" అని ఉద్రేకంగా ఉపన్యసించాడు. పెట్రోగ్రాడ్‌సిటీ కౌన్సిలుసభ్యులు, సోవి యట్ రైతు డిప్యూటీలు వీధిలోనికిపోయి వింటర్‌పాలెస్‌వైపు, పాటలతో నడిచారు.

కాజన్ కెథీడ్రల్‌వద్ద బోల్షివిక్‌దళం వారినినిలిపి ముందుకుసాగనివ్వ లేదు. వింటర్‌పాలెస్‌లో నున్నవారు, ఆఖరిప్రయత్నానికి ఏర్పాట్లుచేస్తు న్నారు. ఆసమయంలో కిష్కిన్‌వచ్చి "మిలిటరీ రివల్యూషనరీపార్టీ దగ్గరనుంచి ఒక అల్టిమేటంవచ్చిందనీ, దాన్నిగూర్చి చర్చించాలనీ తెలియచేశాడు. ఆ అల్టిమేటమును నిర్లక్ష్యంచెయ్యడానికే నిశ్చయించారు. గడియారంలో అప్పటికి 8 గంటలుదాటిపోయింది. మంత్రులంతా దీపాలు ఆర్పివేసికూర్చున్నారు. బైటనుంచి అనేక రకాలధ్వనులు వినవస్తున్నాయి.

ఒకవింతధ్వని వినిపించింది.

"ఏమిటది?" అని ఒకరడిగారు.

"అది 'అరోరా' వద్దనుంచి" అని నౌకామంత్రి వెర్డెరెవిస్కీ (Verderevsky) సమాధానం ఇచ్చాడు. అంతకుముందు సెంట్‌పీటరు సెంట్‌పాల్ వద్దనుంచి తుపాకుల ధ్వనులు వినిపించాయి. తరువాత 'అరోరా' 6 అంగుళాలషెల్లునుగురిచూచి కొట్టింది. అదివచ్చి వరండాలో పడింది. దానితో ప్రతిఘటించేవారందరిలో కల్లోలం బయలుదేరింది.

ఇంతలో 30 లేక 40 మంది బోల్షివికులు తుపాకులతోను, రివాల్వర్లతోనూ భవనంలో ప్రవేసించారు. కాని అక్కడ వారినివెంటనే బంధించివేశారు. తరువాత మరికొందరు నావికులు ప్రవేసించి గ్రనేడ్లు ప్రయోగించారు. కాని వారినికూడా అక్కడ బంధించారు.

తలుపు ఒక పెద్దధ్వనితో తెరువబడింది.

తూటాలాగ ఒక పొట్టిమనిషి లోపలికి త్రోసుకువచ్చాడు. అతని వెనుకనే కొంతగుంపు త్రోసుకునివస్తోంది. అతనికళ్లు, ముఖముచూస్తే చాలా అలిసినట్లున్నాడు. అతడు ముందుకువేగంగావచ్చి ఇల్లాఅన్నాడు.

''తాత్కాలిక ప్రభుత్వసభ్యులెక్కడవున్నారు?''

''తాత్కాలిక ప్రభుత్వం ఇక్కడేవుంది. ఏమికావాలి నీకు?''అని కూర్చునివున్న కొనోవలోవ్అడిగాడు.

''మీతాత్కాలికప్రభుత్వ సభ్యులనందరినీ బంధించాం అని మీకు తెలియచేస్తున్నాను. నేను మిలిటరీ రివల్యూషనరీ కమిటీ అధ్యక్షుడను-ఆన్టోనోవ్ను'' (Antonov)''రక్తపాతమును ఆపుటకై ప్రభుత్వసభ్యులు దౌరన్యానికి లొంగిపోతారు.'' అన్నాడు కొనోవలోవ్.

''రక్తపాతం ఆవటానికి! పాపం! ఎంతరక్తం చిమ్మించావునీవు!' అన్నాడు ఆగుంపులో ఒకడు. అన్నిప్రక్కలనుంచీ కేకలుప్రారంభించాయి'

ఆన్టోనోవ్కేకలను ఆపుచేశాడు.

''కామ్రేడ్సు! చాలు. అదిచాలు. అదంతా మనంతరువాతచూద్దాం. నేనివ్వుడు ప్రొటోకాల్ (Protocal) వ్రాయాలి. ముందు మీవద్దనున్న ఆయుధాలను మాకు స్వాధీనంచేయండి.''

సైనికులంతా ఆయుధాలప్పగించారు. గది ఆయుధపాణులైన సైనికులతో క్రిక్కిరిసిపోయింది. కెరెన్‌స్కీ పారిపోయినట్లు తెలియగానే అందరూ అనేకవిధాలుగా శపథాలతో కేకలుపెట్టారు. ''వీళ్లుకూడా పారిపోతారు. వారిని వెంటనే చంపండి.'' అని కేకలుపెట్టారు. ఆన్టోనోవ్లేచి

"కామ్రేడ్స్! అంతా నిశ్శబ్దంగావుండండి. వీరిని సెంట్‌పీటర్, సెంట్ పాల్‌లో బంధిస్తాం. దౌర్జన్యం అంగీకరించను. మీరు శాంతంగా, క్రమ శిక్షణతో మెలగాలి. అధికారం ఇప్పుడు మనచేతిలోవుంది." అని వారిని వారించాడు.

ప్రభుత్వసభ్యులను సెంట్‌పీటర్, సెంట్‌పాల్‌కోటలలోబంధించారు.

తాత్కాలికసభ్యులను బంధించినవార్త స్మోల్నీకి చేరేసమయానికి, సోవియట్‌కాంగ్రెసుసభ జరుగుతోంది. ముఖాన్నిసగం కప్పుకున్న జేబురుమాలును లెనిన్ తీసివేశాడు.

"నీవిగ్గును తీసిపారెయ్" అని బ్రోంచ్‌బ్రుయేవిచ్ (Bronch-Bruyech) అన్నాడు. లెనిన్‌విగ్గునుతీసి వేదికపైకిరాగానే హర్షధ్వానాలు చేశారు. శబ్దంతగ్గిన తరువాత అతడిలాఉపన్యసించాడు.

"కామ్రేడ్స్! బోల్షివిక్‌లు పదేపదేచెప్పిన కార్మికకర్షకవిప్లవం జరిగింది. దీనియొక్క ప్రాముఖ్యతఏమి? ధనికబలంలేకుండా మనకు సోవియట్ ప్రభుత్వంఏర్పడింది. అణచివుంచబడిన ప్రజలే ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసుకుంటారు. పూర్వప్రభుత్వపద్ధతులన్నింటినీ ముక్కముక్కలుగాచేసి, సోవియట్‌ప్రభుత్వం నెలకొల్పబడుతుంది. ఇక్కడనుంచి రష్యాచరిత్రలోని నూతనాధ్యాయం ప్రారంభమౌతుంది. ఈమూడవ రష్యావిప్లవమే సోషలిజం విజయానికి దారితీస్తుంది. ఇప్పుడు మనం రష్యాలో సామాన్యసోషలిస్టు ప్రజారాజ్యాన్ని స్థాపించాలి. ప్రపంచవరివ్యాప్తవిప్లవము వర్ధిల్లుగాక."

ఆ రాత్రి చాలాప్రొద్దుపోయినతరువాత లెనిన్ బోన్‌చ్‌బ్రుయేవిచ్ ఇంటికిపోయాడు. అతడు తలుపులన్నీబంధించి, లెనిన్‌గది ప్రక్కనే పడుకున్నాడు. విప్లవం ఇంకా పూర్తికాలేదు. లెనిన్‌ను బంధించటానికి ఎవరైనారావచ్చునని అతడు అనుకున్నాడు.

చివరికి లెనిన్ తనదీపం ఆర్పివేశాడు. అతడు పడుకున్నాడనే తలంపుతో బోన్‌చ్‌బ్రుయేవిచ్‌కూడా పడుక్కోబోతున్నాడు. కాని ఇంతలో

మళ్ళీ దీపాలువెలిగాయి. లెనిన్ లేచికూర్చుని ఏదో వ్రాయడం ఆరంభించాడు. అతడు వ్రాసినది మళ్ళీమళ్ళీ సరిచూసుకుని సరియైన కాపీ తయారుచేసేసరికి తెల్లవారింది. అప్పుడే లెనిన్ నిద్రపోయాడు.

ఉదయాన్నే అందరూలేచి టీ త్రాగేసమయానికి లెనిన్ యథావిధిగా వచ్చి "ఈమొదటిసోషలిస్టువిప్లవదినంనాడు మీకందరికీ అభినందనలు" అన్నాడు. అప్పుడు తన జేబులోనుంచి, రాత్రి తానువ్రాసిన కాగితంతీసి, ఎస్టేటుభూములను రద్దుచేస్తూచేసిన డిక్రీని చదివాడు. "దీనినిప్పుడు రేడియోద్వారా ప్రజలకు వెల్లడిచేయాలి. అప్పుడు వారిని దీనిని రద్దుచేయ ప్రయత్నించనీయండి. భూమిమీద ఏ శక్తీ దీన్నిరద్దుచేసి, కర్షకులనుంచి భూమిని లాగి జమీందారుల కివ్వలేదు. మనయొక్క విప్లవం సాధించిన అతిముఖ్యకార్యమిది. ఈ దినం వ్యవసాయవిప్లవంవస్తుంది. దానికింక తిరుగులేదు." అని చెప్పాడు లెనిన్

"సోషలిస్టు రివల్యూషనరీల కార్యక్రమాన్ని తస్కరించామని వారు మనలను దూషిస్తారు." అని ఒకరు సూచించారు.

"వారిష్టంవచ్చినట్లు చెప్పనియ్యండి. మనం ఎల్లప్పుడూ వారి కోర్కెలనే బలపరుస్తామని రైతులుగ్రహించగలరు. మనం రైతులతోనూ వారి కోర్కెలతోనూ కలిసిపోవాలి. మనలనుచూసి నవ్వే వెఱ్ఱివాళ్లుంటే నవ్వనీయండి. రైతులపై సర్వాధికారమును సోషలిస్టు రివల్యూషనరీల కివ్వడానికి మనం ఎన్నడూ తలపెట్టలేదు" అన్నాడు లెనిన్.

ఇప్పుడు ఎటువంటిప్రభుత్వంస్థాపించాలి; సభ్యులనేమనిపిలవాలి? అనేది ప్రస్తుతప్రశ్న. "మంత్రులు-కాకుండా ఏపేరైనాసరే. అది చాలా అసహ్యమైనమాట" అన్నాడు లెనిన్.

"కమిస్సార్ అని పిలవవచ్చు కాని చాలామంది కమిసార్లున్నారు" అన్నాడు ట్రాట్‌స్కీ. "సుప్రీమ్ కమిసార్ అంటే-కాదు. అది బాగాలేదు. పీపుల్సుకమిస్సార్ అంటే ఎల్లావుంటుంది?"

"పీపుల్సు కమిసార్లు-ఔను. అదిబాగానేవుంది. అయితే ప్రభుత్వం అంతనీ ఏమనాలి?" అన్నాడు లెనిన్.

"సోవియట్-అందాం; పీపుల్సు కమిసార్ల సోవియట్" "పీపుల్సు కమిసార్ల సోవియట్-అది చాలాబాగుంది" అన్నాడు లెనిన్.

అఖిలరష్యాకాంగ్రెసులో జరిగిన కార్యకలాపానికి నిరసనగా 100 మంది డెలిగేట్లు బైటకువెళ్ళిపోయారు. బోల్షివికులు, అనుచరులుమాత్రం మిగిలారు. ప్రభుత్వమును స్వాధీనం చేసుకుంటున్నామని ఒకతీర్మానం చేశారు.

సోవియట్ప్రభుత్వాధికారం, భూములను, సైనికులు, కార్మికుల కంట్రోలుకు తిండి, ఇతర అవసరములను రాజ్యాంగసభను ఇవ్వటానికి వాగ్దానంచేస్తుంది. కెరెన్స్కీనిగూర్చి సైనికులకువార్నింగు నిచ్చినతరువాత, నవంబరు 8వ తేదీఉదయం ౧ గంటలకుసభను వాయిదావేశారు.

లెనిన్, జినోవీవ్లు కాంగ్రెసు, పిట్రోగ్రాడ్ సోవియట్ సభ్యుల సంయుక్తసమావేశంలోనికి రాగానే బ్రహ్మాండమైన హర్షధ్వానాలు చేశారు. ఆరాత్రి 'రష్యన్సోషలిస్టు ఫెడరేటెడ్ సోవియట్ రివబ్లిక్సు' (Russian Socialist Faderated Soviet Repulics)యొక్క ప్రాథమిక న్యాయసూత్రాన్ని కాంగ్రెసు ఏర్పాటుచేసింది.

ఇది కార్మిక, సైనిక, కర్షక డిప్యూటీల అఖల రష్యాకాంగ్రెసు చేసిన డిక్రీ:-

దేశరాజ్యపరిపాలనకొరకై, రాజ్యాంగసభ కార్మిక, కర్షకప్రభుత్వమును స్థాపించి, "ది సోవియట్ ఆఫ్ ది పీపుల్సు కమిస్సార్సు" (The Soviet of the Peoples Commissars) అని నామకరణం చేసేవరకు రాజ్యంలోని వివిధజీవితశాఖలను కమిస్సరియేట్లకు అప్పగించి ఆయా ఉద్యోగులద్వారా, కార్మిక స్త్రీ పురుషులు, నావికులు, సైనికులు, కర్షకులు, ఉద్యోగులకనుగుణ్యంగా, కాంగ్రెసు ప్రకటించిన కార్యక్రమము నెరవేర్చబడును. ప్రభుత్వాధికారమంతా ఈ కమిస్సరియేట్ల అధ్యక్షుని సంఘంలో-అనగా పీపుల్సుకమిస్సార్ల సోవియట్ చేతిలో-వుంటుంది.

పీపుల్సు కమిస్సార్ల పనులఅజమాయిషీ అధికారమంతా కార్మిక, సైనిక, కర్షకడిప్యూటీల సోవియట్లకాంగ్రెసు చేతిలోనూ, దాని సెంట్రల్ కార్యవర్గం చేతిలోనూ వుంటుంది.

ప్రస్తుతానికి సోవిపీపుల్సుకమిస్సార్ల ఉద్యోగులీక్రిందవారుంటారు:-
సోవియట్ పీపుల్సుకమిస్సార్ల అధ్యక్షుడు: వ్లాడిమర్ ఉలియనోవ్ (లెనిన్)
అంతరంగిక పీపుల్సు కమిస్సార్: ఐ. ఐ. రైకోవ్.

వ్యవసాయ ,, ,, : డి. పి. మిల్యుటిన్.
లేబరు ,, ,, : ఏ. అర్. ష్లియప్నికోవ్.
యుద్ధము, నౌకాకమిటి: వి. అన్టోనోవ్-ఓవ్‌సీన్కో, ఎన్. వి. క్రైలాన్కో, డైబెన్కో.

వాణిజ్య, పరిశ్రమల పీపుల్సు కమిస్సార్:- వి. పి. నోగిన్.
విద్యాశాఖ ,, ,, :- ఏ. వి. లునాకార్‌స్కీ.
ఆర్థికశాఖ ,, ,, :- ఐ. ఐ. స్క్వోర్ట్సొవ్ (స్టెపనోవ్)
విదేశవ్యవహారాల ,, ,, :- యల్. డి. బ్రోన్‌స్టీన్ (ట్రాట్‌స్కీ)
న్యాయశాఖ ,, ,, :- జి. ఇ. ఒప్పోకోవ్ (ఏ.ఏ.లోమోవ్)
సప్లయిశాఖ ,, ,, :- ఐ. యఫ్. థియొడోరోవిచ్.
పోస్టు, టెలిగ్రాఫ్ ,, ,, :- ఎన్. పి. అవిలోవ్ (గ్లెబోవ్)
జాతీయశాఖ ,, ,, :- జె. వి. డ్జుగషింలి (స్టాలిన్)

(సోవియెట్ ఆఫ్ పీపుల్సు కమిస్సార్‌ని తరువాత రష్యాభాషలో 'సోవ్నార్కొం' అన్నారు.)

సోవియట్ల సెంట్రల్‌కమిటీ అనుమతి వచ్చేవరకూ ఆగకుండా లెనిన్, స్టాలిన్, క్రైశెన్కోలు, యుద్ధారంగంలోనున్న జర్మనీవారితో స్నేహం చెయ్యవలెనని, వారిసైనికులకు ఆజ్ఞలిచ్చారు. ఒకవేళ జర్మనీ వారు తమరాజీని తిరస్కరిస్తే దీనివల్ల బలహీనత ఏర్పడుతుందని కొందరు బోల్షివికులు వాదించారు.

నవంబరు 22వ తేదీ రాత్రి లెనిన్, స్టాలిన్‌లు ఫోనులో జనరల్ డుఖోనిన్‌నుపిలిచి జర్మనీవారితో శాంతిరాయబారాలు జరుపుటకు ఏర్పాట్లు చేయమని ఆజ్ఞాపించారు. ఈ సందర్భంలో స్టాలిన్ ఇల్లాచెప్పాడు. "అది చాలాకఠినసమయం. డుఖోనిన్, ఇతరఉద్యోగులు పీపుల్సుకమిస్సార్ ఆజ్ఞలను పాటింప నిరాకరించారు...."

వెంటనే రేడియోస్టేషన్‌కువెళ్ళి, డుఖోనిన్ బర్తరఫ్‌చేయబడినట్టు, సైనికులంతా యుద్ధకలాపం కట్టిపెట్టి, ఆస్ట్రియా జర్మనీ సైనికులతోకలిసి, శాంతిప్రయత్నాలు తామే చెయ్యాలని'' ప్రసారం చేయమని లెనిన్ ఆజ్ఞాపించాడు. డుఖోనిన్‌వద్దనుంచి అధికారమును తీసుకోటానికి క్రైలెన్కో కొంతసైన్యంతో వెళ్లాడు. కాని అతడు నిరాకరించుటచేత సైనికులతన్ని సంహరించారు. అప్పడు జర్మనీవారితో శాంతిరాయబారాలకై కొందరిని ప్రతినిధులను క్రైలెన్కోపంపించాడు.

బ్రెస్ట్‌లిటోవిస్క్‌లో శాంతిరాయబారాలకు తాము సిద్ధంగానున్నట్టు జర్మనీసైన్యాధిపతి నవంబరు 27వ తేదీని సోవియట్ ప్రభుత్వానికి సమాధానం ఇచ్చాడు.

అక్కడకు పంపబడిన ప్రతినిధులకు, జర్మనీవారిచ్చిన ఏషరతులనైనాసరే అంగీకరించమని లెనిన్ ఆజ్ఞనిచ్చాడు. అంతకంటెచేయవలసినది లేదు. లెనిన్ ఇచ్చిన శాంతిఆజ్ఞతో రష్యన్ సైన్యాలంతరించినట్లే. జోఫీ నాయకత్వంలో వెళ్ళిన మొదటి శాంతి రాయబారవర్గంలో సైనికనిపుణులు, కార్మిక, నావిక, కర్షక, స్త్రీ ప్రతినిధులుకూడావున్నారు.

## నియంతృత్వము

బోల్షివికులకు, తాత్కాలికప్రభుత్వపక్షీయులకు వీధులలోపోట్లాటలు సాగుతుండగానే, ఆల్‌సోషలిస్టుమంత్రివర్గస్థాపనకై, బోల్షివిక్కులు వామపక్ష మెన్షివిక్కులతోను, సోషలిస్టువిప్లవకారులతోను సంభాషణలు ప్రారంభించారు. ఈ సంయుక్తమంత్రివర్గంకావాలని ఆశిస్తున్న కామెనేవ్, రైకోవ్‌లు బోల్షివిక్కులకు నాయకత్వం వహించారు; కాని లెనిన్‌మాత్రం ఈసంభాషణలను, కెరెన్‌స్కీబలాలపై దెబ్బతియ్యటానికేఉపయోగించాడు.

తాత్కాలికప్రభుత్వపతనంలో పెట్రోగ్రాడ్‌లోను ఉత్తరరంగంలోను ఉన్నప్రభుత్వోద్యోగులు, ముఖ్యపాత్రవహించారు. అసలైనపోరాటానికి దూరంగావుండటానికై, రాజపక్షీయులు వారిసంకుచిత రాజకీయాలనే

ఉపయోగించారు. కెరెన్స్కీ దారిలోనుంచి తప్పుకుంటే, బోల్షివిక్కులను చాలతిసులభంగా తొలగించగలరని అనుకున్నారు.

1917 సం॥ నవంబరు 17వ తేదీని, లెనిన్ మిశ్రమమంత్రి వర్గానికై అంగీకరించనందుకు వ్యతిరేకంగా, రైకోవ్‌నాయకత్వంలో చాలా మంది బోల్షివిక్‌కమిస్సార్లురాజీనామానిచ్చారు. అదేసమయంలో రష్యాలోని సోవియట్ల కేంద్రకార్యవర్గసభ్యత్వానికికామెనేవ్‌కూడా రాజీనామానిచ్చాడు. వెంటనే లెనిన్ స్వెర్డ్‌లోవ్‌నుపిలిపించాడు. "జాకబ్ మిఖైలోవిచ్! సోవియేట్ల కేంద్రకార్యవర్గానికి నీవు ఆధ్యక్షతవహించాలి. ఏమంటావు?" అన్నాడు లెనిన్.

స్వెర్డ్‌లోవ్ కొంచెంఅనుమానించాడు. కాని అంగీకరించాడు. "ఏదో ఒక ఆజ్ఞను చేయడంతో వెంటనే ప్రారంభించు. ముందు కేంద్రవర్గంలోని బోల్షివిక్కు వర్గసభను ఏర్పాటుచెయ్యి. నీవిదివరకే అధ్యక్షపదవిలో వున్నట్లుగా నటించు. కేంద్రకమిటీసభను ఏర్పాటుచేసి దానిలో నీ అధ్యక్షతను ఖాయంచేయిస్తాము. కేంద్రకమిటీ నిన్ను ఖాయంచేయుటకు నిరాకరించదనుకుంటాను. తరువాత సోవియట్ల కేంద్రసంఘంలో ఆమోదింపచేసి, వెంటనే నిన్ను అధ్యక్షునిగా ప్రకటిస్తాము. కమిటీలో మనకున్న ఓట్లన్నీ లెక్కపెట్టి సభకు వారంతా హాజరయ్యేటట్లుచూడు." అని లెనిన్ చెప్పాడు.

ఈ విషయాలన్నీ లియోనిడ్‌క్రాసిన్ తనభార్యకువ్రాసినఉత్తరంలో వివరించాడు. సోలోమన్‌తో సంభాషణజరిపినప్పుడు ఈ విషయాలన్నీ విపులీకరించాడు. తరువాత సోలోమన్‌తో సంభాషించిన సందర్భంలో తనభావాలు తెలియచేశాడు. "వ్లాడిమర్‌ఇలిచ్! ఇక్కడేమి జరుగుతుందో నాకు చెప్పు? ఏమిటిది? ఇదంతా పెద్దమొత్తంగా ఉటోపియాదీవిపై, సోషలిజంతో జరుగుతున్న జూదమా? నాకిది ఏమీ అర్థంకావటంలేదు." అన్నాడు సోలోమన్.

"ఉటోపియాదీవిలేదు. సోషలిస్టుప్రభుత్వస్థాపనయేప్రశ్న. ఇప్పటి నుంచి సోషలిస్టుప్రభుత్వం స్థాపించిననాటి రష్యాయే ప్రథమదేశం. నీవు

నీభుజాలను ఆడిస్తున్నట్లుచూస్తున్నాను. కాని నీవింకొక ఆశ్చర్యం చూడబోతున్నావు. ఇదంతా ఒక్క రష్యాప్రశ్నయేకాదు పెద్దమనుష్యులారా! రష్యాపై నా కనహ్యం. ప్రపంచవిప్లవానికి మనం చేరుకోటానికి ఇది ఒక మార్గంమాత్రమే.'' అని లెనిన్ చెప్పాడు.

సోలోమన్ చిరునవ్వునవ్వాడు. లెనిన్ తనకళ్లు మిటకరించి ఇల్లా అన్నాడు:

''నీవునవ్వుతున్నావు? ఇదంతా ఒక కల అని నీ అభిప్రాయం. నీవేమిచెప్పబోతున్నావో నాకుతెలుసు. నీవు వొరోవ్‌స్కీతోచేసిన సంభాషణనుగూర్చి నాకతడువ్రాసినది జ్ఞాపకంవుంది. అదంతాజరిగిపోయిన గాథ. అదంతా మార్క్సుసిద్ధాంతాలనుగూర్చి బుఱ్ఱపాడుచేసుకోటమే. అదంతా ప్రతీసంఘానికి తప్పనిసరియైన చిన్నపిల్లజబ్బులవంటివని మేము త్రోసిపారేశాం. నూతనజ్ఞానోదయమైనప్పుడు అందరూ వాటిని విడిచి పోవలసిందే....నన్నువిమర్శించటానికి ప్రయత్నమైనా చేయవద్దు. అది లాభంలేదు. నీవు నీ క్రాసిన్‌కలిసి నన్ను ఒప్పించలేరు. ఔను మేము సమస్తమూ నాశనంచేసి, వానిశిధిలాలమీదనే దేవాలయం నిర్మిస్తాం. అది అందరిసౌఖ్యానికి దేవాలయమౌతుంది. కాని మేము బూర్జువాప్రభుత్వాన్ని నాశనంచేసి, పిండిచేస్తాము. ఇది నీవు జ్ఞాపకంఉంచుకో-నీవు నీ స్నేహితుడు క్రాసిన్-మేము ఎవ్వరితోనూ కలియము. నీకు పదిసంవత్సరాల క్రిందట తెలిసివున్న లెనిన్ ఇకముందులేడని జ్ఞాపకం ఉంచుకో. అతడు చచ్చిపోయాడు.'' అని లెనిన్ ఉద్రేకపూరితంగా సమాధానం ఇచ్చాడు.

ఈలోగా గందరగోళంనుంచి ప్రశాంతి నెలకొల్పటానికై ప్రయత్నం జరుగుతోంది. ఆక్రమణలు, స్వాధీనాలు జోరుగాసాగిపోయాయి. కాని భ్యాంకులన్నింటినీ స్వాధీనంచేసుకోటం చాలాముఖ్యం. దానికితగిన అధికారప్రకటన చేశారు. స్వాధీనం చేసుకోటానికై మెన్‌జిన్‌స్కీని ఆర్థిక కమిసార్‌గా లెనిన్ నియోగించాడు:

బ్యాంకులను జాతీయంచేసినవిధంగూర్చి జోన్‌బ్రుయెవిచ్ వర్ణించాడు. అతడే ఆర్డరువ్రాసి, రవాణాలు ఏర్పాట్లుచేసి, 28 దళాలను

ఏర్పాటుచేశాడు. 28 బ్యాంకులను స్వాధీనంచేసుకుని, 28 బ్యాంకు డైరక్టర్లను ఖైదుచేయవలసివచ్చింది. "ఒక మంచి సౌఖ్యప్రదమైనగదిని ఇతరులతోసంబంధంలేకుండా దూరంగా, ఏర్పాటుచేసి, 28 మంచాలను, 28 టేబిలుబల్లలను, 28 కుర్చీలను, ఏర్పాటుచేయమని కామ్రేడ్ మార్కోవ్‌ను కోరాను. 28 మనుష్యులకు అతడు భోజనం పెట్టటానికి సిద్ధంగావుండి, మర్నాడుదయం 8 గ॥లకు వారికి కాఫీ ఫలహారాలనుకూడా సిద్ధంచెయ్య మన్నాను." 28 బ్యాంకులస్వాధీనం సునాయాసంగా జరిగిపోయింది. 1917 సం॥ డిశంబరు 17వ తేదీని జరిగింది. "అంతస్వల్పవ్యవధిలో ఆర్థికకమిసార్ క్రొత్తపనివారిని నియమించాడు. ఖైదుచేయబడినడైరక్టర్లలో చాలామంది సోవియట్‌ప్రభుత్వంక్రింద పనిచేయటానికంగీకరించారు. కనుక వారిని విడుదలచేశారు. అన్నిబ్యాంకులకు కమిసార్లను నియమించి బ్యాంకులలోని ధనమంతటిని ప్రభుత్వబ్యాంకులోనికి చేర్పించారు."

ప్రభుత్వం మార్పిడిసమయంలో లెనిన్‌ఇచ్చిన ఆజ్ఞఇది: "అధికారం అస్తగతం చేసుకోవాలి; బ్యాంకులను జాతీయం చెయ్యాలి; తరువాత ఏంచెయ్యాలో అలోచిద్దాం. అనుభవాన్నిబట్టి నేర్చుకుందాం." ఈసూత్రం మీదనే అతడు ముందుకుసాగిపోయాడు. బోల్షివికుల విజయానికి తరువాత రోజునేవారు రెండు ఆజ్ఞలను ప్రకటించారు. మొదటిది-పెద్దజమీందారీలను రద్దుచేసి భూములను, రాజ్యాంగసభ నిర్ణయంజరిగేవరకు, వ్యవసాయ సంఘాలకు అప్పగించాలి. రెండవది-బ్యాంకుసంస్థలన్నింటినీ జాతీయం చేయాలి. ప్రత్యేకపు అస్థులను రద్దుచెయ్యలేదు. చిన్నభూస్వాములను ఏమీచెయ్యలేదు. బ్యాంకులలో కరెంటుఖాతాఉన్నవారు, నెలకు 1500 రుబుల్సు తీసుకోవచ్చు.

ఫాక్టరీలను వెంటనే జాతీయంచేయటానికి లెనిన్ ఇంకా ఆలోచిస్తు న్నాడు. 1918 సం॥ జనవరి 24వ తేదీని ఒక పిట్రోగ్రాడ్ సభలో లెనిన్ ఇల్లాచెప్పాడు.

"తరుచుగా కార్మిక, కర్షకవర్గాలువచ్చి ఆ భూమినిగూర్చిఏంచేస్తాం, ఈ భూమినిగూర్చి ఏంచేస్తాం అని అడుగుతున్నారు. వారికి ఏవిధమైన

స్థిరభావాలులేకపోటంచేత తరుచు నాకే ఆశ్చర్యంవేసింది. వారికి నేనిలా చెప్పాను. మీరే ప్రభుత్వం; మీఇష్టంవచ్చినట్లుచెయ్యండి; మీకు రావలసిన దంతా మీరు తీసుకోండి; మేము మిమ్ము బలపరుస్తాం; కాని ఉత్పత్తి విషయంలో జాగ్రత్తవహించండి, ఉత్పత్తి ఉపయోగకరంగా వుండేలాగ చూడండి. ఉపయోగమైనపనులుచేయండి; మీరు తప్పలుచేసినా, ఒప్పను మీరు నేర్చుకోగలరు...."

మానవస్వభావం కనుక అతడు 'ప్రభుత్వం, విప్లవము' అనే దానిలో లొంగివుండవలసిన అవసరంవుందని వ్రాశాడు. సోషలిజం పూర్తిగా స్థాపించబడేవరకూ, ప్రభుత్వంలో కార్మికస్వాతంత్ర్యం ఉండ కూడదు. వ్యతిరేకులను అణచుటకై ప్రభుత్వంకావాలి.

ఈలోగా విధానమంతా స్పష్టమైంది. "విప్లవంకొరకు, మార్పు సమయంలో ఉపయోగపడే ఒకసంస్థయే ప్రభుత్వం; కనుక స్వతంత్ర ప్రజాప్రభుత్వముగురించి మాట్లాడటంతప్పు. కార్మిక కర్షక రాజ్యం ఇప్పుడు స్వాతంత్ర్యంకోసంకాదు; అది విరోధులను అణచటానికే అవసరం." విరోధులను అణచుటయే 'కార్మిక కర్షక నియంతృత్వం," 'దానినేవిధంగా నైనా సంపాదించుటయే మన లక్ష్యం.'

1917 సం॥ నవంబరు 10వ తేదీని పత్రికాస్వాతంత్ర్యమును తగ్గిస్తూ ఒక శాసనంచేశారు. కాని ఇది ప్రభుత్వం సుస్థిరమైనతరువాత సడలించబడుతుందని వాగ్దానంచేశారు.

లిబరలు పత్రికలనుమాత్రం అణచివేశారు. కాని సోషలిస్టు భావాన్నికూడా అణచిపెట్టడం లెనిన్‌కు ముఖ్యం. సోవియట్ అధికారం వచ్చిన ప్రారంభంనుంచీకూడా అతడు సోషలిస్టువిప్లవ పత్రికలను, మెన్షివిక్ పత్రికలను అణచివేయాలని పట్టుపట్టాడు. ట్రాట్‌స్కీప్రకారం అడుగడుగునా లెనిన్ ఇల్లాఅంటాడు: "ఈ దుండగులను మనం త్రొక్కి పెట్టలేము? ఇది ఏమి నియంతృత్వమంటావో చెప్పు?" క్రమక్రమంగా విరోధిపత్రికలను అణచివేశారు.

బ్రెస్టు-లిటోవిస్కుసంధి తరువాత జర్మనీసేనలు రష్యాలోని చాలాభాగాలను ఆక్రమించుకున్నసమయంలో, లెనిన్ చాలాభయపడి సెన్సారుసూత్రాలను సడలించాడు. కొన్నిపత్రికలను ప్రకటించటానికి అనుమతినిచ్చారు. కాని వానిముఖపత్రంమీద సోవియట్ డిక్రీలను, బోల్షివిక్ కమిసార్ ప్రకటనలు ప్రకటించాలి. పైగా సెన్సారు కిష్టంలేని వార్తలు ప్రకటించినపుడల్లా పెద్ద మొత్తాలను జుల్మానాలువేశారు. ఈ కారణంతోనే గోర్కీపత్రిక 'నోవయజన్' పత్రికకు 35,000 రుబుల్సు జుల్మానావేశారు.

కాని ఈ స్వల్పలాభంకూడా చాలాకాలం జరుగలేదు. 1918 సం॥ మే నెలారంభంలో 'డ్యేలోనరోడా' 'డ్యేన్' మొదలైన అనేక వ్యతిరేక పత్రికలను, గోర్కీపత్రికనుకూడా అణచివేశారు. తరువాత గోర్కీలెనిన్‌తో స్నేహంచేసుకున్నతరువాతకూడా తనపత్రికను ప్రకటించుకోటానికిఅతనికి అనుమతినివ్వలేదు.

అనేకసంవత్సరాలుగా రష్యావిప్లవకారులుపోరాడి సంపాదించిన పత్రికా, వాక్స్వాతంత్ర్యాలు కొన్నిమాసాలలోనే అడుగంటిపోయాయి.

## లెనిన్ రాజ్యాంగసభను అణచివేశాడు

1917 సం॥ ఏప్రిల్‌నుంచి నవంబరువరకు "వెంటనే రాజ్యాంగ సభను ఏర్పాటుచెయ్యాలి" అనేనినాదం మారు మ్రోగించాడు. అనేకసార్లు బోల్షివిక్కులు అధికారంలోకి రాగానే, వెంటనే రాజ్యాంగసభను ఏర్పాటు చేస్తానని లెనిన్ వాగ్దానంచేశాడు.

బోల్షివిక్కుల వాగ్దానం స్పష్టంగానేవుంది. తాత్కాలికప్రభుత్వంచేత నవంబరు 25వ తేదీన ఏర్పాటుచేయబడిన ఎన్నికలలో, రాజ్యాంగసభ తమకు స్వాధీనంకాదని బోల్షివిక్కునాయకులు భయపడ్డారు.

"విప్లవంయొక్క మొదటిరోజునే-కాదు మొదటిగంటలోనే-లెనిన్ రాజ్యాంగసభనుగూర్చి ప్రస్తావించాడు. "మనం ఎన్నికలను వాయిదా

వెయ్యాలి. 18 సం॥ వచ్చినవారికే మనం ఎన్నికహక్కునివ్వాలి. కార్నిలోవ్ అనుచరులను, కాడట్లను మనం బహిష్కరించాలని లెనిన్ చెప్పాడు'' అని ట్రాట్‌స్కీ చెప్పాడు.

బోల్షివిక్కులు ఎంత బలవంతంగా పనిచేసినా ఎన్నికల ఫలితాలు లెనిన్ అనుకున్నాదానికంటె అధమంగా వచ్చాయి. చరిత్రలో మొదటి స్వేచ్ఛా ఎన్నికలలో రష్యాప్రజలు, లెనిన్‌కు, వర్తకులకు వ్యతిరేకంగా మోడరేటుసోషలిజానికి వోటుచేశారు. సోవియటు ప్రజాసంబంధాలనుబట్టి ఇంతకంటె ఘోరఫలితాలకు అవకాశంలేదు. కాని లెనిన్ దీనికైనా సిద్ధంగానేవున్నాడు.

ప్రారంభోత్సవానికి బాగా ఆలోచించేఏర్పాటుచేశారు. ఎసంబ్లీలో ఎవరు ఉపన్యసించాలి; ఏవిషయాలమీద మాట్లాడాలి; ఇతరవర్గాల నాయకులెవరు; మొదలైన అనేక విషయాలను ఆలోచించారు.

అనేకసార్లు వాయిదాలువేసిన తరువాత చివరికి 1918 సం॥ జనవరి 18వ తేదీని రాజ్యాంగసభ ప్రారంభోత్సవం నిర్ణయించేశారు. ఈలోగా బోల్షివికులు, కార్మికవర్గాలలో సోషలిస్టు రివల్యూషనరీలకు వ్యతిరేకప్రచారం సాగించారు. ప్రభుత్వం తారుమారుచేయటంలో బోల్షివికులు ప్రదర్శించిన శక్తిసామర్థ్యాలనే, రాజ్యాంగసభను రద్దుచేసే ప్రయత్నాలలోకూడా ఉపయోగించారు. అదృష్టానికి వారేమీ విడిచిపెట్టలేదు. ఇదివరకు సైన్యాలను తయారుచేసినట్లుగనే, ఇప్పుడు మిలిటరీ సహాయంతో, ప్రజాసంస్థల నెదుర్కోటానికి సైన్యదళాలను తయారుచేశారు. నవంబరు సమరంలో సైనికులపక్షంలో మిగిలినది వారిపార్టీ ఒక్కటే. కనుక అది వారికి మంచిఅవకాశంఇచ్చింది.

కార్మికులలో బోల్షివికులు ప్రబలమైన ప్రచారంచేశారు. పెట్రోగ్రాడు ఫాక్టరీ ఎన్నికలలో బోల్షివికులకు 15% కార్మికులే వోటుచేశారు. మిగిలిన మెజారిటీకార్మికులు తటస్థులే. సైనికులలోకూడా బోల్షివికులు గొప్పప్రచారంచేశారు. జనవరి 10వ తేదీని రాజ్యాంగసభనురద్దుచెయ్యాలనే సంకల్పంతో క్రైలెన్‌కో, సెమియెనోవిస్కీదళం దగ్గిరకిపోయాడు. కాని

అతనికి సరియైన ఆదరణజరగలేదు. అతడు చాలాజాగ్రత్తగా సంచరించకపోతే సైనికులు అతనిమాటను లెక్కచెయ్యరనికూడా చెప్పారు. గదిలో జరిగిన గలభాలో క్రైలెన్కో చెప్పినమాటలన్నీ గాలికెగిరిపోయాయి. అతడు వెళ్ళిపోయిన తరువాత ఒకసైనికుడులేచి రాజ్యాంగసభను రక్షించాలని ఉపన్యసించాడు. బోల్షివిక్కులు బాల్టిక్ సముద్రంలోని ఒకటి, రెండు నౌకాదళాలను రాజ్యాంగసభకు వ్యతిరేకప్రచారంలో ఉపయోగించబోతున్నారని సోషలిస్టు రివల్యూషనరీ మిలిటరీకమిటీకి తెలిసింది. సోషలిస్టు రివల్యూషనరీలకు రెండవదళంలో ఒక చిన్న సంఘంవుంది. దానికి తెలివైన సైనికుడు సర్రనోవ్ అనేఅతడు కమిటీఅధ్యక్షుడు. జనవరి 16వ తేదీని జరిగినసభలో ఒకసైనికుడు బల్లమీదకు గెంతి ఇల్లాకేకలుపెట్టాడు: "సోదరులారా! కామ్రేడ్సులారా! మనం రాజ్యాంగసభకు వ్యతిరేకంగా నడువము" అని మనం ప్రమాణంచెయ్యాలి. దానిని వ్యతిరేకించమని నావికులు ప్రతిజ్ఞచేశారు—దాన్ని బలపరచడం విషయంవేరు.

జనవరి 18వ తేదీని అసెంబ్లీసభ ప్రారంభించటానికి నిర్ణయించారు. చాలాకాలంనుంచి ఎదురుచూస్తున్న సంఘటనకొరకై లెనిన్ పెట్రోగ్రాడ్నుంచి లెట్టిష్ సైనికదళాన్ని రప్పించటానికి ఏర్పాటుచేశాడు. ఈ సైనికులకు రష్యాప్రజలకు ఎటువంటి సంబంధబాంధవ్యాలులేవు. కనుక వారు తమఆజ్ఞలను తూచాతప్పకుండా పాటిస్తారని లెనిన్ఉద్దేశ్యం.

ఈలోపుగా రాజ్యాంగసభా రక్షకసంఘము మెన్షివిక్కులుకలిసి అసెంబ్లీ ప్రారంభదినంనాడు టారైడ్ రాజభవనంవద్ద, శాంతియుతమైన ప్రదర్శన జరపాలని నిర్ణయించారు. దీనికి వ్యతిరేకపువిప్లవమని నామకరణం చేయబడింది.

లెట్టిషు సైన్యంతోపాటు, క్రాన్స్టాట్నుంచి యుద్ధనౌకలు, జలాంతర్గాములు, 'రిపబ్లిక్' అనే యుద్ధనౌక మొదలైనవి నేవాలో సిద్ధంచేశారు. టారైడ్ రాజభవనానికివెళ్ళే ముఖద్వారంవద్ద నావికులను, రెడ్గార్డులను కాపుంచారు. పెట్రోగ్రాడ్ రాజకీయ పోలీసుఅధికారియైన యురిట్సీ, ప్రేక్షకుల గాలరీలకు ప్యాసులిచ్చాడు.

జనవరి 18వ తేదీనాడు పదకొండు గంటలకు పట్టణంలోని అన్ని వర్గాల కార్మికులు, విద్యార్థులు, నినాదాలతో, అసెంబ్లీహాలువద్దకుచేరారు. "అన్ని దేశాల కార్మికులు ఏకంకావాలి." "భూమి-స్వాతంత్ర్యము" "రాజ్యాంగసభ చిరకాలం వర్ధిల్లుగాక" అనే నినాదాలతోనున్న అట్టలు ప్రదర్శించారు. వారంతా మార్సుఫీల్డువద్దకు వచ్చేసరికి, కర్షకసోవియట్ కార్యవర్గసభ్యులు వారిని కలుసుకున్నారు.

ఈ ఊరేగింపు టారైడ్‌భవనందగ్గిరకి పోటానికి ఒకవీధిలోనికి తిరుగగానే బోల్షివికులు తుపాకులు, మరతుపాకులు ప్రయోగించారు. అసెంబ్లీకిపోయే అన్నివీధులను బోల్షివిక్కులు అడ్డగించి: "తుపాకులు ప్రేల్చండి" అని ఆజ్ఞాపించారు. ఆనాడు నూర్గురు పురుషులు, స్త్రీలు మరణించారు.

టారైడ్‌భవనం ఒక వింతదృశ్యమైపోయింది. భవనంలోనూ, అసెంబ్లీహాలులోనూ సైనికులు వచ్చిచేరారు. ప్రతీగుమ్మంలోనూ, కిటికీలోనూ, సైనికులుచేరి ప్రవేశపుకార్డులను చూపించమన్నారు. ప్రేక్షక గాలరీలన్నీ యురిట్‌స్కీ ప్యాసులిచ్చిన బోల్షివిక్‌జనంతో నిండిపోయాయి.

అసెంబ్లీ సభ ఉదయానికిబదులు సాయంత్రం నాలుగుగంటలకు ప్రారంభమైంది. హాలులో ఎడమవైపున బోల్షివికులు, లెఫ్టుసోషలిస్టు రివల్యూషనరీలు; వారితరువాత సోషలిస్టురివల్యూషనరీ మెజారిటీపార్టీ వారు, తరువాత మెన్షివిక్కులు కూర్చున్నారు. కుడివైపునున్న బల్లలన్నీ ఖాళీ. కాడెట్‌డిప్యూటీలను చాలామందిని ఖైదుచేశారు. కొందరు హాజరు కాలేదు. అసెంబ్లీఅంతా సోషలిస్టుమయంగావుంది; కాని బోల్షివిక్కులు మైనారిటీయే.

లెనిన్, తనభార్య, సోదరి, బోంచి బ్రుయేవిచ్‌లతోకలిసి ఒక ప్రక్క గుమ్మంలోనుంచి, హాలులో ప్రవేశించాడు. వారు ప్రక్కగదిలో కోట్లనుతగిలించి, మాట్లాడుతూ భోజనంచేశారు.

"మనం తెలివితక్కువగా అసెంబ్లీని సమావేశపరుస్తామని వాగ్దానం చేశాంకనుక, ఈవేళ దాన్నిప్రారంభించాలి. కాని దాన్నిముగించేటైము చరిత్రలో ఇంకా నిర్ణయింపబడలేదు" అన్నాడు లెనిన్.

స్వెర్డ్లోవ్ హాలులోప్రవేసించి ముందుకార్యక్రమంగురించిలెనిన్‌తో ఆలోచించాడు. కొన్నినిమిషాలతరువాత లెనిన్‌లేచి ''ఇంక ప్రారంభించే సమయమైంది.'' అనిచెప్పి ప్రక్కవరండాలోనుంచి నడిచిపెద్దహాలులోకి వెళ్ళాడు. అతడు ప్రవేసించేసరికి, కార్యక్రమం అతని ప్లానుప్రకారం జరగటంలేదు.

ఆచారంప్రకారం సమావేశం అతివృద్ధుడైన డిప్యూటీచేత ప్రారంభింపబడింది. సోషలిస్టు రివల్యూషనరీల బెంచీలనుంచి, షెవెట్జోవ్ అనే ఒకవృద్ధడిప్యూటీలేచి వేదికపైకెక్కాడు. బోల్షివిక్ డిప్యూటీలందరూ బల్లలుగ్రుద్ది అల్లరిచేయటం ఆరంభించారు. సైనికులు తమతుపాకులతో నేలపై ధ్వనిచేశారు. గాలరీలలోనున్న ఒక సైనికుడు తుపాకీప్రేల్చాడు.

ఆఅల్లరిమధ్యలోనే కొంచెం ఖాళీదొరకగానే షెలెట్జోవ్ ''రాజ్యాంగ సభ సమావేశం ప్రారంభమైంది'' అన్నాడు. వెంటనే నక్కకూతలు, పిలికూతలు అతనిమాటల నాహ్వానించాయి.

అప్పడు స్వెర్డ్లోవ్ వేదికపైకివచ్చి గంభీరస్వరంతో, కార్మిక, సైనిక, కర్షక సోవియట్ల కేంద్రకార్యవర్గమే అతనికిసభను ప్రారంభించుటానికధికారం ఇచ్చిందన్నాడు. ఆ తరువాత కమిటీతరఫున ''కార్మిక కర్షకుల అధికారముల ప్రకటన''ను అతడు చదివాడు. దీనిని లెనిన్, స్టాలిన్, బుఖారిన్‌లు వ్రాశారు. ఆ ప్రకటనలో ప్రభుత్వాధికారమంతా సోవియట్లహస్తంలో వుండాలని వ్రాయబడింది. దాన్నిబట్టి రాజ్యాంగ సభకు అర్థమే చచ్చిపోయింది. బోల్షివిక్ స్వాధీనంలోనున్న సోవియట్ కేంద్రకార్యవర్గం దాన్ని దత్తంచేసుకుంది. ప్రభుత్వకార్యకలాపాలుజరుప ప్రయత్నించే ఏవ్యక్తిగాని, సంస్థగాని విప్లవవ్యతిరేకులుగాభావింపబడతారని వారొక తీర్మానంచేశారు. అటువంటి ప్రతికార్యమును సోవియట్‌ప్రభుత్వ శక్తిని-ఆయుధశక్తితోసహా-ఉపయోగించి అణచివేస్తాము.''

సోవ్‌నార్కమ్ కార్యక్రమాన్ని అంగీకరిస్తారో లేదో నిర్ణయించవలెనని స్వెర్డ్లోవ్ అసెంబ్లీనిఅడిగాడు. దీనికిబదులు ఎంతఅల్లరి జరుగు

తున్నా మెజారిటీపార్టీ వారు అధ్యక్షుణ్ణి ఎన్నుకున్నారు. సోషలిస్టు రివల్యూషనరీపార్టీ నాయకుడైన విక్టర్ చెర్నోవ్ ఎక్కువతేడాతో ఎన్నుకోబడ్డాడు.

చెర్నోవ్ ప్రారంభోపన్యాసంలో, రాజ్యాంగసభను ఏర్పాటుచేయటంతో రష్యా తాత్కాలికప్రభుత్వం అంతరించినదన్నమాటే అని తెలియ చేశాడు. భూమివిషయం ఇదివరకే తీర్మానించారు: దున్నటానికి సమర్థులు, ఇష్టంవున్నవారికి భూమి ఉమ్మడిఆస్థిగా వుంటుంది. రాజ్యాంగ సభయే ఉన్నత విదేశవిధానమునవలంభించి, ఓడించినవారు, ఓడింపబడినవారనేభేదం లేకుండా ప్రజాస్వామ్యశాంతికి ప్రయత్నిస్తుంది. కాని రాజపాలిత జర్మనీతో ప్రత్యేకశాంతి సంధినిచేసుకోవటంలేదు.

స్వేచ్ఛగా ఎన్నుకోబడిన పార్లమెంటయిన రాజ్యాంగసభకు సంపూర్ణశాసనాధికారం వుందని చెర్నోవ్ చెప్పాడు. కాని ప్రధానమైన నిర్ణయాలన్నింటిలో అది ప్రజాభిప్రాయానికి లోబడివుంటుంది. సోవియట్లు, అసెంబ్లీతో చేతులుకలిపి ప్రజాభిప్రాయమును గౌరవించినట్లయితే, రష్యాలో శాంతిభద్రతలు నెలకొంటాయి; లేకపోతే ప్రజాయుద్ధం తప్పదు.

నిరంతరము జరుగుతున్న అల్లరుల తుపానులో చెర్నోవ్ తన ఉపన్యాసమును ముగించాడు. అతనితరువాత బోల్షివిక్ ఉపన్యాసకులైన బుఖారిన్, స్క్వోర్ట్సోవ్‌లు ఉపన్యసించారు. సోవియట్ ప్రకటనను ఎజెండాలో ప్రథమంగా ఆమోదించాలని బుఖారిన్ చెప్పాడు. స్క్వోర్ట్సోవ్ సోషలిస్టు రివల్యూషనరీలవైపుతిరిగి "మన యిరువురిమధ్యను అంతా ముగిసిపోయింది. ధనికవర్గాలపైన మేము అక్టోబరువిప్లవాన్ని చివరివరకు సాగిస్తాము. మనం యుద్ధభూమి కిరువైపులా నిలచివున్నాము." అని ఉపన్యసించాడు.

బోల్షివిక్ నాయకుల ఉపన్యాసాలను ఏమాత్రం అల్లరిలేకుండా సోషలిస్టు డిప్యూటీలు విన్నారు. వారు దుర్భాషలాడినాకూడా ఏమీకలుగ చేసుకోలేదు.

ట్సెరెటెల్లీ ఉపన్యసించటానికి లేచినప్పుడు తుపాకులు, పిస్తోళ్లు అతనిపై గురిచేయబడ్డాయి. అధ్యక్షుడు 'ఆర్డరు' కోరినప్పుడు కేకలు,

కూతలు హెచ్చిపోయాయి. కాని మొత్తంమీద ట్సెరెటెల్లీ తన ఉపన్యాస శక్తితో సభికులను ఆకర్షించి ప్రజాస్వాతంత్ర్యము, ప్రజాయుద్ధమును గూర్చి హెచ్చరిక చేశాడు. తరువాత ఒక సోషలిస్టురివల్యూషనరీ డిప్యూటీ రాజ్యాంగసభయొక్క శాంతి కార్యక్రమాన్నిగూర్చి ఉపన్యసించాడు.

లెనిన్ మాట్లాడనేలేదు. వేదికకు పోయేమెట్లమీద అతడుకూర్చుని చిన్నకాగితంమీద ఏదోవ్రాసుకుని బల్లమీదనిద్రపోయినట్లు పడుకున్నాడు. గ్యాలరీలలో అల్లరి యధారీతిగా జరుగుతూనేవుంది. బోల్షివిక్‌నాయకులు తమ ప్రకటనను ఆమోదించాలని తిరిగి పట్టుపట్టారు. చాలా వాదోప వాదాలు జరిగినతరువాత రాజ్యాంగసభ మెజారిటీవారి ప్రకటనను త్రోసిపుచ్చి, యుద్ధము, కర్షకసమస్య, రష్యాప్రభుత్వపద్ధతినిగూర్చి వారి అభిప్రాయములనే ఆమోదించారు. అందుమీదట బోల్షివిక్ డిప్యూటీలు అందరూలేచి బైటకువెళ్ళిపోయారు.

చెర్నోవ్ ఒక డిక్రీని చదువుతుండగా ఒక నావికుడువచ్చి అతని చెయ్యిపట్టుకున్నాడు. "టైమయిపోయింది. మాకు పీపుల్సు కమిసార్ నుంచి ఆజ్ఞవుంది." అన్నాడు.

"ఏ పీపుల్సుకమిసార్?" అని చెర్నోవ్ అడిగాడు.

"అదొక ఆజ్ఞ. నీవింక ఇక్కడవుండటానికి వీలులేదు. రక్షకు లంతా చాలా అలిసిపోయారు. మేమింక దీపాలార్పివేస్తాము." అని నావికుడు సమాధానం ఇచ్చాడు.

"రాజ్యాంగ సభసభ్యులుకూడా అలసిపోయారు. కాని ప్రజలు వారికిచ్చిన ఆజ్ఞప్రకారం, శాంతి, భూమి, ప్రభుత్వం సమస్యలనుగూర్చి నిర్ణయించేవరకూ నిద్రపోలేరు." అన్నాడు చెర్నోవ్.

నావికునికి మళ్ళీ అవకాశంఇవ్వకుండా చెర్నోవ్ డిక్రీలను చదువు తున్నాడు. "టైమైపోయింది. త్వరగా పూర్తిచెయ్యండి. లేకపోతే దీపా లార్పివేస్తాం" అని రక్షకభటులు అరుస్తున్నారు. కాని డిప్యూటీలు వారి పని వారుసాగిస్తూనేవున్నారు. మొత్తంమీద అధ్యక్షుడు సభను పూర్తిచేసే

సరికి తెల్లవారింది. మధ్యాహ్నం మళ్ళీ సభ సమావేశంకావాలని నిర్ణయించిన సమయానికి టారైడ్‌భవనానికి పోయేదారులన్నీ ఆయుధపాణులైన సైనికులతో అడ్డగింపబడివున్నాయి. అదేరోజున—1918 సం॥ జనవరి 19 తేదీని - సోవ్‌నార్క్‌మ్‌డిక్రీ ఒకటి రాజ్యాంగసభను రద్దుచేసింది. జనవరి 18వ తేదీ విశేషాలను ప్రకటించిన వార్తాపత్రికలను, సైనికులు లాగివేసి తగులబెట్టారు.

1918 సం॥ జనవరి 19వ తేదీని జరిగిన అఖిలరష్యా కేంద్రకార్యవర్గసభలో లెనిన్ ఇల్లా ప్రకటించాడు:

"ప్రజలు రాజ్యాంగసభను సమావేశం చేయమన్నారు. మేము దానిని సమావేశపరిచాం. కాని వెంటనే వారు రాజ్యాంగసభ అసలుసంగతి తెలుసుకున్నారు. ప్రజాభిమతాన్ని మేమిప్పుడు పాటిస్తున్నాం. సర్వాధికారం ఆసోవియట్‌దే. విద్రోహుల నడుములు విరగకొడతాం....

"రాజ్యాంగసభకు అధికారం అప్పగించటమంటే ధనికులతో రాజీచేసుకోడమన్నమాట. నూతనస్వరూపంలో కప్పబడిన రాజద్రోహకరమైన రాజీకంటే కష్టపడే ప్రజానీకపుసమస్యలే రష్యాసోవియట్లకు అతిముఖ్యమైనవి. సోవియట్లు ప్రవేశపెట్టిన అతిప్రాముఖ్యమైనసమస్యలను వాయిదావేయాలని రాజ్యాంగసభ నిర్ణయిస్తే, ఒక్కనిమిషంకూడా వాయిదావేయకూడదని మేము చెప్పాం. ప్రజాధికారమును తిరస్కరించిన రాజ్యాంగసభను, సోయట్‌అధికారంతో, రద్దుచేస్తున్నాము. "రాజ్యాగసభ రద్దుచేయబడింది. ఎంత ఖరీదైనా సోవియట్ రివల్యూషనరీ రిపబ్లిక్ జయించి తీరుతుంది."

ఆఉపన్యాసం తరువాత రద్దుడిక్రీ అయిన వెంటనే ట్రాట్‌స్కీతో లెనిన్ రహస్యంగా ఇల్లాచెప్పాడు: "రాజ్యాంగసభను సమావేశపరచడం ఇంకా ఆలస్యం చెయ్యకపోడం మనతప్పు. మనం చాలాఅజాగ్రత్తగా ప్రవర్తించాం. కాని అదీ మనమంచికేవచ్చింది. సోవియట్ ప్రభుత్వంచేత రాజ్యాంగసభ రద్దుచేయబడిందంటే నియంతృత్వం ప్రజాస్వామ్యమునే రద్దుచేసిందన్నమాట. అది మంచి గుణపాఠంగా ఉపయోగిస్తుంది."

# బ్రెస్టు-లిటోవిస్కు

నియంతృత్వశక్తిని సమీకరించుకోటానికై లెనిన్‌కు, ఏవిధంచేత నైనా శాంతికావాలి. జర్మనీప్రాబల్యంతోవచ్చిన శాంతి తనకు నిర్భయంగా వుంటుంది; కనుక వెంటనే జర్మనీలో విప్లవం అవసరమని అతడు నిశ్చ యించాడు. అందుచేత రాయబారాలలో, ఏవిధంగానైనా శాంతిని సాధిం చాలని తన సహచరులకు తెలియచేశాడు.

జోఫే,ట్రాట్‌స్కీలనాయకత్వంలో శాంతిరాయబారవర్గం, నవంబరు ఆఖరున బ్రెస్టు-లిటోవిస్కుకు వంపించబడింది. డిశంబరు 27వ తేదీని పీట్రోగ్రాడు పత్రికలు, సోవియట్ శాంతిరాయబారవర్గపు ప్రకటనను ప్రకటించాయి.

* * *

సోవియట్‌వర్గం జర్మనీషరతులను వినగానే జనరల్ స్కేలన్ అనే సోవియట్ ప్రతినిధి వెంటనే ఆత్మహత్యచేసుకున్నాడు. మరియొక సభ్యుడైన ప్రొఫెసర్‌పోక్రోవిస్కీ "ఇంచుమించు 18 రాష్ట్రాలకు సరిపోయే టంత భాగాన్ని రష్యానుంచి తీసుకుంటే, రష్యాకు కలిసేభాగాలులేకుండా శాంతినిగూర్చి ఎవరు మాట్లాడగలరు?" అని కన్నీటితో చెప్పాడు.

ట్రాట్‌స్కీ, బుఖారినుల నాయకత్వంలోనున్న ఇప్పటి ప్రతినిధి వర్గంలో చాలామంది జర్మనీషరతులకు పూర్తిగావ్యతిరేకులే. ఈ భేదాభి ప్రాయాలు సోవియట్‌ప్రభుత్వంలోనే చీలికలు తీసుకొచ్చేటంత ప్రబలంగా వున్నాయి.

1918 సం॥ జనవరి 21వ తేదీని, జర్మనీ షరతులనుగూర్చి చర్చించటానికై బోల్షివిక్ కేంద్రకమిటీ, మూడవకాంగ్రెసులో, బోల్షివిక్ డిప్యూటీలను కలుసుకోటం జరిగింది. హెచ్చుప్రదేశమును ఇచ్చినాసరే శాంతి సంధిని చేసుకోవాలని లెనిన్ వాదించాడు. సంధిపైసంతకం చెయ్య కుండా చివర యుద్ధమును ప్రకటించాలని ట్రాట్‌స్కీచెప్పాడు, "శాంతి లేదు; యుద్ధంలేదు" అనే ఈ మంత్రంద్వారా, పనిపాట్లులేకుండావున్న

జర్మనీ, ఆస్ట్రియా సైన్యాలు తిరగబడతాయని అతని ఆశ. జర్మనీ, దాని మిత్రరాజ్యాలపై విప్లవయుద్ధంజరపడం మూడవసలహా. లెనిన్ సలహాకు 15 మంది; ట్రాట్‌స్కీసలహాకు 16 మంది, విప్లవయుద్ధానికి 32 మంది ఓటుచేశారు.

మూడు రోజులతరువాత కేంద్రకమిటీలో తిరిగి శాంతిసమస్యను గూర్చి చర్చించారు. వెంటనే జర్మనీషరతుల నంగీకరించమని లెనిన్ తిరిగి గట్టిగాచెప్పాడు.

* * *

బుఖారిన్, ట్రాట్‌స్కీ, యురిట్‌స్కీ, లోమోవ్, జెర్‌జిన్‌స్కీలు జర్మనీషరతుల నంగీకరించడమంటే బోల్షివిక్ కార్యక్రమమంతా విడిచి పెట్టినట్లేనన్నారు. చివరికి 9:7 వోట్లతో ట్రాట్‌స్కీ చెప్పినసూత్రం: "యుద్ధం ఆపాలి; శాంతిపత్రంపై సంతకంచెయ్యకూడదు; సైన్యం తగ్గించాలి" అనేదాన్ని అంగీకరించారు.

కాని వారు జర్మనీలేకుండా సమాలోచించారు. ఫిబ్రవరి 16వ తేదీని జనరల్‌హాఫ్‌మాన్ సోవియట్‌ప్రభుత్వానికి ఒక అల్టిమేటం పంపించాడు. జర్మన్‌సైన్యాలు దెబ్బతియ్యటానికి సంసిద్ధమైనాయి. జర్మనీ అల్టిమేటం వచ్చినతరువాత సెంట్రల్‌కమిటీ ఫిబ్రవరి 17వతేదీని ఒక సభను ఏర్పాటు చేసింది. లెనిన్, స్టాలిన్, స్వెర్డ్లోవ్, సోకోల్నికోవ్, స్మిగ్లా ఈ అయిదుగురు జర్మనీషరతులను వెంటనే అంగీకరించాలన్నారు: బుఖారిన్, లోమోవ్, ట్రాట్‌స్కీ, యురిట్‌స్కీ, జోఫే, క్రెస్టిన్‌స్కీ ఈ ఆరుగురు వ్యతిరేకంగా వోటుచేశారు. వెంటనే శాంతిసంధి సంతకం చేయటమా, లేక జర్మనీ దెబ్బతీసేవరకూ చూడటమా అనే దానిపై వోటుచెయ్యగా, జర్మనీ దెబ్బతీసేవరకూ నిరీక్షించటానికే నిర్ణయించారు. బహుశఃజర్మనీ సైనికులు యుద్ధంచేయటాని కంగీరించరేమో!

దీనికి సమాధానం త్వరగానేవచ్చింది. ఫిబ్రవరి 18 తేదీని జర్మనీ సైన్యాలు మళ్ళీ ఎదిరించాయి. మళ్ళీ సెంట్రల్‌కమిటీ సమావేశమైంది. లెనిన్ వెంటనేసంతకంచెయ్యాలని మళ్ళీచెప్పాడు. మళ్ళీ అతనికి మైనారిటీబలమేదక్కింది. సాయంత్రానికి ఇంకా జర్మనీసైన్యాలువచ్చాయనగానే

పద్ధతులు మారిపోయాయి. లెనిన్ తనమాటనే మరింతబలంతో పునరుద్ఘాటించాడు. తన సహచరులధోరణిని అతడు అర్థంచేసుకోలేదు. లెనిన్‌కి కావలసినది సోవియట్ అధికారమునకు నష్టంవుండాలేదా అన్నదే. "జర్మనీవారు బోల్షివిక్‌ప్రభుత్వాన్నే త్రోసిరాజనాలంటేమాత్రం మనం తప్పక యుద్ధంచెయ్యవలసిందే. మిగతా షరతులు, కోరికలు, ఇవ్వవచ్చు" అని లెనిన్ చెప్పాడు.

కడసారి వోటింగులో 13 మందిలో ఏడుగురు లెనిన్‌పక్షం వోటు చేశారు. బ్రెస్టు-లిటోవిస్కులో జర్మనీప్రభుత్వం ఇచ్చిన షరతులను, సోవియట్ ప్రభుత్వం అంగీకరించిందని జర్మనీప్రభుత్వానికి టెలిగ్రాం ఇచ్చారు. ఫిబ్రవరి 22వ తేదీని జర్మనీవారిచ్చిన సమాధానంలో ఫిన్లాండులో బాల్టిక్‌ప్రాంతంవారికివ్వటమేకాక, జర్మనీచేస్థాపించబడిన స్వతంత్ర ఉక్రైన్‌నుకూడా సోవియట్‌రష్యా ఆమోదించాలని చెప్పారు. అప్పుడు ప్రభుత్వంలో పాల్గొంటున్న లెఫ్టుసోషలిస్టురివల్యూషనరీలు జర్మనీని ఎదిరించటానికై మిత్రరాజ్యాలసహాయం అంగీకరించాలన్నారు. లెనిన్ సభకురాలేదు. కాని ఈ క్రిందిసందేశాన్ని పంపించాడు: "ఆంగ్ల, ఫ్రెంచి రాజకీయబందిపోటుదొంగలనుంచి ఆయుధాలను తీసుకోవాలన్నపక్షానికే నావోటు." మొత్తానికి తరువాత సెంట్రల్‌కమిటీసభలోలెనిన్, రివల్యూషనరీ మాటలతో చెలగాటం ఇంక తగ్గించాలన్నాడు. అది ఇంకాజరుగుతూన్నట్లయితే సెంట్రల్‌కమిటీనుంచి, ప్రభుత్వంనుంచీకూడా తాను రాజీనామానిచ్చి ప్రత్యక్షప్రచారంచేస్తాను. విప్లవయుద్ధం జరిగించాలంటే సైన్యంకావాలి. మనకివ్వడదిలేదు. అందుచేత మనం తప్పక శాంతిసంధిషరతులనంగీకరించాలి." అన్నాడు లెనిన్.

చాలాతీవ్రమైన వాదోపవాదాలు జరిగాయి. లెనిన్ విరోధులు అతని 'ఛాలెంజిని' అంగీకరించటానికి అనుమానించారు. 1918 సం॥ మార్చి 3వ తేదీని సోవియట్ ప్రతినిధులు బ్రెస్ట్-లిటోవిస్కు' సంధిపై సంతకాలుచేశారు.

*　　　*　　　*

"అతడంగీకరించిన షరతులనుగూర్చి లెనిన్‌కు ఏవిధమైన అనుమానాలులేవు. బ్రెస్టు-లిటోవిస్కు సంధిపత్రం ముసాయిదాను కారఖాన్

తీసుకొచ్చినప్పుడు నేను లెనిన్ గదిలోనేవున్నాను. అతడు దానినివిప్పి తన నాయకునికి చూపించబోయాడు. లెనిన్‌గట్టిగా వారించాడు. ''ఏమిటి? నేనీఛండాలపుశాంతి సంధిపత్రంమీద సంతకం పెట్టడమేకాక దీన్ని చద వాలికూడానా? లేదు. అలా ఎన్నడూ జరుగదు. నేను దాన్ని చదవనూ చదవను, ఏమాత్రం అవకాశందొరికినా అషరతులను పాటించనూ పాటించను. అన్నాడు లెనిన్'' అని అతని సెక్రటరీ స్టవోవాచెప్పాడు.

బ్రెస్టు-విటోవిస్కుద్వారా, ఉక్రెయిన్‌లోని సంపదలు జర్మనీస్వాధీన మైనాయి. చాలా జర్మనీసైన్యాలను పశ్చిమరంగానికి పంపటానికి వీలైంది. కాని ఆరుఏడునెలలలో అమెరికా, ఇంగ్లడు, సైన్యాలు యుద్ధరంగంలో ప్రవేసించాయి. హిండెన్‌బర్గులైను ఛేందించబడగానే, జర్మనీ యుద్ధ విరమణసంధి చేసుకోవలసివచ్చింది. మిత్రరాజ్యాలజయంతో సోవియట్ రష్యాతో, లెనిన్ సంతకంపెట్టిన సంధిమూలంగా లభించిన ప్రాంతాలను జర్మనీ విడిచిపెట్టవలసివచ్చింది.

# దౌర్జన్య శక్తి ప్రారంభము

బోల్షివికులు జయించిన వెంటనే యుద్ధభూమినుంచి పారివచ్చిన వారికి ఉరిశిక్షను రద్దుచేశారు.

''అది తప్పు. అది క్షమించరాని దౌర్బల్యం.'' అని చెప్పి లెనిన్ దానిని వెంటనే పునరుద్ధరించాలని వాదించాడు. ఈ విధానంవలన తాను అపవాదు పాలౌతాననేభయంతో ఒక అంగీకారానికివచ్చాడు. క్రొత్తశాసన మును నిర్లక్ష్యంచేయడం; పారివచ్చినవారిని పేల్చుట.

''దౌర్జన్యంతప్పదని ప్రతినిమిషం మాబుఱ్ఱలలోనికి ఎక్కుస్తుండిన సమయం అదే'' అని ట్రాట్‌స్కీ చెప్పాడు.

''నీ నియంతృత్వం ఎక్కడవుంది? నాకు చూపించు. మనకున్న దంతా గందరగోళం. నియంతృత్వంకాదు. ద్రోహంచేసినవాణ్ణి మనం పేల్చలేకపోతే.... ఇదేమి విప్లవం?'' అన్నాడు లెనిన్.

విప్లవవ్యతిరేక ప్రయత్నాలనుగూర్చి విన్నప్పుడు ఒకనాడు అతడిల్లా ఆగ్రహంతో ఉరిమాడు: "మన అడివిజాతి విప్లవ వ్యతిరేకులను మచ్చికచేయటానికి ఫొక్వ్యుర్‌టిన్‌విల్లే (Fouquier Tinville) వంటి తగినసమర్ధుడులేడా?"

అటువంటివాడు ఫెలిక్సు జెర్జిన్‌స్కీ అనేవాడు లెనిన్‌కి దొరికాడు. అతడు అందంగా గుండ్రనిభుజాలు, సూదివలెనున్న చిన్నగడ్డం పిల్లికళ్లు కలిగివుంటాడు. అతని నవ్వులో రాతినికరిగించే గుణంవుంది. ఇతడు విల్నోరాష్ట్రంలోని ఒక పోలెండుజాతి భూస్వామికుమారుడు. విద్యార్థిగా అతడు లుథేనియా సోషల్‌డిమొక్రటిక్‌పార్టీసభ్యుడైనాడు; చిన్నవయసులోనే ప్రవాసంవెళ్ళాడు; తరువాత పోలెండు సోషల్‌డిమొక్రటిక్‌పార్టీలో చేరాడు; తరువాత జీవితం చాలాభాగం సైబీరియాజైళ్ళలో గడిపాడు. విప్లవంతో అతడు మాస్కోలోని టగాన్‌కా జైలునుంచివిడుదలచేయబడ్డాడు.

స్మోల్నీ ఇన్‌స్టిట్యూట్‌లో మేడపైన లెనిన్ తన అనుచరులతో నూతనసమాజానికి పథకం తయారుచేస్తున్నాడు. లెనిన్ అభిప్రాయాలిస్తున్నాడు; కాని సోవియట్ శక్తిని నమీకరించటానికి దౌర్జన్యం అవసరం. క్రిందభాగంలో ఒక చీకటిగదిలో జెర్జిన్‌స్కీ కూర్చున్నాడు. అప్పుడే అతడు స్మోల్నీ కమాండెంటుగా నియమించబడ్డాడు. అతని అధికారంలో చాలామంది లెట్టిషుసైనికులున్నారు; మరతుపాకులను బాగా మెరుగుపెట్టి కిటికీలలో అమర్చటమే వీరిపని.

కొద్దిరోజులు చాలామంది స్మోల్నీలోనికివచ్చారు, వెళ్ళారు. అందరి చంకలలోనూ ముఖ్యమైన కాగితాలకట్టలున్నాయి. రావటం, మాట్లాడటం, ఆజ్ఞలు తీసుకోటం వెళ్లటంజరిగింది. బోల్షివిక్ విప్లవవిరోధులను అణచేవరకు లెనిన్ అధికారం సంపూర్తికాదని జెర్జిన్‌స్కీకి తెలుసు.

సోవ్‌నార్కం జరుగుతుండగా కమాండెంటు గదిలోనుంచి ఒక ఆజ్ఞ వచ్చింది. ఆ భవనంలో ఉన్నవారినందర్నీ తణికీకి హాజరుకావాలని ఆజ్ఞ. హాజరుకానివారినందరినీ వచ్చేటప్పుడో, వెళ్ళేటప్పుడో పట్టుకున్నారు.

ప్రతీద్వారంవద్ద కాపలాబెట్టారు. అక్కడకువచ్చినవారినందరినీ "ఓహో! గుడ్‌మోర్నింగు కామ్రేడ్!" అని జర్జిణస్కీ పలుకరిస్తాడు. తరువాత వ్యాపారసంభాషణ జరుగుతుంది.

అనుమానంలేనివారికందరికీ ఆ భవనంలోనికి రావటానికి ప్యాసు లిచ్చారు. కొందరిని మళ్ళీ ఇక్కడకు రాకూడదనే అజ్ఞతోపంపించారు. కొందరిని విచారణచేయటానికి బంధించారు. ఒకనాడు ఆడపిల్లలకు అందమైన పాఠశాలగావున్నభవనం నేడుగూఢచారుల గృహంగామారింది.

1917 సం॥ డిశంబరు 20వ తేదీని విప్లవవ్యతిరేకుల జూదమును అరికట్టేపన్నాగం పన్నాలని లెనిణ జర్జిణస్కీకి తెలియచేశాడు. చెకా (Cheka) అనేపేరుతో, సోవియట్‌పోలీసుదళమంతా, ప్రపంచంలో కనివిని యెరుగని భయంకరశాఖగామారింది. అటుతరువాత దానిపేరు, 'ఓజిపియు' (OGPU) ఎణకెవిడి (NKVD) ఎమ్‌విడి (MVD) అనే మార్పులుచెందింది. కాని దాని ఆశయంమాత్రం యథాప్రకారమే. జెర్జిణస్కీ చెకాకు మొట్టమొదటి అధికారియైనాడు.

తరువాత బోల్షివికులకు వ్యతిరేకంగా, నాయకులను చంపటానికి అనేక కుట్రలు, ప్రయత్నాలు జరిగాయి. జెర్జిణస్కీ తన చిన్నగదిలో కూర్చునిసోవియట్ నియంతృత్వాయుధానికి నిరంతరం పదును పెట్టుతూనే వున్నాడు. పెట్రోగ్రాడులో అన్నిచోట్లనుంచీ అతనికి పుకార్లువచ్చి చేరుతుండేవి. అతడు తన చెకాదళాలతోపట్టణమంతటినీ పరిశుద్ధంచేసేవాడు.

అతిస్వల్పకాలంలోనే రాత్రిళ్లు సోదాలలో తీసుకువచ్చిన వారివద్ద నుంచి సాక్ష్యం, వాఙ్మూలాలు తీసుకోటం జరిగిపోయింది. వెంటనే అనుమానం నిర్మూలన చేయనివాని ఖర్మకాలిందన్నమాటే. ఖైదీలను తరుచుగా చలికాలభవనం (Winter Palace) దగ్గరనున్న పోలీలుస్టేషనుకు తీసికొనిపోయేవారు. ఇక్కడవారిని ప్రశ్నలువేసి, వేయక, దొడ్లోగోడవద్ద నిలబెట్టి పేల్చివేశేవారు. ఆ యభాగ్యుల మరణఘోషను వినిపించకుండా కప్పివేయుటకు ప్రత్యేకంగా వుంచబడిన మోటారుట్రక్కుల రణగొణ ధ్వనుల నుపయోగించారు.

పాతసమాజంనుంచి క్రొత్తసమాజమును సృష్టించటానికై జెర్జిన్‌స్కీ ఒక ఆయుధం తయారుచేశాడు—అదే క్రమబద్ధంగా పెంపొందింపబడిన దౌర్జన్యం. జెర్జిన్‌స్కీదృష్టిలో వర్గపోరాటం అనగా కార్మికవర్గశత్రువులను నాశనంచేయటమే. బోల్షివిక్ నియంతృత్వాన్ని వ్యతిరేకించిన వారంతా కార్మికవిరోధులే.

సోవ్నార్కంసభలలో లెనిన్ తనసహచరులకు చీటీలను వ్రాస్తుండేవాడు. ఒక సమయంలో లెనిన్, జర్జిన్‌స్కీకి వ్రాసిన చీటిలో ఇల్లావుంది: ''మనజైళ్లలో ఎంతమంది కృత్రిమపు విప్లవవ్యతిరేకులున్నారు?'' దానికి జర్జిన్‌స్కీ ''ఇంచుమించు 1500'' అని జవాబిచ్చాడు. లెనిన్ దాన్ని చదివి ఆ అంకెప్రక్కన + గుర్తుపెట్టి జర్జిన్‌స్కీకి పంపించాడు. జర్జిన్‌స్కీ మాట్లాడకుండా లేచివెళ్ళిపోయాడు. లెనిన్ చీటీకిగాని, జర్జిన్‌స్కీ వెళ్ళినందుకుగాని ఎవ్వరూ లెక్కచెయ్యలేదు. సభజరిగిపోయింది. కాని మరునాడు పెద్దఅలజడి బయలుదేరింది. 1500 మంది విప్లవవ్యతిరేకులను ఉరితీయమని జర్జిన్‌స్కీ క్రిందటిరాత్రే ఆజ్ఞాపించాడు. లెనిన్ + గుర్తును అందరినీ చంపమని ఆజ్ఞగా అతడు గ్రహించాడు.

లెనిన్ అభిప్రాయం అదే అయితే కొంతైనా విమర్శజరిగివుండేది. కాని లెనిన్ కార్యదర్శిచెప్పినట్లు ''దానినపార్థం చేసుకున్నాడు. వ్లాడిమర్ ఇలిచ్ అభిప్రాయం వారిని చంపమనికాదు. సాధారణంగా తాను చదివినదానిపై చదివినట్లుగా అల్లా గుర్తుపెట్టడం లెనిన్‌కు అలవాటు.''

1918 ప్రారంభంలో ప్రభుత్వకార్యస్థానమును సోవియట్ నాయకులు మాస్కోకు మార్చారు.

జర్జిన్‌స్కీ క్రొత్తముఖ్యపట్టణానికి తన పరివారంతో రాగానే తనకు తగిన కార్యాలయం వెతికాడు. లుబయాన్కావీధిలో 22 నెంబరుగల రోడియా ఇన్సూరెన్సుభవనాన్ని అతడు తనకార్యాలయంగా ఎంచుకున్నాడు. అది చాలా గదులు, ప్రక్కదారులు, విశాలమైన దొడ్డికలిగిన మేడ. చెకా కార్యస్థానంగా 22 లుబియాన్కావీధి, రష్యాలో చాలా ప్రసిద్ధికెక్కిన కార్యాలయమైంది.

# క్రెమ్లిన్‌లో

ఒకానొకప్పుడు మాస్కోనగరం దగ్ధమౌతుండగా నెపోలియన్‌చూస్తూ నిలబడిన క్రెమ్లిన్ కోటగోడమీదనే, మే 1వ తేదీని లెనిన్ నిలబడి, రెడ్ స్క్వేర్‌లోజరిగిన మే డే ఉత్సవాన్ని తిలకించాడు.

అనేక శతాబ్దాలు రష్యాచక్రవర్తులు కిరీటాలు ధరించిన ఈ పాత పురాతన కోటలోనే స్థిరస్థానం ఏర్పరచుకుని క్రొత్తనాయకుడు జీవించాడు. అతడున్న భాగమునకు చుట్టుప్రక్కలనున్న గదులన్నీ ఎలుకలవాసన తోను, కార్బాలిక్ ఏసిడ్ వాసనతోను నిండివున్నాయి. అతనితోపాటు అతనిభార్య కృప్సకయ, సోదరిమేరియా, వారి దాసికూడావున్నారు. వారు జారుచక్రవర్తుల వెండి, చైనా పాత్రలలోనే భుజించారు. కాని వీరి భోజనం రుచిహీనంగాను, చాలీచాలకుండాను వున్నాయి. వారు వెన్న, తేనె, మొదలైన పదార్థాలనుపయోగించినా, మొత్తంమీద వారిభోజనం, విప్లవానికిపూర్వం సాధారణమానవుని భోజనంకంటె హీనంగావుంది. గదులను వెచ్చచెయ్యటానికి తగినన్ని కట్టెలుగాని, అతిధులకు చాలినన్ని చెంచాలుగాని వారికిలేకపోయాయి.

''మేము మంచి విప్లవకారులము. కాని మనముకూడా విదేశీయుల కున్నంత ఉన్నత సంస్కృతి గలవారమేనని తెలపాలనివుండటం ఎందుకో తెలీదు. నామటుకు నేను అడవిమనిషిని అని చెప్పటానికి సందేహించను'' అన్నాడు లెనిన్.

* * *

కర్షకులకు ధాన్యానికిబదులుగా ఇవ్వటానికి తగినంత తయారైన వస్తువులుగాని, తినుపదార్థాలుగాని లేనందువల్ల, 1918 సం॥ మే 10వ తేదీని సోవియట్‌ప్రభుత్వం, గొప్పరైతులవద్దనున్న ధాన్యంస్వాధీనం చేసుకోవలెనని ఒక ఆర్డరిచ్చింది. ఒక నెలతరువాత, జూన్ 11వ తేదీని 'బీదల కమిటీలు' అనబడేవాటిని, ప్రతిపల్లెలోనూ ఈ ఆర్డరును అమలుజరపటానికి నియోగించారు. రైతులలో అనుమానం, కుట్రలు, నమ్మకద్రోహం మొదలైనవానితో ఒకరకమైన అసహ్యకరపువాతావరణం

ఏర్పడింది ఇరుగుపొరుగువారే ఒకరిపైనొకరు గూఢచార్లుగా పనిచేశారు. రైతులు తమ పశువులను చంపి, ప్రభుత్వానికివంట నివ్వటానికి నిరాకరించి భూమిదున్నటమే మానేశారు. పల్లెటూళ్లలో జరిగిన తిరుగుబాట్లను చెకా సైన్యాలు అణిచివేశాయి.

మానవస్వాతంత్ర్యాన్ని పూర్తిగా అణగద్రొక్కుట, రాజ్యాంగసభను రద్దుచేయుట, చెకా భయానకశక్తి, బ్రెస్టులిటోవిస్కుసంధి—రష్యాకు ధనవంతమైన ప్రదేశాలను లేకుండా చేసినది-మొదలైనవి రష్యాలో ప్రతీ తరగతి ప్రజలలోను తిరుగుబాటును ప్రేరేపించాయి.

కెరెన్స్కీని పదభ్రష్టునిచేసిన పెట్రోగ్రాడ్‌సైన్యాలు, తిరుగుబాటుకు సిద్ధంగావున్నప్పుడు, ఇతరసైన్యాలవలెనే వారిచేతకూడా ఆయుధవిసర్జనచేయించారు. లెనిన్ పూర్తిగా నమ్మకంవుంచినది ఒక లెట్టిషు సైన్యాలమీదనే.

రాజ్యాంగసభ రద్దుచేయబడినతరువాత రాజకీయపార్టీలన్నీ-లెఫ్టు సోషలిస్టు రివల్యూషనరీలుతప్ప—కలిసి లెనిన్ నియంతృత్వానికి వ్యతిరేకశక్తులనధికంగా పెంచాయి. 1918 సం॥ వసంతకాలంలో జర్మనీపక్షీయులైన రైట్‌సింటరు సభ్యులు, లెనిన్‌ను కూలద్రోసి మళ్ళీ సామ్రాజ్యస్థాపన చెయ్యాలనే భావంతో, జర్మనీప్రతినిధులతో రహస్యమంతనాలుచేశారు.

ఈ సమయంలోనే 'నేషనల్‌సెంటరు' అనేవర్గం ఉద్భవించింది. 1918 సం॥ జూన్ నెలలో, జర్మనీతోనూ, సోవియట్‌ప్రభుత్వంతోను పోరాడుటకై సహాయంగా సైన్యాలను పంపటానికి మిత్రరాజ్యాలంగీకరించాయి.

ఇంతకుముందే సైబీరియాలో మిత్రరాజ్యాలవారు మందుగుండు సామగ్రిని, ముడిపదార్థాలను నిలవచేసిన, వ్లాడివాస్టక్, మొదలైన ముఖ్య ప్రదేశాలలో జపాను సైన్యాలు చాలావచ్చి దిగాయి. సైబీరియాలో చాలామంది జర్మనీ, ఆస్ట్రియా యుద్ధఖైదీలున్నారు. జర్మనీవారు ఈ సరుకులను, ఖైదీలను ఉపయోగించకుండా జపానువారు అడ్డగించారు. నిజానికి

జపానువారు అక్కడేస్థిరపడటానికి వచ్చారని నమ్మటానికి కారణంవుంది. 1918 సం॥లో జపానువారి నెదిరించటానికై, బ్రిటను, ఫ్రాన్సు అమెరికా సైన్యాలు వ్లాడివాస్టక్‌వచ్చిచేరాయి. వీటిలో చాలాసైన్యాలు రేవువట్టణానికి చుట్టుప్రక్కలనేఉన్నాయి. అదేసమయంలో బ్రిటను, అమెరికాసైన్యాలు మర్మాణస్కు, ఆర్కేంజల్ పట్టణాలలో దిగాయి. బ్రెస్టులిటోవిస్కుసంధి తరువాత, రష్యాసైన్యంలో వాలంటీర్లుగా పోరాడిన జెకొస్లావాకియా యుద్ధ ఖైదీలను, సైబీరియా, వసిఫిక్‌సముద్రాలద్వారా ఫ్రాన్సుకుపోవాలని మిత్ర రాజ్యాలు ఆజ్ఞాపించాయి. దానిమీదట, జెకోస్లావాకియావారి ప్రయాణపు దారి నంధికివ్యతిరేకంగా భావిస్తామని జర్మనీవారు సోవియట్‌రష్యా ప్రభుత్వానికి తెలియచేశారు.

యుద్ధపు కమిసార్‌గావున్న ట్రాట్‌స్కీ ఆ ఖైదీలవటాలాన్ని నిరాయుధులను చేయవలెనని ఆజ్ఞాపించాడు. అప్పటికి వారు వాల్గాప్రాంతంలో ఉండగా మే 26వ తేదీని, ట్రాట్‌స్కీ ఆజ్ఞను పాలించటానికి ప్రయత్నించి నప్పుడు, జెక్కులు తిరుగబడి రష్యా ఉద్యోగులను ఖైదుచేశారు.

జెక్కుల తిరుగుబాటునుగూర్చి లెనిణకు టెలిగ్రాంవార్త రాగానే అతడు చాలా కంగారుపడ్డాడు. మంత్రివర్గసమావేశం వాయిదావేసి రోసెన్‌గోల్జు అనేబలమైన బోల్షివిక్‌సభ్యుని రహస్యాధికారాలతో పంపించాడు.

జూన్ 8వ తేదీని, సోషలిస్టు రివల్యూషనరీపార్టీకి చెందిన కార్మికులు, సైనికులు జెక్కులతోకలిశారు. 'అఖిలరష్యా రాజ్యాంగసభ సభ్యులు' అనే కమిటీని ఏర్పాటుచేసి, తద్వారా వాలంటీరు ప్రజాసైన్యమును తయారుచేయుటకు ప్రారంభించారు. స్వల్పకాలంలోనే వసిఫిక్ తీరంలో వాల్గా, వ్లాడివాస్టక్‌లమధ్యనున్న నమారాప్రాంతమంతా బోల్షివిక్ వ్యతిరేకసైన్యాలచేతిలో జిక్కింది. ఆసమయంలోనే యుక్రైన్, దక్షిణ రష్యాప్రాంతాలు జర్మనీ, ఆస్ట్రియా సైన్యాలకు చిక్కివున్నాయి.

డాన్ ప్రాంతంలో పూర్వపురష్యాసైన్యాధిపతులైన జనరల్ అలెక్సీవ్, జనరల్ కోర్నిలోవ్‌లు ఒక తెల్లసైన్యాన్ని తయారుచేశారు. 1918 సం॥ జనవరిలో వారి సైన్యసంఖ్య 3000. ఈ సైన్యాన్ని నాశనంచేయ

టానికై బోల్షివికులు 10,000 సైన్యం పంపించారు. ఆ ప్రాంతంలోని రైతులు జనరల్సు కార్యక్రమాన్ని అంగీకరించనందువల్ల వారిసైన్యం స్టెప్పీలలోనికి తిరోగమనం చేయవలసివచ్చింది. ఆసమరంలో జనరల్ కోర్నిలోవ్ మరణించాడు.

రెండు నెలలతరువాత మిగిలినసైనికులు వెయ్యిమంది. కొసాక్కులను చేర్చుకొని క్రొత్తసైన్యం తయారుచేశారు. జూన్‌లో వారిసంఖ్య 12000; జులైలో 30,000 1918 సం॥ అక్టోబరునాటి ఈసైన్యం 10,000 పెరిగింది. వీరు జనరల్ డెనికిన్ ఆధిపత్యంలో 200 మైళ్ల ప్రాంతము నాక్రమించుకున్నారు.

లెనిన్‌ను బలపరిచి, సోవియట్ ప్రభుత్వంలో పాల్గొనిన ఏకైక బోల్షివికేతర పార్టీ కూడా తిరుగబడింది. వారు పంచసూత్రకార్యక్రమాన్ని సోవియట్లకాంగ్రెసున కందించారు. (1) ధాన్యస్వాధీనదళాలను రద్దు చెయ్యాలి; (2) రష్యన్ స్థిరసైన్యాన్ని రద్దుచెయ్యాలి. (3) జెర్జిన్‌స్కీ యొక్క రహస్యపోలీసుశాఖ-చెకాను రద్దుచెయ్యాలి. (4) జెకోస్లోవేకియా లీజియన్‌తో శాంతిఒడంబడికను చేసుకోవాలి; (5) జర్మనీతో గోరిల్లా యుద్ధప్రకటనచెయ్యాలి.

లెనిన్ ఈసూత్రాలను పూర్తిగా నిరాకరించి, కొందరుప్రముఖులైన లెఫ్టుసోషలిస్టు రివల్యూషనరీ నాయకులను ఖైదుచేయమని ఆజ్ఞాపించాడు. జర్మను వ్యతిరేకులైన చెకాదళాలలాలోచీతో, భయానకచర్యలకు తోడుగా, రష్యాలోని జర్మనీ రాజకీయప్రతినిధులపై సాయుధ తిరుగుబాటు చేయటానికై లెఫ్టుసోషలిస్టు రివల్యూషనరీలు ఒక పన్నుగడవన్నారు. 1918 సం॥ జులై 6వ తేదీని బ్లుమ్‌కిన్ అనే అతడు రష్యాలోని జర్మనీ రాయబారి కౌంటుమిర్‌బాచ్‌ను హత్యచేశాడు.

అనేక సైనికదళాలు, తిరుగబడిన చెకాదళంతోనుకలిసి, లెఫ్టుసోషలిస్టు రివల్యూషనరీలు, జర్జిన్‌స్కీని ఖైదుచేసి, మాస్కో టెలిగ్రాఫ్ ఆఫీసుభవనంతోసహా అనేకభవనాలను స్వాధీనంచేసుకున్నారు. వెంటనే తిరుగుబాటుచెయ్యాలని దేశమంతటికీ టెలిగ్రాములు పంపించారు.

టెలిఫోనుశాఖ యింకా తన అధీనంలోనే ఉండటంచేత లెనిన్ వెంటనే చర్యతీసుకున్నాడు. అతడు తనకు భక్తియుక్తులైన లెట్టిషు సైన్యాలసహాయంతో, మాస్కోలోని కమ్యూనిస్టు కార్మికులనందరను సమీకరించి, వారి సహాయంతో వెంటనే మాస్కోలో శాంతినెలకొల్పచేశాడు. ఏమీ అపాయంలేకుండా జర్జిన్‌స్కీని విడుదలచేశారు.

రాష్ట్రాలలో లెఫ్టుసోషలిస్టు రివల్యూషనరీ పక్షీయులైన కర్షకుల వల్ల అపాయకరంగానేవుంది. ఇప్పుడు స్టాలిన్‌గ్రాడ్ అనబడే ట్సారిట్సిన్ నగరంలోవున్న స్టాలిన్‌కు లెనిన్ ఈసమాచారం పంపించాడు; ఈరాత్రే, నిర్దాక్షిణ్యంగా మనం తిరుగుబాటును అణచివెయ్యాలి. ప్రజలకీ సత్యం తెలియచెయ్యి. యుద్ధానికి మనం ఒక తలవెంట్రుక దూరంలోనేవున్నాం. విప్లవవ్యతిరేకులకు పరికరాలుగానున్న ఈదుర్మార్గపు పచ్చిసాహసులను ప్రతీచోటా, నిర్దాక్షిణ్యంగా అణచివేయటం చాలాఅవసరం.''

దీనికి స్టాలిన్ సమాధానంఇది; ''ఈ పిచ్చివాళ్ల విషయంలో మనం అశ్రద్ధచేయమని నీవు ధైర్యంగావుండవచ్చు. మనం శత్రువులను శత్రువులను చూడవలసినట్లుగానే చూస్తాం.''

కౌంటుమిర్‌బాచ్ హత్యకు, బెర్లిన్‌లో తీవ్రనిరశనను తెలియచేశారు. వెంటనే విచారణజరిపి హంతకుణ్ణి శిక్షిస్తామని రష్యాప్రభుత్వం వాగ్దానంచేసింది. కాని బ్లంకిన్ పట్టుబడలేదు. జర్మనీప్రభుత్వ కోపాగ్నిని చల్లార్చటానికై, 20 మంది లెఫ్టుసోషలిస్టు రివల్యూషనరీలను చంపుటకు లెనిన్ ఆజ్ఞాపించాడు.

''మన సోషలిస్టు రివల్యూషనరీ 'కామ్రేడ్ల''నుంచి అంతరంగిక అప్పగా తీసికొని, మన అమాయకత్వాన్ని నిరూపించి, మన లాభాలను కూడా పెంపొందించుకోవచ్చు.''నని లెనిన్ క్రాసిన్‌తో చెప్పాడు.

ఈలోగా యూరలు ప్రాంతంలో ఇంకా రెడ్‌సైన్యాలనాయకత్వంలో వున్న లెఫ్టు సోషలిస్టు రివల్యూషనరీయైన మురలీమ్, 1918 సం॥ జులై 11వ తేదీని టెలిగ్రాంద్వారా జర్మనీపై యుద్ధంప్రకటించి తన సైన్యా

లను మాస్కోపైకినడవమని ఆజ్ఞాపించాడు. కాని అతని ఆజ్ఞను పాటించే లోగానే ఒక బోల్షివిక్ కమిసార్ మురలీవ్‌ను చంపాడు. అతని మరణంతో ఈ తిరుగుబాటుకూడా అణగిపోయింది. కాని ఇంకా మధ్యరష్యా, సైబీరియా యుక్రైన్, క్రిమియా, కాకసస్‌ప్రాంతాలు మాస్కోతో సంబంధంలేకుండానే వుండిపోయాయి.

జెక్కులు, బోల్షివిక్కులు యూరల్ ప్రాంతంలో యుద్ధంచేస్తుండగానే 1918 సం॥ జులై 16వ తేదీని మాజీ జారుప్రభువైన నికోలస్, అతని కుటుంబం ఎకటెరిన్‌బర్గులో ఉరితీయబడ్డారు. మార్చి విప్లవంతరువాత వెంటనే వారిని బంధించి ఖైదులోవుంచారు. 1917 సం॥ లో తాత్కాలిక ప్రభుత్వం వారిని సైబీరియాకు పంపించింది. 1918 సం॥ లో యూరల్ ప్రాంతంలోని బోల్షివిక్ సంస్థ భద్రతకై వారిని ఎకటెంబర్గుకి మార్చమని కోరారు.

నికొలస్, అతనిభార్య, పిల్లలు అక్కడకు చేరగానే అక్కడి సోవియట్ నాయకులు వారి హత్యనుగూర్చి సమాలోచనచేశారు. చాలామంది మాస్కో అంగీకారంలేకుండా ఆ బాధ్యతను వహించుటకంగీకరించలేదు. వీరిఖర్మను తేల్చుకురావడానికై బోల్షివిక్ నాయకుడైన గొలోషోకిన్‌ను పంపించారు.

మొదట వీరిని ఎకటెంబర్గులోనే ప్రత్యక్షవిచారణ చెయ్యాలని సెంట్రల్‌కమిటీ ఆలోచించింది. కాని అప్పటి సైనికపరిస్థితులనుబట్టి దాన్ని విరమించుకోవలసివచ్చింది. జెకోస్లావేకియా సైన్యం ఎకటెంబర్గుకి వెడుతూవుంది. నికోలస్‌కు, అతని కుటుంబానికి మరణదండన విధించాలనీ, విప్లవవ్యతిరేకులు వారి ఎముకలనుపయోగించి, మూఢనమ్మకాలు గలిగిన సామాన్యప్రజను రెచ్చగొట్టకుండా వుండునట్లు, దేహాలను భస్మం, చెయ్యాలనీ తీర్పునిచ్చారు. ఈ ఆజ్ఞను పరిపాలించుటకై ఒక ప్రత్యేక సంఘాన్ని పంపించారు.

యూరల్‌కమిసార్లలో ఒకడైన బైకోవ్ ఇల్లాచెప్పాడు. "జులై 16వ తేదీని రాజకుటుంబాన్ని చంపుటకు నియోగింపబడినవారు, కమాండెంటు,

ఇపట్యేవ్ ఇంట్లో సమావేశమైనారు. అక్కడే రాజకుటుంబంకూడా నివసిస్తున్నారు. వారందరినీ భూగృహంలోనికి తీసికునిపోయి అక్కడేహత్యాకాండ జరిగించటానికి నిశ్చయింపబడింది. చివరిక్షణంవరకు వారిని హత్య చేస్తారని ఆ అభాగ్యులకు తెలియదు. అర్ధరాత్రి వారిని లేపి, దుస్తులు ధరించమని, భూగృహానికి వెళ్లమన్నారు. వారికి అనుమానం కలుగకుండా ఇంటిపై తెల్లవారు దాడిచేస్తారని వారితో చెప్పారు. ఇంటిలోని ఇతరులందరినికూడా అక్కడకే హాజరుకావాలని ఆజ్ఞాపించారు. అందరు చేరినతరువాత రాజకుటుంబానికి వారి ఖర్మపై తీర్పును వినిపించారు. నికోలస్, అతనిభార్య, కుమారుడు అలెక్సీ, నలుగురు కుమార్తెలు, వారి అనుచరులను అక్కడికక్కడే, వెంటనే కాల్చి చంపారు.''

దేహాలను దుప్పట్లలో కప్పి, లారీపైవేసి చాలామైళ్ళదూరంలోనున్న పాతగనిగోతివద్దకుతీసికొనిపోయారు. వారినక్కడ తాత్కాలికంగా వుంచి, మరునాడుదయం దేహాలనాశనం ప్రారంభించారు. 18వ తేదీ మధ్యాహ్నంవరకు ఈపని పూర్తికాలేదు.

ఈ కార్యక్రమమంతా యూరల్‌సోవియట్ సభ్యుడైన యూరోవిస్కీ నాయకత్వంలో, లెట్టిషు చెక్కిస్టుల దళంచేత జరుపబడింది. దేహాలను గొడ్డళ్ళతో ముక్కముక్కలుగా నరికి, బెంజైన్‌లోముంచి, సల్ఫ్యూరిక్ ద్రావకంపోసి తగులపెట్టారు. మాడిపోయి, మిగిలిన శేషాలను చాలా మైళ్ళదూరంలోనున్న చెరువులో పడవేసి, ఆ తడిసిన ప్రదేశాన్ని ఆచోకీ తెలీకుండా ఆకులతో, నాచుతోకప్పివేశారు.

''సోవియట్ అధికారం అభాగ్యులైన రాజకుటుంబాన్ని చాలా వింతపద్ధతిలో నాశనంచేశారు. ఈ విషయంలో సోవియట్‌ప్రభుత్వం, అత్యంత ప్రజాస్వామ్యపద్ధతి నుపయోగించారు. అఖిలరష్యా ఖూనీకోరునకు వీరికీ ఏమీ తేడాచూపలేదు. సాధారణబందిపోటును కాల్చినట్లే వారినిచంపారు.'' అని బైకోవ్ తరువాత వ్రాశాడు.

ఈరాజకుటుంబం హత్యనుగూర్చిన అధికారప్రకటన జులై 18వ తేదీని జరిగింది.

సోవ్నార్కోం సభలో క్రొత్తప్రజారోగ్యడిక్రీనిగూర్చినచర్చ సగంలో వుంది. ఆరోగ్యకమిషనరు, సెమాష్కోమాట్లాడుతున్నాడు. అప్పడు స్వెర్డ్లోవ్ లెనిన్ చెవిలో ఏదోచెప్పాడు. తానొక ప్రకటన చెయ్యాలని "సభవారిని కామ్రేడ్ స్వెర్డ్లోవ్ అడుగుతున్నాడు" అన్నాడు లెనిన్.

"తీర్పు ప్రకారం, ఎకటెరింబర్గులో నికోలస్‌ను పేల్చివేశారని ఒక రిపోర్టువచ్చింది అని నేను ప్రకటించదలచుకున్నాను. నికోలస్ పారి పోవాలని అనుకున్నాడు. జెకోస్లోవేకియనులు పట్టణంలో ప్రవేసిస్తున్నారు. సెంట్రల్ ఎగ్జిక్యూటివ్‌కమిటీ అధ్యక్షుడీచర్యలను ఆమోదిస్తున్నాడు."అని స్వెర్డ్లోవ్ ప్రకటించాడు.

దానిపై ఏమీ విమర్శలేకపోయింది.

"ఇప్పుడు మనం ముసాయిదాను విషయాలవారీగా చదవడం సాగిద్దాం." అని లెనిన్ పునఃప్రారంభంచేశాడు. పీపుల్సుకమిస్సార్ల కౌన్సిలు, సెమెష్కో ప్రజారోగ్యడిక్రీని మళ్ళీ ప్రారంభించారు.

1918 సం॥ జులై 19వ ఇజ్‌వెస్టియాపత్రికలో "నికలస్‌రోమనోవ్ భార్య, కొడుకులు భద్రమైనస్థలానికి పంపించబడ్డారు." అని వ్రాయ బడింది. మాజీజారుప్రభువు, కుమారుడు, నలుగురు కుమార్తెల హత్య ప్రజలకు దుర్భరమైనదని సుస్పష్టమే. పైగా ఏ న్యాయశాస్త్రంగాని, విప్ల వాత్మకమైన న్యాయమైనా, మాజీప్రభువు వైద్యుని, వంటవానిని, పరిచా రికను, నౌఖరునుకూడా చంపటానికి అంగీకరించదు.

జారుప్రభువు హత్యకు మరుసటిరాత్రి, అతనికుటుంబానికిచెందిన ఏడుగురు అమాయకులనుకూడా యూరల్‌ప్రాంతపు పట్టణంలో హత్య చేశారు. ముందుగానే గ్రాండ్‌డ్యూక్ మైఖైల్‌ను పెర్ములోపేల్చి చంపారు. బలవంతులైన శత్రువులనందరినీ నిర్దాక్షిణ్యంగా చంపుటయే ఈనాటి కార్యక్రమం.

తనక్రింది అధికారులకు ఆజ్ఞలివ్వటంలో లెనిన్ ఏమాత్రం తడబడ లేదు. 1918 సం॥ 19వ తేదీ నిచ్చిన ఈ క్రింది ఆజ్ఞ సరియైన ఉదాహ

రణ:-బాగా నమ్మకస్థులైనవారితో కూడిన ఒక అధిక రక్షకదళమును తయారుచేయుట చాలా అవసరం. వారు కులకులు (Kulaks) మత గురువులు, తెల్లగార్డులపై ఉమ్మడిగా నిర్దాక్షిణ్యభయానక చర్యలను సాగించాలి. అనుమానితులైనవారినందనీ బంధించి ఊరిబయట యుద్ధఖైదీల ఖైదులోవుంచాలి. విద్రోహులను ఏరిపట్టుకోటానికి వెంటనే దళాలను పంపాలి. ఈ ఆజ్ఞను పాలించిన విషయం టెలిగ్రాం జవాబు ఇవ్వవలెను.

సోవ్నార్కం అధ్యక్షుడు—లెనిన్.

ఇంచుమించు సోవియట్ ప్రభుత్వం ప్రారంభించబడినప్పటినుంచీ లెనిన్ హత్యకై ప్రయత్నాలు జరిగినట్లు పుకార్లున్నాయి. అతని ప్రభుత్వ చర్యలు వృద్ధియైన కొలదీ అతని ప్రాణభయం అధికమైంది. 1918 సం॥ జనవరిలో ఆచోకీ తెలియని హంతకుడొకడు లెనిన్ కారుపై పేల్చాడు; కాని అది గురితప్పిపోయింది.

1918 సం॥ ఆగస్టు 30వ తేదీని లెనిన్ మాస్కోలోని కార్మిక ప్రదర్శనంలో పాల్గొనవలసివుంది. హాలులోనికి ఆలస్యంగా వచ్చినవారిలో ఒకస్త్రీ వేదికవద్ద కూర్చుని, ప్రతిమాటను శ్రద్ధగావింటూ, భయపడుతూ వరుసగా సిగరట్లు కాల్చుతోంది.

టైముప్రకారం లెనిన్‌వచ్చి కొద్దినిముషాలు మాత్రమే మాట్లాడాడు. అప్పుడతడు వేదికను దిగి అతని కోటు, టోపీలను తీసుకుని బయటకు వెళ్ళాడు. అతనితో కార్మికులు చాలామందికూడా వెళ్ళారు. విడువకుండా సిగరెట్లు కాల్చినస్త్రీకూడా అప్పుడే వెళ్ళింది.

లెనిన్ తన కారున్న ప్రదేశానికి వచ్చాడు. తలుపుదగ్గిర ఆస్త్రీ అతన్ని పలుకరించి కొన్ని ప్రశ్నలడిగింది. అతడు తనకారువద్దకు వెళ్లు తూనే ఆమెకు సమాధానం ఇవ్వటానికి ప్రయత్నించాడు. అతడు కారులో ఎక్కబోతుండగానే ఆమె లెనిన్‌కు కొద్ది అడుగుల దూరంనుంచి, మూడుసార్లు పిస్తోలుపేల్చింది. లెనిన్‌క్రిందపడిపోయాడు. "వాళ్లు లెనిన్‌ను చంపారు." అని ఎవరో కేకపెట్టారు. ఆ అలజడిమూక కంగారుగా

ముందుకుపోయి చెదిరిపోయారు. కాని లెనిన్ లేచి కారును ఇంటికి పోనిమ్మన్నాడు. అతడు నొఖరు ఇతరులసహాయంతో తనసీటులో కూర్చో గలిగాడు. కారు శరవేగంతో క్రెమ్లిన్ కోటకు పోయింది.

రెండుగుళ్లు అతనిమెడలోకి, కంఠెఎముకలోనికి చొచ్చుకుని పోయినా, అతని పరిస్థితి మొదట అనుకున్నంత ప్రమాదకరంగాలేదు.

లెనిన్‌ను పేల్చిన స్త్రీని కొంతదూరంలోనే బంధించారు. ఆమెను ఆరాత్రి లుబాయాంకాకు తీసుకొచ్చారు. చకా విచారణలో ఆమె ఇల్లా వ్రాసింది.

"నాపేరు ఫాన్యాకప్లాన్....ఈవేళ నేను లెనిన్‌పై పేల్చాను. అది నేను నాస్వంతంగానే చేశాను. నేనెవరివద్దనుంచి రివాల్వరు తెచ్చానో నేనుచెప్పను. నేనేమీ వివరాలుచెప్పను. లెనిన్‌ను చంపాలని నేను చాలా చాలాకాలం క్రిందటనే నిశ్చయించాను. విప్లవానికి అతడు ద్రోహిఅని నా ఉద్దేశ్యం. కీవ్‌లోఒకజారు ఉద్యోగిని హత్యాప్రయత్నంచేసిన సందర్భంలో నన్ను సైబీరియాకు ప్రవాసంపంపించారు. నేను పదకొండు సంవత్సరాలు కఠినశిక్ష ననుభవించాను. విప్లవానంతరం నన్ను విడిచి పెట్టారు. నేను రాజ్యాంగసభను బలపరిచాను; ఇంకా నేను దానిపక్షమే. నా తల్లిదండ్రులు అమెరికాలోవున్నారు. వారు 1911 సం॥లో వలస పోయారు. నాకు నలుగురు అక్కచెల్లెళ్లు, ఇద్దరు అన్నదమ్ములు వున్నారు. వారంతా కార్మికులు. నేను అక్కడనేచదువుకున్నాను. నేను లెనిన్‌పై పిస్తోలు ప్రేల్చాను."

పెట్రోగ్రాడ్‌లో ఆమె లెనిన్‌ను హత్యచేయటానికి ప్రయత్నించిన రోజునే పెట్రోగ్రాడ్‌లో జ్యూవిద్యార్థి, లియొనిడ్‌కనెగీసర్ (Leonid Kanegiesser) అనే అతడు పెట్రోగ్రాడ్ చెకా అధికారియైన, యురిట్స్కీని హత్యచేశాడు.

ఈరెండు హత్యాచర్యలతో పెట్రోగ్రాడ్‌లో రెడ్‌సైన్యదళాలు వీధులో తిరిగి ధనికులకొరకు, బుద్ధిమంతులకొరకు గాలించటంతో పెట్రో

గ్రాడ్‌లో అత్యంతభయంకర వాతావరణం తాండవించింది. కమ్యూనిస్టు, కార్మికులుమాత్రమే క్షేమంగావుండగలిగారు. ప్రశ్న, మాటలేకుండా అనేకులను ఖైదుచేశారు.

జినోవీవ్ సైనికులతో "ధనికులు ప్రత్యేకంవ్యక్తులను చంపుతారు. కాని మనం పూర్తిగా వర్గాలనేచంపుతాం"అని చెప్పగలిగాడు. ఈవిధమైన నినాదాలతో ఉద్రిక్తులైన సైనికులు మహోత్సాహంతో హత్యాకాండ ప్రారంభించారు. కనెగిసర్‌ను విచారణలేకుండా చంపారు. క్రోన్‌స్టాట్ నావికులు (Krounstadt's Sailors) బాల్టిక్ ప్రాంతంలోవున్న 500 మంది ధనికులను హత్యచేశారు.

కొద్దిరోజులలోనే పెట్రోగ్రాడ్ చెకాదళాలు 512 మందిని హత్య చేశారు.

అక్టోబరు 19వ తేదీని ఇజ్వెస్టియాపత్రికలో ప్రత్యేకకమిషన్ సభను గూర్చి వ్రాయబడింది. "మాస్కోనుంచి అఖిలరష్యా ఎక్స్ట్రార్డినరీకమిషన్ వారు నిర్గమించిన తరువాతనుంచి పెట్రోగ్రాడ్ డిస్ట్రిక్టుకమిషనుచేసిన పనినిగూర్చిన వివరాలు బోకివ్‌చెప్పాడు. ఖైదుచేసినవారి మొత్తంసంఖ్య 6,22౧. 800 మందిని కాల్చివేశారు. ఈ అంకెలు కొద్దికాలంలోనే, పెట్రోగ్రాడ్‌జిల్లాలోమాత్రం జరిగినవి.

పూర్తిగా ధనికవర్గాన్నే నాశనంచెయ్యాలని రెడ్‌భయంకరశక్తి అసలుఅభిప్రాయం. "కాని చకాదృష్టిలో ధనికవర్గంఅంటే బోల్షివిక్ కాని వారందరూ. చెకాఅధికారులలో ఒకడైన ఎం. లాట్సిస్ ఇల్లావ్రాశాడు: "ధనికులవర్గాన్నే మనం రూపుమాపుతున్నాం. వారు, వీరు సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేసినచర్యలకు, మాటలకు ఏవిధమైనసాక్ష్యాల కోసం ఎదురుచూడవద్దు. ఖైదుచేసినవారిని అడగవలసిన ప్రథమప్రశ్నలు: అతడే వర్గానికిచెందినవాడు?, పుట్టుపూర్వోత్తరాలేమిటి?, అతనివిద్య, పనిఏమిటి? ఈప్రశ్నలే వ్యక్తియొక్క ఖర్మను నిర్ణయించాలి. ఇదే రెడ్ భయంకర దౌర్జన్యశక్తి సారాంశం."

యూక్రైన్‌లో ఆమెచూసిన దౌర్జన్యకాండనుగూర్చి ఏంజలికా బలా బనాఫ్ నిరసన తెలియచేసినప్పుడు, లెనిన్ ఒక చిరునవ్వుతో, బోల్షివిక్ పార్టీకి ఆమె ఉపయోగం ఇంకలేదని చెప్పాడు.

ఈసమయంలోనే అతడు చకాసభలో మాట్లాడుతూ, 'అమాయ కులను పేల్చినందుకు అలజడినిగూర్చి తన కాశ్చర్యంవేసిందన్నాడు. తప్పులనుంచే మేము నేర్చుకుంటామని అతడు గట్టిగాచెప్పాడు. చెకాయే నియంతృత్వానికి బలమునిస్తున్నదన్నదే ముఖ్యవిషయం.

"నేను చెకా కార్యకలాపాలనుగూర్చి విచారించి చూడగా, అదే సమయంలో, దానికి వ్యతిరేకంగా చెలరేగిన విమర్శలను చూసినప్పుడు ఇదంతా ధనికవర్గాల శుష్కప్రలాపం అని చెప్పాలి. స్వయంవిమర్శ తోనే మేము వారిని తరిమివేస్తాము. కార్మికుల నియంతృత్వాన్ని చకా కార్యరూపంలో పెడుతోంది. ఇదే చాలా విలువైనది. ఇదే చకావని. దానిలోనే కార్మికుల కదిచేసే సేవఇమిడివుంది." అని 1918 సం॥లో లెనిన్ చెప్పాడు.

1915 సం॥ లో చనిపోయాడని లెనిన్ ప్రకటించిన మాలినోవిస్కీ 1918 సం॥ లో మాస్కోలో ప్రత్యక్షమైనాడు. కొన్నిసంవత్సరాలక్రిందట లెనిన్ అతనిపై మోపిన నేరాలకు ఇప్పుడతడు బోల్షివిక్ రివల్యూషనరీ ట్రిబ్యూనల్ విచారణకు గురియైనాడు. లెనిన్ సమక్షంలో ఈ విచారణ అతిరహస్యంగాజరిగింది. అతనిపై మోపబడిన నేరములను మెలినోవిస్కీ నిరాకరించలేదు. తాను డ్యూమాను విడిచిపెట్టినప్పుడు సమస్తము లెనిన్‌కు తెలియవరచానని అతడు చెప్పాడు.

లెనిన్ మాలినోవిస్కీకి ఎదురుగా కూర్చొని తలవంచుకుని ఏదో వ్రాస్తున్నాడు. ఓల్గా అనిన్ట్సు ప్రకారం లెవిన్ తనలో తాను మానసిక వేదనపడుతున్నట్లు స్పష్టం. ఆవిధంగా అతడు గంటలకొలదీఉన్నాడు. మానినోవిస్కీకి సలహాలిచ్చే మిత్రులుండివుంటే, అతడుగూఢచారియై వుండేవాడుకాదని, ప్రతివాది ప్లీడరు చెప్పినప్పుడు, లెనిన్ తలపైకెత్తి చాలాసార్లు తలవంకించాడు.

తుపాకితో పేల్చి చంపాలని తీర్పును చెప్పగానే మాలినోవిస్కీ భయంకంపితుడైపోయాడు. లెనిన్ కలుగచేసుకుంటాడేమో అని అతడు అనుకున్నాడు. హాజరుకాకముందే అతన్ని క్షమించుటకు అవకాశంవుంది; కానిలెనిన్ కే నిశ్చయంకుదరలేదు. ఒకప్పుడు లెనిన్ కునమ్మినబంటుగనుక, ద్రోహికివ్వబడిన శిక్షను అతడు తగ్గిస్తాడేమో అనేభయంతో విచారణను చూడటానికివచ్చిన పెట్రోగ్రాడ్ బోల్షివిక్ కార్మికులు, మాలినోవిస్కీ ఉరిని స్వయంగా చూడాలని పట్టుపట్టారు. మరునాడు మాలినోవిస్కీని పేల్చి చంపారని ఇజ్వెస్టియా పత్రికలో ప్రకటింపబడింది.

## కోమిన్ టర్న్

అధికారం చేజిక్కించుకోగానే బోల్షివికులు ప్రపంచవిప్లవానికి ప్రయత్నాలు ప్రారంభించారు. 1917 సం॥ డిశంబరు 24వ తేదీని, విదేశవ్యవహారాలశాఖకమిస్సరేట్ లోని విదేశప్రతినిధులకు ప్రపంచవిప్లవావసరాలకై సోవ్నార్కమ్ రెండుమిలియన్ రూబుల్సును ప్రత్యేకించింది.

ఏదేశములోనైనా, ఆదేశం రష్యాకు విరోధమైనా, స్నేహమైనా సరే, లేక అవి తటస్థంగా నున్నాసరే—కార్మికవ్యవస్థలకు అన్నిసహాయములు, ధనసహాయంతో కూడా చెయ్యటం చాలా అవసరమని ఇజ్వెస్టియాలో, లెనిన్ ట్రాట్స్కీ, బోంచ్-బ్రుయేవిచ్, గోర్బునోవ్‌ల సంతకాలతో ఒక ప్రకటనచేశారు.

రష్యాప్రజాయుద్ధంలో మునిగివున్నప్పటికి ప్రపంచమంతటిలో మార్క్సియన్ విప్లవాలు వర్ధిల్లాలనే తన ఆశయమును మాత్రం మరిచిపోలేదు. శాంతి ఒడంబడికయైన తరువాత, మధ్య, తూర్పు ఐరోపాలలో పరిస్థితులు అల్లకల్లోలంగా ఉన్నాయి. యుద్ధరంగాలనుంచి తిరిగివచ్చే సైనికులు, అలసిపోయి, అయోమయులై, ఆగ్రహావేశాలతోనున్నారు. జర్మనీలో, ఆస్ట్రియా హంగరీలలో రాజ్యాధికారులు అడుగంటారు; ఆస్ట్రో హంగరీ సామ్రాజ్యం క్షీణించింది; పోలెండు, బాల్కను రాజ్యాలు ఉడుకుతున్నాయి. మిత్రరాజ్యాలలోనున్న కార్మికులుకూడా కంగారులోవున్నారు. కమ్యూనిజానికి భూమి తగిన సారవంతంగా వున్నట్లుతోచింది.

ప్రపంచవిప్లవానికి బోల్షివికులు ప్రయత్నాలు జరిపిన మొదటి విదేశం జర్మనీయే. విప్లవప్రచారసామగ్రిని, కరపత్రాలు మొదలైనవన్నీ సోవియట్ రాజకీయ ప్రతినిధులు తరలించుకువచ్చారు. జోఫే, రకోవిస్కీ రడేక్, బుఖారిన్, ఇగ్నటోవ్‌లతో కూడిన ఒక ప్రతినిధివర్గమును బోల్షివికులు పంపించారు. జర్మనీ సైనికులు వారినడ్డగించారు. కాని రడేక్ మాత్రం మారువేషంతో బెర్లిన్ చేరుకున్నాడు.

మొట్టమొదట రడేక్ శక్తివంతమైన స్వతంత్రసోషలిస్టుపార్టీ వారికి నివేదించాడు. రష్యా పేరులో అతడు, ఎబర్టు, షీడ్‌మాన్ (Sheidemaun) నాయకత్వంలోనున్న సోషల్‌డిమొక్రటిక్ ప్రభుత్వాన్ని, నిరసించాడు. నిజమైన విప్లవప్రభుత్వం స్థాపించబడాలన్నాడు. ఈప్రభుత్వం, రష్యా ప్రభుత్వంతోకలిసి, సామ్రాజ్యవాదులైన మిత్రరాజ్యాలపై యుద్ధం ప్రకటిస్తుంది.

తరువాత స్పార్టాసిస్టు నాయకుడైన కారల్‌లీబ్‌న్నెట్ (Carl Liebknecht)తో సంధిచేసుకోవాలని రెడెక్‌కు అజ్ఞ వచ్చింది. అగ్రిమెంటు ప్రకారం, స్పార్టసిస్టు ప్రచారానికి, అయుధాలకు ధనసహాయంచేసి, జర్మనీ సోవియట్ జర్మనీకి లీబ్‌న్నెట్‌ను అధ్యక్షుడు చేయటానికి లెనిన్ వాగ్దానం చేశాడు. 1919 సం॥ జనవరిలో స్పార్టసిస్టులు జర్మనీలో తిరుగుబాటు చేశారు. దానిని త్వరలోనే అణచివేసి లీబ్‌న్నెట్, రోసాలక్సెంబర్గులు చంపబడ్డారు.

హంగరీలో కమ్యూనిస్టు విప్లవంతర్వాత 1919 సం॥ మార్చిలో, కమ్యూనిస్టు నియంతయైన బెలాకున్ (Belakun)తో లెనిన్ ఇటువంటి సంధినే చేసుకున్నాడు. ఈసంధిప్రకారం రష్యా, హంగరీలు ఒకరికొకరు ఆర్థిక సైనికసహాయం చేసుకోవాలని నిర్ణయించారు.

1919 సం॥ ఫిబ్రవరి 12వ తేదీని బెర్లిన్‌లోని కమ్యూనిస్టు ప్రచార కార్యాలయందగ్గిర రెడెక్‌ను ఖైదుచేసినప్పుడు, మధ్యఐరోపాలో చేయ దలచుకున్న కమ్యూనిస్టు యుద్ధానికి సంబంధించిన ప్లానులను అతని వద్దనుంచి పోలీసులు పట్టుకున్నారు. ఈ జర్మనీకమ్యూనిస్టు తిరుగు

బాటును, పోలెండుగుండా జర్మనీపైకి రష్యాసేనలు నడవటం ఒక్క సారిగా జరుగవలసివుంది.

మూడవ ఇంటర్నేషనల్‌ను ప్రారంభించవలెనని, 1919 సం జనవరిలో, ఐరోపా, అమెరికా కార్మికులకు లెనిన్ ఒక విజ్ఞాపనచేశాడు జనవరి 24వ తేదీని సోవియట్ విదేశవ్యవహారాల మంత్రియైన చిచేరిన్ (Chicherin) మార్చిలో మాస్కోలో జరుగబోయే అంతర్జాతీయ కాంగ్రెసుకు ఆహ్వానాలను పంపించాడు. బ్రిటిషు లేబరుపార్టీచే సూచనచేయబడిన సభను కార్మికవర్గశత్రువుల సమావేశము అని తిరస్కరించారు. మూడవ రివల్యూషనరీ ఇంటర్నేషనల్ మిత్రులైనవారందరినీ సభకు రాకూడదని తెలియచేశారు. ట్రాట్‌స్కీచేత వ్రాయబడిన విజ్ఞాపన, "బీద ప్రజానీకపు నియంతృత్వానికీ, అధికారంకొరకు విప్లవపోరాటం సాగించే కార్మికుల సోవియట్ల బావుటాక్రిందను; మూడవ ఇంటర్నేషనల్ బావుటా క్రిందను అన్నిదేశాల కార్మికులు సమైక్యంకావాలి" అనే మాటలతో ముగిసింది.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రథమకాంగ్రెసు (కామిన్‌టర్న్) (Comintern) 1919 సం॥ మార్చి 2వ తేదీని క్రెమ్లిన్‌లో ప్రారంభించబడింది. జిమ్మర్‌వాల్డు యూనియనుకు మాజీకార్యదర్శియైన ఏంజలికా బలబనోఫ్ ఉద్దేశ్యంప్రకారం, ఆసభకువచ్చిన 35 మంది డెలిగేట్లలోను, 15 మంది అతిథులలోను, చాలామంది, రష్యా అధికారంలోవున్న-ఇస్తోలియా, లిట్వియా, లిథూనియా, ఫిన్లాండు మొదలైన చిన్నచిన్న దేశాలలోని కమ్యూనిస్టులనుంచి, బోల్షివికులు ఏరికూర్చితెచ్చినవారే. ఇతరులు ఆసమయంలో రష్యాలోనున్న యుద్ధఖైదీలు, ఇతరదేశపు రాడికలుపార్టీవారే. హాలండు, అమెరికాలోని సోషలిస్టు ప్రోపగాండాలీగు, (స్లావికు దేశాలనుంచి వలసవచ్చినవారితో నిండినది) జపానుకమ్యూనిస్టులకు, ఒక డచ్చిఅమెరికా ఇంజనీరు రట్‌గర్సు ప్రాతినిధ్యం వహించాడు. ఇతడొకప్పుడు కొన్నిమాసాలు జపానులోఉన్నాడు.ఇంగ్లండునకు సోవియట్ విదేశవ్యవహారాల ఆఫీసులో పనిచేసిన ఫీన్‌బర్గు, అనే రష్యాజాతివాడు; హంగరీకి, జాక్సుసాడోల్ — ఫ్రెంచియుద్ధఖైదీ — ప్రాతినిధ్యవహించారు.

యుద్ధవ్యతిరేకపు ఫ్రెంచిసంపాదకుడైన గుయిల్‌బీక్స్ వస్తున్నాడని వార్తరాగానే అతనికోసం సరిహద్దువద్దకు ప్రత్యేకపురైలునుపంపి, సరియైన సమయానికి మాస్కోకిరప్పించి ఫ్రాన్సుతరఫున వోటుచేయించారు. ఫ్రెంచి లెఫ్టువింగు ప్రతినిధి అనేపేరుతో అతనికి ఐదు వోట్లిచ్చారు.

లెనిన్ పెట్రోగ్రాడ్‌కు రావటానికి తగిన ఏర్పాట్లు చేసిన ప్లాటెన్ అనేస్విట్జర్లాండు ప్రతినిధి, లెనిన్‌తో జర్మనీద్వారావచ్చి, అప్పటినుంచీ రష్యాలోనే ఉంటున్నాడు. బోరిస్‌రీన్‌స్టీన్ అనే అమెరికాసోషలిస్టు లేబరు పార్టీసభ్యుడు,—ఇతడు 1917 లో రష్యాకువచ్చినవాడు-తనకు పార్టీనుంచి అధికారం లేదనేకారణంతో, అమెరికాప్రతినిధిగా వ్యవహరించటానికి నిరాకరించాడు. నిజానికి రష్యాకు బైటభాగానికి చెందిన ప్రతినిధి, స్పార్టాసిస్టు ప్రతినిధియైన జర్మనుయువకుడు, ఎబర్లయిన్ ఒక్కడే. రష్యనులు ఈ సభయే మూడవ ఇంటర్నేషనల్‌యొక్క ప్రధమకాంగ్రెసుగా తీర్మానం చేసినప్పుడు ఈ ఎబర్లయిను ఒక్కడే గట్టిగా అభ్యంతరం చెప్పాడు.

"విదేశవ్యవహారాల కమిస్సార్ ఆఫీసును ప్రధాన కార్యస్థానంగా చేసుకుని రడెక్ విదేశకమ్యూనిస్టు శాఖలను ఏర్పాటు చేస్తున్నట్టు నేను విన్నాను. తణిఖీచేయటానికై నేనక్కడకు వెళ్ళినప్పుడు, ఇంతగొప్పగా చెప్పుకున్న మహత్కార్యం కేవలం దగాఅని తెలిసింది. ఈ వర్గాలసభ్యులందరూ చాలావరకు రష్యాలోని యుద్ధఖైదీలు. వీరందరూ పార్టీలోనున్న ప్రత్యేకాధికారాలకై పార్టీలో చేరినవారే. వీరిలో ఎవ్వరికీ వారివారి దేశాలలోని విప్లవ, కార్మిక సంఘాలతో ఎట్టిసంబంధమూలేదు; పైగా సోషలిస్టు సూత్రాలైనా వీరికి తెలియవు. వారివారి దేశాలకుపోయి సోవియట్ యూనియను తరపున పనిచేయవలెనని రడెక్ వీరిని వేధిస్తున్నాడు. వీరిలో ఇద్దరు ఖైదీలు—ట్రీస్టీనుంచి పెద్దఅధికారపత్రాలతో ఇటలీకి వెళ్లటానికి సిద్ధంగావున్నారు. వారికి ఇటలీసంస్థతో ఏమీసంబంధం లేకపోటమేకాక వీరికి సోషలిజమునుగూర్చి ప్రాధమిక పడికట్టుపదాలుకూడా తెలియవని నాకు తెలిసింది. నేను తిన్నగా లెనిన్‌కే నా అభ్యంతరం తెలియచెయ్యాలని నిశ్చయించాను."

"వ్లాడిమర్ ఇలిచ్! నీ డబ్బును, అధికారపత్రాలను వాపసు తీసుకోమని నా సలహా. ఈ మనుష్యులు కేవలం విప్లవంనుంచి లాభం పొందేవారే. వారు ఇటలిలో మనకు చాలా హానికలుగచేస్తారు." అన్నాడు కోమింటర్ను ప్రథమకార్యదర్శి.

"ట్యూరటీపార్టీ (సోషలిస్టుపార్టీ) నాశనానికి వారు చాలాతగిన వాళ్లు."అని లెనిన్ చల్లగా సమాధానంచెప్పాడు. ఈ సంభాషణకు కొన్ని వారాలతరువాత ఈ ఇద్దరు లెనిన్ ప్రతినిధులు, సోవియట్ ప్రభుత్వం నుంచి తీసుకున్న సొమ్మును మిలాన్ హెూటళ్లలోనూ, వ్యభిచారగృహాల లోనూ తగులబెట్టినట్లు వార్తలు వచ్చాయి.

1920 సం॥ నాటికి ఇటలీలో ప్రజాస్వామ్యప్రభుత్వస్థాపనకై జరిగిన ప్రయత్నమును కోమింటర్ను అణచివేయగలిగింది. ఫేసిస్టులు ఇటలీలో ఇంకా బలమైన వర్గంకాలేదు. మాజీప్రధానియైన ఫ్రాన్సెస్కోనిట్టీ రాజ కుటుంబ, సైనికపలుకుబడివలన కలిగెఅనర్థాలనుగుర్తించి, రాజైనవిక్టర్ ఎమాన్యుయల్‌ను పదచ్యుతునిచేసి ప్రజాస్వామ్యస్థాపన ప్రకటనను చెయ్యాలని అనుకున్నాడు.

ఇటలీలో లెనిన్ అంతరంగిక ప్రతినిధియైన వ్లాడిమర్ డియోగాట్ వద్దకు, సోషలిస్టుపార్టీ సెంట్రల్‌కమిటీ సెక్రటరీ బొంబాసి ఇద్దరు కమ్యూనిస్టు కామ్రేడ్లతోవచ్చాడు.

"రాజపదచ్యుతికి, రిపబ్లిక్‌ప్రకటనకు, నిట్టీనిర్ణయంచేశాడు. సెరెట్టీ ఇంచుమించుగా అంగీకరించాడు. రేపు సెంట్రల్‌కమిటీలో ఈ విషయం నిర్ణయించబడాలి. నీ అభిప్రాయమును నీవు కమిటీకి తెలియ చేయాలని నా అభిప్రాయం." అని బొంబాసి చెప్పాడు.

"కోమిన్‌టర్ను పేరుతో, ఇటువంటి రాజకీయమార్పులతో కలుగ చేసుకోటం కార్మికజాతికే ద్రోహంచేసినట్లుకాగలదని, మీపార్టీ సెంట్రల్ కమిటీకిచెప్పవచ్చు." అని డియోగాట్‌సమాధానం చెప్పాడు.

సింహాసనంమీద ఎవరున్నదీ-నిట్టే లేక రాజు-చాలాఅల్పవిషయం. మనం క్రిందినుంచి విప్లవాన్ని బాగాపురికొల్పి రాజును, నిట్టీనికూడా

నాశనంచెయ్యాలి. అప్పుడే మనం కార్మికకర్షక నియంతృత్వం ప్రకటిం చాలి.'' అని డియొగాట్ లెనిన్‌పక్షాన్ని మాట్లాడి నిట్టేతీర్మానంచంపాడు. ఇటలీలో అప్పుడు పెద్దపార్టీయైన సోషలిస్టుపార్టీ ఏపార్టీల తోను కలియ టానికి సర్వదా నిరాకరిస్తూనేవుంది. 1921 సం॥లో, లివోర్నోలోపార్టీ చీలిపోయినప్పుడు, కమ్యూనిస్టు ఇతరసోషలిస్టువర్గాలపై ఏకధాటిగా యుద్ధంచేశారు. మేనెలలో వారు ఫాసిస్టుపీడను నాశనంచేయగలిగారు. అనెలలో జరిగిన ఎన్నికలను 'సోషలిస్టులకు పరీక్ష' అని పేర్కొన్నారు. 1922 సం॥ అక్టోబరునెలలో బెనిటోముస్సోలినీ కమ్యూనిస్టులకు 'తాత్కా లిక శ్వేతజాతిప్రతిక్రియను' చూపించాడు. అదిఒక తరంవరకు సాగింది.

కార్మికకర్షక నియంతృత్వాన్ని కార్యరూపంలో ఆచరణలోపెట్టే చరిత్రాత్మకపాత్రను నిర్వహించటానికే కోమింటర్న్ స్థాపించబడినదని లెనిన్ వ్రాశాడు. అటువంటి విజయం, వెనుకబడిన రష్యాదేశంలోనే సంభవించినపుడు, ఇతర అభివృద్ధిదేశాలలో రాబోవువిప్లవం ఇంకాఅధిక విజయాన్ని సాధించగలదు.

''ముఖ్యపట్టణాన్ని విప్లవాత్మకంగా ఎదిరించ ప్రయత్నించే అంత ర్జాతీయసంస్థకు, మొదటిఇంటర్నేషనల్ (1864—72) పునాదివేసింది.'' అని లెనిన్ విశదీకరించాడు.

''రెండవ ఇంటర్నేషనల్ (1889—1914) బలవత్తరంగా కాక పోయినా, సువిశాలంగా వ్యాపించిన కార్మికకర్షక ప్రచారంయొక్క అంత ర్జాతీయసంస్థమాత్రమే. అందుచేత ఇది తాత్కాలికంగా విప్లవచర్యలలో తగ్గుదలకు, తాత్కాలిక అవకాశవాదులకు స్థానంఇచ్చింది. చివరికది లజ్జా కరమైన పతనస్థితికి దారితీసింది.

''మూడవ ఇంటర్నేషనల్, రెండవఇంటర్నేషనల్‌యొక్క పనిని చేసింది. కాని తాత్కాలికంగా తలయెత్తిన దుర్మార్గపు కుట్రలనన్నింటినీ నాశనంచేసి, కార్మికకర్షక నియంతృత్వాన్ని సుస్థిరంచేయటానికి పని చేసింది.

"ప్రపంచమంతటికి పెద్దవిప్లవమైన ధనికవర్గాన్ని రూపుమావ వలసినభాద్యత వహించటానికిప్పుడు అంతర్జాతీయపార్టీల యూనియనుకు పునాదికట్టుదిట్టం ఏర్పడింది. దీనికి కార్మికకర్షకుల నియంతృత్వాన్ని అంతర్జాతీయంగా ఆచరణలోపెడుతున్న అనేక సోవియట్ రిపబ్లికులు, వానియొక్క విజయమే ఉదాహరణ."

ఐరోపాలోని ఇతర ప్రాంతాలలోకూడా విప్లవజ్వాలలను రగిల్చితే గాని, సోవియటు ప్రభుత్వానికి మనుగడలేదని లెనిన్‌కు బాగా నమ్మకం కలిగింది.

ఎన్నివ్యతిరేకాలున్నా, యుద్ధం జరుగుతున్నా కోమిన్‌టర్న్ కార్య కలాపంతో లెనిన్ ఎల్లప్పుడూ సన్నిహితంగానే వుండేవాడు.

1920 సం॥ జూన్ నెలలో కోమిన్‌టర్న్‌యొక్క రెండవకాంగ్రెసు పెట్రోగ్రాడులో ప్రారంభమైంది. తరువాత అది మాస్కోకు తరలించబడి ఆగస్టువరకు సాగింది. ఈసారి దీనికి 37 దేశాలనుంచి ప్రతినిధులు హాజరైనారు.

కమ్యూనిస్టులయొక్క పార్లమెంటరీ విధానాలనుగూర్చి ఇంటర్నేష నల్‌లో స్పష్టంగా విశదీకరింపబడినది:

ఏ పరిస్థితులలోనూ, సంస్కరణలకుగాని, కార్మికుల అభివృద్ధి విధానాలకుగాని పోట్లాడుటకు పార్లమెంటు తగినస్థలంకాదు....ధనికవర్గాల ప్రభుత్వసంస్థలను వానియొక్క నాశనంకొరకే ఉపయోగించుకోవడం ఎల్లాగ అన్నదే ఇప్పుడు ప్రశ్న."

దీన్నిబట్టి కమ్యూనిస్టు విధానాలకు ప్రధానసూత్రంగా వారిచేతనే అంగీకరించబడినదేమంటే కమ్యూనిస్టులు ప్రాథమికంగాప్రజాస్వామ్యానికి వ్యతిరేకులు—అన్నదే.

మూడవ ఇంటర్నేషనల్ తయారుచేసిన కార్యక్రమాన్ని తూచా తప్పకుండా అంగీకరించి, లెనిన్‌చేత తయారు చేయబడిన అంతర్జాతీయ కమ్యూనిజం సూత్రాలనంగీకరించిన సంస్థలను మాత్రమే కోమిన్‌టర్న్ సభ్యులుగా చేర్చుకున్నారు.

అంతర్జాతీయ కాపిటలిజమును ఓడించాలంటే, సామ్రాజ్యాధిపత్యంలో నున్న కాలనీలబలమును నిర్మూలించటమే మార్గం. ''ఐరోపా కాపిటలిజం పరిశ్రమలనుంచి వృద్ధిపొందలేదు; దాని యభివృద్ధి ఆరాజ్యాలకున్న కాలనీలబలంచేతనే జరిగింది. ఆధునిక కాపిటలిజానికి ఆధారం, ఆ కాల నీలలోనుంచి వచ్చిన సిరిసంపదలే. ఈఆధారమును నిర్మూలించినప్పుడే ఐరోపాకార్మికవర్గం, ధనికవర్గాన్ని జయించగలదు.'' అని రెండవకాంగ్రెసు ప్రకటించింది.

స్థానికకాంగ్రెసు తీర్మానాలన్నీ కోమిన్‌టర్న్ తీర్మానాలతో సరితూగి వుంటాయని నమ్మకం కలగటానికై, సభ్యులైనపార్టీలన్నీ స్థానికకాంగ్రెసు సభలను కోమిన్‌టర్న్ కాంగ్రెసుసభల తరువాతనే ఏర్పాటుచెయ్యాలని 1921 సం॥ జులైనెలలో కోమిన్‌టర్న్ కార్యనిర్వాహకవర్గం ఒక ఆర్డరు ప్రకటించింది

కోమిన్‌టర్న్‌కు వచ్చేసభ్యులందరు, వోట్లను ఏవిధంగా వినియోగించటమనే విషయాలపై పార్టీ ఆదేశాలనేమీ తీసుకోకుండానే, కోమిన్‌టర్న్ సభలకు తిన్నగా మాస్కోకురావాలని నాల్గవకాంగ్రెసు ఒక రూలింగు ఇచ్చింది. దీన్నిబట్టి అధికారం పూర్తిగా అగ్రస్థానంలోవుంటుందని రూఢి యైంది.

లెనిన్ కోమిన్‌టర్న్ ప్రాథమికప్లానులకు, కార్యక్రమాలకు గ్రంథ కర్తయే కాకుండా, విప్లవనీతిసూత్రాలకుకూడా అతడే ప్రధానకారకుడు: అతడిల్లా వ్రాశాడు:

''కమ్యూనిస్టులు త్యాగంచేయటానికి సర్వసిద్ధంగావుండాలి. అవసరమైతే అన్నిరకాల కుయుక్తులకు, కుట్రలకు, ఎత్తులకు, అన్యాయ మార్గాలకు, నిజాన్నితప్పించి మభ్యపరచుటకు సిద్ధంగావుండి, ట్రేడ్ యూనియన్లలోవుండి, ఎన్నికష్టాలలోనైనా కమ్యూనిస్టు కార్యక్రమం సాగించాలి. సరిగా మన మెన్షివికులవంటివారైన గోంపర్సను, జోహాక్సు, హెండర్సన్సులను మనదేశంలో అవకాశవాదులైన నాయకులతో యుద్ధం చేసినట్లుగా పోట్లాడి ట్రేడ్‌యూనియన్లనుంచి తరిమివెయ్యాలి.''

లెనిన్ మరణానంతరం కోమిన్‌టర్న్ చాలా అభివృద్ధిపొంది అంతర్జాతీయఏజంట్లను ఏర్పాటుచేసింది. కాని దీర్ఘదృష్టిగలయుక్తులు; పద్ధతులన్నీమాత్రం లెనిన్ ఏర్పరిచినవే.

# క్రోన్‌స్టాట్ దుర్గము

బోల్షివిక్ విప్లవోద్యమంలో క్రోన్‌స్టాట్ దుర్గము అత్యంత గర్వకారణమైన పాత్రనిర్వహించింది.

1921 సం॥ మార్చి 1వ తేదీని క్రోన్‌స్టాట్ నావికులు తిరుగుబాటు చేశారు. అనేకమైన ఓడలనుంచీ, సైనికశిబిరాలనుంచీ 15000 మంది సభలు జరిపారు. వెంటనే క్రొత్త ఎన్నికలు జరపాలనీ, పత్రికా, వాక్స్వాతంత్ర్యంకావాలనీ, ట్రేడ్‌యూనియన్లకు కర్షకసంఘాలకు సమావేశాలహక్కు కావాలనీ. నౌకాసైన్యశాఖలలో కమ్యూనిస్టు రాజకీయ ఏజన్సీని రద్దు చెయ్యాలనీ, ధాన్యం స్వాధీనంచేసుకునే దళాలను వెంటనే రద్దు చెయ్యాలనీ, రైతులకు స్వేచ్ఛావ్యాపారము నంగీకరించాలనీ, తమ కోర్కెలను తెలుపుతూ తీర్మానాలు చేశారు.

మధ్యరష్యాలో కొన్ని రైతులతిరుగుబాట్లు, పెట్రోగ్రాడ్ మొదలైన పట్టణాలలో సమ్మెలుజరిగిన తరువాతనే క్రోన్‌స్టాట్ తిరుగుబాటుజరిగింది. పాత ముఖ్యపట్టణంలో ఆకలితో బాధపడే ప్రజలు దుకాణాలను దోచుకున్నారు.

1921 సం॥ మార్చిలో రష్యా ఆర్థికనాశనానికి అంతర్యుద్ధానికి సిద్ధపడవలసివచ్చింది. దీనిలో విదేశీయజోక్యం ఏమాత్రంలేదు. జాతీయం చేయబడిన పరిశ్రమస్తంభించింది; కార్మిక కట్టుబాట్లు పూర్తిగా నాశనమైనాయి; కార్మికులందరు పట్టణాలను విడిచిపెట్టి పల్లెలకుపోతున్నారు.

ఉత్పత్తిచేయబడిన సరుకులఖరీదు ఆకాశంవరకుపెరిగిపోయాయి 1921 సం॥ జనవరిలో ఒక బంగారు రూబులు ఖరీదు 26,529 కాగితపు రూబుల్సు అయింది. రైతులవద్దనుంచి అత్యధికంగా ధాన్యమునువసూలు చేస్తున్నారు.

"శాంతి, తిండి, భూమి" అనే నినాదాలతో లెనిన్ లోబరుచుకున్న సైనికులు, కార్మికులు, నావికులు, సామాన్యప్రజలే ఇప్పుడు సోవియట్ పాలనపై తిరుగుబాటుచేశారు.

1921 సం॥ మార్చి 5వ తేదీని క్రోన్‌స్టాట్ నావికులు 15 మందితో కూడిన విప్లవ కార్యవర్గాన్ని ఏర్పాటుచేశారు. ఈ తిరుగుబాటును అణచటానికై మాస్కోనుంచి జనరల్ ట్యుకచేవిస్కీ ప్రత్యేకరైలులో 6వ తేదీని వచ్చిచేరాడు. చెకాసైన్యాలు, కమ్యూనిస్టు సైనికులు ఇతరనమ్మకస్థుల నుంచి అతడు 60,000 మందిగల సైన్యాన్ని తయారుచేశాడు. తిరుగుబాటు నణచటానికై పెట్రోగ్రాడ్ ప్రాంతంలోని సైనికస్థావరాలలోని సైనికులందరినీ ఉపయోగించమని ఆజ్ఞాపించాడు.

కాని క్రోన్‌స్టాట్‌పైన విప్లవపతాకం ఎగిరింది. 9 మంది నావికులు, 4 మంది కార్మికులు, ఒక మగనర్సు, ఒక స్కూలుడైరక్టరుతో కూడిన విప్లవకార్యవర్గం చేతిలో అధికారమంతావుంది. ఈ కార్యవర్గపు అధ్యక్షుడు పిటిచెన్కో. పెట్రోగ్రాడ్ కార్మికులు, సైనికులు తిరుబాటులో చేరతారని క్రోన్‌స్టాట్ తలచింది. కాని జినోవీవ్ నిద్రపోలేదు. అతడు పెట్రోగ్రాడు నంతటినీ యుద్ధరంగంగా ప్రకటించి, గుంపులను చెదరగొట్టి, ప్రదర్శనలన్నింటినీ మరతుపాకులతో నాశనంచేయమని కమ్యూనిస్టు సైనికుల కాజ్ఞాపించాడు. క్రోన్‌స్టాట్‌లోని ఉద్యోగులు, నావికులువెంటనే పెట్రోగ్రాడ్‌పై దెబ్బతియ్యకపోతే వారు ఓడిపోతారని సలహాయిచ్చాడు. కాని "అనవసరంగా రక్తం ప్రవహించనియ్య"మని నావికులుచెప్పారు. "ట్రాట్‌స్కీ ప్రజారక్తాన్ని ప్రవహించునట్లు చేయదలచుకుంటే మాత్రమే తప్పక మేము నిరోధిస్తాము" అని నావికులన్నారు.

ట్రాట్‌స్కీ ఆలస్యంచెయ్యలేదు. తిరుగుబాటుదారులు వెంటనే లొంగకపోతే, వారిని ఒక్కొక్కరినే చెరువులోని బాతులను వేటాడినట్లు వేటాడతామని ప్రకటించాడు. నావికులు లొంగలేదు. మార్చి 6వ తేదీని టుకచెవిస్కీ విమానాలు ఫిన్‌లాండుతీరంపైఎగిరి క్రోన్‌స్టాట్ దుర్గాలను, ఇళ్ళను బాంబుచేశాయి. అప్పుడు కోటను ఎదుర్కోవలెనని టుకచెవిస్కీ

ఆజ్ఞాపించాడు. ఉదయమున, చీకటితోనే చెకా, కమ్యూనిస్టుసైన్యాలు బైలుదేరాయి. మంచుతో కలిసిపోయేలాగ, కమ్యూనిస్టుసైనికులు తెల్లని దుస్తులు ధరించారు. వారివెనుక ఏరికూర్చిన రెడ్‌సైన్యాలు, తరువాత చెకా మరఫిరంగులదళం నడిచాయి. టుకచెవిస్కీ ఫిరంగులకు నావికులు కోటలోను, ఓడలలోనున్న ఫిరంగులతోనే సమాధానం ఇచ్చారు. దగ్గిర నున్న పట్టణమైన ఓరనీన్బామ్‌లోనున్న రెడ్‌సైన్యాలు నావికులపై యుద్ధం చేయటానికి నిరాకరించి, తిరుగుబాటుచేశాయి. చెకాదళాలు ఆ ప్రాంతానికి పోయి ప్రతీ అయిదవసైనికుణ్ణి పేల్చివేశారు.

క్రోన్‌స్టాట్ నావికుల ధైర్యస్థైర్యాలనుచూసి టుకచెవిస్కీ భయపడి, వెంటనేబోల్షివిక్‌పార్టీ నాయకులు యుద్ధరంగానికివచ్చి సైనికులకుధైర్యోత్సాహాలు కలిగించాలని తెలియచేయవలసివచ్చింది. మాస్కోనుంచి కమ్యూనిస్టుపార్టీ 10వ కాంగ్రెసు వెంటనే 300 పెద్దనాయకులను యుద్ధరంగానికి పంపించింది. 1921 సం॥ మార్చి 8వ తేదీని అదే కాంగ్రెసుసభలో లెనిన్ తన ఉపన్యాసంలో ఇల్లాచెప్పాడు: "క్రోన్‌స్టాట్‌నుంచి నాకింకా తాజావార్తలురాలేదు. కాని ఈ తిరుగుబాటు మరికొద్దిరోజులలోనో, కొద్ది గంటలలోనో అణచివేయబడుతుంది. దీనికేమీ సందేహంలేదు."

మార్చి 16వ తేదీని టుకచెవిస్కీ తన సైన్యాలతో కోటను ముట్టడించటానికి వ్యూహాలుపన్నాడు. ఆసమయంలోనే అతని సైన్యాలు బాంబులవర్షంతో ముంచెత్తివేశాయి. యుద్ధనౌకలు బలంగా ఎదిరించాయి. మరునాడు సాయంత్రం ఉన్నవిమానాలన్నీ కోటపై బాంబులవర్షం కురిపించేటట్లు ఏర్పాటయింది.

ట్రాట్‌స్కీ అతనిమాటను నిలబెట్టుకున్నాడు. మార్చి 17వ తేదీని క్రోన్‌స్టాట్ నిశ్శబ్దంగావున్నదని టుకచెవిస్కీ మాస్కోకు వార్తపంపించాడు. అచ్చటి వీధులలో వేలాదినావికులు, సైనికులు పీనుగు పెంటలైపడివున్నారు.

కొందరు నావికులు ఫిన్లాండుకి పారిపోగలిగారు. కాని వారిలో చాలామందిని జీవాలతో బంధింపబడి చెకాదళాలచేత కాల్చివేయబడ్డారు. మిగిలినవారు దూరప్రాంతాలలోని ఖైదులకు పంపించబడ్డారు.

* * *

క్రోన్‌స్టాట్‌లో ఇంకా ఫిరంగిధ్వనులు ప్రతిధ్వనిస్తున్నప్పుడే, బోల్షివిక్‌పార్టీ అధికారం నిలబడాలంటే ఇంకా రాజీచేసుకోవాలని లెనిన్ గ్రహించాడు. వామపక్షీయులంగీకరించపోయినా, 1921 సం॥ వసంతకాలంలో అతడు నూతన ఆర్థికవిధానమును ప్రవేశపెట్టాడు. దీనితో సోవియట్ పారిశ్రామికవేత్తలకు, టెక్నీషియన్లు కమ్యూనిస్టుసూత్రాలకంటె ఆర్థిక స్తోమతుకే ఎక్కువప్రాధాన్యం ఇచ్చారు. కార్మికులకు వారివారి పనినిబట్టి జీతాలిచ్చారు.

1921 సం॥ అక్టోబరుమాసంలో మాస్కో కమ్యూనిస్టు సంస్థల కాన్ఫరెన్సులో మాట్లాడుతూ, ఈ సమయంలో కమ్యూనిజమును ప్రవేశపెట్టుట చాలాపొరపాటయిందని లెనిన్ స్పష్టంగా అంగీకరించాడు. రైతులు కార్మికులకు కావలసినతిండిని సప్లయిచేయలేకపోయినందుచేతనే తాను సరియైనకమ్యూనిస్టు సూత్రాలతో రాజీపడవలసి వచ్చిందని అతడు చెప్పాడు. ప్రయివేటుశక్తులను ముందుగా వ్యవసాయంలోను, అటుతరువాత చిన్నపరిశ్రమలలోను ప్రవేశపెట్టాలని సిఫార్సుచేశాడు. ప్రాథమిక పరిశ్రమలు, రవాణా, విదేశవ్యాపారం మాత్రం ప్రభుత్వాధీనంలోనే వుంటాయి. అందుచేత నూతన ఆర్థికవిధానంవలన ధనికవర్గాలు తలయెత్తటానికి వీలులేదని అంచనావేశాడు. ఈ క్రొత్తవిధానానికి లెనిన్ "ప్రభుత్వ కాపిటలిజం" అని పేరుపెట్టాడు.

ఒక సంవత్సరంతర్వాత ఈ నూతన ఆర్థికవిధానం సోషలిజానికి దారితీస్తున్నదని లెనిన్‌కు బాగానమ్మకంకలిగింది.

"ఇంక సోషలిజం ఎప్పుడో ముందురాబోయేదికాదు. సోషలిజాన్ని మనం ప్రతిదిన జీవితంలో ప్రవేశపెట్టాం. సమస్య ఎంతకఠినమైనా, ఎన్ని అవాంతరాలువచ్చినా, ఎన్నికష్టాలున్నా ఏమీఫరలేదు. కాని దానిని

బట్టిమనం రేపేకాకపోయినా,మరికొన్ని సంవత్సరాలలో,నూతనార్థికవిధానవ్యవస్థ సంపూర్ణంగా సోషలిస్టువ్యవస్థగా మారిపోతుందని ధైర్యంగా చెప్పవచ్చు" అని లెనిన్ చెప్పాడు.

తరువాత కొన్నాళ్లకే అతనికంత నమ్మకం లేకపోయింది.

"మనం ఇంకా సోషలిస్టు ఆర్థికవిధానానికి పునాదికూడా పూర్తి చేయలేదు. చచ్చిపోతూన్న ధనికవర్గశత్రువులు మనదగ్గరనుంచి అంతా తీసుకుపోవచ్చు. కేవలం ఊహలు అపాయకరమైనవి. కనుక ఈ విషయం మనం బాగా అర్థంచేసుకుని అంగీకరించాలి. ఈ సత్యాన్ని గ్రహించినంతమాత్రాన్ని మనం అధైర్యపడి కంగారుపడనక్కరలేదు. సోషలిజం జయంపొందాలంటే అనేక అభివృద్ధికర దేశాలలోని కార్మిక శక్తులు సమైక్యంకావాలని మనమెల్లప్పుడూ నేర్పుతూ, బోధించాము." అన్నాడు లెనిన్.

1921 సం॥ వేసవికాలంలో నూతనార్థికవిధానదృష్ట్యా అనుసరించవలసిన నీతినిగూర్చి తెలియచేయుటకై కోమిన్టర్న్ యొక్క మూడవ కాంగ్రెసుకు లెనిన్ హాజరైనాడు. ప్రపంచవిప్లవానికి నూతన ఆర్థికవిధానం అవసరమని విదేశప్రతినిధులకు తెలియచెప్పాడు.

"మనం జోస్యంచెప్పిన అంతర్జాతీయవిప్లవం అభివృద్ధిపొందుతూంది. కాని ఈఉద్యమాభివృద్ధి మనం అనుకున్నంతగాలేదు....ప్రస్తుత పరిస్థితులనుబట్టి, మనకున్న ఈఅవకాశమును సక్రమంగా వినియోగించుకోవాలి."

1918 సం॥ నుంచి రైతులవిషయంలో అనుసరింపబడిన కమ్యూనిస్టు విధానంవల్ల కలిగిన పంటలనష్టము, రిజర్వుసప్లయిలు లేనందువల్లను కలిగిన కరువునుంచి రక్షించటానికి ఈ ఆర్థికవిధానం సకాలంలో రాలేదు. సోవియట్ అధికారలెక్కలనుబట్టి 1921-22 సంవత్సరాలలో కరువువలన 5,000,000. మంది ప్రజలు మరణించారు.

రైతుల తిరుగుబాట్లు, పారిశ్రామికసమ్మెలు, క్రోన్‌స్టాట్ తిరుగుబాటుల మూలంగా లెనిన్ రష్యా ఆర్థికవిధానమును మార్చుకున్నప్పటికీ, రాజకీయ మార్పులనుమాత్రం చేయలేదు. రాజకీయ వ్యతిరేకులను నిర్దాక్షిణ్యంగా అణచివేశారు. మెన్షివికులకు సోషలిస్టు రివల్యూషనరీలకు ఖైదులే శాశ్వతస్థానాలు.

లెనిన్‌యొక్క రాజకీయ పోలీసుశాఖను బహుముఖాల అభివృద్ధి చేసి కుట్రలను అణచివేశారు. లెనిన్ విధానాలనుగూర్చి విమర్శలేకుండా ఇనుపసెన్సార్షిప్పు ప్రవేశపెట్టారు. పత్రికలు, రేడియో, సినిమా, రంగస్థలము ప్రభుత్వప్రచారకసాధనాలుగానే ఉపయోగించబడుట చరిత్రలో ప్రథమంగా ప్రారంభమైంది. ఎక్కువ వేతనాలకు పరిస్థితులకు బేరమాడటానికి ట్రేడ్‌యూనియన్లకు అధికారంపోయింది. జారుప్రభుత్వంలో కంటెకూడా జైళ్ళు యుద్ధఖైదీకేంద్రాలు పూర్తిగా నిండిపోయాయి. రష్యాప్రజల నిజమైన ఆఖరి తిరుగుబాటుకి క్రోన్‌స్టాట్ స్మారక చిహ్నంగా మారింది. ఇకమీదట లెనిన్ నియంతృత్వం స్థిరపడింది. కార్మిక కర్షకరాజ్యం స్థిరస్వరూపం దాల్చింది.

## నిగర్వియైన నియంత

"నేను బోల్షివిక్‌పార్టీ ని స్థాపించాను. నవంబరు విప్లవానికి నాతెలివే మూలం. అనేకసార్లు మన పార్టీ అధికారం పతనమౌతున్న సమయంలో నాయొక్క ధైర్యమైన ఆలోచనలతోనూ, 1918 సం॥ లో ప్రజలకిష్టంలేని సంధిపత్రంమీద సంతకంచేసి, 1921 సం॥ లో నూతన ఆర్థికవిధానమును ప్రవేశపెట్టి, అనేకపర్యాయములు దానిని నేను రక్షించాను. నేను కోమిన్‌టర్నును సృష్టించి, బోల్షివిజమును ప్రపంచమహాశక్తిగా తయారుచేయగల విప్లవసూత్రాలను, ఉపాయాన్ని దానికిచ్చాను." అని లెనిన్‌చెప్పినట్లయితే అదంతా నిజమైనదే. కాని అతడెన్నడూ చెప్పలేదు. చరిత్రలో ఏనియంతకూడా ఇంత నిగర్వంగాఉండలేదు. నిజానికి అతనిచుట్టూవుండే అనుచరులు అతనిని పెద్ద అందలంమీద కూర్చోపెట్టాలని చేసిన ప్రయత్నాలకు లెనిన్ చాలా ఏవగించుకున్నాడు.

అతనికేదైనా ఇతరదేశభాష వచ్చునా అనే కోమింటర్ను చేసిన ప్రశ్నకు సమాధానంగా అతడు 'ఏదీరాదు' అని జవాబువ్రాశాడు. కాని కోమింటర్ను మూడవకాంగ్రెసుసభలో అతడు జర్మనీభాషలో, అప్పుడప్పుడు సరియైమాటలకు తడుముకుంటూ, ఉపన్యసించాడు. "నీయొక్క ప్రత్యేకతలేమిటి?" అని 1921 సం॥లో 10వ పార్టీ కాంగ్రెసు ప్రశ్నావళిలో వుంది. "ఏమీలేవు" అని లెనిన్ దానికి సమాధానంఇచ్చాడు.

శిల్పచిత్రకారుడైన నాదన్ ఆల్ట్‌మన్ (Nathan Altman) అతని శిల్పచిత్రమునకై ఒక పోజు (Pose) ఇమ్మన్నాడు. కాని అది అస్వభావికంగా వుంటుందని అతడు తిరస్కరించాడు.

వ్యక్తికి, రాజకీయనాయకునికి తారతమ్యమునుగూర్చిన విమర్శలో కలిగినచిక్కును మాక్సిమ్‌గోర్కీ విడదీయలేకపోయాడు.

"జూదం ఆటలోఉన్న సరదా లెనిన్ జీవితంలో ఒకభాగం. కాని ఈజూదవువ్యసనం కేవలండబ్బు సంపాదించుటకొరకుకాదు. దీనివల్ల ఒక సమస్యనుగూర్చి ఆలోచించేటప్పుడు, వ్యక్తికి తన ఆత్మశక్తిలోనున్న దృఢనమ్మకమును, ప్రపంచంలోని ఇతరపరిస్థితులతో ఆతనికిగల బాధ్యతాయుతసంబంధమును, ప్రపంచంలో తాండవిస్తున్న అయోమయ వాతావరణంలో తాను నిర్వహించవలసిన పాత్రనుమాత్రమే ఇది సూచిస్తుంది.

"సోక్రటీస్‌నుపోలిన ముఖలక్షణాలు, ఇతరఆకారసదృశాలు, వికృతమైన కొన్నిఅలవాట్లుకలిగి ఎప్పుడూ సౌఖ్యానందం వెల్లివిరుస్తూంటాడు. అధికారశక్తియుక్తులను ప్రసరించే అతనిదృక్కులు, గంభీరమైన వాక్చాతుర్యానికి కళలు దిద్దుతుంటాయి."

అయినప్పటికీ లెనిన్ తన రాజకీయవిరోధులపై అభాండాలను విసరటంలో మొనగాడు. ఒకనాడు పెట్రోగ్రాడ్ నావికులు, సైనికులు అల్లకల్లోలపు సమయంలో సారాదుకాణాలలోదూరి అల్లరిచేసినప్పుడు, ఇది కాన్‌స్టిట్యూషనల్ డెమొక్రటిక్‌పార్టీ యొక్క కేంద్రకమిటీయే చేయించినదని అతడు ఆరోపించాడు. రాజకీయవిరోధులను ప్రజలదృష్టిలో

చేజిక్కించుకోడం మొదటిది; దానిని నిలబెట్టుకోడం రెండవది. ప్రజా స్వాతంత్ర్యాలను అణగద్రొక్కి, భయభ్రాంతులుగా చెయ్యటమే సరియైన మార్గాలు. అతని పరమలక్ష్యం—వర్గరహితసమాజం—ఎప్పుడో ఒకనాడు సిద్ధిస్తుంది.

అతడు నిర్మించిన ప్రభుత్వము, ప్రభుత్వవిధానములు నిలబడి వుంటాయని అతడు తన అత్యంతదశలో అనుకున్నాడో లేదో ఆధారం లేదు. ప్రపంచ రాజకీయాలన్నీ సోవియటిజమునకు, కాపిటలిజానికిజరిగే నిరంతరసంఘర్షణమే అనుకున్నట్లయితే, ప్రపంచవిప్లవవిజయం చేకూరే వరకూ, సంఘంఎల్లప్పుడూ యుద్ధప్రక్రియలోనేవుండాలని అతనిఆశయం.

మార్క్సుసూత్రాలను అతిగా క్లుప్తంచేసి, ధనికప్రజాస్వామ్యం ఇచ్చిన అధికారములను అతడునమ్మలేదు. సోవియట్‌ప్రభుత్వం స్థాపన యైనతరువాతనే అతడు తన అధికారమును సుస్థిరంచేసుకోటానికి క్రమ క్రమంగా రాజకీయ స్వాతంత్ర్యమును నాశనంచేశాడు.

## టెస్టమెంటు

1921వ సం॥ ఆఖరుకి లెనిన్‌యొక్క ఆరోగ్యం చెడిపోయింది. అతడు పనిచేస్తున్నప్పుడు ఒక్కొక్కసమయంలో తలను నొక్కిపట్టుకుని చాలా నిమిషాలు కదలకుండా కూర్చుంటాడు. అతనికి నిద్రపట్టకపోటం అధికమై, నీరసంకూడా హెచ్చినట్లుచెప్పాడు; తలనొప్పి తరుచుగావస్తుం డేది. 1922 సం॥ ప్రారంభంలో అతనికి తలదిమ్మెక్కేజబ్బు అధికమై ఆసమయంలో క్రిందపడిపోకుండా దగ్గిర ఏవస్తువుంటే దాన్ని పట్టుకో వలసిన అవస్థకలిగేది.

డిశంబరు ప్రారంభంలో, పోలిట్‌బ్యూరో సభ్యులకివిధంగా ఒక చీటీవ్రాసి గోర్కీగ్రామంలోని తనగృహానికి వెళ్ళిపోయాడు.

"నేను నాపనిని తగ్గించి, విశ్రాంతిని అధికంచేసినప్పటికి నాకు నిద్రాభంగంజబ్బు చాలా అధికమైంది. పార్టీకాంగ్రెసుకుగాని, సోవియట్ల

కాంగ్రెసుకుగాని హాజరుకాలేనేమోనని భయంగావుంది.''అతనిగోర్కీగ్రామం నుంచే అతడు సోవియట్ విధానాలను నిర్ణయించేవాడు. విదేశకమిస్సార్ అయిన చిచేరిన్ ఐరోపా, అమెరికాలనుంచివచ్చే ఆర్థిక ''నష్టపరిహారాల''దృష్ట్యా, రాజ్యాంగంలో కొన్నిమార్పులు చెయ్యాలని సూచించినప్పుడు లెనిన్ కోపంగా సమాధానంఇచ్చాడు: ''చిచేరిన్‌నువెంటనే ఆరోగ్యకేంద్రానికి పంపించాలని అనుకుంటాను. దీన్నిగురించి అశ్రద్ధచేయకూడదు.''

1922 సం॥ మార్చిలో జరిగిన 11వ పార్టీకాంగ్రెసే అతడు హాజరైన కడసారిసభ. ఈసభ తరువాతనే సెంట్రల్ కేంద్రకార్యవర్గం కమిటీ, స్టాలిన్‌ను (Stalin) కమ్యూనిస్టుపార్టీ జనరల్ శక్రటరీగా ఎన్నుకోటం జరిగింది.

లెనిన్‌ను పరీక్షించటానికి జర్మనీ, రష్యాలలోనున్న ఘనవైద్యులను రప్పించారు. 1922 సం॥ మార్చినెలలో అతని నరములలో జబ్బున్నట్లు గ్రహించలేదు. కాని మే ప్రారంభంలో అతడు మొట్టమొదటి నరబాధను అనుభవించాడు. కొంతకాలం అతనికి మాటపోయింది. కుడికాలు, చెయ్యి కదల్పలేకపోయాడు. కొన్నివారాలలోనే అతనికి మాట, నడకపోయాయి. తరువాత ఒక్కొక్కసారి గంట రెండుగంటలు అవస్థపడే నరాలబాధ అనుభవించేవాడు. తరువాత అతనికి కొంతస్వస్థత కలిగింది. ఇది అతని కంత్యదశయేమోనని డాక్టర్లను లెనిన్అడిగాడు. అదే అయితే అతడు కొన్ని కడసారిఆజ్ఞలు ఇవ్వవలసివుంది. ఇది ఇంకా కడసారిసమయం కాదని డాక్టర్లు ధైర్యంగాచెప్పారు. కాని ఇప్పుడు లెనిన్ కాలు, చెయ్యిలేనివాడు. కాని అతని తెలివికి ఏమీలోపం జరుగలేదు. అయినా అతడు సంజ్ఞచేతకూడా తనభావాలను సరిగా వ్యక్తంచేయలేకపోతున్నాడు.

లెనిన్‌కి అతనిసోదరి మేరియా ఉపచారంచేసింది. అతనిభార్య క్రుప్స్కయా అతనికి ఎడమచేతితో వ్రాయడం, మాటలను స్పష్టంగా పలకడంనేర్పింది.

సాటిలేని అతని ఆత్మశక్తితో లెనిన్ దేహం మామూలుస్థితికివచ్చింది. అతని బుద్ధిశక్తి యథాతథంగావచ్చింది. శీతకాలపు రాత్రులందు అతడు మందంగావుంటాడు. అటువంటి సమయాలలో అతడు సంగీతం వినాలని కోరేవాడు. పియటకోవ్ అనేప్రఖ్యాత పియానోవాయిద్యగాడు రకరకాలైన పాటలు వాయించేవాడు. అతడు సంగీతం వాయించేసమయాలలో లెనిన్ పూర్తిగా మారిపోయి, శాంతంగా, చిన్నపిల్లవానివలెవున్నట్లు పియటకోవ్ చూశాడు. సాధారణంగా అతనికళ్లలోవుండే జిత్తులమారిచూపు మాయమైపోయేది.

జులైనెలలో లెనిన్ మళ్ళీ తన కాళ్లపై తాను నిలబడ్డాడు. అప్పుడే సోషలిస్టురివల్యూషనరీ పార్టీసభ్యుల విచారణప్రారంభమైంది. ప్రభుత్వ సభ్యులపై దౌర్జన్యచర్యలుచేశారనీ, 1918 సం॥ లో సోవియట్ అధికారంపై తిరుగుబాటుచేశారనీ వారిపై నేరారోపణజరిగింది. అప్పట్నుంచీ కొందరు నాయకులు జైలులోవున్నారు. సోవియట్ ట్రిబ్యునల్ వారికి ఉరిశిక్ష వేసినప్పుడు, ప్రపంచంలోని సోషలిస్టులు, కొందరు కమ్యూనిస్టు పార్టీసభ్యులు, మాక్సిమ్‌గోర్కీ, నిరసనతెలిపి తీర్పును రద్దుచెయ్యాలని కోరారు. బోల్షివిక్‌నాయకులు కొందరు నేరస్థులను, రూపుమాపాలనీ, ఇతర జర్మనీకమ్యూనిస్టులు వారిపై ఉదారబుద్ధి చూపించి, ఉరిశిక్షను ఖైదుగా మార్చాలనీ, లేకపోతే విదేశాలలో ప్రభుత్వానికి అపఖ్యాతివస్తుందనీ పట్టుబట్టారు. లెనిన్ రెండుకోర్కెలనుకూడా పాటించలేదు. ఖైదువారికిసరిపోదు; మరణదండన తిరుగుబాట్లకు దారితీస్తుంది. అందుచేత ఇకముందు ఎన్నడూ సోవియట్ నాయకులపై అఘాయిత్యాలు జరుగకుండా వారిని శాశ్వతంగా తాకట్టు ఖైదీలుగా ఉంచటానికి నిశ్చయించాడు. నిజానికిది అనుమానంగావున్న ఉరిశిక్షయే. ఇట్లు శిక్షింపబడిన సోషలిస్టురివల్యూషనరీ నాయకులు స్టాలిన్‌చేత ఉరితీయబడేవరకూ, అనేక సంవత్సరాలు ఖైదులలో వున్నారు.

ఈ సోషలిస్టు రివల్యూషనరీ నాయకులవిచారణ సందర్భంలో లెనిన్ న్యాయశాఖ కమిసార్‌అయిన డి. ఐ. కురిస్కీకి ఒకఉత్తరంవ్రాశాడు.

1922 సం॥ మే నెలలో సమాలోచనలోవున్న సోవియట్ క్రిమినల్‌కోడ్ సందర్భంలో ఇది వ్రాయబడినది.

"నాఅభిప్రాయంలో తుపాకీతో పేల్చేమరణదండనను, మెన్షివికులు సోషల్ రివల్యూషనరీలు, మొదలైనవారందరి చర్యలన్నింటికీ వర్తింప చెయ్యాలి. ఈ చర్యలు అంతర్జాతీయధనికవర్గానికి, మనపైవారిపోరాటానికీ సంబంధించినవే అని నిరూపించటానికి తగినట్లుగా ఒక సూత్రాన్ని తయారు చెయ్యాలి."

ఈ ఉత్తరం ఏవిధంగా ఉపయోగింపబడుతుందో అతడుముందుగా గ్రహించియుండకపోవచ్చు. రడెక్, సోకోల్నికోవ్ మొదలైన బోల్షివికులను విచారించేముందుగా దీనిని, 1937 సం॥ జనవరి 15వ తేదీని మాస్కో బోల్షివిక్ పత్రికలో ప్రకటించారు.

లెనిన్ను తిరిగి మాస్కోకు తీసుకురావటానికి తగినంతగా అతడు ఆరోగ్యం పొందాడు. అతడు వారానికి రెండురోజులు విశ్రాంతి తీసుకునే షరతుపైన 11 గం॥ నుంచి, 2 గం॥ వరకు, 6 గం॥ నుంచి 8 గం॥ వరకుమాత్రమే పనిచేయటానికి డాక్టర్లు అంగీకరించారు. అతడు తిరిగి పోలిట్‌బ్యూరో, సోవ్నార్కంసభలలో అధ్యక్షతవహించుట, టెలిఫోనులోను, చూడవచ్చినవారితో గంటలతరబడి మాట్లాడుట, ఉత్తరాలు, వ్యాసాలు చెప్పుట, ఇతరదేశాలలోని కమ్యూనిస్టు ఏజంట్లకు రహస్యసలహాల నిచ్చుట ప్రారంభంచేశాడు. అతడు కోమిన్టర్న్ నాల్గవ కాంగ్రెసుకు హాజరుకావటానికి సిద్ధపడ్డాడు. అతని మామూలు అనుచర బృందంతో అతడు హాలులోనికివచ్చి వేదికవద్దకు తిన్నగావెళ్ళాడు. విదేశాల కమ్యూనిస్టులను ఎక్కువఉత్సాహంగా వుండాలనిచెప్పి, వారికి సోవియట్ ప్రోత్సాహమును వాగ్దానంచేశాడు.

"మామీద ఆధారపడండి. మాకు వెడల్పైన భుజాలున్నాయి. మీరు బలకరంగా తయారవండి. త్వరలోనే యుద్ధమువస్తుందనుకోకండి. బలమును కూర్చుకుని అవసరమైనప్పుడు ధనికవర్గాన్ని కొట్టండి. మీకు విజయం ఖాయమైనప్పుడు సరిగా గుండెలమీదనే కొట్టండి."

అతని ఉపన్యాసం మధ్యలోనే అతనికి నీరసంవచ్చింది, అతని స్వరం తగ్గింది; ముగించేసరికి అతనికి ముచ్చెమటలు పోశాయి. క్లారా జెట్కిన్ (Clarazetkin) లెనిన్ దగ్గరకిపోయి అతని చేతిని ముద్దుపెట్టుకున్నాడు. లెనిన్ విజయోపేతంగా స్వీకరించాడు.

అతనికి పరిచర్యచేసిన నర్సు ఫోటీవా (Foteiva) అతని అస్వస్థకాలంలో జరిగిన సంగతులన్నీ రికార్డుచేసింది. నవబందు 25వ తేదీని "ఈవేళ డాక్టర్లు పూర్తి విశ్రాంతి తీసుకోమన్నారు." అని వ్రాసింది.

ఆ రోజునుంచి లెనిన్‌యొక్క నిత్యదినచర్య ఆగిపోయింది. అతడు ఆఫీసుకి సరిగావెళ్లలేదు. ఎక్కువమంది జనులను చూడలేదు. ఇదివరకుకంటె ఇప్పుడతడు అధికంగా చదువుతుండేవాడు.

1918 లో చెప్పినట్లుగా లెనిన్ ఇప్పుడు సోషలిజం 'కార్యరూపం దాల్చింది' అని చెప్పటంలేదు. "దీనికి వ్యతిరేకంగా ప్రాపంచిక, ఆర్థిక, పారిశ్రామికంగా మనమంతా సోషలిజం ప్రారంభదశకైనా వచ్చామా?" అని అతడు ఆశ్చర్యపోయాడు.

ప్రత్యేకవ్యక్తుల వ్యాపారమును అభివృద్ధిచేయుట, తెలివితక్కువ, ఆత్మహత్యాకరమైనదని ప్రకటించాడు. "వ్యాపారము నేర్చుకోండి" అని చెప్పి పురాతన కమ్యూనిస్టులను ఆశ్చర్యపరచాడు. లెనిన్ ధనికవ్యవస్థను పునర్నిర్మాణంచేస్తూ రుబులును సుస్థిరంచెయ్యటంలో మనం కృతకృత్యులమైతే మనం జయించినట్లే" అన్నాడు.

ఇకముందు నిర్బంధసమిష్టివ్యవసాయమును, సామాజిక పద్ధతిలో భూమి దునేపద్ధతిని అతడు ఏర్పాటుచేయదలచుకోలేదు. "సమిష్టివ్యవసాయ కేంద్రాల విషయంలో మనం చాలా తెలివితక్కువలు చేశాం. సమిష్టి వ్యవసాయం ప్రస్తుత సమయానికి తగదు. మనం ప్రత్యేక వ్యక్తులైన రైతులపై ఆధారపడాలి; అతడుమునుపున్నట్లేవున్నాడు. ఇకముందు అతడు మారిపోవటంలేదు. కర్షకులు సోషలిస్టులుకారు; వారు సోషలిస్టులనుకుని సోషలిస్టుప్లానులను ఆ దేవిధంగా తయారుచేయడం, ఇసుకపైఇల్లు

కట్టడంవంటిది. కర్షకుల మానసిక తత్వమును, అలవాట్లను మార్చటానికి కొన్నితరాలుపడుతుంది. దౌర్జన్యం ఉపయోగపడదు. కర్షకులను నీతియుక్తంగా తయారుచేయుటయే మనవిధి. మధ్యరకపు రైతుకు మనం ప్రతిఫలం ఇవ్వాలి. మన ఆర్థిక పునస్సృష్టిలో శక్తిమంతుడైన కర్షకుడే కేంద్రవ్యక్తి కావాలి.''

1922 సం॥ డిశంబరు నెలలో మళ్ళీ లెనిన్ ఆరోగ్యానికి పెద్ద దెబ్బ తగిలింది. ఈసారి ఎక్కువ ఉధృతంగావచ్చింది. కాని శక్తి సామర్థ్యాలతో దాన్నిపోరాడి, లెనిన్ స్వస్థత సంపాదించకలిగాడు.సంపూర్తి విశ్రాంతి తీసుకోవాలని అతని వైద్యులు సలహానిచ్చారు. ఒక నెలతరువాత సోవియట్ ఆర్థికవిధానంలో కోపరేటివుల పాత్రనుగూర్చి వ్యాసం వ్రాయటం ఆరంభించాడు. ఉత్పత్తివిధానం సమాజస్వాధీనంలో వుంచుకున్న నాగరీక కోపరేటర్ల విధానమే సోషలిజం'' అని అతడు వ్యాఖ్యానించాడు. దీనితోపాటుగానే, ''రష్యాలోని రాజకీయ, సామాజిక విప్లవం, నాగరిక విప్లవానికి తరువాత వచ్చింది.'' అని అతడు చెప్పాడు. ఇప్పుడు సామాన్యప్రజాళిలో నాగరికతను పెంపొందించటానికి అధికంగా శ్రద్ధ వహించాలి. సోషలిజానికి మార్పుజరిగేముందు భావాలు, నాగరికత పూర్తిగా మారాలి, అన్నాడు లెనిన్. కాని ఒకనెలతరువాత ''మనం ధనిక నాగరికతతో ప్రారంభించవచ్చు'' అనడం అందరికి ఆశ్చర్యంవేసింది.

ఇవే అతని ఆఖరివ్యాసాలు: డిశంబరు 12వ తేదీని అతనిజీవితానికి ఆఖరిసారిగా అతడు టేబిలువద్ద కూర్చున్నాడు.

డిశంబరు 16వ తేదీని సోవియట్ కాంగ్రెసులో ఉపన్యసించాలనే ఉద్దేశ్యమును విరమించుకున్నాడు. కారులో తన గ్రామానికి వెళ్లడమే చాలా కష్టంగావుంటుంది కనుక పట్టణంలోనే ఉండాలనికూడా ఆదే రోజున అతడు నిర్ణయించాడు.

త్వరలోనే అతనికి మళ్ళీ జబ్బుచేసింది. ప్రజలతో ఏవిధమైన సంబంధం లేకపోయేవరకు అతడు శాయశక్తులా పనిచేస్తూనేవున్నాడు.

జనరల్ శక్రట్రరీగాను, కార్మిక కర్షకుల కమిసార్‌గాను స్టాలిన్ ఉద్యోగం స్వీకరించిన రెండుమాసాలకు, 1922 సం॥ జూన్ 4వ తేదీ ప్రావ్దాపత్రికలో లెనిన్ జబ్బును గూర్చి ప్రకటించారు. క్రమక్రమంగా లెనిన్ రాజకీయరంగంనుంచి విరమించినకొలదీ అధికారంకొరకై, జినోవీవ్, ట్రాట్‌స్కీ, స్టాలిన్‌లమధ్య, పోటీ బయలుదేరింది. పెట్రోగ్రాడ్ సోవియట్‌కు, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు జినోవీవ్ అధ్యక్షుడు; ట్రాట్‌స్కీ మిలిటరీ రివల్యూషనరీ కౌన్సిలుకు అధ్యక్షుడుగను, యుద్ధ కమిసార్‌గాను వున్నాడు; స్టాలిన్ పార్టీ జనరల్ శక్రటరీ.

లెనిన్ తనఅధికారమును విడిచిపెట్టగానే నాయకత్వం వీరిముగ్గురి పైనపడింది. 1923 సం॥ ఏప్రిల్ నెలలో స్టాలిన్, జినోవీవ్‌లమధ్య అధికారం చేజిక్కించుకోటానికై అంతర్యుద్ధం జరిగింది. ట్రాట్‌స్కీ వీరికి వ్యతిరేకంగా ప్రచారంఆరంభించాడు. రివల్యూషనరీకౌన్సిలు అధ్యక్షపదవి కేవలం గౌరవపదవి. కనుక అతనికి పార్టీలో ముఖ్యమైన పనినేమీ ఇవ్వటంలేదు. 1923 సం॥ బోల్షివిక్ కాంగ్రెసులో తన శక్తిసామర్థ్యాలను పూర్తిగా ఉపయోగించుకోటంలేదనీ, అతన్ని త్రోసిరాజంటున్నారనీ సూచన చేశాడు.

కొంతకాలం పోలిట్‌బ్యూరోలో జినోవీవ్ తిరుగులేనిఅధికారం వహించాడు. సెంట్రల్‌కమిటీలో అతనికి మెజారిటీవుంది. జినోవీవ్ అధికారంలో తమతమ పలుకుబడిని హెచ్చించుకోవచ్చునని సభ్యులంతా భావించారు. లెనిన్‌కాక, పోలిట్‌బ్యూరోలోనున్న ఆర్గురు సభ్యులూ ట్రాట్‌స్కీకి వ్యతిరేకులే. అందుచేత జినోవీవ్, కామెనోవ్, బుఖారిన్‌లు ముగ్గురు ఒకవర్గంగా ఏర్పడిస్టాలిన్‌కంటె మెజారిటీగావున్నారు. కాని నాయకత్వానికి పార్టీకాంగ్రెసును స్వాధీనంచేసుకోగలిగివుండాలి. కనుక జినోవీవ్‌ను నాయకునిగా చేయటానికి సెంట్రల్‌కమిటీగాని, పోలిట్‌బ్యూరోగాని ఎన్నడూ ఆలోచించలేదు. ఇక్కడే స్టాలిన్ పెద్దరికం సంపాదించాడు. క్రమంగా అతడు తన అనుచరులను పార్టీసంస్థలన్నింటికి శక్రటరీలుగా వేసి, పార్టీ యంత్రాంగాన్ని తనచేత జిక్కించుకున్నాడు.

1922 సం॥ అంతానికి, లెనిన్ పరిస్థితిపై ఇంక నిరాశచేసుకోవలసిందేనని నిశ్చయంకాగానే ప్రభుత్వవిధానంలో స్టాలిన్ కొన్నిమార్పులను చేయడం ఆరంభించాడు. రాబోయే కాంగ్రెసుకు బ్రహ్మాండమైన ఏర్పాట్లను చేసినట్లుగా స్టాలిన్ నిరాకరించలేదు. "గత ఆరు సంవత్సరాలుగా, కాంగ్రెసుకు సెంట్రల్‌కమిటీ ఇప్పుడుచేసినన్ని ఏర్పాట్లు ఎన్నడూ చేయలేదు" అన్నాడు స్టాలిన్.

1923 సం॥ జనవరిలో చనిపోతానని తెలుసుకొని లెనిన్, ఒక "రాజకీయవిల్లు"ను (Political Testament) వ్రాశాడు. దానిలో బోల్షివిక్‌నాయకులనుగూర్చి వ్రాస్తూ లెనిన్ తరువాత అధికారంవహించగల నాయకునికొరకై ప్రయత్నాలుచేశాడు. అతనివిల్లులో, నాయకత్వమును స్టాలిన్, ట్రాట్‌స్కీలు సమంగాఉంచుకోవాలనీ, ఈకలయిక అసంభవమని తెలిస్తే పార్టీలోనే విభేధాలువస్తాయనీ, ఈ పరిస్థితులకు దారితీస్తాయనే భయంతో, స్టాలిన్‌ను కమ్యూనిస్టుపార్టీ శక్రటరీపదవినుంచి తొలగించాలనీ లెనిన్ సూచించాడు.

లెనిన్ అతనివిల్లులో (Testament) ఇల్లావ్రాశాడు:—

"కామ్రేడ్ స్టాలిన్ జనరల్‌శక్రటరీపదవి నధిష్టించడంతో అమితమైన అధికారం అతని హస్తగతమైంది. కాని దానినతడు తగుజాగ్రత్తతో ఉపయోగించగలడని నాకు నమ్మకంలేదు. అంతకంటె, రహదారులకమిసార్ ఆఫీసువ్యవహారంలో సెంట్రల్‌కమిటీతో పోరాటం సందర్భంలో తనశక్తిసామర్థ్యాలను నిరూపించుకున్న కామ్రేడ్ ట్రాట్‌స్కీ- ఇప్పుడున్న సెంట్రల్‌కమిటీలో వున్నవారిలో అతిసమర్థుడు - ఎక్కువ మనోధైర్యం, దూరదృష్టికలిగి ఆఫీసువ్యవహారాలలో ఎక్కువ శ్రద్ధతీసుకునే అలవాటుకలవాడు.

ఇప్పుడు సెంట్రల్‌కమిటీలోనున్న ఈ యిరువురి గొప్పనాయకుల రెండు గొప్పలక్షణాలు, వారికితెలియకుండానే చీలికలుకలిగించవచ్చు.మన పార్టీ దీన్నినివారించటానికి శ్రద్ధతీసుకోకపోతే తలవని తలంపుగానే చీలిక ఏర్పడవచ్చు. పార్టీలోని ఇతర సభ్యులనుగూర్చి నేనింకచెప్పను. కాని

అక్టోబరులో జినోవీవ్, కామెనేవ్ చర్యలు, కేవలం ప్రమాదవశంగావచ్చినవి కాదనీ, అది ట్రాట్‌స్కీవారిపై ఉపయోగించిన బోల్షివిక్ వ్యతిరేకలక్షణాలనీ మీకు జ్ఞాపకంచేస్తున్నాను.

కమిటీలోని చిన్న సభ్యులలో పియటకోవ్ (Piatakov) బుఖారిన్ (Bukharin) లను గూర్చి కొన్నిమాటలు చెప్పదలచుకున్నాను. నా ఉద్దేశ్యంలో వారు చాలాశక్తిమంతులు (చిన్నవారిలో). వారివిషయంలో ఈ క్రిందివిషయాలు జ్ఞాపకం ఉంచుకోవాలి. బుఖారిన్ పార్టీలో కేవలం విలువగల సూత్రకారుడు మాత్రమేకాదు; అతడు పార్టీకంతటికీ చాలా ఇష్టమైనవాడు కూడా. అతని సూత్రాలు చాలా పాండిత్యప్రకర్షణతో నిండివుంటాయి కనుక అవి పూర్తిగా మార్క్సుసూత్రాలే అని నిస్సందేహంగా చెప్పలేము. (అతడు ఎన్నడూ చదువుకోలేదు; సాధారణ భాషాజ్ఞానం కూడా ఉన్నట్లు నాకు తోచదు.)

ఇంక పియటకోవ్:-ఆత్మబలంలోను, శక్తిలోను నిస్సందేహంగా ప్రఖ్యాతిగలవాడు. ప్రమాదకరమైన రాజకీయ విషయాలలోకూడా కేవలం పరిపాలనా పద్ధతులకే ఎక్కువ కట్టుపడివుంటాడు. ఈ రిమార్కులు ప్రస్తుతసమయానికి చేసినవే; లేకపోతే వారు ఏకపాక్షికాభిప్రాయాలను సరిదిద్దుకొని వారి తెలివితేటలనుపయోగించటానికి తగిన సమయం దొరకదేమోనని నా ఊహ.

డిశంబరు, 25; 1922 సం॥

"స్టాలిన్ చాలా మోటుమనిషి. ఈ తప్పును కమ్యూనిస్టులమైన మనకు బలపరచవలసినదైనా, ఇది జనరల్ సెక్రటరీ పదవికి సరిపడదు. అందుచేత ఆ పదవినుంచి స్టాలిన్‌ను తప్పించి, మరియొకనిని, అన్ని విధములా స్టాలిన్‌కు వ్యతిరేకమైనవానిని, అనగా ఎక్కువ ఓపిక, భక్తి, నమ్రత, కామ్రేడ్‌లపై ఎక్కువశ్రద్ధ, కలిగిన వ్యక్తిని ఆ పదవి నియమించాలని నేను కామ్రేడ్‌లకు సూచిస్తున్నాను. ఈ పరిస్థితి చాలా స్వల్పమైనదిగానే తోస్తుంది. కాని స్టాలిన్, ట్రాట్‌స్కీల సంబంధాలనుబట్టి,

వారిరువురిమధ్యను చీలికలు రాకూడదుకనుక, దానిని స్వల్పమైన దానినిగా త్రోసివేయ తగినదికాదు.

1923 సం॥ జనవరి, 4 లెనిన్.

1923 సం॥ మార్చి 5వ తేదీని 'స్టాలిన్‌తో అన్నివిధములైన వ్యక్తిగత. కామ్రేడ్ సంబంధాలను త్రెంచివేస్తున్నట్లుగా' లెనిన్ తన శక్రటరీకి చెప్పి ఒక చీటి వ్రాయించాడు.

దీనినే లెనిన్‌యొక్క కడసారి వ్రాతపత్రమని స్టాలిన్ పేర్కొన్నాడు.

జరుగుతున్న సంగతులన్నీ ఆశ్చర్యంతోనే లెనిన్‌గ్రహించాడు. కామ్రేడ్లను అతడు చూడకూడదని నిషేధించడంచేత అతడెవ్వరికీ చెప్పలేకపోయాడు. అతడు తన అధికారం తగ్గిపోతున్నట్లు గ్రహించటమే కాక స్టాలిన్ కృప్సకయానమర్యాదగా చూస్తున్నట్లుగా గ్రహించాడు. స్టాలిన్ చర్యలకు కోపగించి అతడు స్టాలిన్‌తో అన్నిసంబంధాలను త్రెంచుకున్నట్లువ్రాశాడు. దానికేమీ ఎక్కువప్రాధాన్యం కలుగలేదు. 1923సం॥ మేలో లెనిన్‌కు మూడవసారి పక్షవాతం దెబ్బతగిలింది.

1923 సం॥ మే మధ్యప్రాంతంలో లెనిన్‌ను కడసారిగా క్రెమ్లిన్ కోటనుంచి గోర్కీగ్రామానికి తీసుకువెళ్ళారు. అతనికి ఆరోగ్యం చేకూరుతుందనే ఆశలేకపోయింది. అతనికికావలసిన సదుపాయాలను చేయటమే అప్పుడు చేయగలిగినది. జులైఆఖరుకి అతనికి కొంతస్వస్థతకలిగి, చక్రాల కుర్చీమీద తోటలోనికి తీసుకువెళ్లటానికి వీలైంది. అతనిశక్తి, ఆకలికొంత వృద్ధిపొందాయి.

కాని అతనిఆరోగ్యం అభివృద్ధితోపాటు మెదడు చెడిపోటం ఆరంభించింది. అతనికిఉత్సాహకరంగా ఉండటానికై బండిమీదనే మంచిగాలిలో త్రిప్పేవారు. డిశంబరు 24వ తేదీని లెనిన్ భార్య ఒక క్రిస్టమస్‌చెట్టును పెట్టి రైతులనందరినీ ఆహ్వానించింది. లెనిన్ చాలాఉత్సాహంగావున్నాడు. 1924 సం॥ జనవరి 20వ తేదీని అర్ధరాత్రి అతడు ఉత్సాహంగానే పడుకున్నాడు. కాని ఉదయం 6 గం. 50 ని. కు కడసారి దెబ్బతగిలింది. ఆదెబ్బ చాలా మితిమీరిన ప్రమాదకరంగా పరిణమించింది. అతనికి

ఊపిరి ఆగిపోయింది. అపస్మారంవచ్చింది. క్రమంగా ఉధృతమైనజ్వరం వచ్చింది. 1924 సం॥ జనవరి 21వ తేదీని లెనిన్ మరణించాడు.

అతని దేహాన్ని, శరీరావయవభాగాలన్నింటినీ సూక్ష్మంగా పరీక్షించిన తరువాత, జాగ్రత్తగాభద్రపరిచారు.

"అతన్ని తెరిచి పరీక్షించినప్పుడు అతనిమెదడులో నరాలుముద్ద కట్టుకుపోయాయి. అతనికి అటువంటి మెదడులో ఆలోచనాశక్తి సక్రమంగానేవుండటం ఆశ్చర్యంకాదు; కాని అటువంటి మెదడుతో అతడంత కాలం బ్రతికివుండటమే ఆశ్చర్యం." అని ప్రొఫెసర్, రొనజోవ్ (Ronazov) వ్రాశాడు.

మంచుమయమైన గోర్కీ గ్రామంనుంచి లెనిన్ మరణవార్త రష్యా అంతటా మారుమ్రోగింది. మాస్కో, చుట్టుప్రక్కలగ్రామాలనుంచి అనేకులు మిత్రులు, అనుచరులువచ్చిచేరారు. జనవరి 23వ తేదీని, అతని దేహాన్ని మాస్కోకు తీసుకువెళ్ళటానికై, కమ్యూనిస్టుఅనుచరులు మోసికొని స్టేషనుకిచేర్చారు. గోర్కీనుంచి మాస్కోకు, 30 మైళ్ళదూరం, లెనిన్ దేహం వుంచబడిన రైలువెడుతుంటే, దారిపొడవునా ప్రజలు బారులుతీర్చి నిలుచున్నారు.మాస్కోలో ట్రేడ్‌యూనియన్ల భవనంలో అతని దేహమును ప్రభుత్వమర్యాదలతోవుంచారు. వేలాదిప్రజలు గుంపులుగావచ్చి అతనికి వారితుది గౌరవాన్నిచూపించారు.

అంత్యక్రియలరోజున ఆ భవనమంతటినీ నల్లజెండాలతో కప్పివేశారు. తెల్లవారి 4 గంటలకు లెనిన్ మిలిటరీగార్డులు నిశ్శబ్దంగా భవనంముందు చేరారు. మాస్కోనుంచి దూరంగా, గౌరవసూచకంగా వరుసగాపేల్చబడిన ఫిరంగులమ్రోత వినిపిస్తూంది. గార్డుసిపాయిలు వారితుపాకులనెత్తి గౌరవసూచనగా మూడుసార్లు పేల్చారు.

మాస్కోలో అంత్యక్రియల ఉత్సవం బయలుదేరినప్పుడు చాలా చలిగావుంది. అతని శవపేటికను పొలిట్‌బ్యూరో సభ్యులు మోశారు. ఆ రోజంతా అనేకమైన సంఘాలతరఫున ప్రతినిధులు వచ్చి శవపేటిక ప్రక్కనే నడిచి పూలమాలలను అర్పించారు. మాస్కోనగరం ఫాక్టరీల

ఘోతలతో ప్రతిధ్వనిచేస్తుండగా మధ్యాహ్నం 4 గంటలకు లెనిన్ దేహమును భూస్థాపితం చేశారు.

ఇతరవిప్లవవీరులవలె అతని దేహమును భూస్థాపితం చెయ్యలేదు కాని అతని దేహమును భద్రంగా రెడ్ స్క్వేర్‌లో నిర్మింపబడిన ఒక గొప్ప గోరీలోవుంచారు.దానిపైLeninఅనే అయిదక్షరాలను నల్లరంగులోవ్రాశారు

లెనిన్ మరణానికి అయిదురోజుల తర్వాత 1924, జనవరి 26వ తేదీని, సోవియట్ల కాంగ్రెసులో స్టాలిన్ ఉపన్యసించాడు.

"25 సంవత్సరాలు కామ్రేడ్ లెనిన్ మన పార్టీని పెంచి, ప్రపంచ మంతటికీ ఘనతవహించిన కార్మికపార్టీగా అభివృద్ధిచేశాడు

"అతడు మనలను విడిచివెళ్ళిపోడంతో, పార్టీసమైక్యతను, కంటి లోని పాపవలె, రక్షించుకోవలసిన భాద్యతను లెనిన్ మన కొప్పగించాడు. కామ్రేడ్ లెనిన్! నీవు మాకొప్పగించిన బాధ్యతను సగౌరవంగానెరవేరుస్తా మని శపథం చేస్తున్నాము.

"మనలను విడిచివెళ్ళడంతో, కార్మికకర్షక నియంతృత్వమును రక్షించి, బలపరచేబాధ్యతను కామ్రేడ్ లెనిన్ మన కొప్పగించాడు. కామ్రేడ్ లెనిన్! ఈబాధ్యతనుకూడా నెరవేర్చుటకు అన్నిప్రయత్నాలు చేస్తామని మేము శపథంచేస్తున్నాము.

"కాపిటలిస్టు రాజ్యాలనుంచి మనం సంపాదించిన విశ్రాంతి చాలా స్వల్పకాలమే వుండవచ్చునని లెనిన్ మనకనేకసార్లు చెప్పాడు. రెడ్‌సైన్యాలను అభివృద్ధిచేసి, బలపరచుటకూడా పార్టీయొక్క ప్రధాన భాద్యతలలో ఒకటని లెనిన్ అనేకసార్లుచెప్పాడు. కామ్రేడ్‌లారా! మన రెడ్‌సైన్యాన్ని, రెడ్‌నౌకాదళాన్నీ అభివృద్ధిచేసి, బలపరచటానికి సర్వ ప్రయత్నాలుచేస్తామని మనం శపథంచెయ్యాలి.

"మనదేశం, నాల్గువైపులా ధనికరాజ్యాలచేత చుట్టుముట్టబడిన ఒక పర్వతంవలెవుంది. కెరటాలు ఒకటితర్వాత ఒకటివచ్చి దానిని ముంచివేయాలని భయపెడుతుంటాయి. కాని పర్వతం కదలకుండా వుంటుంది. దాని బలం ఎక్కడవుంది? మనదేశం కార్మిక, కర్షకుల

స్నేహసంబంధంపైనే ఆధారపడడంలోలేదు; స్వతంత్రదేశాల అభిమాన మును చూరగొనడంలోలేదు; రెడ్‌సైన్యం, నౌకాదళాలచే రక్షింపబడ్డంలో లేదు, ప్రపంచంలోని కార్మికకర్షక హృదయాలలోనుంచి వచ్చిన అభి మానంలోవుంది. తిరుగులేని ఆబలమే మన దేశంలో స్థిరత్వానికి, ప్రధాన కారణం.

"సోవియట్లు రిపబ్లిక్‌స్థాపనయే అంతిమోద్దేశ్యంఅని లెనిన్ ఎన్నడూ భావించలేదు. తూర్పు పశ్చిమదేశాలలోని విప్లవోద్యమాల అభివృద్ధికిది ఒక అవసరమైనసంస్థగా, ప్రపంచంలోని కార్మికకర్షకుల విజయానికి అవకాశం కలిగించే ఒక సూత్రంగా దీన్ని లెనిన్ భావించాడు. అంతర్జా తీయ దృక్పథంలోనే కాక, సోవియట్లరిపబ్లిక్ సంరక్షకదృష్టిలోకూడా అటువంటి వ్యాఖ్యానమే సరియైనదని లెనిన్‌కు తెలిసినదే. మోక్షప్రాప్తికై నిశ్చితయుద్ధాలకు అన్నిదేశాల కార్మిక కర్షకులను ఉద్రేకపరచుటకిదియే సాధ్యమైన విధానమని లెనిన్‌కు తెలుసు. అందుచేతనే కార్మిక, కర్షక నాయకులలో మేధావంతుడైన, లెనిన్ కార్మిక కర్షకనియంతృత్వసంస్థాపన రోజునే, కార్మిక ఇంటర్నేషనల్ (Worker's International) కు పునాది రాయివేశాడు. అందుచేతనే ప్రపంచంలోని కార్మిక కర్షకుల సమైక్యతకై విసుగులేకుండా పనిచేసి, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను (Communist International) ఏర్పాటుచేశాడు....

"మనలను విడిచివెళ్లడంతో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సూత్రాలకు కట్టుబడివుండవలసిన ధర్మాన్ని లెనిన్ మనకొప్పగించాడు. కామ్రేడ్ లెనిన్! ప్రపంచకార్మిక కర్షకసమైక్యతను, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను బలవత్తరంచేసి, అభివృద్ధిచేయుటకు నిర్విరామదీక్షతో పనిచేస్తామని శపథం చేస్తున్నాము."

సోవియట్ నాయకులే అనేకసార్లు చెప్పినట్లుగా లెనిన్ చనిపో యాడు; కాని లెనినిజంమాత్రం జీవించియేవుంటుంది. నూతన పరిస్థితు లనుబట్టి పద్ధతులు మారిపోతాయి; కాని లెనిన్ శవపేటికవద్ద స్టాలిన్ చేసిన శపథమే, ఇంకా సోవియట్ యూనియన్ ప్రభుత్వగమ్యస్థానానికి మార్గదర్శకంగావుంది.